# శ్రీకృష్ణావతారతత్త్వము

## మూడవప్రకరణము.

ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందు: ప్రధానాంధ్రపండితులు
కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మచే
రచియింపఁబడినది.






చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1926.

# పోషకులు.

---

## కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి. యల్.

" విరూరు పిచ్చయ్యగారు, బి. ఏ. ప్లీడరు.

" సి. లక్ష్మీనారాయణశాస్త్రులుగారు, బి. ఏ., బి. యల్.

" కాటూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. యల్.

" యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.

" సి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.

" వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. యల్.

" బి. సి. దేవరాజులునాయుడుగారు, బి. ఏ., బి. యల్.

" పి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. యల్.

" సి. పి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్.

" కే. సూర్యనారాయణరావుగారు, ప్లీడరు.

" భోగసాధము వెంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.

" పత్తి రాఘవులు శ్రేష్ఠిగారు.

" కందిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.

" సుంకేసుల సుబ్బయ్యగారు.

" కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు

" దేవతి పిచ్చయ్యశ్రేష్ఠిగారు.

" కామిసెట్టి వెంకటేశము శ్రేష్ఠిగారు.

" మల్లెంకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.

" మాలెపాటి చిన్నవెంగన్న శ్రేష్ఠిగారు.

## కడప.

మ. రా. శ్రీ. అన్నలూరు శేషగిరిరావుగారు.
" డబ్ల్యు. శ్యామయ్యగారు.
" బి. శేషగిరిరావుగారు.
" యీదాటి వేంకటసుబ్బయ్యశాస్త్రిగారు.
" శ్రీకంఠము నరసింహారావుగారు.
" వేమగంటి శ్రీనివాసరావుగారు.
" పి. వీరభద్రరావుగారు.
" పుష్పాల వేంకటస్వామినాయుడుగారు.
" శాస్త్రపాటి చలపతిరావుగారు.
" కొండలకుంట వేంకటనారాయణరావుగారు.
" ఆర్. గోవిందరావుగారు, బి. ఏ., తహశీల్దారు.

## కామలాపురము.

మ. రా. శ్రీ. కొమరగిరి వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., తహశీల్దారు.
" బచ్చు రాఘవయ్యశ్రేష్ఠిగారు.
" జి. సుబ్బయ్యగారు.

## వల్లూరు.

మ. రా. శ్రీ. సముద్రాల రామస్వామిగారు.
" బెత్తవేముల నరసయ్యశ్రేష్ఠిగారు.
" టంగుటూరు చెన్నయ్యశ్రేష్ఠిగారు.
వంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
పోలేపల్లి వెంగన్నశ్రేష్ఠి, ఆరణిపోలేపల్లి సుబ్బయ్యశ్రేష్ఠిగారు.

## ఎఱ్ఱగుంట్ల.

ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బరావుగారు, కరణము.

## ఎల్లగుంట్ల.

మ. రా. శ్రీ. ఎల్లగుంట్ల వెంకటసుబ్బయ్యగారు.
" మాలేపాటి నాగయ్యగారు, తల్లము సుంకయ్యగారు.
" పెద్ద నాగిరెడ్డిగారు.
" ఏ. శ్రీనివాసులునాయుడుగారు.
" అయ్యాదొరనాయుడుగారు, హైస్కూలుహెడ్మాష్టరు.
" యం. రంగనాయకులునాయుడుగారు.

## ప్రొద్దుటూరు.

మ. రా. శ్రీ. రూపావతారము శేషశాస్త్రిగారు.
" కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
" నారాయణము సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
" వంగిపురము శ్రీనివాసాచార్యులుగారు బి. ఏ, ప్లీడరు.
" సి. నరసరామశాస్త్రిగారు. బి. ఏ, ప్లీడరు.
" యం. రామస్వామయ్యగారు, ప్లీడరు.
" రావులూరు. సుబ్బయ్యగారు, డిప్టినాజర్.
" ఉప్పులూరు రామభద్రయ్యగారు.
" డి. రాజశేఖరకవిసింహులుగారు, శతావధానులు.
" నారాయణము సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు.
మ. రా. శ్రీ. ఆర్కాటు పరశురామరావుగారు, ప్లీడరు, కొండటూరు.
" ఏదూరు చెంచుసుబ్బయ్యగారు, శేషమాంబాపురము.
" కూకల వెంకటసుబ్బయ్యగారు, అప్పయరాజుపేట.
" పిడతల చినవెంకటసుబ్బయ్యగారు, కొనగలూరు.
" మద్దాల భోగాదిశ్రేష్ఠిగారు, వేములప్రొత్తపల్లి.
" పుల్లగూర వెంకటశేషయ్య శ్రేష్ఠిగారు, వెంపల్లి.
" పోలేపల్లిసుబ్బయ్యకుమారుడు, సుబ్బయ్యశ్రేష్ఠిగారు, వెంపల్లి
" గంగవరం వెంకటనారాయణరెడ్డిగారు, మిద్దాయగారిపల్లె.

మ. రా. శ్రీ. బచ్చు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు, మామిళ్లపల్లె.
" చల్లా చెంచుపాపిరెడ్డిగారు, చంద్రపల్లె.
" మాకం జంగం శ్రేష్ఠిగారు, చీమలపెంట.
" కోట బాలయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠ రావుపేట.
" చిన్నబయ్యన్నగారి లక్ష్మన్నగారు, ఎఱ్ఱదొడ్డిపల్లె.
" రేవులూరు సిద్ధయ్యశ్రేష్ఠిగారు, కస్తూరిరాజుగారిపల్లె.

## నెల్లూరు.

మ. రా. శ్రీ. వెలంపల్లి రామకృష్ణమ్మగారు, నెల్లూరు.
" ములుమూడి లక్ష్మీనరసింహాయ్యగారు, నెల్లూరు.
" ఇదమకంటి వేంకటరామిరెడ్డిగారు, నెల్లూరు.

## అనంతపురము

మ. రా. శ్రీ. కరణము కృష్ణరావుగారు, జేలినహాళ్లి.
" శ్రీరాము తిమ్మయ్యశ్రేష్ఠిగారు. "
" పెద్దనరిసప్పగారి హనుమంతుగారు. "

## బళ్లారి.

మ. రా. శ్రీ. విట్లా శేషప్పశేష్ఠిగారు, ప్రజాసంఘ కార్యనిర్వాహకులు.
" రావుసాహేబు జే. పాపయ్యశ్రేష్ఠిగారు.
" అయ్యగారి బుస్సెట్టిగారు, కణేకల్లు.
మ. రా. శ్రీ. కలిదిండి వేంకటరాజుగారు, రాజమహేంద్రవరము.
" బొడ్డు మల్లికార్జునరావుగారు, బాపిరాజుగారు, ఏలూరు.
" ఆకొండ్రకల్లిన ప్రగడ లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ. బి. ఇ. డిస్ట్రిక్టుబోర్డు ఇంజనీయర్ గారు, కర్నూలు.
" వి. ఎస్. నరసింహాచార్యులుగారు, బి.ఏ.బి.యల్. కుడతాను.

# విషయసూచిక.



శ్రీః

# శ్రీకృష్ణావతారతత్త్వము

## తృతీయప్రకరణము.

---

శ్లో. నిఖిలభువనలక్ష్మీ నిత్యలీలాస్పదాభ్యాం
కమలవిపినవీథీ గర్వసర్వంకషాభ్యామ్,
ప్రణమదభయదాన ప్రౌఢిగాఢోద్ధతాభ్యాం
కిమపి వహతు చేతః కృష్ణపాదాంబుజాభ్యామ్. ౧౨

శ్లో. ప్రణయపరిణతాభ్యాం ప్రాభవాలంబనాభ్యాం
ప్రతిపదలలితాభ్యాం ప్రత్యహం నూతనాభ్యామ్,
ప్రతిముహురధికాభ్యాం ప్రస్నువల్లోచనాభ్యాం
ప్రభవతు హృదయే నః ప్రాణనాథః కిశోరః. ౧౩

శ్లో. మణినూపురవాచాలం వందే తచ్చరణం విభోః,
లలితాని యదీయాని లక్ష్మాణి వ్రజవీథిషు. ౧౪

శ్రీకృష్ణకర్ణామృతము.

పరమభక్తులారా! కరుణాతరంగితాంతరంగులారా!

ద్వితీయప్రకరణమున శ్రీకృష్ణపరమాత్మ భూలోకమున నవతరించుటయు జననీజనకులకు హితజ్ఞాన ముపదేశించుటయు

నద్భుతచర్యలం గనంబఱచుటయు, వానిం దెలియక గోపిక లవి యెల్ల బాల్యచేష్టలని భావించి యశోదకు విన్నవించుటయు లోనగు దివ్యగాథలం బఠించితిరి. ఇందు శ్రీకృష్ణపరమాత్మ లోకానుగ్రహార్థ మేయేలీలల మెలంగెనో ఏయేదుష్టుల నిర్జించెనో, ఏయేప్రాణులకు ముక్తిని బ్రసాదించెనో, ఏయేరీతుల నీతు లుపదేశించెనో యవియెల్లం జదువందగు. ఒక్కొక్కయద్భుతచర్యయు సంసారసాగరసంతరణతుకు మనంబగు. ఇంతియ కాక యీప్రకరణమున బృందావనసంచారము ముఖ్యమైనది. దానిం దమకమునం జదువుఁడు. అం దనేకవిషయములు తెల్లములగు. అంతియగాక బృందావనమున నుండుతఱి భగవంతుఁ డమానుషచర్యలం జూపెఁ గాన వాని యథాతత్త్వముగాఁ బఠించుటయేగాక తదంతరార్థముల నెఱుంగుటయు ముఖ్యము కాఁబట్టి భక్తులారా! యీమూఁడవప్రకరణమును భక్తియుఁ బఠింపుఁడు. ఈప్రకరణకథాభాగము ముందు విస్పష్టము కాఁగలదు గాన నిపుడు వ్రాయుటయు ననవసరము. ఇంకఁ గథాభాగమునకు లేఖినిం ద్రిప్పుచున్నాఁడను. శ్రీకృష్ణపరమాత్మ మీకు భక్తియోగమున మనస్సు స్థిరమగునట్లు చేయుంగాక. సావధానచిత్తులరై భగవల్లీలాగాథలం బఠింపుఁడు.

### బాలకృష్ణపరబ్రహ్మాయద్భుతచర్యలు.

శ్రీహరి యొకప్పుడు బలదేవుంగూడక గోపబాలురం గూడి యాడుచుండువాఁడు. తనలీలామానుషత్వము నెన్నిభం

గుట్టుఁ దెలిపినను గోపికాగోపకు లెఱుంగఁజాలరని యెఱుంగును. కాని యింకను బ్రవర్తించి వారిమనస్సులఁ గలంచవలయునని యూహించెను. గోకులమున నొకనాఁడు గోపిక లెల్ల శ్రీకృష్ణు నింబట్టుకొని యశోదాదేవికిం జూపవలయునని తలంచిరి. తలుపులకుఁ దాళములు పెట్టిరి. ముద్రలవైచిరి. పాలు పెరుగువెన్నమీఁగడలోనగు నిష్టపదార్థములఁ గడవలనిండ నింపి యుతరులకుఁ గనఁబడనిగదులలో నుంచిరి. ఏత్రోవన శ్రీకృష్ణమూర్తి వచ్చునో యని దిక్కులుచూచుచుండిరి. కాని తమకుఁ బట్టసాధ్యుఁడా కాఁడా యని యించుకంతయు నూహింపరైరి. పాపము! వారు కేవలము పామరులు. పూర్వజన్మకర్మజ్ఞానమించుకంతయును వారికిలేదు. సంసారమిది సారవంతమైనం నిస్సారమయ్యు సారవంతముగాఁ దోఁచ జేయునదియా యని తెలిసికొను నేరవెఱుంగరు. శక్తిబాలుఁ డీవఱకు లోకమునఁ బుట్టలేదని యశోదతో చెప్పెదము నించుక యాలోచింపరైరి. తులువతనము చేయువాఁడనియే నిశ్చయించిరి కాని యీచర్యల నిందొక్కదానినైన బాలు రెవ్వరేఁ జేయఁజాలరుకదా? తద్వ్యక్తి సామాన్యమైనదా. అపూర్వమా యని యూహింప నుద్దేశింపరైరి ఏమి వారిపామరము! ఏమి వారిదూరదృష్టిలేమి! ఏమి వారిలోకజ్ఞానము! స్త్రీలు చంచలబుద్ధిగలవారనుట దీన స్పష్టమగునుగదా

శ్లో. ఏకో లుబ్ధస్తు సాక్షీస్యాద్బహ్వ్యశ్శుచ్యోఽపి న స్త్రియః
స్త్రీబుద్ధేరస్థిరత్వాత్తు దోషైశ్చాన్యేపి యే వృతాః.

మను. ౮ అ. ౭౭ శ్లో.

కాఁబట్టి కాఁజోలు మహర్షులు.

అస్వతంత్రా స్త్రియః కార్యాః పురుషైస్స్వైర్దివానిశమ్,
విషయేషు చ సజ్జంత్యస్సంస్థాప్యా ఆత్మనోవశే.

మను. ౯అ. శ్లో.

పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే,
రక్షంతి స్థావిరే పుత్రా నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి. ३
సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యః స్త్రియోరక్ష్యా విశేషతః,
ద్వయోర్హి కులయో శ్శోకమావహేయు రరక్షితాః. ౪
ఇమం హి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మ ముత్తమమ్,
యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి. ౫
స్వాం ప్రసూతిం చరిత్రంచ కులమాత్మాన మేవచ,
స్వంచధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి. ౭
యాదృశం భజతే హి స్త్రీసుతం సూతే తథా విధమ్,
తస్మాత్ప్రజావిశుధ్యర్థం స్త్రియం రక్షేత్ప్రయత్నతః. ౯
న కశ్చిద్యోషితశ్శక్తః ప్రసహ్యా పరిరక్షితుమ్,
ఏతైరుపాయ యోగైస్తు శక్యాస్తాః పరిరక్షితుం. ౧౦
పానం దుర్జనసంసర్గః పత్యాచ విరహోఽటనం,
స్వప్నోఽన్యగేహవాసశ్చ నారీ సందూషణానిషట్.

అని స్త్రీధర్మముల నుపదేశించిరి. కాఁబట్టి గోపిక లోపికలులేక భగవంతుని యమానుషచర్యలం దెగడసాగిరి. యశోదమనస్సు కలఁతచెందునట్లు చేయఁబూనిరి. కాని భగవంతుఁడు

తనవిచిత్రచరిత్రమును బాలచేష్టలద్వారా వెల్లడించుచునే యుండెను. యశోద యోర్చుచునే కాలముగడుపుచుండెను. ఒకనాఁడు యశోద యింటిపనులయందు నిమగ్నురాలై యుండుతఱి గుంపుగాఁగూడి గోపిక లరుదెంచి

సీ. కలకంఠి మావాడ గరితల పెల్ల నీ
    పట్టి రాఁగలఁడని పాలు పెరుగు
లిండ్లలోపల నిడి యేమెల్లఁ దనత్రోవఁ
    జూచుచో నెప్పుడు చొచ్చినాఁడొ
తలుపులు ముద్రలుఁ దాళంబులును బెట్టి
    యున్నచందంబున నున్నవరయ
నొకయింటిలో నాడు నొకయింటిలోఁ బాడు
    నొకయింటిలో నవ్వు నొకటఁ దిట్టు
ఆ. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ
పక్షిఘోషణములు పరఁగఁజేయు
నిట్లుచేసి వెనుక నెక్కడఁబోవునో
కానరాఁడు రిత్తకడవలుండు. శ్రీపోతనకవి.

అని విన్నవించిరి. ఎన్నిసారులు తనయద్భుతచర్య లెన్ని యోవిధంబులఁ జూపినను గనుఁగొనలేనివారి కించుక తెలివి గల్గింపఁగోరి భగవంతుఁ డొకయింట నాడి ఒకయింట సంగీతము పాడి, వేఱొకయింట నవ్వి, ఇంకొకగృహమున దూషించి యవ్వలిగేహమున వెక్కిరించి, ఒక్కొక్కతావున మృగము

లరచినట్లు ధ్వనిగల్గించి, వేఱొక్కస్థలమునఁ బతులుకూసినట్లు శబ్దమును వినఁబడఁజేసి సర్వాంతర్యామిత్వమును వెల్లడించెను. కాని పుట్టుగ్రుడ్డి కద్దముచూపినట్లు బుద్ధిహీనలగు నాగోపికల కెన్నియమానుషచర్యలం జూపినను దెలిసికొనఁజాలకమీఁదుమిక్కిలి పట్టుకొనఁ బ్రయత్నించిరి. అక్కటా! మనుష్యబుద్ధి యెంతతుచ్ఛమైనది? తలఁగోసి ముంచఱఁబెట్టినను గారడివిద్య యనునట్లు ఒక్కపర్యాయమే యిన్నియిండ్లలో నిన్నివిధములుగా నొకబాలుఁడు కానరాఁగా నిదియేమిచిత్రము! అని యోజింపరాదా? స్త్రీబుద్ధి చంచలమనునది సత్యముగ నున్నయది. అతీంద్రియజ్ఞానముగలవారిపల్కు లన్నృతము లనుటకంటెఁ బాపము వేఱొండు గలదా? మునుల కతీంద్రియజ్ఞానము కలదు. చిరకాలము జీవించుశక్తి వారికింగలదు. అనిమాత్ర మంగీకరించుచు వారిపల్కుల నాక్షేపించువారలకంటెఁ దెలివి తక్కువవారు గలరా? మునులకు దూరదృష్టి లేదనియె యంగీకరింపవలయు కలదనినచో వారివాక్కులు వేదతుల్యము లని గ్రహింపవలయు. దూరదృష్టి గలదు. మహాత్ములు. చిరకాలజీవులు అని మన మంగీకరించుచో ముందు రాఁగల కాలమును బరికించి యాచరణీయధర్మముల నుపదేశించిరిగానమునులవాక్యములగు స్మృతులను ప్రమాణములని యొప్పుకొనవలసి యుండును. అంగీకరించుచో స్త్రీబుద్ధి చపలమైనదని యొప్పక తప్పదు. ఈవిషయము గోపికాచర్యలవలన స్పష్టమగుచున్నది.

## శ్రీకృష్ణుఁడు తన సర్వవ్యాపిత్వమును దెలుపుట. గోపిక లెఱుంగఁజాలక మోసపోవుట.

ఒక దినమున భగవంతుఁ డెన్నివిధములఁ దనయద్భుత చర్యలఁజూపినను వీరునన్నుఁ దెలియఁజాలకున్నవారు. ఇంకను వారికిగోలోకకృత్యములఁ జూపెద. అని తలంచి యాడుకొనుచు గోపికాగృహములం జొచ్చెను. అంతకుముందే గోపికలు తమ యిండ్ల కీదినము కృష్ణుఁడువచ్చినఁ బట్టుకొనిపోయి యశోద కుం జూపుదమని నిశ్చయించుకొనియే యుండిరి. ఈవిషయము భగవంతుఁ డెఱుఁగును. కానిమ్ము. ఎట్లు పట్టుకొనుదురో చూ చెదఁగాక యని యథాపూర్వముగా వారి యిండ్లలోఁ బ్రవే శించెను. ఒకపర్యాయమే యందఱియిండ్లలోఁ గనఁబడెను. ఆతు రంబునఁ బరుగిడి పట్టుకొనిరి. అందొకతుక కృష్ణా! యిఁకెందుఁబోఁ గలవు? చిక్కితివి లే. వెన్నదొంగిలి బాగుగాఁ దినసాగితివా? చిక్కక తప్పించుకొని పోఁగలనని పొగరుపడితివి. ఇప్పుడో ఎందుఁ బోఁగలవు! రారమ్ము. నీపని యిందేమగునో చూతువులే. మీతల్లి యొద్దకుం బిలుచుకొనిపోయి నాలుగు దెబ్బలు గట్టి గాఁ గొట్టించెదను. అపుడుగాని మావెన్న దిన్న బలము తగ్గదు. కొంచెము తట్టుకొంగా నాయనా. అని బెదరించెను. వేఱొకతుక అబ్బాయీ! వెన్న గావలయునా? ఎంతకావలయు? కసవనిం డఁ జాలునా చాలదా మాతండ్రీగా! అమ్మదగ్గరకు రమ్ము. అచ్చ టఁ జక్కఁగా వెన్న దినిపించెదను. పదపద. అని బెదరించె

ను. ఇట్లే గోపికలందఱు దొరకినాఁడు బాలుఁడు వెన్నదొంగ అని గట్టిగాఁ బట్టుకొని యశోదకడకుఁ బోయిరి. నాకు మాత్ర మే కృష్ణమూర్తి చిక్కెను. ఇతరులకుఁ జిక్కలేదనియే యం దఱు తమతమశక్తిని బొగడుకొనుచుఁ బోయిరి. యశోదయు గృహకృత్యములఁ జూచుకొను చుండెను. గోపిక లొక్కొక్క రుగా నందభవనమును జేరిరి. యశోదసమీపమునకుఁ బోవున ప్పటికి యశోదాదేవి కూరుచుండి యప్పుడేపాలిచ్చి బాలుఁ డాడుకొనుచుండఁగా నానందించుచు నాయనా! కృష్ణా! గోపా లా! రారా యని పలుకుచుండెను.

గోపికలు గట్టిగా కృష్ణుని చేయిపట్టుకొని మాయబ్బా! రారా యని పిలుచుకొనిపోయి తల్లితోఁ జెప్పి దండింపింత మనియూహించి యశోదచెంతకుం బోఁగా ఆమెచెంత బాలలీ లలఁ దల్లి నుల్లసిల్లం జేయుచు నల్లనల్లన నెగురుచు శ్రీ కృష్ణుఁ డుండెను. ఆతనిం గాంచిరి. తమరుపట్టుకొనివచ్చిన కృష్ణునింజూ పఁబోఁగా నిచ్చటనున్నాఁడే యని తమచెంతఁజూడఁగాఁ గృష్ణుఁ డగపడకుండెను. దాన సిగ్గుపడి మరలి వృథాశ్రమము గలిగెను. ఇదేమి చిత్రమో యనుకొనుచు నందఱు గృహములకుం బో యిరి.

శ్లో. గోప్యః కదాచన పృథ క్పృథగాహ్య కృష్ణ
మేకైకశైవ గదితుం ప్రసృతా స్తదాగః,

దృష్ట్వా తదంత్యథత మేవ నిజా నదృష్ట్వా
సర్వా శ్చ తాని వవృతు స్స్వగృహాన్ సలజ్జాః.

శ్రీభాగ. ౧౦ అ. 33. శ్లో.

భక్తులారా! ఈ యద్భుతచర్యను నమ్మనివారు కొందఱు మనలోఁ గలరు. వారిమాట మన కేల? దీనిచే శ్రీకృష్ణుని సర్వవ్యాపిత్వము స్పష్టమగును. ప్రతిగోపిక యింటిలోఁ గనఁబడెను. అందఱు పట్టుకొనిరి. అందఱకుఁ జిక్కెను. చిక్కఁగద యని పాప మాగోపికలు గట్టిగాఁ బట్టుకొనిరి. ప్రాకృతశిశువనియే తలపోసిరి. కాని వెన్న యిన్ని దినము లింతఱియిండ్లలోఁ దినుటచే నజీర్ణరోగమైన రాలేదే. కారణ మేమనిరైన నూహింపఁ జాలక పోయిరి. అంతతో నూరకుండక యశోదకడకుం గొంపోయిరి. అందుండు శ్రీ కృష్ణునిఁ గాంచిరి. నివ్వెఱపడిరి: తమరు పట్టుకొన్న బాలుఁడు కనఁబడక పోవుటఁ జూచెంగిరి.అప్పుడైన నితఁడు భగవంతుఁడని భావించిరా? సిగ్గుపడి యశోదతోఁజెప్పి కొట్టింపఁ జాలకపోతిమే యని యిండ్లకుఁ బోయిరి. ఔరా! భగవన్మాయ. వారి నెట్లు మోహింపఁజేసినదో పరికింపుఁడు. ఇంతకన్న వేఱుదాహరణ మేల? ఈశ్లోకమున కేలొకో యీఘట్టమున నాంధ్రభాగవతమునఁ బద్యము కానరాకున్నది. బొంబాయిప్రతియందీశ్లోకము గానరాదు. ఆంధ్రలిపియందు వ్యాఖ్యగూడ నున్నది. ఇఁకఁ గథనువినుఁడు.

ఇట్లు శ్రీకృష్ణపరబ్రహ్మము తన సర్వనియంతృత్వ సర్వవ్యాపిత్వములు లోనగు నద్భుతచర్యలం గనంబఱచినను గోపి

కలు తన్మాయామోహితులు గాన దెలిసికొనఁజాలక పలువా ఱులు యశోదతో నీకొడుకు దొంగ యని చెప్పసాగిరి. అంతియ గాక చిన్నతనమునందే చేయరానిపనులు చేయ మొదలుపెట్టె ననియు బోధించిరి. అట్టితఱి శ్రీకృష్ణమూర్తి తనమహిమమును దెల్పుచున్నట్లుండెను. నిలువఁబడి తల్లికి ముద్దులు మూటఁగ ట్టునట్లు మాటలాడుచు

సీ. తనువున నంటిన ధరణీపరాగంబు
పూసిన నెఱి భూతి పూఁతగాఁగ
ముందఱ వెలుఁగొందు ముక్తాలలామంబు
తొగల సంగడికాని తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు
కాముని గెల్చిన కన్ను గాఁగఁ
గంఠమాలికలోని ఘననీలరత్నంబు
కమనీయ మగుమెడకప్పు గాఁగ

ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ
బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివుని పగిది నొప్పె శివునకుఁ దనకును
వేఱులేమిఁ దెల్ప వెలయునట్లు. ఆంధ్రభాగవతము.

ఇట్లు తనచెంతనుండి యాడుకొనుచున్న బాలకునింజూచి యారీతిఁ దప్పులు చెప్పుచున్న గోపికలం జూచి యశోద కొడుకునం దించుకంతయైన నపరాధము లేదని యెఱింగి ఊరక

గోపికలు కొడుకుపైఁ దప్పులు మోపుదురా యనియునూహించి యేమియుఁ బలుకక యూరకుండు నంతలో గోపిక లరుదెంచి. తల్లీ

క. కడులచ్చి గలిగె నేనియుఁ
గుడుతురు కట్టుదురు గాక కొడుకుల నగుచుఁ
బడుగుల వాడల పైఁబడ
విడుతురె రాకాంత లెందు విమలేందుముఖీ.

క. ఓయమ్మ! నీ కుమారుఁడు
మాయిండ్లను బాలు పెరుగు మననీఁడమ్మా
పోయెద మెక్కడి కైనను
మాయన్నుల సురభులాన మంజులవాణీ. భాగవతము.

అని వేసారుచుఁ జెప్పిరి.

యశోద కుమారునిం జూచెను. శ్రీకృష్ణుఁడు ముద్దుమాటలు పలుకుచు యశోదమనస్సు కరఁగునట్లు చేసెను. అంత నామె కొడుకునందు నించుకయుఁ దప్పు లేదని నిశ్చయించి గోపికలపై నాగ్రహింపక చల్లఁగా గోపికలారా! మీకును ఇట్టి కొడుకులు గలరు. బాలకులు తెలియక తోఁచినట్లు చేయుట సహజమే కాని నా యీ కుమారుఁడు

క. చన్నువిడిచి చనఁడిట్టులు
నెన్నఁడు పొరుగిండ్ల త్రోవ లెఱుఁగఁడు నేఁడుం

గన్నులు తెఱవని మాయీా
చిన్నికుమారకుని అవ్వసేయం దగునే.

కాఁబట్టి

తే. అన్య మెఱుఁగఁడు తనయంత నాడుచుండు
మంచివాఁ డీతఁ డెగ్గులు మానరమ్మ
రామలార, త్రిలోకాభిరామలార
తల్లులార, గుణవతీమతల్లులార.

అని వారలకోపంబుడిపి సమ్మతింపఁ జేసి సాగనంపెను. శ్రీ కృష్ణుఁడు తన కేమియుఁ దెలియనట్లు నటించుచు.

ఉ. కాంతలు తల్లితోఁ దనవికారము లెల్ల గణింప భీతుఁడై
శాంతుని సొంపునం బరమసాధుని పెంపున గోలమాడ్కి వి
భ్రాంతునికైవడిన్ జడునిభంగిఁ గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక తల్లికుచవేదికపైఁ దలమోపి యాడుచున్.

శ్రీకృష్ణమూర్తి మృద్భక్షణవ్యాజమునఁ దల్లికి విశ్వరూపమును జూపుట.

శ్లో. నిబద్ధముగ్ధాంజలి రేష యాచే
నీరంధ్ర దైన్యోన్నత ముక్తకంఠం,
దయాంబుధే దేవ భవత్కటాక్ష.
దాక్షిణ్యలేశేన సకృన్నిషించ. శ్రీకృష్ణకర్ణామృతము.

* కొలఁది దినము లిట్లు జరగెను. ఒకానొకదినమున బల దేవ శ్రీకృష్ణప్రభృతు లగు గోపకుమారు లాడుకొను చుం

* ఈకథ భాగవతము ౮ అధ్యాయైక దేశమునుండి గ్రహింపఁబడినది.

డిరి. గోపబాలురు కొందఱు పోయి యశోదతో నమ్మా శ్రీకృష్ణుఁడు మన్ను దినుచున్నవాఁ డని తెల్పిరి. బలదేవుఁడును మన్ను దిన్నవాఁడు వెన్నుఁడని విన్నవించెను. యశోదయు సంభ్రాంతురాలై పరుగిడి చేయి పట్టుకొని కృష్ణా! నీవు చపలచిత్తుఁడవు. మన్ను తినవలదని యెన్నియో మాఱులు చెప్పితినిగదా. ఏటికి భక్షించితివి? గోపబాలురే గాక మీయన్న బలదేవుఁడుకూడఁ జెప్పినాఁడు. ఏమిరా యీ కుబుద్ధి! అంతటి యాఁకలిగొనెనదా? ఇప్పుడేకదా యన్నము దింటివి. అని తర్జించెను. శ్రీకృష్ణుఁ డంబతో భయము నటించుచు నమ్మా! నిజముగా నే మన్ను తినలేదు. వీ రబద్ధము చెప్పినారు. నామాట నీవు నమ్మకున్న నానోరు చూడుము. వాసనరాదా. అమ్మా! చక్కఁగాఁ బరీక్షింపుము. త్వరగాఁ జూడు మనెను. యశోదయు నాయనా! మీయన్న యబద్ధము లాడువాఁడు కాఁడే! ఆతఁడు కూడ మన్ను దిన్నవాఁడు కృష్ణుఁడని చెప్పెనన్నా! నీమాట నే నెట్లు నమ్ముదును. అని మరలఁ దర్జించెను. అందులకుం గృష్ణుఁడు నవ్వుచు

శా. "అమ్మా మన్నుదినంగ నే శిశువునో యాఁకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరి మాటలు మదిన్ నన్నీవు కొట్టంగ నీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్యగం
ధమ్మాఘ్రాణము చేసి నా వచనముల్ దప్పైన దండింపవే."

శ్లో. నాహం భక్షితవా నంబ సర్వే మిథ్యాభిశంసినః,

యది సత్యం గిరస్తర్హి సమక్షం పశ్య మే ముఖమ్.

అనిమూలము.

పూర్వమేవ మత్కుక్షిస్థ పృథివీవ్యతిరేకేణ అద్య నకించి ద్భక్షిత మితిభావః. అని వ్యాఖ్య. నహి బాహ్యంకించి న్మయా భక్షితమ్ మత్కుక్షౌ వాదావేవ సర్వ మస్తీతి భావః

అని శ్రీధరాచార్యులు.

పాఠకులారా! కృష్ణుఁ డందఱుచూచునట్లు మన్ను దిన్న ట్లు నటించెను. వీరుదానిని నమ్మిరి. తల్లికి విన్నవించిరి. తల్లి య డుగఁగా "నేఁ దినలేద"నియె. ఇది యసత్యముకాదా యన రాదు. పూర్వమే నాకుక్షియందుఁ బృథివి యున్నది. క్రొత్తఁగా నేమన్ను దినలేదని. వ్యాఖ్య వ్రాయఁబడియె. అట్లర్థము చెప్ప కున్నఁ బ్రత్యక్షముగ నసత్య మాడినట్లే చెప్పఁదగుఁగదా. వ్యాఖ్యాతల బుద్ధిచమత్కారమును బరిశీలింపుఁడు. ఎంతటి మహోపకార మొనర్చిరో. ఈయర్థము పద్యమునఁ గలదా యన్న "మదీయాస్య గంధ మ్మాఘ్రాణము చేసి" అను వాక్య మున నీధ్వని గలదని తెలియుఁడు. శ్లోకార్థమునే విస్తరించి తెనిఁగింపఁబడినది. ఇఁక పై విషయమును వినుఁడు.

ఆమాటలువిని యశోద మన్నుదిన్నచో వాసనరాయెన రాదా యని యూహించి చూపుము బాలకృష్ణా! నోరుచూ పుము. అని గద్దించి యడిగెను. క్రీడామనుజ బాలకుం డా శ్రీ కృష్ణుఁడు నోరు తెఱచెను.

యశోద కుమారునిముఖమును జూడఁగనే లోపల సముద్రములు, కులాచలములు, భూగోళము, సూర్యచంద్రాది గ్రహములు, నక్షత్రములు మొదలగు దక్కుఁగల పదార్థము లన్నియుఁ బ్రత్యక్షముగాఁ గనంబడియెను. యశోదయొడలు కంపించెను. మనస్సు మోహిత మయ్యెను. ఊహలు నిలిచి పోయెను. ఆశ్చర్యము తోఁచెను. ఇదేమి చిత్రము! ఈతఁడు నాకుమారుఁడా కాఁడా, నేను యశోదను గానా. ఇది గోకులము కాదా. ఇదేమి స్వప్నమా లేక మాయయా. నిశ్చయమా, ఈబాలకుఁడు జేనెడు లేఁడు ఇతని ముఖమెంత! అందులో నీబ్రహ్మాండము లుండుటేమి? బాలుఁడుగాఁ గనఁబడుచున్నవాఁడే కాని బాలుఁడు కాఁడు. సర్వేశ్వరుఁడే. నేనే ప్రమాదంపడితిని. నాకడుపున సర్వేశ్వరుఁడే యీరూపమున జన్మించినవాఁడు. గోపికలు చెప్పినమాట లన్నియు నిజములే. అప్పుడేమో యనుకొంటిని. ఇన్నిపనులు చేయఁ జాలువాఁడే యీబాలుఁడు. బ్రహ్మాండము లీతనియం దున్నవి.

అని తనను భగవంతునిగా భావించు తల్లియుహ నెఱింగి గోపాలబాలుఁడు మరల మాయామోహితనుగా నొనర్చెను. అంతట నాయశోదయు

క. "జడనుపడి తెలుకసెడి యా
పడఁతుక సర్వాత్ముఁ డనుచుఁ బలుకక యతనిం
గొడుకని తొడపై నిడుకొని
కడువేడుక తోడ మమత గాంచె" భాగ.

ఇట్లాతరుణీమణి యథాపూర్వముగాఁ దనకొడుకును దొడలపై నిడుకొని ముద్దాడ సాగెను. కాని బ్రహ్మాండదర్శనములోనగు నద్భుతవిషయముల మాటయే మఱచిపోయెను.

పాఠకులారా! కొందఱు శ్రీకృష్ణుఁడు యశోదకు నోరు దెఱచి ప్రపంచమును గనఁబఱచుట పరకాయప్రవేశవిద్య (**Mesmerism**) ఆకాలమున నున్నయట్లు తెలిసికొనఁగల రని కవి యనువదించెఁ గాని బాలుఁ డిట్లు లామెకు బ్రహ్మాండములు చూపుట యసంగతమందురు. కాని వారివాదమున కాధారము లేకపోలేదు. ఏమనఁగా సామాన్యదృష్టింజూడ నిది యొక హాస్యముగనే కనఁబడును. కాని సూక్ష్మదృష్టిం జూడ నిం దసంగతప్రసంగ మించుకంతయు లేదని తెలియఁగలదు. శ్రీకృష్ణమూర్తి భగవంతుఁడని యంగీకరించువారికి నిందు శంకింపఁ బనియే లేదు. భగవంతుఁడు కాఁడనువారికి నచ్చఁజెప్ప బ్రహ్మకే నశక్యము. ఎట్టివారుగాని భగవంతుని చరిత్రమునం దిదిశక్యము ఇదశక్య మనువాదము చేయఁబూనరని నానమ్మకము. శక్యాశక్యములు ప్రాకృతులయందే గాని భగవంతునకు లేవు. అఘటనాఘటన సమర్థుఁడుకదా భగవంతుఁడు. నాస్తికులు గూడ ఆపత్తునం దాస్తికు లగుదురు. ఇఁక ఆస్తికాభాసులమాట యిట ప్రస్తావింపనేల? భగవన్మాయామోహితులము గాన క్షణభంగురమగు నీదేహమును స్థిరమని నమ్ముచుండరణోపాయ మారయలేకున్న వారము. ఇట్టిమనము ప్రకృత్య

తీతుఁడగు భగవంతునివిషయమై యిదమిత్థమని నిర్ణయింపఁబూనుట ఉట్టి కెగురఁజాలనివారు స్వర్గమున కెగురుదురా యన్న సామెత కుదాహరణభూతుల మగుదుము. కావునఁ గుప్రశ్నముల కవకాశమిచ్చి మనస్సును బాడుసేయఁ బూనక భక్తిమైనాపరతత్త్వమును స్మరించుటయే యుత్తమమార్గము. మనోబుద్ధ్యతీతుని బ్రాపంచికజ్ఞానమునఁ బరికింపం బూనుట హాస్యాస్పదము. యోగముచేతనే తెలియఁదగును.

నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి.     3౮
యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ,
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథో మయి. 3౫

భగవద్గీతా జ్ఞానయోగము.

తపస్విభ్యో ఽధికో యోగీ జ్ఞానిభ్యో ఽపి మతో ఽధికః,
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున.

ఆత్మసంయమనయోగము.

ఇట్లు భగవద్గీత తెలుపుచున్నదికదా. కావున యోగియైనఁ గాని భగవత్తత్త్వ మెఱుంగఁజాలఁడు. దానికై ప్రయత్నించి చిరంతనాభ్యాస మొనరించి యోగమునఁ జక్కని యనుభవము గలిగిన భగవద్దివ్యతత్త్వము కరతలామలకము. అది లేనిచో నిదియు శూన్యమే. కాఁబట్టి నిత్యము యోగము నభ్యసించి శ్రీభగవత్తత్త్వము నెఱుంగుటకుఁ బ్రయత్నింపవలయు. ఇఁక శ్రీకృష్ణలీలను మఱొకదానిని వినుఁడు.

## యశోద శ్రీకృష్ణునిం బట్టుకొని దండించుట.

* ఒకనాఁడు యశోదాదేవి దాసీజనములఁ గార్యాంతరములందు నియోగించి తానే పెరుఁగు చిలుకుచుండెను. రాజపత్నియయ్యుఁ దానే పెరుఁగు చిలుకుచు

'కర్మాంతర నియుక్తాసు నిర్మమంథ స్వయందధి' అనిమూ. భాలు నాడించుచుండెను. రాజపత్నులుకూడ నాకాలమున గృహకృత్యములు దమరే చేయుట యాచారమయియే యున్న ట్లూహింపవచ్చును. దేహమును గేవల సుఖాయత్తము చేయరాదనియు, ఇంచుకపరిశ్రమమున నలసినఁగాని పాటవమును గాంచదనియు నాకాలపువారెఱుంగుదురు. సోమరితనము వహించిన నాయువుక్షీణించుటయగాక దేహపాటవముతగ్గుననుట పూర్వులెఱింగినట్లు మన మెఱుంగముకాని యెఱింగినటు లభినయించుచుందుము. ఈకాలమున నుపన్యాసములందుఁ జెప్పంబడు విషయములన్నియు నాకాలమునఁ గార్యరూపమును దాల్చియుండెను ఐశ్వర్యము గలుగుట పరోపకారము చేయుటకేయని యాకాలపు మనుష్యుల భావమని చెప్పవచ్చును.

ఇట్లుయశోదతానే పెరుఁగు చిలుకుచుండఁగా శ్రీకృష్ణుఁ డుముక్కుచు మూల్గుచుఁ బాలీవేఅమ్మా యని పిలుచుచు మెల్ల

* ఈకథ శ్రీ భాగ. ౯ అధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది. మఱియు బ్రహ్మపురాణము శ్రీకృష్ణజన్మఖండము విష్ణుపురాణములఁ గల విశేషము లిందుఁజేర్పఁబడుననియు నెఱుంగఁదగు.

గావచ్చి కవ్వపుఁద్రాడును గట్టిగాఁ బట్టుకొనియెను.అఁకలియగు చున్నది పాలీవే యనుచు మూల్గుచువచ్చి త్రాడు పట్టుకొనఁ గానే యశోద చిన్నికొడుకుం గాంచి యప్పనిమాని ముద్దుకు మారా! రారా పాలిచ్చెద. నాయనా రారా యనిపిలుచుచుఁ గడుఁ బ్రీతిమీఱ నెత్తుకొని ముద్దాడి యొకచోఁ గూరుచుండి తొడపైఁ గొడుకు నిడుకొని దేహమును బలుమాఱు తడవుచుఁ బాలిచ్చెను. చిన్నికృష్ణుఁడు కడుపునిండఁ బాలు ద్రాగెను. అం తట యశోద నాయనా! ఆడుకొమ్ము అనిబుజ్జగించి దించి కాగు చున్న పాలు పొంగిపోవు జాడఁగాంచి యచ్చటికిం బోయెను.

తల్లి యవ్వలఁ గార్యాంతరమునఁ బోవఁగా బాలకృ ష్ణుఁడు లేనికోపమును గల్పించుకొని యొక పాషాణముం గైకొ ని గుఱిచూచి వెన్నయుండు కడవ బ్రద్దలు వైచెను. అది పగిలిపో యెను. అందున్న వెన్నఁ దినుచుండెను. రిత్తమాఁకలి నభినయిం చుచు వడివడి వెన్నఁదినుచుండఁగా నాయశోద పొంగఁబోవు పాలు పొంగకుండ మంటనార్పి వచ్చి కుండపెంకులఁ జూచి కొడుకు వెన్నదినుచున్న విధమును గన్నులారఁ గనిముసిముసి నవ్వుచుఁ బోయెను. అంతలో శ్రీకృష్ణుఁ డటఁ గనఁబడక పోయెను. ఇపుడున్న పిల్లవాఁ డింతలో నెచటికిఁబోయెనో యని యిటునటు వెదకుచుఁ బొరుగిండ్లకుఁ బోవుట మానుకగానఁ బ్రక్కయింటికిం బోయెను. తాను బోయిచూడఁగా

శ్లో. ఉలూఖలాంఘ్రే రుపరి వ్యవస్థితం
మర్కాయ కామం వదతం శుచిస్మితం,

హయ్యంగవం చౌర్యవిశంకితేక్షణం
నిరీక్ష్య పశ్చాత్సుత మాగమ చ్ఛనైః. భా. ౯ అ. ౮ శ్లో.

మర్కాయ మర్కటాయ మర్కశబ్దో ఽత్ర మార్జారా దీనా ముపలక్షకః యద్వాఽమర్కం నవనీతం తదర్థమాగతాయ సఖిజనాయేత్యన్యే. అనివ్యాఖ్య.

ఱోలు తిరుగవేసి యందునిలుచుండి యుట్టి నందుకొని మెల్లఁగా పైమూఁతఁ దీసి యందులోని వెన్నను గోఁతికి బిల్లికిని బెట్టుచున్న కుమారుఁ డగపడెను.

మ. కనిచేతఁ జెలగోలఁ బట్టుకొనుచుం గానిమ్ము కానిమ్ము రా
తనయా యెవ్వరియందుఁ జిక్కుపడ నే దండంబునుం గాన,
నే,వినివారంబును బొంద నేవెఱపు నే విభ్రాంతియుం జెంద
ము, న్ననియో నీవిటు నన్నుఁ గైకొనమి నేఁడారీతి
సిద్ధించునే.

అని హెచ్చరించెను.

తా మాత్తయష్టిం ప్రసమీక్ష్య సత్వర
స్తతో౽వరుహ్యాపససార భీతవత్,
గోప్యన్వధావన్న య మాపయోగినాం
క్షమం ప్రవేష్టుం తపసేరితం మనః.

శ్రీభా. ౧౦ స్కం. ౯ అ. ౯ శ్లో.

శ్రీకృష్ణుఁడు జెలగోల పట్టుకొని తన్ను దండింపవచ్చు జననిం గనియె. ఈమెనన్నుఁ గొట్టవచ్చుచున్న జాడఁ గనుపట్టెడి. ఇంతకుముందే ముఖమున సకలబ్రహ్మాండములు కన్న

లారఁ గాంచెనే. మఱచినది కాఁబోలు! అయిన భీతి నభినయించు చ వడివడిఁ బరుగెత్తెద. అట్లు చేసినఁగాని ముందు చేయఁగ లకార్యము సాగదు. అని యూహించి సర్వజ్ఞుఁడు కావునఁ గప టనాటకసూత్రధారుఁ డను పేరు సార్థకము చేయఁగోరి గల్లుగ ల్లున గజ్జెలు మ్రోఁగుచుండఁగా నాట్యమాడునట్లు భీతిని బరు గిడువానిరీతి హాస్యమునకు వడివడిఁ జనుభంగిఁ బరువెత్తెను. ఈ ఘట్టమున శ్రీపోతనగారి పద్యరత్నము నలంకరింపక మాన నయితిగాదు. ఈపద్యమునకు మూలము బీజరూపముగా నున్న ది. "నయ మాప యోగినాం క్షమం ప్రవేష్టుం తపసేరితం మనః" అను మూలమునకు మహాకవి యిట్లు పద్యమును రచించెను.

సీ. బాలుఁ డితండని భావింతు నందునా
  యే పెద్దలును నేర రీక్రమంబు
వెఱ పెఱుంగుటకునై వెఱపింతు నందునా
  కలిగి లేకొక్కఁడు గాని లేఁడు
వెఱపుతో నాబుద్ధి వినిపింతు నందునా
  తనుఁ దానరైయె బుద్ధి తప్పకుండు
నొండెఱుంగకయింట నుండెడి నందునా
  చొచ్చి చూడని చోకచోటులేదు
ఆ. తన్ను నెవ్వరైనఁ దలఁపోయఁ బోతెడి
  త్రోవ లేదు భీతి త్రొక్కటి త్రొక్కఁగఁ

డెలమి నూరకుండఁ డెక్కసక్కెము లాడుఁ
బట్టి శాస్తిసేయు భంగియెట్లు?

యశోద యాసమయమున నిట్లూహించె ననికవిప్రాయుట సమంజసమేయని యెన్నకయుండుట యపరాధమే. చాలసారులు గోపికలు బాలకృష్ణు నపరాధములఁ దెల్పియుండిరి. తాను వాని నాలించియుఁ గన్నులారఁ జూడక దండింపరాదని నిశ్చయించి వారికేవో నాలుగుమాటలు చెప్పి సాగనంపి యుండెను. దుడుకు కొడుకని తానెఱింగెను కాని యాచిన్నికుమారుఁడు చేయు బాలచేష్టల కపరిమితానందమందుచు నాతప్పులను మఱచిపోయి యుండెను.ఇంతకుముందే పాలిచ్చెను. దానఁదృప్తినొందక పాపాణప్రయోగముచేసి వెన్నకుండను బ్రద్దలు కొట్టియుండెను. అందున్న వెన్నను దినుటయుఁ దాఁజూచి యుండెను. పట్టుకొనఁ బోఁగా కనఁబడక పోవుటయు నెఱింగెను. పరికింతమని పొరుగింటికిం బోఁగా మున్ను గోపికలు చెప్పినట్లే ఱోల్లు తిరుగవేసికొని దానిపైకి నెక్కి వెన్నను గోఁతులకు బిల్లులకుఁ బెట్టుచున్న కొడుకును గన్నులారఁ గాంచెను. గోపికలు చెప్పినతప్పులన్నింటిని దనకుమారుఁడు చేసియే యుండునని నమ్మెను. ఒక నిముసములో నిచటికివచ్చి యిట్టిపని చేయుచున్నాఁడు కదా? ఈతని పనులీవఱకే బాలుఁడు చేయునవి కావు. లోకాతీతములు. ఇన్ని యుపాయము లెవ్వరికి నుండవు. ఎట్లు వీనికీ దుర్గుణములు పట్టుపడకుండఁ జేయుదునా యని తల్లి యుల్ల

మునఁ దలంచుట లోకసాధారణప్రవృత్తికి విరుద్ధమే కాదు. ఇట్లూహించినదాయని సంశయించుటయే విరుద్ధము. ఇట్టిఘట్టమున మహాకవి తనప్రతిభను దిగంతవిశ్రాంతముగఁ జేసెఁగదా యని వేయినోళ్లఁ బొగడక తప్పదు. ఇఁక నవ్వాలఁ బరికింతము. "అతిసర్వత్రవర్జయే" త్తనియున్నదియే కదా.

## ఉలూఖలబంధనము.

ఇట్లు యశోద వితర్కించి వితర్కించి కరమునసున్న నెలగోల జళిపించుచు బాలగోపాలా! బుద్ధిమంతుఁడవు. నీప్రవర్తనము చాలమెచ్చఁదగినది! ఇదియే నాయనా చేయఁదగిన పని. మంచిది మంచిది. కొంచెము నిలువఁబడుము. పరుగెత్తకుము. అని యదలించెను. కఠినవాక్కులతో భయపెట్టెను. నెలగోలంజూపించి యెట్లున్నదో చూచితివా. దెబ్బ తినక తప్పదులే యనుసూచనను గనఁబఱచెను. ఇంక నిట్టిపనులు చేయకుండ గట్టిగా బుద్ధిచెప్పెద నాయనా యించుక నిలువదా యని చెంతకుం బోయెను.

శ్రీకృష్ణమూర్తి తల్లివచ్చుటం జూచెను. భయము నభినయించెను. తల్లిచూచినదే. యిఁకేమి నాగతియని చెనటినట్లు నలుప్రక్కలు పరికించెను. ఎట్లు తప్పించుకొందునా యను భావము తేటపడునట్లు నిలువంబడియెను. గుటకలు మ్రింగెను. మొగము వెలవెలఁ బాఱునట్లుగాఁ గపటదుఃఖము నభినయించెను. చిక్కకుండఁ దప్పించుకొని పోవు సూచ్న గనఁబఱచెను.

చేయుచున్న కార్యము తప్పు. ఇంకఁజేయనమ్మా యని తెలుపున ట్లుమాటలాడఁబోయెను. ఈఘట్టమున మూలమును బరికింతము. పిదపఁ బరివర్తనముఁ బరీక్షింతము.

శ్లో. కృతాగసం తం ప్రరుదంత మక్షిణీ
కర్షంత మంజన్మషిణీ స్వపాణినా,
ఉద్వీక్షమాణం భయవిహ్వలేక్షణం
హస్తే గృహీత్వా భిషయంత్యవాగురత్. ౯ అ. ౧౧ శ్లో.

సీ. స్తంభాదికంబులు తనకు నడ్డంబైన
నిట్టిట్టు చనిపట్టు నీనివాని
నీతప్పు సైరింపు మింక దొంగిలఁ బోవ
నేనని మునుముట్ట నేడ్చువానిఁ
గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు
వెడలు కన్నీటితో వెగచువాని
నేదెస వచ్చునో యిదియని పలుమాఱు
సురుఁగుచుఁ గ్రేఁగంటఁ జూచువానిఁ
ఆ. కూడఁ బాఱిపట్టుకొని వెఱపించుచుఁ
జిన్ని వెన్నదొంగ చిక్కెననుచు
నలిగి కొట్టఁ జేతులాడక పూఁబోఁడి
కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి.

మూలార్థమును బద్యము విస్తరింపఁజేయుచు దానిసారమును దేటతెల్లముగఁ దెలుపుచున్నది. మూలమున "అపా

గుర ఇతి పాఠాంతరే అపనోరణంమనసా ద్రోహచింతన మకరో దిత్యర్థః" అని వ్యాఖ్య కనఁబడియెడి. ఈపాఠము సుసంగతము కాదని పోతనగారు వదలిరి. అందుకు నీపాఠ మసంగతమని యే తోఁచును. ఏలయనఁగా యశోద తనమనస్సులోఁ గీడుచేయఁ దలఁచెననుట యసంగతముకాదని యెవ్వ రనఁగలరు!

ఇట్లు యశోద శ్రీకృష్ణునిం బట్టుకొని యతని యపరాధమును గన్నులారఁ గాంచినదయ్యుఁ గొట్టఁ జేతులాడక నందింపకున్న నింకను ఈదురభ్యాసమే పట్టుపడి బాలుఁడు నిందలపాలగు ననియు నూహించి కుమారుని సత్ప్రవర్తకునిగఁ జేయం దలంచి దండింపక తీఱదని నిశ్చయించి ముందుగా నించుక పరిహాసముగా భయపెట్టం దలంచి *యంతలో మిక్కిలి భీతిల్లినట్లు లభినయించిన కుమారు మోముం గాంచి పాప మేమిరొయెఱుంగఁడు. ఏమో తెలియక యీతప్పు చేసితిని దండింపకుమా యను నభిప్రాయమును గనఁబఱచు చున్నవాఁడని యూహించి

క. వీ రెవ్వరు శ్రీకృష్ణులు
గారా యెన్నఁడును వెన్నఁ గాన రఁటకటా
చోరత్వం బించుకయును
నేరరఁట ధరిత్రి నిట్టి నియతులు గలరే.

* త్యక్త్వా యష్టిం సుతం భీతం విజ్ఞాయార్భకవత్సలా, ఇయేష కిల తం బద్ధుం దామ్నాఽతద్వీర్యకోవిదా అని మూ. పై పద్యము మూలార్థము ననుసరింపక కల్పితమని యెఱుంగఁదగు.

అని పరిహసింపుమనట్టు లభినయించిదండించెను. నాయనా! వెన్న దినె నని గోపికలు చెప్పఁగా నేఁ దినలేదమ్మా యని యంటివే. దొంగతనము నే నెఱుఁగనంటివే. ఇప్పటి కృత్యము నేఁ గన్నులారఁ జూచితినే. దీని పేరేమి? అసత్య మాడలేదా. దొంగతనము చేసితివికదా. నీవంటి బుద్ధిమంతులు లోకమున నుందురా. అని బెదరించెను. అంతతో నూరకుండక మఱియు నాయశోద

*క. పట్టినఁ బట్టువడనినినుఁ
బట్టెద నని చలము గొనినఁ బట్టుట బెట్టే
పట్టు వడవండ్రు పట్టీ
పట్టుకొనఁగ నాకుఁగాక పరులకు వశమే.

వత్సా! ఎట్టివారికేఁ జిక్కవని పలుకుదురు. నిన్నుఁ బట్టుకొనఁగ నాకు వశమగునేగాని యితరులకు శక్యమా. అని ప్రాతీతికార్థము. విశేషార్థమేమనఁగా పరులు శత్రువులు. అనఁగా భక్తిశూన్యులు. భక్తియుఁ బ్రేమరూపమైనది. నీయందుఁ బ్రేమరూపమగు భక్తి లేనివారలకు నీవు పట్టుపడుదువా. హృదయమునఁ దోఁచువాఁడవు కావు. పరాత్పరుఁడవగు నీవు కుమారుఁడవగునంతటి పుణ్యము చేసితిని. తొలిజన్మమున నే నిట్టి యపూర్వసుకృతముఁ జేసినదానను. కాఁబట్టి చిన్నతనమునుండి

---

*ఈపద్యమునకు మూలము లేదు. అతద్వీర్యకోవిదా. అని యున్నది. అకృష్ణుని ప్రభావము నెఱుంగనిదై అనియర్థము. ఈపదము నాధారముచేసికొని మహాకవి పోతనగారు శాశమునసౌధముగట్టి యలంకరించిరని యెఱుంగఁదగు.

నిన్నెత్తి పెంచనోచితి. నీ సహస్థితి నాకుఁగలిగిన ట్లెవ్వరికీ నేనాఁడును గలుగలేదు. తుదకు ఋషులకుఁగూడ లేదుకదా. అట్టి నేనుదప్ప నిన్నుఁబట్టుకొనువారెవ్వరుగలరు? అనునది సారము

ఇట్లు పలుకుచు మాయావిమోహితస్వాంతయయ్యు వాసనాబలంబునఁ దనవశముగాక పైపైఁ బొంగి వచ్చుచున్న మాటల నాపుకొనఁజాలక

క. ఎక్కడనైనను దిరిగెద
వొక్కయెడన్ గుణము గలిగియుండవు నియమం
బెక్కడిది నీకు మఱచినఁ
జక్కఁగఁ బోయెదవు పెక్కు జాడలఁ బుత్రా!

కుమారా! అనిసంబోధించి యిట్లు పలికెను. ఇందుఁ బ్రాతీతికార్థము స్పష్టము. రహస్యార్థము.

శ్రు. అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః. అనునట్లు సర్వత్ర వెలయువాఁడవు. అనఁగా సర్వవ్యాపకుఁడవు. ఒక్కచోటనైన గుణముకుదిరి యుండవు. ఒక్కచోటనే నిలుచుట లోకులవాడుక. నీవట్లుండ వీలులేదు. ఎవ్వరేరూపమున నెట్లు ధ్యానింతురో ఎవ్వరు ధ్యానాసక్తులుగాకుందురో నీవెలుంగుదువు. కాన నందందుఁ బ్రియముఁ దిరుగుచు వారివారి పుణ్యానుసారము దర్శనమిచ్చుచుందువు. నీకు నియమములేదు. అనఁగా శ్రుతిస్మృతి నియమబద్ధులు ఇతరులు. తదతీతుఁడవు ఏనియమములు నీకులేవు. నియమబద్ధులు

ప్రకృతి.నీయిచ్ఛయే యామహాదేవికినియమము. నియమములు లేవనఁగా నీవే విరాట్టువు. సగుణబ్రహ్మమవై తివని భావము. మఱచినఁ జక్కఁగాఁ బెక్కుజాడలఁబోయెదవు. ఒక్కమార్గము నీకుఁ జాలదు. పెక్కుమార్గముల నందును జక్కఁగా న్యాయముగాఁ బోయెదవు. భక్తులు పరతంత్రులై ధ్యానించినతఱి నీదేహము నీవెఱుంగ వనిభావము.

పాఠకులారా! యశోద యిట్టిభావమునఁ బలికెననుట సమంజసమాయనిప్రశ్నింపకుఁడు. భగవత్సంగతియూరకపోదు. అప్రయత్నముగ నట్టిభగవత్ప్రభావద్యోతక వాక్కులే వచ్చుచుండును గాని మాయామోహితులుగాన నట్టివారు తమమాటల కిదియర్థమని వారెఱుంగరు. అని మనమెఱుంగుటయే చక్కని త్రోవ. భగవన్నామస్మరణమే సకల పాపధ్వంసక మనఁగా నిఁక యశోదపుణ్యమునకు మేరయుండునే.

ఇట్లాసాధ్వీమతల్లి యుల్లమున లేనికోపమునఁ బలుకుచు నంతతో దండించుటయో వదలుటయో చేయక యింకను మాటలచే శ్రీకృష్ణుని బెదరింపఁబూని

*సీ. తోయంబు లివియని తొలఁగక చొచ్చెదు
తలఁచెదు గట్టినఁ దరలనెత్త
మంటితో నాటలు మానవు కోరాడె
దున్నతస్తంభంబు లూపఁబోయె

* ఇందు దశావతారములు వర్ణింపఁబడిన వని తెలియఁదగు.

దస్యుల నల్పంబు లడుగంగఁ బాఱెడు
  రాచవేఁటలఁజాల నవ్వ దెచ్చు
దలయవు నీళ్లకు నడ్డంబు గట్టెడు
  మునలిపై హరివృత్తి మొనయఁజూచు
ఆ. దంబనంబు మొలకు నడుగవు తిరిగెద
వింకఁ గల్కిచేత లేల పుత్ర
నిన్ను నంప బ్రాల్ప నే నేరననియొ నీ
విట్టు క్రిందు మీఁదు నెఱుఁగ కునికి.

అని బెదరించెను. ఇట్లు బెదరించి కొడుకును గొట్టఁ జేతులాడక వదలిన గోపిక లేమనుకొందురో యని సంశయించుచుఁ బ్రత్యక్షముగా దోషము చేసినవానిని వదలుట శిష్టము లేక లోకాచారమురీతి బుద్ధి చెప్పందలంచి యొకత్రాఁటచే నాగోపాలబాలు నొకఱోటికిం గట్టెను. త్రాడు నడుమున బిగించి దానిని ఱోటికిం జుట్టెను.

ఆర్యులారా! ఈఘట్టమున శ్రీభాగవతమునందు

శ్లో. నచాంత ర్న బహి ర్యస్య నపూర్వం నాపి చాపరమ్,
  పూర్వాపరం బహిశ్చాంత ర్జగతో యో జగచ్చయః.

అని కనుపట్టెడు.

క. వెలిలోను మొదలు తుది నడు
ములు లేక జగంబు తుదియు మొదలుఁ నడుముఁ
వెలియును లోనగు నీశ్వరు
నలవడు నే కట్టఁ బ్రణతురాల్ గాకున్నఁ.

ఆ. పట్టి యొల్లబోటి పట్టి యీతండని
గట్టి తలఁపుతోడఁ గట్టెఁ గాక
పట్టికడుపు పెక్కు బ్రహ్మాండములు పట్టు
టెఱఁగనేని తల్లి యేలకట్టు. అని పోతనమహాకవి.

ఇట్టి బాలు నెట్లు గట్టెనో తెలియఁ జాలముగాని లోకా చారముతోఁ జోల్చిన నిది సుసంగతమే. వేదాంతవేద్యుఁడను నర్థము భక్తులు బాలలీలలనుండి యెఱుంగవలయు ననియే గ్రంథకర్తలభావము. ఒకొక్కభక్తున కొకొక్కరూపమునఁ బ్రీతి కలిగియుండును. ఈవిషయము శ్రీకృష్ణకర్ణామృతమునందుఁ గనుపట్టెడు. పరమభక్తుఁడగు లీలాశుక మహాకవి శ్రీకృష్ణరూప మాబాల్యముగ సర్వావస్థల వర్ణించెను. అందు నీసమయమున యశోద వెన్నదొంగ యని సిద్ధాశయురాలై యపరాధముఁ దెలిపినపుడు శ్రీకృష్ణమూర్తి యెట్టులుండునో వర్ణించియున్నవాఁడు.

శ్లో. వదనే నవనీత గంధవాహం
వచనే తస్కరచాతురీ ధురీణం,
నయనే కుహనాశ్రు మాశ్రయేథా
శ్చరణే కోమలతాండవం కుమారమ్.

ఒకొక్కరూప మొకొక్కభక్తుని కభీష్టముగ నుండుట లోకసహజము. లీలాశుకుల కన్నిరూపములు ప్రీతిపాత్రములే. శ్రీకృష్ణుని సకలావస్థాబోధకరూపము లామహాత్ముని ధ్యానమునఁ దగిలినవే. కావున భగవల్లీలలు వర్ణితము లగు

చుండును. ఏలన, కర్మములు ఒక్కరీతి నుండునవి కావు. కొం దఱు కామమునఁ బుణ్యకార్యము లొనరింతురు. అట్టివారికి శ్రీపరమేశ్వరవిహారమునఁ దగురూపమే ధ్యానగమ్యమగు. కొందఱు నిష్కాములై సత్కర్మముల నాచరింతురు. వారికి భగవంతుని జ్ఞానరూపమే ధ్యానగమ్యమగు. ప్రతిభక్తుఁడును నిరంజనాదిశబ్దములతో నుతించును గాని యతని కర్చారూ పము కర్మాధీనముగనే యుండును. కొందఱు రాధామాధవుని, కొందఱు బాలకృష్ణుని, కొందఱు గోపికాలోలుని ధ్యానమున నుతించుటేల? కవిస్తుతియే యతని ప్రాక్కర్మమును దెలుపును. ఒక్కొక్కతఱి నెట్లో స్తుతించినను ఆతనిపట్టుదల మనకు గోచ రించుచునే యుండును. పరబ్రహ్మము శ్రీకృష్ణుఁ డనుట సర్వ సమ్మతము. అట్టివారు అట్టిరూపముల కాధారమగు మంత్ర మునే యుపాసింతురు. వారి ధ్యాన మారూపమునే గోరు చుండును. కొందఱు శ్రీరామచంద్రుని ధ్యానించుట, కొం దఱు వీరరాఘవుని గొనియాడుట, మఱికొందఱు కోదండ రాముని గొండాడుట, ఇంకనుగొందఱు జానకీరాముని జపించు టయు నేల? వారి భక్తివిశ్వాసము లారూపధారియగు రాము నిపై నుండునుగాని యితరరూపములను వారు దూషింపరు. ఐనను వారి దృఢప్రేమ మామూర్తి కాధారమగు మంత్రమున నిల్చును. అందులకే రాఁబోలు,

"సుపరీక్షితశిష్యాయ వదేన్మంత్రం మనోహరం"

అని పెద్ద లనువదించిరి. శిష్యుని మనోభావము నెఱింగి చిరకా

లము వానిసంభాషణములంగనిపెట్టి వీని కీదేవతయందు విశ్వాసముకలదని నిశ్చయించి తదనుమతమగు మంత్రము నుపదేశించుట సద్గురులక్షణమని శాస్త్రము బోధించుచున్నది. అట్లులేక తనకుం దోంచినది యుపదేశించిన ననర్థములు పొసంగుట మనము కన్నులారం జూచుచున్నవారముకదా.

నశఠాయ నదుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్, ·
తస్మై కుప్యంతి యోగిన్య స్సోఽనర్థ స్సుమహా న్మనే.

అని శాస్త్రములు శాసించుచున్నయవి. ఇవన్నియుం బైభావమునే స్థిరపఱచుచున్నవి. కాంబట్టి భక్తుల కాయా భగవదవస్థారూపములు ధ్యేయము లనుటయే యిట గ్రహింపందగు సారము. ఇంక శ్రీకృష్ణలీలం బఠింతము.

యశోద యిట్లు లాకుమారునిం గట్టివేయంబూన నా రశ్మి రెండంగుళములు తక్కువ యయ్యెను. పాప మాసాధ్వి వేఱొకత్రాడు నెట్లో తెచ్చి ముడివైచి బాలకృష్ణునిం గట్టంబూనెను. ఆత్రాడును రెండంగుళములు కొఱంతంగాంచెను. మరల నింకొక్కత్రాడు సేకరించి తెచ్చి ముడి వైచెను. కాని నడుమున కదియుం గట్టుతఱి రెండంగుళములే తక్కువగాం గన్పట్టెను. ఇట్లెన్నిరశ్ములం దెచ్చినను రెండంగుళములే కొఱంత కన్పట్టుచుండెను. ఇంటిలోని కరుగుట, త్రాడుగొనివచ్చుట, అది కొదువయగుట, మరల నరుగుట, వచ్చుట, కొఱంతకాంగా మరలిపోవుట ఈసందడిలో నాయశోదదేహ మలసెను. భగవంతుం డూరక చూచుచుండెను.

ఏవం స్వదేహ దామాని యశోదా సందధ త్యపి,
గోపీనాం విస్మయంతీనాం స్మయంతీ విస్మితా భవత్.
సమాతు స్విన్నగాత్రాయా విస్రస్తకబరస్రజః,
దృష్ట్వా పరిశ్రమం కృష్ణః కృపయాసీ త్స్వబంధనే.
ఏవం సందర్శితాహ్యంగ హరిణా భక్తవశ్యతా,
స్వవశేనాపి కృష్ణేన యస్యేదం సేశ్వరం వశే. అని మూ.

తుట్టతుదకు తల్లి యలయుటఁ గాంచి బ్రహ్మాదులకుఁ జిక్కని శ్రీపరమాత్మ యామె కట్టుత్రాటికిం జిక్కెను. శ్రమం పడి యామెయుం గట్టితినిగదా యని తలంచెను.

జ్ఞానినాం చాత్మభూతానాం యథా భక్తిమతా మిహ.

అనునట్లు జ్ఞానులకుంగాని మఱెట్టివారికింగాని భక్తులకు వశుఁడైనట్లు భగవంతుఁడు వశుఁడు కాఁడుకదా. కావున శ్రీహరి తల్లిచేతిలోఁ జిక్కి యాత్రాటిచేఁ గట్టఁబడిరెను.

భక్తులారా! ఇందొక్క సందియంబు పొడమెడు. జ్ఞానులకు మానులకును భక్తులకు వశుఁడైనట్లు కానఁగా భక్తి యన్నింటికంటెఁ బెద్దదనుభావము తేటపడియెడు. జ్ఞానులకంటె భక్తుఁ డెక్కుడుగ భగవత్ప్రీతిపాత్రుఁ డని తెల్పినట్లె తోఁచునుగదా?

నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి. గీ
శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః,

జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి. ౩౯
తస్మా దజ్ఞానసంభూతం హృత్థ్సం జ్ఞానాసి నాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. ౪౨

శ్రీభగవద్గీత జ్ఞానయోగము.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పర యోపేతా స్తే మే యుక్తతమా మతాః.
యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్ధధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః. ౨౦

శ్రీభగవద్గీత భక్తియోగము.

భగవద్గీతా సూక్తులం బఠించితిరిగదా. జ్ఞాన భక్తి శబ్దముల కర్థములు వినుఁడు. జ్ఞానం. విశేషేణ సామాన్యేనచావబోధః. మోక్షే ధీ ర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః. ఇత్యమరః. మోక్షే శిల్పే శాస్త్రే చ యా ధీః సా జ్ఞానం విజ్ఞానం చోచ్యతే. ఏషా విశేషప్రవృత్తిః. అన్యత్ర ఘటపటాదావ్యాధీః సాపి జ్ఞానం విజ్ఞానం చోచ్యతే. ఏషా సామాన్యప్రవృత్తిః. మోక్షేధీః జ్ఞానం విజ్ఞానంచ యథా జ్ఞానా న్ముక్తిరితి సా యాచితాచ విజ్ఞానం తుష్టా బుద్ధిం ప్రయచ్ఛతి ఇతి. యోగశాస్త్రమ తేతు.

ఏకత్వం బుద్ధిమనసో రింద్రియాణాం చ సర్వశః,
ఆత్మనో వ్యాపిన స్తాత జ్ఞాన మేత దనుత్తమమ్.

వాయుపురాణే ఉత్తరభాగే.

వైరాగ్యా జ్జాయతే జ్ఞానం జ్ఞానా ద్యోగః ప్రవర్తతే,
యోగజ్ఞః పతితోఽపాపి ముచ్యతే నాత్రసంశయః,
జ్ఞానం ప్రకృత మజన్య మవచ్ఛిన్నం సర్వస్య సాధకమితి జ్ఞాన ముత్తమమ్. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మేతిశ్రుతేః.
ఇతితద్భాష్యమ్.

భక్తియనఁగా

భక్తిః. విభాగః సేవా. ఇతిమేదినీ. పూజ్యేష్వనురాగో భక్తి రిత్యుపదేశః ఈశ్వరే పరానురక్తిః.

అథాతో భక్తిజిజ్ఞాసా సా పరానురక్తి రీశ్వరే, ఇతి శాండిల్యసూత్రమ్. ఉపాసనా. పరమేశ్వరవిషయే పరమప్రేమ ఉపాస్యాకారాకారితచిత్తవృత్త్యా వృత్తిరూపా పరిపక్వ నిధిధ్యాసనాభ్యా శ్రవణమననాభ్యాస ఫలభూతా అనురక్తిః నహ్యేష్టదేవా త్పరమస్తి కించిత్. ఇతి బుద్ధి పూర్వికా చిత్తవృత్తిః సాచ పరమేశ్వరప్రీత్యధీనా. అని శబ్దకల్పద్రుమము.

ఇట్లు నిఘంటువులందు జ్ఞానమనఁగా వస్తుతత్త్వావబోధన ని భక్తియనఁగా ఈశ్వరునియందుఁ బరమప్రేమ మని యర్థములు తేలుచున్నవి. "జ్ఞానాన్ముక్తిః" అనుట యందఱెఱుంగుదురు. అట్టిజ్ఞానులకంటె భగవంతునే సదామననము చేయువారాను లకంటె భక్తుఁ డెక్కుఁ డనుటయెట్లు? అను శంకపొడమెడు. భక్తిజ్ఞాన వైరాగ్యములు నిశ్శ్రేణికాన్యాయము ననుసరించి(వరుసగా సోపానములవంటివి) ఒక్కదానికన్న నింకొక్కటి యెక్కు-

వయని కొందఱందురు. వీని కన్నింటికంటె యోగమే శ్రేష్ఠమని వేఱొకమూలనుండి యొక్కఁడు ఘోషించు.

"తస్మాద్యోగీ భవార్జున"

అను గీతాప్రమాణము వినంబడ నొక్కఁడు వాకొను. "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" అను శ్రుతి గలదు కదా. కాఁబట్టి జ్ఞానమే ప్రధానము. భగవంతుఁడు జ్ఞానస్వరూపుఁడు. దానిని మించినదొక్కటియు లేదని వేఱొకమూలనుండీ యొకఁడునెత్తిన నోరుపెట్టుకొని వాదించు. వైరాగ్యము ప్రధానము. దానికి నీడుసేయ నేవియుఁ దగవని మఱొక్కఁడు ముక్కుమీఁదఁ గ్రుద్దినట్లు మొగముచిట్లించి మాటలాడు. ఎవరినోరు మూయింప శక్యమగు? ఎవరికి సమాధానముచెప్పి వానిని మనమతమునకుఁ ద్రిప్పికొనఁగు? ఇదియే యుత్తమమని యిది దానికంటె మిన్నగాదని యొప్పింప నెట్లుసాధ్యము? కాఁబట్టి యీవాదము లనాదిగా నున్నవియే. ఇందెవ్వరి కేది యుక్తమని తోఁచిన నది వారి కనుసరింప యోగ్యమనుట చక్కనియుపాయము.

భగవద్గీతలు అడుసునఁ బాతిన కంబమువలె నేదియుఁ దేలవీలులేనట్లు బోధించుచున్నవని కొందఱందురు. ఆమాట మన మంగీకరింపరాదు. ఒక్కగీతలేమి? ఏ గ్రంథమునైన నేవిషయమును జెప్పినపు డది యుత్తమమని బోధించును. దేన నెవరిచిత్తము పరిపక్వ మగునో అది యాజీవునకు సుత్తమమార్గము. దానిననుసరించి యతఁడు భగవత్సేవ చేయవలయు. దానఁ దరిం

చవలయు. రెండవమార్గ మతనికి రుచింపదు. అట్టుండుటచే మేలు?

ధర్మస్య తత్వం నిహితం గుహాయాం
మహాజనో యేనగత స్స పంథాః.

అనుసూక్తి యందఱకుం గ్రొత్తదికాదు.-ఈమూఁడు నన్‌గా భక్తిజ్ఞాన వైరాగ్యములు సమఫలదములు. ఒకదానికన్న నింకొక్కటి మిన్నయని యెన్న నశక్యము. లోకజ్ఞానముగలిగి పరతత్వచింత చేయువాఁ డెవ్వఁడైన దీనికంగీకరింపకపోఁడు. వాగ్వాదమున మాత్రము దక్షులగు మాన్యులు వాదింపఁగ లరు. వారిజోలి మనకేల?

సిద్ధాంతము.

ఏ మనుజున కీమూఁడు త్రోవలందు నేది మనసునకు సరిపడునో దాని ననుసరింపందగు. రెంటవదాని దూషింపక యుండుటయేభక్తునిలక్షణము. కానియీమూఁడింటికిఁబరస్పరసం బంధము గలదు. వాని నెఱుంగుట యుత్తమము. ఈ భక్తివిష యమునసే మతత్రయస్థాపకులు వేఱుమార్గములు త్రొక్కిరికాని ముఖ్యవిషయమున భేదముగానరాదు. భగవత్సేవచేయుటయం దఱమత సారము. సేవావిధులలో భేదములుగలిగినవి. కావుననే మతములుమూఁడుగ నేర్పడినవి. ఇందుభక్తులు బహువిధములు గాఁ జీలిపోయిరి. ఒక్కొక్క పురాణమున నొక్కొక్క మార్గ ము ప్రధానముగాఁ జెప్పఁబడినది. ఇందేవిధి ననుసరించినను ఫలము సమానము. భక్తి యన్నింటికన్న హెచ్చని జ్ఞానికన్న

భక్తుఁడే హెచ్చని చెప్పుటమాత్రము ప్రమాదమనక తప్పదు. అయితే భక్తిశూన్యుఁడు జ్ఞాని కానేరఁడు. జ్ఞానశూన్యుఁడు భక్తుఁడు కానేరఁడు. వైరాగ్యసంపద యీ రెండింటికి ఫలము. అది లేకున్నఁ బై రెండును దృఢములుగా నిలువఁజాలవు. కాఁబట్టి తోఁచినట్లు పలుకరాదు. జ్ఞానులు భక్తులే. భక్తులు జ్ఞానులే. వీరుభయులు వైరాగ్య సంపద గలవారే. వీరలకు ముప్వురకు భగవత్ప్రసాదమే యభీష్టఫలము. దాని కీముప్వురును పాత్రులే. ఇందేదిగాని దృఢతఁ గాంచకున్న ఫలము శూన్యమేయగును. వేదోక్త కర్మాచరణము వ్యర్థమని, అది భగవంతునిఁ జేర్పఁజాలదని పలుకుట పాపహేతువు. వేదము భగవద్రూపము. తదుక్తకర్మములు ఫలింపకున్నఁ దక్కినవి ఫలింపవు. శాస్త్రముసుల్లంఘించుట భగవదాజ్ఞను నుల్లంఘించినట్లే.

శ్లో. య శ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిం. ౨౩
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మకర్తు మిహార్హసి. ౨౪
శ్రీభగవద్గీత, ౧౬ అధ్యాయము.

నియమవిహీనమగు మాట నిష్ఫలము. భగవదాజ్ఞయు నట్టిదే. కాఁబట్టి యజ్ఞములు ఇతర శ్రుత్యుక్తకర్మములు చేయుటకన్న భగవన్నామస్మరణమే చేయఁదగినదని భక్తికే భగవంతుఁడు వశ్యుఁడని, తక్కినవి ఫలము నీఁజాలవని యుద్ఘోషించుట

తెలివితక్కువ. కర్మాసక్తుఁడుకూడ భక్తుఁడేయని యొంచిగిన నిట్లు వారు పలుకరు. ఏ కార్యములు విధ్యుక్తములు చేసినను భగవదర్పణబుద్ధిచేఁ జేయఁదగునను టదీనిసారతాత్పర్యము. ఇంతకన్న నెక్కువ యించుకంతయు లేదు. ఇట్లుండఁగా వాదములు చేయుట, ఆశాస్త్రము తప్పు. ఈ శాస్త్రమే యొప్పని మనుష్యులు చెప్పఁదగదు. చర్మచక్షుస్సు గల మానవు లంతటివారు కాఁజాలరు. అతీంద్రియుఁడు భగవంతుఁడు. ఇంద్రియవశులు మానవులు. కాన వీరు వేదములను దప్పులుపట్టుట తెలివితక్కువ యనుటకన్నఁ జెప్పఁదగిన దేమున్నది? భక్తజనులారా! భగవంతుని కరుణకుఁ బాత్రులమగుట కనేకమార్గములు గలవు. అందేదియే నాశ్రయింపఁజను. అన్నియు భగవంతుని కరుణకుఁ బాత్రులగునట్లు చేయ నేర్పడినవియే. అం దెవ్వరికేది యాశ్రయింపఁదగునని తోఁచునో, పూర్వకర్మానుకూలముగ దానినతఁ డాశ్రయింపఁదగు. ప్రతికార్యమందును భక్తి యుండితీరవలయును. ఏకర్మను నాచరించినను భగవదాజ్ఞచే నాచరించుచున్నవాఁడను, కర్తృత్వము నాకు లేదు, ఫలమునకు నే నర్హుఁడను గాను, ఫలము పరమేశ్వరార్పణము. అను స్వచ్ఛబుద్ధితో నేమార్గము నాశ్రయించినను గడతేఱును. కావున కర్మసిద్ధాంతముల దూషింపరాదు. భక్తి యన్నింటిలోనున్నది. అది లేకున్న నేకార్యము ఫలింపదు.

ఇంతట నీవిషయమును వదలి ప్రకృత కథాభాగమును బరిశీలింతము.

యశోద యీరీతిఁగా కుమారుని సామాన్యబాలునిగాఁ దలంచి యులూఖలమునకుం గట్టివేసి యిఁక నెందుఁబోయె దవో చూతును గదా? యని బెదరుగదురఁ బలికి తులిపితన మింకఁ జేయకుండఁగల బుద్ధివచ్చునని నమ్మి గృహకృత్యముల నొనర్పంబోయెను. శ్రీకృష్ణుఁడు నటఁదల్లియున్నంతసేపు భయ పడిన ట్లుండి తల్లి కార్యాంతరమునఁ బోఁగానే మదిలో నిట్లూ హించెను. చిరకాలమునుండి నారదు శాపంబునఁ గుబేరపు త్రులు నలకూబరమణిగ్రీవు లనువా రిరువురు నర్జునవృక్షంబులై (మద్దిచెట్లు) శీతాతపాది బాధలంగనుచుఁ జేయునది నేరక దుః ఖించుచు శ్రీకృష్ణావతార మెప్పుడు జగమున నగు నాశాప మోక్ష మేకాలమున నగునాయని వేచియుండుట స్మరించెను. నా యాగమనమును గోరుచున్న వీరికి శాపవిముక్తిరూప ఫల మును బ్రసాదింపవలయు. ఈ రెండుచెట్లు జంటగానున్నవి. మాతల్లి నా నడుమునకు ఱోలుకట్టినది. దీని నీడ్చుకొనిపోయి యావృక్షముల నడుమఁజొచ్చెద. ఈయులూఖల మావృక్షాం తరమునఁ బట్టుదు. నే నానడుమఁజొచ్చి దీనిని లాగెద. ఆవృ క్షములు కూలు. శాపము కడచును. ఇదియ నాకర్తవ్యము. అని తలపోయు చుండెను.

## యమళార్జునభంజనము.

శ్రీకృష్ణునకుఁ దగిన శాంతి యయ్యెఁగదా, ఇఁక మన యిండ్లలో దధిమొదలగునవి దక్కుననుకొని గోపికలు కొలఁది

నిమేషములందుండి తమకనిదీఱఁ గాంచి నాయనా! పాలుపె రుగు వెన్న కావలయునా. చాలునా. ఏమయ్యా గోపాలకృష్ణ య్యా. అమ్మ కట్టివేసినది! పరుగెత్తుము. చూతుము. మాయిం డ్లలో వెన్న దిన్నట్లున్నదియా. అని పరిహాసవచనములు పల్కుచుఁ దమతమ యుండ్లకుం బోయిరి. బ్రహ్మాదులకుం గట్టు పడని శ్రీగోపాలబాలకుఁడు ప్రీతిచేఁ దల్లికింగట్టుపడి కర్త వ్యము నాలోచించి యిప్పుడెవ్వరును ఇటలేరు. మాయమ్మ యిం టిపనులు చూచుకొనుచున్నయది. తడవుసేయరాదు. నురల నేనెట్లున్నవాఁడనో చూడవచ్చును. కార్య మాలస్యమగును. పరితపించుచున్న వారిని గాపాడుటయే నాకర్తవ్యము. నాయ వతారఫల మిదియేకదా. ఇఁకఁ క్షణమైన నాలసింపరాదు. వేగ ముగ నామద్దులం గూల్పవలయు. ఆర్తుల మొఱ లాలించుట కన్న నేఁజేయవలసినపని యేమి? కృష్ణా యని మొఱ్ఱయిడుచున్న దీనులఁ గాపాడెద.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్.

అన్న నాప్రతిజ్ఞను సార్థకము చేయవలయుఁ గదాయని యూహించి మెల్లమెల్లన నాయులూఖలము నీడ్చుకొని పోయెను. మందగమనమునఁ జప్పుడుగాకుండ నొరులకుఁ దెలి యకుండంబోయి యారెండు మద్దిచెట్లనడుమఁ దూఁదూఱెను. ఱోలు రెండుచెట్లకుఁ దగిలియుండెను. చిన్నికృష్ణుఁ డిట్లున డుమఁ జొచ్చి యించుకముందునకు ఱోలు జరగున ట్లీడ్చెను.

రెండుచెట్లకు నానుకొని యున్నదిగాన ఱోలుముందునకుఁ గృష్ణునిచే నాకృష్టముకాఁగా రెండుచెట్లును నేలంగూలెను. శ్రీకృష్ణుఁడు తనకార్యముకాఁగా నూరకుండెను.

యశోద కొడుకు నులూఖలమున కెచ్చోటఁగట్టెనో యచ్చోటికింజెంతనే యా మద్దిచెట్లజంట యుండెను. దాని చుట్టును విశాలమగు భూభాగము నిర్మలమైయుండెను. ఆనీడల గోపబాలు రాడుకొనుట యాచారమై యుండెను. ఎప్పుడైన గోపకులుగూడ నందుం గూరుచుండి యిష్టాగోష్ఠి జరపుట యలవాటు. కావుననే యాచెట్లనీడల గోపిక లులూఖలముల నునిచియుండిరి. వీద లందు ధాన్యము దంచుచుండువారు. ఆ యులూఖలముల నొకదానికే యశోద కొడుకుం గట్టివైచెను. పాప మాయశోద కొడు కిట్టివాఁడగునని యెఱుంగదు. ఎన్నిమాఱు లాత్మరూపమహిమములఁ దెల్పినను ఆమె తన్మాయా మోహితురాలు గాఁబట్టి మఱచిపోవుచుండెను.

* ఇట్లు లా రెండువృక్షములు భూతలంబునం బడియెను. పడుటయే తడవుగా నందుండి రెండగ్నులు బయలువెడలి

---

* ఈకథ భాగవతము ననుసరించి వ్రాయఁబడినదని వ్రాసియుంటిని. రెండుమద్ది చెట్లను గూల్చెనని భాగవత విష్ణుపురాణముల యందున్నది. బ్రహ్మవైవర్తపురాణమునందు మాత్రము యశోద శ్రీకృష్ణు నులూఖలబద్ధునింగావించెననియు, అట్లుచేయుంట ఆచెట్టుక్రిందనేయనియు నావృక్ష మొక్కటియేయనియు శ్రీకృష్ణుఁడాయులూఖలము నాచెట్టునకు దగిలించగనే యది పడెననియు నందుండి యొకపురుషుఁడులేచివచ్చి కృష్ణమూర్తిని బ్రార్థించె.

వచ్చునట్లు జ్ఞానసంపన్నులగు సిద్ధులిర్వురు బయలువెడలి కర యుగము జోడించి భక్తివినయంబులుట్టిపడ భగవంతునకు నమ స్కరించి యిట్లువినుతించిరి. శ్రీకృష్ణా! పరమేశ్వరా! మహా యోగివి. నీవే యాదిపురుషుండవు. అందఱికంటె నుత్కృష్టుం

నవియు నాతఁడు నలకూబరుఁడనియు దేవలముని శాపంబున వృక్షమై యుండె ననియుఁ గనఁబడియెడు.

శ్లో. పపాత వృక్షస్సైలాభ శ్ఛిత్వా కృత్వా భయానకమ్.
సువేషః పురుషో దివ్యో వృక్షా దావిర్బభూవహ.

అనియు, 'కుబేరతనయ శ్రీమాన్ నామ్నా యో నలకూబరః, జగా మనందనవనం క్రీడార్థం సహ రంభయా...రతిభోగం ప్రకుర్వంతం దదర్శ దేవలో మునిః, నగ్నాం రంభాం ముక్తకేశీం పీనశ్రోణిపయోధరాం...త యాయుక్తం పులకితం నోత్తిష్ఠంతం స్మరాన్వితం, వృక్షత్వం యాహి పాపి ష్ఠే త్యువాచ మునిపుంగవః, శశాప రంభాం కామార్తాం మానుషీ త్వంభవే తిచ. ౧౮ అధ్యాయము... కృష్ణాష్టోత్తర శతనామములందు "యమళార్జున భంజనః" యని కనుపట్టెడు. కావున భాగవతమననుసరించి యిది వ్రాయఁ బడినది. రంభాశాపముగూడ మరల వ్రాయఁబడుట నూత్న గాథయౌటచే నని గ్రహింపఁదగు.

నలకూబర మణిగ్రీవకృత శ్రీకృష్ణస్తుతిః.

శ్లో. కృష్ణకృష్ణ మహాయోగిన్ త్వ మాద్యః పురుషః పరః, వ్యక్తావ్య క్తమిదం విశ్వం రూపం తే బ్రహ్మణో విదుః. ౧. త్వ మేక స్సర్వభూతా నాం దేహా స్వాత్మేంద్రియేశ్వరః, త్వమేవ కాలో భగవాన్ విష్ణు రవ్యయ ఈశ్వరః. ౨. త్వం మహాన్ ప్రకృతి స్సూక్ష్మా రజస్సత్వత మోమయీ, త్వమేవ పురుషోఽధ్యక్ష స్సర్వక్షేత్ర వికారకృత్. ౩. గృహ్యమాణై స్త్వ

డవు. వ్యక్తావ్యక్తరూపమగు నీజగత్తు పరబ్రహ్మమగు నీస్వరూపమే. సకలభూతముల దేహములకు, అసువులకు, ఆత్మకు, ఇంద్రియములకు నీవే ప్రభువవు. భగవంతా! నీవే కాలస్వరూపుఁడవు. వ్యాపకుఁడవు. నాశరహితుఁడవు. ఈశ్వరుఁడవు. మహాప్రకృతివి నీవే. రజస్సత్త్వతమోమయియగు సూక్ష్మప్రకృతివి నీవే. నీవే సర్వాధ్యక్షపురుషుఁడవు. సర్వక్షేత్రవికారకర్తవు నీవే. కార్యములచే గ్రహింపఁబడియు నగ్రాహ్యుఁడవు. గుణసంవృతుఁడెవ్వఁడు గుణరహితుఁడవగు నిన్నెఱుంగఁ గలఁడు. పరబ్రహ్మమవై వాసుదేవుఁడవగు నీకు నమస్కారము. ఆత్మద్యోతగుణచ్ఛన్నమహిమముగల నీకు వందనములు. శరీరులయం దశరీరివగు నీ యవతారములు గనఁబ

---

మగ్రాహ్యో వికారైః ప్రాకృతైర్గుణైః, కో న్విహార్హతి విజ్ఞాతుం ప్రాక్సిద్ధం గుణసంవృతః. ౪. తస్మై తుభ్యం భగవతే వాసుదేవాయ వేధసే, ఆత్మద్యోత గుణచ్ఛన్న మహిమ్నే బ్రహ్మణే నమః. ౫. యస్యావతారాజ్ఞాయంతే శరీరి ష్వశరీరిణః, తైస్తై రతుల్యాతిశయై ర్వీర్యై ర్దేహి ష్వసంగతైః. ౬. సభవా న్సర్వలోకస్య భవాయ విభవాయ చ, అవతీర్ణోఽంశభాగేన సాంప్రతం పతిరాశిషామ్. ౭. నమః పరమ కల్యాణ నమస్తే విశ్వమంగళ, వాసుదేవాయ శాంతాయ యదూనాం పతయే నమః. ౮. అనుజానీహి నౌ భూమం స్తవానుచరకింకరౌ, దర్శనం నౌ భగవత ఋషేరాసీ దనుగ్రహాత్. ౯. వాణీగుణానుకథనే శ్రవణౌ కథాయాం హస్తౌచ కర్మసు మన స్తవపాదయోర్నః, స్మృత్యాంశిర స్తవనివాసజగత్ప్రణామే దృష్టిస్సతాం దర్శనేఽస్తు భవత్తనూనాం. ౧౦. శ్రీ భాగవతే ౧౦. స్కం. ౧౧ అధ్యాయః.

-డుచున్నయవి. సాటిలేక సర్వాతిశయములై దేహముల యందంటక వెలయువాఁడవు. అట్టినీవు సర్వలోకములు పుట్టుటకు,వృద్ధియగుటకు నిపుడు అంశమున నవతరించి జీవుల నాశీర్వదించుచున్నవాఁడవు. పరమకల్యాణమూర్తీ!నిన్నుంగూర్చి నమస్కారణము లర్పించువారము. విశ్వమంగళకర్తవగు నీకు వందనము లర్పించువారము. వాసుదేవుఁడనం బ్రఖ్యాతివహించి శాంతరూపుఁడవై యదువంశనాయకుఁడవగు నీకివె మ్రొక్కులు. నీ కనుచరులమై కింకరుల మగు మమ్మనుగ్రహింపుము. ఋషియనుగ్రహమున నీదర్శనము మాకు లభించినది. శాపము తొలుదొలుత దుఃఖకరమయ్యెఁ బునరావృత్తిరహిత శాశ్వత పదప్రదాతవగు నీ సందర్శనము మావంటి యజ్ఞులకు లభింపఁజేసి తుదకు మహోపకారకరణ శుభమైనది. ఆ మహర్షి శాపమే మాకుఁ గలుగకున్న భగవత్పదసందర్శన భాగ్యము మాకుఁ గలిగియే యుండదు. స్వామీ! ఆ శాపరూపము నికరుణ మిమ్ముం జూపఁగల్గినది. మహాత్మా! నీ సద్గుణకథనము చేయు వాగింద్రియమును, నీ పరమపావనకథల నాలకించు శ్రవణేంద్రియమును, నీసేవఁజేయు హస్తేంద్రియములను, నీకు నివాసభూతమగు జగత్తునకు నమస్కారముసమర్పించు శిరస్సు, స్మృతిగల మనస్సును, నీ రూపములఁ గనఁజాలుదృష్టిని మాకు బ్రసాదింపుము అని నుతించిరి.

ఈఘట్టమున శ్రీపోతనమహాకవి పద్యరత్న ముదాహ-

రింప బుద్ధిపొడమెడిని. దానిచమత్కృతి స్మరించుటయే భక్తుల కృత్యము. లేకున్న నామహాకవికి నష్టమువడుదుము. కాన గృతజ్ఞతc జూపవలయును.

శా. నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాంగసం వాక్యం
బులున్, నీపేరం బనిసేయు హస్తయుగమున్ నీమూర్తిపైc
జూపులున్, నీపాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీసేవ
పైc జిత్తముల్, నీపైబుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజ
పత్రేక్షణా.

మూలమున వాణీయని యేకవచనము కనుపట్టcగా నిట బహువచన మేలయనcగా వ్యాఖ్యానమందు, "అస్మత్సం గినాం సర్వేషా మిత్యభిప్రాయేణ బహువచనమ్" అని వ్రాయcబడినది. దానిం జక్కcగాc బరిశీలించినయే సుకవి బహువచనమును బ్రయోగించెను గాని నలకూబర మణిగ్రీవు లిద్దరి కొరకుcగాదు. భక్తుల వాంఛితములు "సర్వేజనాస్సుఖినోభవంతు" అనియే గదా యలరారుచుండును. కాcబట్టిపోతనమహాకవి వ్యాఖ్యానములను బరిశీలించి తెనిcగించెనే కాని వ్యాఖ్యాత యభిప్రాయము గ్రంథకర్తది కాకపోవచ్చునని వానింబాటిక తెనిcగించినవాcడు కాcడని స్పష్టమగుచున్నది. గ్రంథకర్త భావమిదియని తెల్పువా? డెవ్వడు? గ్రంథకర్తయే శాశ్వతను. నశ్వత్థామవలె బ్రదికియుండి ఎవ్వరెవ్వరు పఠింతురో అం

దుఁ దోఁచి నాభావమిది యని తెల్పుచుండవలయుఁ గాఁబోలు. ఇట్టి కువాదముల మనము లెక్కసేయక మూలార్థములను వివరించి బోధించినవ్యాఖ్యాతలకు సర్వదా నమస్కరించుచుం డుటే మనకృతజ్ఞత. వేఱొక్కటి గానరాదు. ఇఁకఁ గథాంశము నకు మరలుదము.

ఇట్లు వినుతించు భక్తులగు వారింజూచి భగవంతుఁడు కృపారసతరంగితాంతరంగుఁడై యిట్లు పలికెను. ఓభక్తులారా! మీరు నారదమహాముని సందర్శనంబున సంపదంధత్వముతొలం గ నన్నుం గాంచుభాగ్యము గలవారలైతిరి. నాభక్తులసందర్శ నము వ్యర్థముగాదు. భవిష్యచ్ఛుభముల నొసంగును. సాధు వులై మత్పదారవిందభక్తులై నిస్సంగులై సమచిత్తులగువారే నాప్రీతికిం బాత్రులు. వారినిదర్శించినవారే నన్నుసందర్శింపఁ గలరు. కావున మీరింక విగతశాపులై కుబేరుం గానంబొండు. నా భక్తియు మీకు స్థిరమయి యుండుఁగాక.

అనిపలుక నా నలకూబరమణిగ్రీవు లిరువురును నమస్క రించి శాపవిముక్తినొంది భగవంతుని సెలవొంది స్వస్థానములకుం బోయిరి. భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు యథాపూర్వముగ నుండుం డెను. పాఠకులారా! యీ నలకూబరమణిగ్రీవులెవరు? వీరికేల శాపమువచ్చెను? అనువిషయ మెఱుంగఁదగినదియే కదా. ఈగా థకుం బ్రాణమువంటి దదియేయని తెలియఁదగు.

## నలకూబరమణిగ్రీవుల నారదముని శపించుట.

* కుబేరుఁడు శివమిత్త్రుఁడు ధనపతి యుత్తరదిగధిపతియొ కఁడుకలఁడుగదా. అతఁడు తొలుత లంకాపురముననుండి రాజ్య మేలుచుండెను. రావణకుంభకర్ణులు వరగర్వితులై తన్నుఁ దిరస్క రింపఁ దండ్రియాజ్ఞచే నందుండుటమాని కైలాసంబునకేగి శంక రునారాధించి తదీయాఖండకరుణాపాత్త్రుఁడై దిగధిపతిత్వ మంది యలకాపురమున నివసించి యుండువాఁడు. ఆరాజరాజునకు నిరు వురు తనయులుగలరు. వారిపేరు నలకూబర మణిగ్రీవులని. వారు శంకరకింకరులై యుండిరి. కాని పూర్వ జన్మ కర్మవశంబున మదోన్మత్తులై చిత్తజుకేళులందేల మదిఁగొని యిష్టానుసారము విహరించు నిందుబింబాస్యలంగూడి కైలాసభూధరవరంబునమం దాకినీపయఃకల్లోలమాలికాడోలికలం దోఁగుచు నెందెందు వి హరింపనిష్టముగలిగిన నందందు విహరించుచు వారుణీమదవిహ్వ లులై యొడలెఱుంగక యుండిరి.

వారొక్కనాఁడు వియద్ధునీహ్రదంబుల విహరింప మన సులఁద్రిప్పిరి. వివస్త్రులై చేడియలట్టివారై తమతోనుండ జల క్రీడాసమాసక్తి నొడలెఱుంగక యుండిరి. దానికిం దోడు మది రాపానము వారినట్టివారిఁగాఁ జేసెను. ఇట్లు వారశంకితస్వాం తముల విహరించుచుండ మార్గవశంబున నారదమహాముని

---

* ఈగాథ శ్రీభాగవతము పదవయధ్యాయము నుండియు సంగ్రహింపఁబడినది.

శంకరుదర్శింప నరుగుచు నచ్చోటికి వచ్చెను. తద్దర్శనంబున నా గోపి డియలు లజ్జాభరంబున నీరువెడలి వడివడిం దటమున నలంకారయు మృదుచేలములం దాల్చిరి. నలకూబరమణిగ్రీవు లిరువురు నీరు వెడలి రాక వివస్త్రులై యందే యుండిరి. నారదముని వారి తెఱంగెఱింగి వీరు మదోన్మత్తులు. వీరికి బుద్ధివచ్చునట్లు చేయవల యును ఊరక వదలిపెట్టుట వీరియభివృద్ధికి హేతువుగాదు. మనకేల యని పోవుట మహానులవృత్తి కాదు. వీరు మదనక్రీడా తత్పరులై నన్ను మన్నింపనున్నవారు. దేహము తెలియక తదేకా గ్రమానసులై యున్నవారు. వీరు భగవదనుగ్రహ దూరులు గాఁదగిన ట్లున్నవారు. వీరికిం గల్గిన యీదుర్వృత్తిని వదలించి సద్వృత్తి నలవరింపవ లెనని యోజించి వారింగూర్చి యిట్లనియె కెను. పాఠకులారా! ఈఘట్టమున శ్రీభాగవతశ్లోకములం దిలకింపుఁడు.

న హ్యన్యో జుషతో జోష్యాన్ బుద్ధిభ్రంశో రజోగుణః,
శ్రీమదాదాభిజాత్యాది ర్యత్ర స్త్రీ ద్యూత మాసవః. ౮
హన్యంతే పశవో యత్ర నిర్దయై రజితాత్మభిః,
మన్యమానై రిమం దేహ మజరామృత్యు నశ్వరమ్. ౯

విషయంబుల సేవించువానికి బుద్ధిని బాడుచేయు రజోగుణంబునకంటె మిక్కిలియగునది వేఱొక్కటి లేదు. అట్టి రజోగుణం బావరించినచో నైశ్వర్యమదమునఁ గన్ను దెలియకుండుట, సత్కులజననాహంకారము, కాంతారతియు, జూదము, పానము తోడగాఁ గలుగును. రజోగుణప్రధానులు నశ్వరమగు నీశరీరమునకు జరామరణరూప బాధలు సంభవింపవని

దేవసంజ్ఞిత మప్యంతే క్రిమివి డ్భస్మసంజ్ఞితం,
భూతధ్రు క్తత్కృతే స్వార్థం కిం వేదనిరయో యతః. ౧౦
దేహః కి మన్నదాతు స్స్వం నిషేక్తు ర్మాతురేవ వా,
మాతుః పితుర్వా క్రేతుర్వా బలినోఽగ్నే శ్శునోఽపివా.
ఏవం సాధారణం దేహ మవ్యక్త ప్రభవా ప్యయం,
కోవిద్వా నాత్మసాత్కృత్వా హంతి జంతూనృతేఽసతః. ౧౨
అసతః శ్రీమదాంధస్య దారిద్ర్యం పరమాంజనం,
ఆత్మౌపమ్యేన భూతాని దరిద్రః పర మీక్షతే. ౧౩
యథా కంటక విద్ధాంగో జంతో ర్నేచ్ఛతి తాం వ్యథామ్,
జీవసామ్యంగతో లింగై ర్న తథా విద్ధకంటకః. ౧౪
దరిద్రో నిరహం స్తంభో ముక్త స్సర్వమదై రిహ,
కృచ్ఛ్రం యదృచ్ఛయాప్నోతి తద్ధి తస్య పరంతపః. ౧౫

---

తలంచి నిర్దయులై యింద్రియములకు లోఁబడి, పశువుల హింసింతురు. మనుష్య భూదేవ భూసురాది నామధేయములు గలదయినను ఈతనువు కడపట క్రిమివిష్ఠా భస్మమయంబే యగును గాని వేఱొండు కాదు. అట్టిశరీరమునమ్మి, తదర్థమై భూతములకు హానిచేయువాఁడు స్వార్థమేమని యెఱుంగఁ గలఁడు? కాన నతఁడు నరకకూపమునం బడును. దేహ మన్నమిడువానికో, తండ్రికో, తల్లికో, మాతామహునకో, ధన మిచ్చికొన్నవానికో, బలవంతునకో, అగ్నికో, కుక్కకో, సొమ్మగు. అవ్యక్తమునం బుట్టి యందే నశించునట్టి దేహము నాత్మగా భావించి జంతువుల హింసించువాఁడు మూఢుఁడు గాక మఱెవ్వఁడగును.? శ్రీగర్వమున విఱ్ఱవీఁగు నసజ్జనునకు దారిద్ర్యము చక్కని కాటుకవంటిది. దరిద్రుఁడు భూతములఁ దనవలెనే చూచును. ముల్లుగ్రు

నిత్యం క్షుత్క్షామదేహస్య దరిద్రస్యాన్నకాంక్షిణః,
ఇంద్రియాణ్యనుశుష్యంతి హింసాపి చ నివర్తతే. ౧౭
దరిద్రస్యైవ యుజ్యంతే సాధవ స్సమదర్శినః,
సద్భిః క్షిణోతి తత్తర్షం తత ఆరా ద్విశుద్ధ్యతి. ౧౮
సాధూనాం సమచిత్తానాం ముకుందచరణైషిణామ్,
దర్శనాంతో భవే ద్బంధః పుంసో ఽక్ష్ణో స్సవితు ర్యథా.
ఉపేక్ష్యైః కిం ధన స్తంభై రసద్భి రసదాశ్రయైః. ౧౯
తదహం మత్తయో ర్మాధ్వ్యా వారుణ్యా శ్రీమదాంధయోః,
తమో మదం హరిష్యామి స్త్రైణయో రజితాత్మనోః. ౨౦

చ్చిన బాధపడువాఁడు ఇతరునకు ముల్లు గ్రుచ్చుకొనినచో గుఱుతులచే దాని బాధ యతనికిం గలదని యెఱింగినచందమున ముల్లు గ్రుచ్చుకొననివాఁడు తెలియఁజాలఁడు. స్తంభాహంకారమదములఁ బాసిన దరిద్రుఁడు యాదృచ్ఛికముగాఁ గష్టమొందు. అదియే యతనికి దపంబు. నిరంతరము నాకలిచేఁ గృశించి యన్నమును వాంఛించు దరిద్రునకు నవయవము లుచితవృత్తిమాత్రమున శోషించుఁ గాన నాతనికి హింస తొలంగు. అట్టివాఁడు ప్రయత్నములేకయే సాధుసంగమమును బొంది తృష్ణను వేగమ తమంబుఁ బాయు. నేత్రముల యప్రకాశము భాస్కరదర్శనావధికమైన తెఱంగున సమస్వాంతులు శ్రీముకుందచరణములఁ గోరువారునగు సాధువులదర్శన మగువఱకే బంధము నిలువఁజాలును. అసజ్జనుల నాశ్రయించి ద్రవ్యమదోన్మత్తులై యుపేక్షావిషయులైన దుర్జనులం జేరఁగనేల? ఇంద్రియములకు లోఁబడి స్త్రీవిజితులై శ్రీమదాంధులై సురారసము ద్రావి గర్వించిన మీయొక్క గర్వము నిదో యడఁగునట్లు చేసెద. దిక్పాలకుని కొడుకులైనను మీరు తమోగుణగ్రస్తులరై గర్వించి వస్త్రము లేకయుండుటయుం నెఱుంగరైతిరి. కాఁబట్టి బుద్ధిలేని స్థావరంబులరై మీరు

యదిమౌ లోకపాలస్య పుత్రౌ భూత్వా తమః ప్లుతౌ,
న వివాస సమాత్మానం విజానీత స్సుదుర్మదౌ. ౨౧
అతో౽ర్హత స్థావరతాం స్యాతాం నైవం యథాపునః,
స్మృతి స్స్యా న్మత్ప్రసాదేన తత్రాపి మదనుగ్రహాత్. ౨౨
వాసుదేవస్య సాన్నిధ్యం లబ్ధ్వా దివ్యశరచ్ఛతే,
వృత్తే స్వర్లోకతాం భూయో లబ్ధ్వా భక్తౌ భవిష్యతః. ౨౩
స ఏవ ముక్త్వా దేవర్షి ర్గతో నారాయణాశ్రమమ్,
నలకూబర మణిగ్రీవా వాసతు ర్యమళార్జునౌ. ౨౪

ఈ ఘట్టమున నేలోకోమహాకవి శ్రీపోతనామాత్యుఁడు మూలమును వదలి తత్సారమును మాత్రమే కొలఁది పద్యములలో వ్రాసెను.

"వ. ఆ మునీశ్వరుండు చూచి శపించువాఁడై ప్రతీతంబగు గీతంబుపాడె వినుము.

శా. సంపన్నుం డొరుఁ గానలేఁడు తనువుం సంసారము న్నమ్మి హిం, సింపం జూచు దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁడై చిక్కి హిం,సింపం డన్యుల నాత్మకుం సములుగాఁ జింతించు

---

పుట్టఁగలరు. అందును నాయనుగ్రహమున దివ్యవర్షశతమునకుఁ దరువాత స్మృతికలుగు. అంత శ్రీవాసుదేవు సన్నిధింబొంది సాధువృత్తి గలుగ దేవత్వము నొంది భగవద్భక్తుల రగుదురు. అనిపలికి యాదేవర్షి నరనారాయణాశ్రమమునకుం బోయెను. ఆ నలకూబర మణిగ్రీవులే యచ్చట యమలార్జున వృక్షంబులుగాఁ బుట్టిరి.

నట్లొటఁ దత్సంపన్నాంధున కంజనంబు వినుమీ. దారిద్ర్య
మూహింపఁగన్.

వ. అని గీతంబుపాడి తనమనంబున.

క. కలవాని సుతుల మనుచును
గలకంఠులతోడఁ గూడి కానరు పరులం
గలలోనైనను; వీరికిఁ
గలక్రొవ్వడఁగించి బుధుల గలుపుటయొప్పున్.

వ. అని చింతించి విజ్ఞాన విశారదుండగు నారదుండు నలకూ
బర మణిగ్రీవులం జూచి మీరలు స్త్రీమదాంధులరు గావున
భూలోకంబున నర్జునతరువులై నూరు దివ్యవర్షంబు లుండుం
డటమీఁద గోవిందచరణారవింద పరిస్పందంబున.

క. ముక్తులరై నారాయణ
భక్తులరై పరమసాధు భావశ్రీ సం
సక్తులరై సురలోక
వ్యక్తుల రయ్యెదరు నాదు వాక్యము కతనన్.

వ. అని యిట్లుపలికి నారదుండు నారాయణాశ్రమంబునకుం
జనియె."

భక్తవరులారా! భాగవతమును దానియాంధ్రీకరణ
మునుజూడుఁడు. పోతనమహాకవి యీఘట్టమునఁ జాల సంకు
చితముచేసి నమూలార్థమును బద్యములఁ బ్రాసెను. తత్సార మిట
నగపడును. భక్తులు కథనుండి యెంత గ్రహింపఁదగునో యంత

మాత్రము వ్రాసెనని తేటపడును. కథకంటెఁ దత్సారమగు నీతిని గ్రహించుట మేలని పరిగ్రహింపుఁడు.

*ఈ గాథయే శ్రీకృష్ణజన్మఖండమున నించుక భేదముగాఁ గనుపట్టుచున్నయది. మద్దిచెట్టొక్కటియే యనియు నందుండి పురుషుఁ డొక్కఁడు పుట్టెననియుఁ గనుపట్టెడు. ఈ భేదమును దెలుపక పైకథకుం బోరాదు. కాన వ్రాసెదను. యశోదాదేవి బాలగోపాలుని వెన్న దొంగిలించెనన్న హేతువుచే నిష్ఠురమగు నాయర్జునవృక్ష మూలమునఁ గట్టివేసెను.

బధ్వా వస్త్రేణ వృక్షే చ తతాడ మధుసూదనమ్,
బధ్వా కృష్ణం యశోదా సా జగామ స్వాలయం ప్రతి,
హరి స్తస్థౌ వృక్షమూలే జగతాం పతి రీశ్వరః. ౧౨
శ్రీకృష్ణ స్పర్శమాత్రేణ సహసా తత్ర నారద,
పపాత వృక్ష శ్శైలాభ శ్శబ్దం కృత్వా భయానకమ్. ౧౩

అని మూలము.

ఇట్లు కోపంబున శ్రీకృష్ణుని మద్దిచెట్టునకుం గట్టివేసి తన్నియింటికింబోయెను. శ్రీగోపాలబాలుఁడు గుటకలుమ్రింగుచు నందేయుండెను.

శ్రీకృష్ణస్పర్శమాత్రమున ఆ మద్దిచెట్టు మహత్తర శబ్దమొనరించుచు నేలం గూలెను. అందుండి మహాసుందరాకా

*ఈభాగము శ్రీకృష్ణజన్మఖండమునఁ బదునాల్గవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

రము గలపురుషుఁ డొక్కఁడు విచిత్రరీతి నావిర్భవించెను. వెంటనే దివ్యవిమానము రాఁగా నందధివసింపఁ బోవుచుఁ బరాత్పరుండగు శ్రీకృష్ణునకు నమస్కరించి సన్నుతించి తన యిచ్చం బోయెను. రత్నాలంకార భూషితుఁడగుచు నా బాలకుఁడు చిఱునవ్వు ముఖమున కలంకార మగుచుండ నందే యుండెను.

యశోదయు వృక్షపతనశబ్దము విని భీతచిత్తయై పరుగెత్తుచుం బోయి బాలు నెత్తుకొని భుజాంతరమునఁ జేర్చి చిఱునవ్వుచున్న శ్యామసుందరు బుజ్జగించుచు నుండెను. గోపికలు తరుపతన భయంకర ధ్వని నాలకించి యచ్చటికిఁ జెచ్చెఱ వచ్చిరి. యశోదయు బాలు నెత్తికొని యింటనుండం గాంచి చిన్న పెద్దలెల్ల నాదేవి నమ్మా! యిటుచేయుట పాడియా? యెంత ప్రమాదము జరగవలసి యుండెను. ఎట్లో తప్పినదమ్మా యని తూలనాడిరి. శిశువునకు బాలగ్రహ బాధలు గలుగకుండ శాంతికృత్యములను జేసిరి. అంతతో నూరకుండక కొందఱమ్మా! మిగుల వయస్సు చెల్లిన పిదప నదృష్టవశమున నీకుమారుఁడు జనించెను. ధన ధాన్యరత్నాదులు పుత్రహేతుకములుగదా. బాలు రెండు సుమతియుండఁ డనుట సత్యము. పిల్లలు భక్షింపని సంగ్రహము నిష్ఫలము. నీవు పాలు పెరుగు వెన్న తినెనన్న కారణమున నిట్టి కఠిన వృక్షమూలమునఁ గట్టివైచి గృహకర్మమందు నిమగ్నవై నీవుండ దైవవశమున వృక్షము పడియె. ఇంతపెద్ద వృక్షము పడినను యశోదాదేవీ! నీయదృష్టమున బాలుఁ డీతఁడు జీవించెను.

ఈ బాలుఁడే మృతుండైన నీగోకులమందున్న వస్తువులతో నీకేమి లాభము? అని భయముపుట్టఁ బలికిరి. భూసురు లాబాలకు నాశీర్వదించిరి. వందిమాగధులు పురోవృద్ధికరగీతములు పాడిరి. పురోహితునిచే హరినామసంకీర్తనము చేయించిరి. ఇట్లు ప్రజలు తమకుఁ దోఁచిన కృత్యముల నొనరించి తమతమ యిండ్లకుం బోయిరి.

అంత నందుఁడు కోపంబున రక్తపంకజములభంగి లోచనములు వెలయ యశోదం గాంచి యిట్లు పలికెను. చండీ! యిప్పుడే, నాపుత్త్రునిఁ గంఠంబునఁ గట్టుకొని తీర్థయాత్రకుం బోయెదను. అటు నీకు సమ్మతము గాకున్న నీపుట్టినింటికిం బొమ్ము. నీతో నాకేమియుఁ బ్రయోజనము లేదు. నూఱు నూతులకు సమాన మొక్కవాపిక యగు. శతవాపీసమ మొక్క సరస్సని పలుకుదురు. సరశ్శతములకంటె యజ్ఞ మెక్కుడు. యజ్ఞశతంబులకంటెఁ బుత్త్రుఁ డుత్తముఁడు. తపోదానంబు లొనరించి సంపాదించిన పుణ్యము జన్మాంతరమున సుఖము నీఁజాలు. పుత్త్రుఁ డిహపర లోకంబుల సుఖము నీఁజాలువాఁడు. పుత్త్రునకన్న నుత్కృష్టుఁడగు బంధువు జగముల నీవఱకుఁ బుట్టియుండలేదు. పుట్టఁబోఁడనుట నిక్కము.

అని యిట్లుపలికి యశోద నిఁక నిట్టిపనులు చేయనని యంగీకరింప నామెతో నింట సుఖంబుండెను. యశోదారోహిణులు గృహకర్మముల నియుక్తలై యుండిరి. అని నారాయణ

మూర్తి తెలుప నారదుం డిట్లు ప్రశ్నించెను. మహానుభావా! నారాయణా! సుందరాకారుండగు పురుషుం డొక్కఁ డుద్భవిం చెనని చెప్పితివి కదా! వృక్షరూపియగు నాపురుషుం డెవ్వఁడు? గోకులమున నుండఁ గారణమేమి? పురుషుం డతఁడు వృక్షాకృ తిందాల్పఁ గారణమేమి? కరుణించి వచియింపుమా యని విన్న పింప నారాయణుం డాదరమున నిట్లనియె.

## నలకూబర శాపవృత్తాంతము.

శ్రీసమృద్ధిగల కుబేరనందనుఁడు నలకూబరుఁ డొక్కఁడు గలఁడు. ఆతండు సుందరాంగులలో సుందరాంగుఁడని లోక మెఱుంగు. వనితలలో రంభయను నచ్చర మిన్నయని జగద్వి దితము కదా! ఆ నలకూబరునిపై రంభకుఁ బ్రీతి మెండుగ నుండు. కావున వారిరువురు పరస్పరమైత్రి నలరుచుండుట వాడుక. ఒక్కనాఁ డానలకూబరుఁడు రంభాసంయుతుఁడై విహారార్థము నందనవనమునకుఁ జనియెను. ఆ నందనవన ము ద్యానరత్నమని పేరుఁ గాంచినది. అందు నిర్మలజలవినుతంబు లగు సరోవరంబులు వెలయుచుండు. పరిమళపరిమిళిత పుష్పం బులెల్ల లతల నెలకొని యుండుట నది పుష్పోద్యాన మనియే ప్రఖ్యాతిం గాంచెను. ఆవనము నిర్జనముకదా? ఆ యుత్తమ తమోద్యానంబున సరోవరతటంబున నొక్క మల్లెచెట్టు పుష్ప వాయువులచేఁ బరిమళవంతముగనుండ నం దానలకూబరుఁడు రంభంగూడి విహరింప నిచ్ఛగించి యందుఁ బుష్పశయనంబు

కల్పించి రత్నదీపంబులవెలుంగున వెలయునచ్చోట విహారింపం బూనెను. అందుఁ జందనాగురు కస్తూరీకుంకుమ ద్రవముల నలరునొక యద్భుతవస్తువు సిద్ధపఱుపఁబడియె. ఆశయనము నలువలంకుల దివ్యకుసుమ మాల్యంబులు, దుకూలక్షౌమ వస్త్రంబులు కట్టఁబడియె.

ఆ దివ్యశయనంబున నలకూబరుండు మదనోన్మాదంబున రంభంగూడి యథామతి విహరించెను. అష్టవిధశృంగారములు, సమవృత్త్యాదిమ రతిభేదంబులు, షట్ప్రకార చుంబనంబులు, యథాస్థాన నిరూపిత రీతులు, అంగ ప్రత్యంగ సంయోగ త్రివిధాశ్లేషణంబులు,నఖదంత కరక్రీడలు, వెలయ నారసిక శేఖరుఁడు నలకూబరుఁడు విహరించెను. మఱియు నాతఁడు కామశాస్త్ర విశారదుండు కావున జలంబునుండి స్థలమునకు, స్థలమునుండి జలమునకుఁ దిరుగుచు, రతిసుఖార్ణవమున మునిఁగి తేలుచు నాశృంగారపురుషుఁడు స్వేచ్ఛఁగా సుఖ మనుభవించుచుండెను.

ఇట్లు రతిసుఖ జలనిధి మునిఁగి తేలుచున్న యానలకూబరుంగాంచి యాచెంత గాఢతర దీక్షంబూని తపమొనరించు దేవలముని ముక్తకేశియు నంబరవిహీనయునయి, యతిపీన శ్రోణిపయోధరయు, నఖదంత క్షతాంగియుఁ బులకాంచిత విగ్రహాయు, నయి, ప్రాణనాథుని వీక్షించుచు, సస్మితయునై సుఖార్ణవ నిమగ్నయు, వక్ర భ్రూభంగ సంయుక్తయు నతి

కాముకియునై యున్న రంభను గాంచెను. పతియు నారంభ రత్నకుండలయుగమునఁ జెక్కిళ్లువెలయ, విచిత్ర రత్నమాల్యంబులు, సురభికుసుమ దామములు తనువున కొకక్రొత్త చెలువు గలిగింపఁ, గింకిణీజాలములు ధ్వనింప, సిందూరబిందువు మోమునఁనొప్పఁ బులకిత తనూవల్లియై నలకూబరుం గూడి యుండెను.

అట్టితఱి దేవలముని విధివశంబున నాసరస్సునకు రావలసి వచ్చెను. ఆ మునిం గాంచి రంభాసమాలింగితతనుం డగు నానలకూబరుండు లేవఁడయ్యె. మునియు నతనిగర్వంబునకాగ్రహించి వీని కిపుడు తగినదండనము విధింపకున్న నింకను జెడిపోవునని యూహించి పాపిష్ఠా! వృక్షత్వము నొందుదువు యని శపించెను. కామాతుర యగురంభను గని యంగనామణీ! నీవు మనుష్యలోకమున జన్మింపుమా యనియు శపించెను. అంతతో నూరకుండక రంభా! నీవు జనమేజయునకుఁ గామినివగుదువు. ఇదియె నీగర్వమునకుఁ బ్రాయశ్చిత్త మని పలికి నలకూబరుం గని నీవు గోకులమున వృక్షరూపంబునఁ బుట్టుము. శ్రీ కృష్ణస్పర్శ మాత్రమున శాపవిముక్తి నొంది యథాపూర్వముగ నీలోకమునకు రాఁగలవు. ఓరంభా! నీవింద్రసంయోగమున మరల నిజలోకము నొందఁగలవు. అని యిరువురకు శాపమొసంగి తద్విముక్తిని బ్రసాదించి స్వాశ్రమునకుం బోయెను. కుబేరతనయుండును నిజమందిరమున కరిగెను.

అని పలికి నారాయణమూర్తి నారదమునీ! నలకూబరు గాథఁజెప్పితి. ఇఁక రంభాచరిత్రము నించుక వచించెద. ఆముని శాపంబున భీతిల్లి రంభ చేయునదిలేక భారతంబున సుచంద్రుని మందిరంబునఁ బుట్టెను. మహాలక్ష్మీసమానత నొంది సుందరీమణియై యలరారెను. ఆ దుహితృరత్నము నా సుచంద్రభూపాలుఁడు సకలాలంకార సంయుతను గావించి జనమేజయ భూపాలునకు నిచ్చెను. ఆ సుదతీమణి జనమేజయభూపాలుని పట్టపురాణి యయ్యెను. ఆరాజచంద్రుఁ డారమణీమణిం గూడి వివిధ ప్రదేశంబుల విహరించెను.

* ఒకానొకతఱి నా జనమేజయభూపాలుఁడు హయమేధ మొనరింప దీక్షఁబూనెను. యజ్ఞాశ్వ మెల్లయెడలఁ దిరుగ శతమఖుండు దాని నపహరించెను. దాని నతనియింటనే కనఁబడకుండనుంచి తాను నందుండెను. ఆతనిపత్నియు యజ్ఞాశ్వము మనోహరముగా నుండునని దానిం జూడఁగోరి యొంటరిగాఁ బోయెను. ఇంద్రుఁడు యజ్ఞాశ్వ సమీపముననున్న రాజపత్నిని బలిప్రతనుగ నెఱింగియు బలవంతముగ రమించెను. ఆ విహార సుఖమున నింద్రుఁడు దివారాత్రుల నెఱుంగకయుండెను. ఆమెయు నింద్రసంభోగ మాత్రమున యోగబలంబున దేహమును త్యజించెను. ఇంద్రుఁ డంతఁ దెలిసికొని రాజభీతిచేతను, లజ్జచేతను స్వర్గమున కతివేగమ పోయెను. రాజును వార్తనెఱింగి

* ఈజనమేజయుఁడు పరీక్షిత్పుత్రుఁడు కాఁడని తెలియుందగు.

మృతభార్యాకళేబరమును గాంచి మిగుల విలాపము చేసెను. ఎట్లో యజ్ఞమును బూర్తిచేసి బ్రాహ్మణుల కనంత ధనమును దక్షిణగా నొసంగెను. రంభయు మానవదేహమును వదలి స్వర్గమునకుఁ బోయి నిజతనువు నొందెను. నారదమునీ! శ్రీకృష్ణకృతార్జునవృక్ష భంగకథను వివరించితిని. నలకూబర శాపమోక్షగాథను రంభావృత్తాంతమును చెప్పితిని. ఈ కృష్ణచరిత్రము పుణ్యప్రదము, జన్మమృత్యు జరాహరణము నగు.

పాఠకవర్యులారా! శ్రీకృష్ణపరమాత్మ యమళార్జున భంజనమునఁ దనబాలలీలఁ దెలిపెను. ఆ గాథయంతయు వింటిరి. కథవినుటచేఁ దృప్తిపడుట న్యాయమా. తత్సారమును గ్రహింపవలయుఁ గదా! శ్రీభాగవతమునందు నలకూబర మణిగ్రీవు లిరువురు *వనితలంగూడి వనవిహారము సల్పుచు నందుండు మందాకినీతుంగతరంగమాలికల దోఁగుచుండఁగా నారదుఁడు వచ్చెననియు, మానింగనినంత నామ్రముదలు వివస్త్రలైయుంట సిగ్గుపడి వడివడి నీరువెడలి వలువలు ధరించిరనియు, మదిరాపానవశంబున నొడలెఱుంగని నలకూబర మణిగ్రీవు లక్ష్మీజలంబుల వివస్త్రులైయుండఁగా వారిం గాంచి కోపించి వృక్షములుగభూమి నవతరింపుఁడని శపించి శ్రీకృష్ణమూర్తి తనుస్పర్శంబున ముక్తి నొందుఁ డనియు శాపమోక్షము ప్రసాదించెనని చెప్పఁబడినది కదా? బ్రహ్మవైవర్తపురాణాంతర్గత శ్రీకృష్ణజన్మఖండమునఁ బదు

* స్త్రీభిస్సైరమగాయద్భి శ్చేరతుః పుష్పితే వనే–అని మూ.

నాల్గవ యధ్యాయమున నీవృత్తాంతమే వ్రాయఁబడుచుఁ గుబే రతనయుఁడు నలకూబరుఁడు రంభంగూడి నందనవనమున విహ రించుచు నందున్న వటభూరుహమూలంబునఁ బుష్పశయనంబుఁ గల్పించి యందు రతిశాస్త్రపద్ధతి విహరించుచు నొడలెఱుంగక యుండఁ దత్సమీపంబునఁ దపంబుచేయు దేవలముని యారీతిం గాంచి నలకూబరు వృక్షంబుగమ్మనియు, రంభను మర్త్యలోకం బున జనియించి జనమేజయుఁడను రాజునకుం బత్నివై మహేం ద్రసంయోగమున మరల స్వర్గమునొందు మనియు శపించె ననియుఁ దచ్ఛాపంబున నలకూబరుఁడు గోకులంబున నర్జునవృ క్షమై జనించె ననియు రంభయు మర్త్యంబునఁ బుట్టె ననియుఁ జెప్పఁబడినది.

ఈగాథయే విష్ణుపురాణమునఁ బంచమాంశమున నాఱ వయధ్యాయమునఁ జెప్పఁబడినది. అందు,

కర్షతా వృక్షయోర్మధ్యే తిర్యగ్గత ముఖలూఖలమ్,
భగ్నా వుత్తుంగశాఖాగ్రౌ తేన తౌ యమళార్జునౌ. ౧౭
తతః కటకటాశబ్ద సమాకర్ణన తత్పరః,
ఆజగామ వ్రజజనో దదర్శ చ మహాద్రుమౌ. ౧౮
తయోర్మధ్యగతం బద్ధం దామ్నా గాఢం తథోదరే,
తతస్తు దామోదరతాం స యయౌ దామబంధనాత్. ౨౦

అని వర్ణింపఁబడినది. ఈ గాథయు శ్రీభాగవతము ననుసరించి యే యున్నది.

ఈగాథయే బ్రహ్మపురాణమున డెబ్బదియాఱవ యధ్యాయమున వ్రాయఁబడుచు విష్ణుపురాణ శ్లోకములే వ్రాయఁబడినవి. బ్రహ్మపురాణమునసుండు శ్లోకములే విష్ణుపురాణమునందు విశేషభాగములఁ జూపట్టెడు. కావున బ్రహ్మపురాణము విష్ణుపురాణమునకు మూలమని స్పష్టముగఁ దోఁచెడిని.

హరివంశమున విష్ణుపర్వమున నేడవయధ్యాయమునందు,
మధ్యాన్నిశ్చక్రామ తయోః కర్షమాణ ఉలూఖలం. ౧౬
తత్తస్య కర్షతో బద్ధం తిర్యగ్గత ములూఖలం,
లగ్నం తాభ్యాం సమూలాభ్యా మర్జునాభ్యాం చ కర్షచ.
తా వర్జునౌ కృష్యమాణౌ తేన బాలేన రంహసా,
సమూల విటపౌ భగ్నౌ సతు మధ్యే జహాస వై. ౧౭
నిదర్శనార్థం గోపానాం దివ్యం స్వబల మాస్థితః,

అని వ్రాయఁబడినది. ఇట్లు బ్రహ్మ విష్ణు భాగవత హరివంశము లొక్కరీతిగను బ్రహ్మవైవర్తముమాత్ర మొక్కరీతిగను ఈగాథను దెల్పుచున్నవి. ఇందేది ప్రమాణ మనుప్రశ్నము చేయువా రుండకపోరనియు నేనెఱుంగుదును. సమాధానము సమంజసముగా వచించుట కష్టమే యనియు నాకుం దెలియును. కాని బుద్ధిమంతులై భక్తులై యొప్పువా రిప్పట్టున సంశయములపాలై మూలకథయందు బద్ధాదరులు కాకయుండఁ గలరని నే నమ్మఁజాల కున్నాఁడను. తోఁచినట్లు సమాధానము నించుక వ్రాయఁబూనెదను. నాపై నాగ్రహింపక మన్నింతురని వేఁడు

చున్నాఁడను. తొలుదొలుతఁ గథాసారమును జక్కఁగా వినుఁడు.

ఈగ్రంథమునుండి బహువిధ సద్విషయముల నేర్చుకొనఁదగియుండును; నలకూబరుఁడు కుబేరపుత్త్రుఁడు. కుబేరుఁడు దిగధిపతి. సుప్రసిద్ధ చరిత్రుఁడు. ఆతని కుమారుఁడు త్రిలోకముల రూపవంతుఁ డని ప్రసిద్ధిఁ గన్నవాఁడు. శంకర కింకరుఁడు. ఇంతియకాక ధనపతిపుత్త్రుఁడునగు. ఇట్టివాఁ డయ్యు నొడ లెఱుంగకుండ నిర్జనారణ్యమున నందనవనమున నొక చెట్టు క్రిందఁ దావిహరించిన నెవ్వరికిని దెలియక యుండు ననుకొనియెను. తనమనస్సునకెక్కుం బ్రవర్తించు నారీమణిని దోడుకొనిపోయెను. ఇష్టానురూపముగ విహరింపఁ దొడఁగెను. ఆ కాంతయు రతిలంపటురాలు గాన నాయకుని మించెను. ఇర్వురును గామశాస్త్రమునఁ బాండిత్యము గలవారలే. పరస్పరానురాగమున నొడ లెఱుంగని వారలే. మనుష్యు లిందెవ్వరును నుండరనియు, నవిచ్ఛిన్నముగా నీసుఖప్రవృత్తి సాగుననియు వారి భావము. తమకుఁగల రతిశాస్త్ర పాండిత్యమును జూపసాగిరి. లోకమున నింతకు మించిన సుఖముకలదా యని విఱ్ఱవీఁగ సాగిరి. మనల నడ్డువా రెవ్వరని గర్వించిరి. సకలవిధశాస్త్రపద్ధతుల నవలంబించి విహరింపఁ దొడఁగిరి. దేవతలుగాన వారిని నిద్రాహారబాధలు పీడింపఁజాలవు. ఆగర్వమున వారు మఱింత క్రీడింప మొదలిడిరి. పుణ్యారణ్యముల మహర్షులు తపం బొనరించు

చుందురను మాటయు మఱచిరి. తమ కష్టము లేదనియే భావించిరి. మోక్షసుఖము గూడ దీని కీడుగాదని యూహించిరి. ధనగర్వము యౌవనగర్వము, ప్రభుత్వగర్వము, వీనినిమించిన సౌందర్యగర్వము మున్నగువానిచే వారు స్మృతిదప్పిరి. ఈరీతి వారికేళి సాగుచుండెను.

భగవంతుఁడు కర్మస్వరూపుఁడు. ఆమహాసీయుఁ డెఱుఁగ నిరహస్యములు లేవు. తత్ప్రవేశము లేనిచోటు వెదకినను లేదు. ఎట్టియెట్టికర్మము లోకమున కుపకరించునో యేదేది లోకమున కపకార మొనరించునో యామహాసీయుమూర్తి కెఱుక పడక యుండదు. తాను సాక్షిమాత్రుఁడుగ నుండి యితరులఁ బ్రేరేపించి యాధ్యాకార్యములను జేయుంచును. వారనుభవించు కర్మఫలములంగాంచి యానందించుచుండును. కర్మము లెట్టి పని చేయుచున్నవో పరిశీలించుటే భగవత్కృత్యము. దాన నేమిలాభవనిన లీలయే యని చెప్పుటకన్న వేఱొకట్టి కానరాదు. కావుననే కర్మసిద్ధాంతమును మించినదేదియు లేదు.

రంభానలకూబరులు కేవల తుచ్ఛసుఖమును బరమసుఖముగా భావించిరి. దివారాత్రభేదములు లేక ప్రవర్తించిరి. దాన నొడలెఱుంగని పాటుపడసాగిరి. ఇది లోకస్వభావము కాదని తలంపరైరి. తమ్ముఁ గాంచినవా రేమనుకొందురో యనిరెఱుంగరైరి. రతిశాస్త్రమే సకలశాస్త్రముల నుత్తమోత్తమమని నమ్మిరి. తద్రీతి బంధాదుల నలవఱచుకొనుచు దానఁ బ్రముది

త్తాత్ము లగుచుండిరి. కాలోచితకర్మములు భగవత్ప్రార్థనాదులు మఱచిరి. సౌందర్యగర్వము వారిమనసుల నోలలాడుచుండెను. ఇంకనెన్నియోవిధముల వారు కుమార్గమున బ్రవర్తింపసాగిరి.

భగవంతుఁ డీవిధమెఱింగెను. వీరికిఁదగిన ప్రాయశ్చిత్తము చేయ నూహించెను. నారదముని కత్తరుణముననే యెచ్చటికో ప్రయాణముచేయు నుద్దేశమును గల్పించెను. ఆమునియు నెచ్చటికో పోవుచు నాచోటికే వచ్చెను. గర్వములఁ బ్రణయమ్ములఁ దమ్ముఁదా రెఱుంగని యారంభానలకూబరులు నారదాగమనమును బరికింపరైరి. తన్ను గాంచినంతనే లజ్జనొందక యిచ్ఛాభిరతి నున్నవారని నారదమునికిం దోఁచెను. వెంటనే వీరినిఁ గామాంధులగుటఁ దగినఫలము ననుభవించునట్లు చేయకున్న లోకమున కుపకారము కాదని నిశ్చయించెను. ఇట్టి దుర్వృత్తిగలవారి కీశాప ముపకార మొసఁగునని తలంచెను. ఈ వృత్తికి మొదటికారణము ధనమేకదాయని యూహించెను. దానిచేఁ గన్నులు వీరికిం గనఁబడలేదని చింతించెను. దూర మాలోచించెను. నలకూబరునకు మిక్కిలి ఫలము నీఁజాలుశాప మొసఁగెను. కదలక యున్నచోటనేయుండి పక్షులు విణ్మూత్రములు విడువ నోర్చుకొని, శీతవాతాతపవర్షాదులవలని బాధల ననుభవించు వృక్షరూపము నొందుమా యని పలికెను. రంభ స్వైరిణి. కావున మనుజతనొందియుండ శపించెను. ఇట్లు శపించి యంతలోఁ దనస్వభావమగు దయ నాశ్రయించెను. దుర్వృత్తికిం దగినఫల మనుభవింపఁ జేసితిని. ఇఁకఁ దద్వృత్తిని బ్రసాదింప

కున్న మేలు లేదని యాలోచించి వారిప్రార్థనమున కెదురుచూ
డకయే శ్రీకృష్ణస్పర్శమాత్రమున శాపమునశించు. నిజపదము
నొందెద వని నలకూబరునకు, మహేంద్రసంగమమున నిజలోక
ప్రాప్తి గలుగునని రంభకు, శాపవిముక్తిని బ్రసాదించెను. తన
దారిం బాయెను. ఇంతతో నీకర్మము ముగియలేదు. శ్రీకృష్ణావ
తారమున భగవంతుని నులూఖలమునఁ గట్టునట్లు యశోదను
బురికొల్పెను. మహేంద్రుఁడు యజ్ఞాశ్వమును హరించు
నట్లు, అచ్చటి కారాజపత్ని వచ్చునట్లు. పురికొల్పెను. ఇట్లం
దఱి నాయాకాలమునఁ బురికొలిపినది కర్మమేకదా! ఇంతటి
శక్తి దానికిం గలుగుటకుం గారణము భగవత్స్వరూప
మగుటంబట్టియే గాని వేఱొకహేతువున గాదని యెఱుంగవ
లయును. ఇట్టికర్మము నెవరు మీఱిపోవఁ జాలుదురు! దానిని
మించుట భగవంతుని మించఁజూచుటయేయని యెఱుంగుటుత్త
మము. కర్మపరతంత్రుఁడై జీవుఁడు పరిభ్రమించుచుండును. ఇట్టి
చోఁ గర్మఫలములను దా నొందఁగోరుట యవివేకముగదా!

దీనిచే నెట్టికృత్యమైనను లోకసమ్మతముగా నుండవలయు
ననియు, స్వభావమునకు విరుద్ధమగు కృత్యము నీచఫలము
నొసఁగుననియు, నెట్టివాఁడైనను లోకహితవృత్తి మెలఁగ వల
యునే కాని ధనబలమునఁగాని, యధికారబలమునఁగాని మిట్టి
వీఁగరాదనియు, దానవతనికిఁ జేటు వాటిల్లక తప్పదనియు, నతని
దుష్కృత్యమే యతనికిఁ బ్రతిఫలమును గల్గించునుగాని యిత
రుఁడు కర్తకాఁడనియు, నట్టితఱి నితరులనిందించుట కేవల

మజ్ఞానమనియు గ్రహింపఁదగినవిషయములు. ఇంతియగాక "అతిసర్వత్రవర్జయేత్త"నుట యథార్థమనియు నూహింపఁదగిన విషయము.

నారదముని తనకపకారముచేయని రంభానలకూబరుల శపించుటపాపముకాదా యని యొకయాక్షేపము రావచ్చును. ఆక్షేపము చక్కనిదేకాని యసూయచేఁ జేయఁబడినది కాదు. మహర్షులు లోకోపకారమునకై తపోధనంబును వ్యయించు చుందురు. భగవదాజ్ఞానుసారము ధర్మము నడచుచున్నదా లేదాయని పరీక్షించుచుందురు. వారియందు భగవత్కళ మెండుగ నుండును. తద్బలమున వారు త్రిలోకములఁ గ్రుమ్మ రుచుందురు. వారి దర్శనముననే యెట్టివారికైన మర్యాదగాఁ బ్రవర్తింపకతప్పదను నూహజనించును. దుష్టరాక్షసులుగూడ నారదాదిమహర్షులం గాంచినంతనే ప్రత్యుత్థానాభివందనములు గావించుచుందురు. దానికిం గారణము తదీయదివ్యతేజ స్సుగాని వేఱొక్కటి కానరాదు. అట్టివారిఁ గాంచినపుడే గర్వించినవా రితరుల నెట్లుగా సమ్మానింతురో వచింపనేల? అట్టి వారికిఁ దగినఫలము కల్పించుట వారిపని. వారికి శాపానుగ్ర హశక్తి కలదు. అట్టిమహాత్ములఁ జూచియుఁ గేవలమింద్రియ లోలత మెలంగుట పాడికాదుకదా. కాఁబట్టి యట్టివారిని గాంచి వీరిజోలి మనకేలయని యూరకున్నచో వారు కేవలేం ద్రియసుఖపరవశులై జ్ఞానము క్రమముగ క్షీణింపఁ జెడుదురు. వారి కామాంధత్వమును దొలఁగించి విజ్ఞానసంపన్నులను

గాఁజేయుట మహాత్ముల నైజము. ఇంతియకాక నారదాదిమహ ర్షులు భగవన్నియుక్తాధికారివర్గమునఁ జేరినవారు. కావుననే యెట్టిదుష్టకార్యములు జరగుచున్నను వారెఱింగి తమచేతనైన నివర్తింపఁజేయుదురు. చేతఁగాకయున్న భగవంతునిం బ్రార్థిం తురు. కాఁబట్టియే నారదముని వారింగాంచి మనకీజోలియేలని యూరకపోవక వారికి శాపమొసంగెను. శాపమిచ్చి తనయిచ్చఁ బోయెనా లేదు. వారిప్రార్థనమునకు వేచియుండక తన్మోక్ష ము తానే తెలిపెను. కరుణామయుఁడుకాక నారదముని క్రూరాత్ముఁ డగునా? ఇంతియగాక యిట్టివారు పెక్కుఁగుండి భూతలమున నుండినఁగాని భగవదవతారము గలుగ నవకాశ ము లేదు. భగవంతుఁడు సామాన్యవేషమున నవతరించినను దన్మహిమము అనన్యసామాన్యముగానుండునుగాన నందఱు భగవంతుఁడని నమ్మరు. అట్టి మహిమమును జూపుట కిట్టివారుం డక తప్పదు. అనేకవిధముల భగవదవతారము లోకము నుద్ధ రించును. ఇన్ని హేతువులఁబట్టి యూహించిన నారదమునికి దీనఁ బాపమురాదు. విశేషించి యిట్టిదుష్కృత్యముల నొనరిం పరాదని లోకులకు గుణపాఠముచెప్పిన పుణ్యము కల్గును.

ఇంక నారదముని శాపమిచ్చెనా దేవలమునియా యన్న శంకయొకటి యున్నదికదా. ఇట్టిశంకల కవకాశము పురాణము లయందుఁ బెక్కుతావులఁ గానంబడుచుండు. పురాణముల తాత్పర్యము నీతి నుపదేశించుటయేగాని వేఱుకాదు. భిన్నభిన్న కాలములలోఁ బురాణములు చెప్పఁబడినవి. బ్రహ్మ విష్ణు శ్రీభా గవత హరివంశము లొక్కరీతిగా వచించినవి. శ్రీకృష్ణజన్మ

ఖండము వేఱొకరీతిగా వచించినది. కాని యిన్నింటి నుండి తేలినసారాంశ మొక్కటియే. ఒక్క చరిత్రమే యెన్ని పర్యాయములో ఎన్నియుగములలో జరగియుండునో వచింప నశక్యము. ఇంతకన్న నెక్కువ సమాధానము చెప్పుట యనవసరము. శ్రీకృష్ణావతారగాథల బోధించు పురాణములయందెల్ల బ్రహ్మవైవస్వతపురాణము ప్రధానము. అందు శ్రీకృష్ణజన్మఖండ మనేకాంశములఁ దెలుపును. అందున్న యీగాథ ప్రమాణము కాదనిభక్తులన వీలుండదు. భాగవతాదులే యప్రమాణములా యన్నను అగుననుటయుఁ బాపహేతువు.

భాగవతమున నలకూబరమణిగ్రీవులు పెక్కుమంది స్త్రీలంగూడి విహరించుచున్నట్లు చెప్పఁబడినది. శ్రీకృష్ణజన్మఖండమున నలకూబరుఁడు రంభంగూడి నందనవనమున విహరించుచున్నట్లు చెప్పఁబడినది. శ్రీమద్రామాయణమున నుత్తరకాండమున రంభారావణసంవాదము కనఁబడియెడు.అందు రంభనలకూబరునం దతిశయ ప్రీతిగలదాననినియు, నతని సుఖ మొందఁజేయ నరుగుచున్నదాన ననియుఁ జెప్పినట్లు కనుపట్టు. దీనిచే రంభానలకూబరమైత్రి స్పష్టమగును. యమళార్జునభంజనము సుప్రసిద్ధ గాథ కదా యన్న భాగవతము సుప్రసిద్ధమగుట నాకథయుఁ బ్రసిద్ధిగాంచినది.ఈ రెండుగాథలును ఒక్కనీతినే బోధించును. మొత్తముమీఁద శ్రీకృష్ణసంస్పర్శమాత్రమున శాపవిముక్తిగల్గుట దీనిసారము.ఇదియన్నింటియందు సమానము.ఇంత మాత్రము గ్రహించిన నెట్టిశంకలు మనసును బాధింపవు. లేని

పోనిశంకలకు మనసు చిక్కనట్లు చేసిన భక్తికిం జేటు వాటిల్లును యేగాని ఫలమేమియుం గానరాదు. కావున భక్తులంత అట్టి కుశంకలకుం జోటు మనస్సుననుంచక భగవద్దివ్యకథాసుధారసమును గ్రోలం బ్రయత్నించుట మిక్కిలి యర్హ్యకృత్యము. శంకలపై శంకలు ప్రశ్నములపైం బ్రశ్నములు సమాధానములపై సమాధానములు ఇట్లు పన్నుటవలన లాభమేమి లేదు. కావున నార్యమహాశయులు భక్తిరసముం గ్రోలం దలంపవలయును.

భగవంతుం డిప్పట్టున నమానుషాద్భుతచర్యచేం దన సర్వకర్తృత్వమును వెల్లడిచేసెను. ఇట్లు చేయుట దంభము కాదా యనరాదు గోపాలబాలుం డితండన్న మందబుద్ధి నశించి కొందఱయిన భగవంతుండని కనుంగొని తరింతురని భగవదాశయము. బాలకృష్ణుం డులూఖలమును మద్దిచెట్ల మధ్యభాగమున నునిచి లాగినంతమాత్రమునం జెట్లు క్రిందంబడునా యని కొందఱాక్షేపింతురు. మానవశక్తిచే భగవంతుని దివ్యశక్తి యేతన్మాత్రమని యూహించుట కడునశక్యమని వారు గ్రహించినవారు కారని తెలియవచ్చెడిని. లేకయున్న శ్రీపరాత్పరునికృత్యము ననుమానింప వీలున్నదా! ఒక్క చిన్నపదార్థము కొండలను ఛేదించును. దానినే మనము పిడుగందుము. పిడుగొక పదార్థమాయని వాదించువారు కొందఱుగలరు. ఆచర్చ యిటచేయరానిపని. వారు నన్నుంగూర్చి నవ్వనిండు. అత్యల్పపదార్థమగు వజ్రము చేతచేతను ఛేదింపంబడదు. కొండంత జంతువును (ఏనుంగును) చిన్నసింగము ఛేదించును. ఒక్కమూలిక ఇనుమును బంగారముగాం

జేయును. ఒకచిన్నివస్తువు ప్రాణముతీయు గరళము నమృతముగాఁజేయును. ఒక్కనిర్మాల్యపదార్థము ఎంతపెద్దవృక్షమునైనను మూలమున నిడినంతమాత్రమున నశింపఁజేయును. ఇన్నియు మనము కన్నులారఁ గాంచుచున్నారము. ఇట్టిశక్తి యావస్తువుల కెక్కడనుండివచ్చెను? ఇన్నిశక్తుల నొసంగువాఁడెవ్వఁడు? మయూరమునకుఁబింఛము, కలరవమునకుఁ గంఠము, సర్పమునకు మణి, ప్రసాదించిన భగవంతుఁడు లోకమున సృష్టియందుఁ దనకుఁగల యనన్యసామాన్యశక్తిని దెలుప లేదా? అట్టి భగవంతుఁడు రెండువృక్షములఁగూల్చెననుటయొక తుచ్ఛకార్యమే కాని గొప్పకార్య మెట్టులగును? బ్రహ్మాండముల నిర్మించు భగవంతున కొక్కటి యసాధ్యముండునా? వేసవికాలమునఁ దన కిరణజాలంబుల నెల్లరఁ బరితప్తులను జేయు భాస్కరు నొక్కనిముషమునఁ జిఱుత మేఘ మాచ్ఛాదించును. దీనియర్థమేమి? నాకన్న మిన్న లేఁడన్న యహంకారము వలదనియే గదా. అట్టివాఁడు కృతకృత్యుఁడు కాఁడనుట కిట్టియుదాహరణములు భగవన్నిర్మితము లెన్నియున్నవి? వానిం జూచియైన మనము భగవచ్ఛక్తి నెఱుంగఁజాలమని నేర్చుకొనకుండుట యొకపాపము కాదా. తుచ్ఛవృక్షము లననేల? సకలబ్రహ్మాండముల నున్మూలింపను, యథారీతిగా నిలుపను, క్షణమాత్రమున సృజింపను నేర్చిన భగవంతున కొకకార్యము శక్యము, వేఱొకకార్య మశక్యమనియు వచించుట పిచ్చితనముకాదా? కావున నట్టిదుర్వాదములఁ గల్పించుకొనక భగవత్తత్వము మనకేమాత్రము తెలియద

నియుఁ బ్రకృతివిశిష్టుఁడగు పరమాత్మ నిజలీలాకల్పిత బ్రహ్మాండముల నాడించుచు వినోదించుననియు నెఱింగి మమ్ముద్ధరింపు మాయని ప్రార్థించి తచ్చరణారవిందముల భజించుట యొక్కటి తప్ప మనకుఁజేయఁదగు కృత్యము వేఱొకటి గానరాదు. కాఁబట్టియే,

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.
భగవద్గీత ౧౮ అ. ౬౬ శ్లో.

అని భగవంతుఁడు వచించెను. "మామేకంశరణంవ్రజ" అనుచో ఏకం అద్వితీయం మాం శరణం వ్రజ-అనునర్థమునే గ్రహింపవలయుఁగాని మామేకంశరణంవ్రజ-అనునర్థమును బరిగ్రహింపరాదు. అట్లుపరిగ్రహించుచో నితరదేవతాతిరస్కారము చేసినట్లగును. సర్వదేవతాస్వరూపుఁడనగు నన్ను నాశ్రయింపుమా యనునర్థము సమంజసము కాదనుట వెల్లడిపట్టుదలయే యగునుగదా. కాఁబట్టి యఖండదివ్యస్వరూపుఁడగు శ్రీభగవంతు నారాధించుట యనఁగాఁ బదుత్తరీతి మెలఁగుటయే కదా. దానిని మించినధర్మము వేఱొకఁ డుండునా?

ఆర్యవర్యులారా! ఈగాథనుండి గ్రహింపఁదగిన విషయము లనేకము లున్నయవి. అందు నాకుందోఁచినవి నాలుగు మాటలు వ్రాసితిని. తక్కుంగలసీతులు మీరే గ్రహింపఁగల రన్న నమ్మకమున నీకఁబెంచి వ్రాయక విరమించి వాటోకభగవ

లీలను వ్రాయుచున్నవాఁడను. ఈభగవల్లీలను దలంచియే యొకానొక భక్తాగ్రగణ్యులు కవితార్కికసింహ బిరుదాంచితులు సర్వతంత్రస్వతంత్రులు, 'వేంకటనాథార్యు' లనఁబడు వేదాంతదేశికులు వినుతించిన శ్లోకముల వ్రాసి యీగాథను ముగించుచున్నవాఁడను.

శ్లో. పరివర్తితకంధరం భయేన
స్మిత ఫుల్లాధర పల్లవం స్మరామి,
విటపిత్వ నిరాసకం కయోశ్చి
ద్విపులోలూఖలకర్షకం కుమారమ్. ౭

నికటేషు నిశామయామి నిత్యం
నిగమాంతై రధునాపి మృగ్యమాణమ్,
యమలార్జునదృష్ట బాలకేళిం
యమునాసాక్షిక యౌవనం యువానమ్. ౮

గోపాలవింశతి.

ఖాండీరవనమున రాధాదేవి శ్రీకృష్ణునిఁ బెండ్లియాడుట.

శ్లో. రాధారాధిత విభ్రమాద్భుతరసం లావణ్యరత్నాకరం
సాధారణ్య పదవ్యతీత సహజస్మేరాననాంభోరుహాం,
ఆలంబే హరినీల గర్వగురుతా సర్వస్వ నిర్వాపణం
బాలం వైణవికం విముగ్ధమధురం మూర్ధాభిషిక్తం మహః

శ్రీకృష్ణకర్ణామృతము.

పాఠకులారా! శ్రీ బాలకృష్ణుని లీలలు కొన్ని చదివితిరి

తద్రసాస్వాదన పరిణతస్వాంతుల రైతిరి. ఇఁక నద్భుతమగు నొక్క గాథను జదువఁగలరు. ఆగాథ వాస్తవముగా నక్కజ మును బుట్టించియే తీరును. అదికల్పితమని భావింపకుఁడు. సాధారణముగా మనము భాగవతముచదువ నలవాటుపడితిమి. అందిట్టికథలు కానరావు. శ్రీకృష్ణలీలలు భాగవతమునఁ జాలిన న్నిలేవు. గ్రంథాంతరములయం దనేకగాథ లున్నవి. శ్రీ కృష్ణా వతారమున రాధాదేవియే మహాలక్ష్మి. మహాలక్ష్మియే రాధా దేవి. శ్రీ కృష్ణకర్ణామృతమును బఠించియే యుందురు. ఆ గ్రం థకర్త లీలాశుకులని పేరుగాంచెను. ఆ మహాభక్తుని చరిత్ర మించుక వినవలసియుండును. రాధాంబికా ప్రస్తావమున నాది వ్యపురుషునిఁ జెప్పనవలసిన యవసరము కల్గినది. ఈగాథ యేపురాణములోనిదనిమాత్రము ప్రశ్నింపకుఁడు. శ్రీ కృష్ణ కర్ణామృతపాఠమున స్పష్టమగును.

## లీలాశుకవృత్తాంతము.

శుకనాముఁ డొక భూపాలుఁ డుండెను. ఆ మహీజాని నిరంతరమృగయారతుఁడై వనముల సంచరించువాఁడు. ఒక్క తఱి నుక్కుమిగులు భటులంగూడి చటులతర ఘోటకము నెక్కి వింధ్యారణ్యముల సంచరించు చుండెను. వివిధ మృగవ ధము చేయుచు నంతకంత కెక్కుడగు వేఁటతమకంబున నావు హాటవిందిరుగు రాజు మహావృక్షచ్ఛాయ నాసీనములగు మృగ యుగ్మముం గాంచి వింటబాణము సంధించి తిగిచియేయ నాత్రే

టున నందొక కృష్ణమృగము ప్రాణంబులవదలుచుఁ గృష్ణా యని యాక్రోశించెను. ఆధ్వనిచే నన్నిదిక్కులు కృష్ణా యన్న ట్లును, వృక్షములు పక్షులుంగూడఁ గృష్ణా యన్నట్లును రాజు చెవులం బడియెను. ఆకాల మహిమ మెట్టిదో తెలియరాదు గాని యాక్షణమున నారాజునకు శ్రీకృష్ణనామమున ననురక్తి కల్గెను. వెంటనే తాఁజేసినపని మంచిదికాదని తోఁచెను. మృగ వధ మందుఁ గూడనిపని యనునూహ గలిగెను. మాంసాహార ములేక తృణములఁదిను సన్మృగముల హాయిగాఁ జల్లనినీడవిశ్ర మించిన వానిం గొట్టుట న్యాయముకానేకాదని స్ఫురించెను.అం దును జంటగానుండుతఱి నొకదానినేయుట మహాపాతకంబని స్ఫురించెను. దీని నెట్లుపాపుకొందునా యను స్మృతి కల్గెను. ఈ క్రూరకార్యజనిత మహాపాపమును దదీయవక్త్రగత శ్రీకృష్ణ శబ్దస్మరణముననే దొలఁగించుకొనుటొప్పునన్న సిద్ధాంతము మనసునఁ దట్టెను. ఇదితప్ప నితరోపాయము లేదనియు నొక మాట యెట్లో మదినుదయించెను. వెంటనే ధనుశ్శరముల నేల వైచి కృష్ణా నన్నుద్ధరింపుమాయని కేకవేసెను. అంబరమునుండి యిదియేనీకుఁ దరణోపాయము. వేఱుమార్గము లేదనుమాట వినఁబడియెను. అంత నతఁడు భటులం బంపి తానసువులఁ దిరు గుచుఁ బ్రాణముల వదలెను.

అంతట నతఁడు లీలాశుకుఁడన జన్మించెను. పుట్టినప్పటి నుండి సంసారవాంఛ వదలి భగవన్నామ పారాయణ పరాయ ణత్వముననే కాలము గడపుచుండఁగా నెవరోయొక మహాత్ముఁ

డు గోలోకవృత్తాంతము నెఱింగించి శ్రీకృష్ణమహిమమును దెల్పెను. తదుపదేశముననే భగవల్లీలలు కరతలామలకమువలె దృగ్గోచరము లగుచుండెను. ఏలీల యెదుట గనఁబడునో దాని యర్థము నొక్కశ్లోకమునఁ జెప్పి భగవంతు నారాధించువాఁడయ్యెను. శ్రీకృష్ణావతారమున భగవంతుని శృంగారచేష్ట లెన్నిగలవో యన్నియు నాలీలాశుకుఁడు వర్ణించెను. ఇట్లు కొంతకాలము కాఁగా నొకమహాపురుషుఁడు పోడసూపినవాఁడా! శ్రీకృష్ణభక్తుఁడవే. కాని పాపపర్వతములు నశింపలేదు. మూఁడవ జన్మమునఁగాని భగవత్పదము నొందఁజాల వనిచెప్పి యదృశ్యుఁడయ్యెను. అక్కటా! యని శ్రీరాధామాధవ పాదారవిందముల ధ్యానించుచుఁ బ్రాణముల వదలెను.

మఱుజన్మమున జయదేవుఁడను రాజవంశమున జన్మించెను. అందష్టపదముల నొక్కొక్కగేయముగా శ్రీరాధామాధవునే వినుతించెను. రాధామాధవుల శృంగారచేష్టలన్నియు నందు వర్ణింపఁబడినవి. ఆజన్మమున భగవంతుఁడు దూరముగా నున్నట్లగపడియెను. ఎట్లో ఆజన్మమునుగడపి మృతినొంది నారాయణతీర్థులన జన్మించెను. కర్మసన్న్యాస మొనరించెను. మృదంగమువాయించుచుఁ దరంగములనఁబడు గేయములఁ బాడుచుఁ బోవుచుండ శ్రీకృష్ణపరమాత్మ పాదారవిందముల గజ్జెలుధరించి నృత్యముసేయుచు వెనుకకుఁ బోవుచుండెను. ఇట్లు పోయి పోయి శ్రీకాశీక్షేత్రమున మణికర్ణికాఘట్టమున శ్రీభగ

వంతుఁడు గంగలోఁబడఁగా సీతఁడును గంగలోఁబడి శ్రీభగ వంతునియం దైక్యమయ్యెను.

ఇట్టిమహనీయుఁడు కర్ణామృతములయందు రాధాదేవిని ప్రధానముగా వర్ణించెను. గోలోకమున రాధాదేవియే భగవంతుని భార్య. ఆమెయే పరాశక్తి. సమస్తలోకపాలిని యారాధాదేవియే. కావున నోపాఠకోత్తములారా! శ్రీకృష్ణజన్మఖండమున రాధాప్రధానముగ భగవల్లీలలు వర్ణింపఁబడినవి. మీరింతకుముందే రాధాదేవికిం గల్గిన శాపమును జదివియుంటిరి. ఆగాథను మఱువకుఁడు. ఆరాధాదేవియే శాపాంతమున శ్రీకృష్ణునిం బెండ్లియాడెను. ఆచరిత్ర మిందుఁ దెలుపం బడును. కావున భక్తియుక్తస్వాంతముల నాలకింపుఁడు.

* బృందావనము గోలోకమున శతశృంగపర్వతము చెంత శ్రీరాధామాధవులకు విహారయోగ్యంబయి గోలోకము నావరించి వలయాకారముగాఁ గనఁబడుచుఁ బరమపవిత్రమై సుఖసంపదల కాటపట్టగునదియని ప్రథమభాగంబునఁ జదివితిరి కదా. ఆపావనవన మాగోలోకమున విరజానదీ వీచికాశీకర సమాయుతి శీతలంబై సకలదేవతానుహీరుహనిబిడంబై యుండునది.

శ్రీగోపాలకృష్ణమూర్తి భూలోకమున నవతరించుటకు

---

* ఈగాథ శ్రీకృష్ణజన్మఖండము పదునైదవయధ్యాయమునుండి వ్రాయఁబడినదని యూహింపవలయు.

ముందే రాధాదేవి యవతరించెఁ గదా. ఆసమయముననే బృందావనముకూడ యమునానదీతటమున నవతరించెను. వనమవతరించె ననఁగా నందలివృక్షములు భగవదాజ్ఞ ననుసరించి రాధామాధవులు విహరింప యమునానదీ ప్రాంతమున నెలకొనియెను. ఆవనముననే గోలోకమున గోవులు జరారోగభీతులు లేక నిత్యపుష్టములై యుండును. ఆపావనవనము భూలోకమున గోకులము చెంతనుండఁగా నందుఁ బచ్చిక మేయు గోవులు మూఁడు వేళలఁ బాలుపిదుకుచు రోగములు లేక దినదినాభివృద్ధి నొందుచుండెను. ఆవనము బృందావనమనుపేరనే ప్రఖ్యాతి వహించెను. భగవంతుఁ డవతరించుతఱిఁ దదర్హములగు పదార్థము లెల్లఁ దదిచ్ఛానుసారము భూమి నెలకొనుననుట యొకవింతయే కాదు. భగవంతుఁ డవతరించుటయే యసంగత మనువారికి సమాధానము చెప్పుట కష్టమగుపనికాని యది యంగీకరించువారి కిట్టివిషయములకు సమాధానము చెప్పుటకూడ గొప్పపని కాదు.

రాధాప్రభృతు లవతరించిరి. బృందావనము భూమి నెలకొనియె. నందుని నివాసము గోకులమనుపేరఁ బ్రఖ్యాతిం గాంచెను. గోలోకవాసు లెల్ల నొక్కొక్కతావున నవతరించిరి. పెక్కుమంది గోకులముననే యవతరించిరి. సర్వపరికరములు సంసిద్ధములుగ నుండెను. శ్రీకృష్ణుఁ డవతరించెను. కావున నిఁక బృందావనమున శ్రీరాధామాధవులకు వివాహము సాగవలయునుగదా. శ్రీరాధాంబికకు శాపమునఁ గొంతకాలము గడ

చెను. భగవత్సమాగమ సమయము సమీపింపఁ జొచ్చెను. కావున బృందావనమునకు భగవంతుఁడు ప్రవేశింపవలసి వచ్చెను. కాని లీలామానుషవిగ్రహుండగు గోపాలబాలుఁడు వయస్సునఁ జిన్నవాఁడుగాఁ గనఁబడుచున్నందున బృందావనము నకుఁ దన్నుఁగొనిపోవ నందున కుత్సాహము గలుగవలయునని సంకల్పించెను.

మహర్షుల సంకల్పములే ఫలించునన నిఁకభగవంతుఁడగు శ్రీకృష్ణపరమాత్మ సంకల్పము ఫలించునని చెప్పవలయునా? సంక ల్పమాత్రమున జగములు పుట్టును. సంకల్పమాత్రమున విల సిల్లు. సంకల్పమాత్రముననే లయించు. అట్టిపరాత్పరుఁడు రాధావియోగమునకు ముక్తిప్రసాదింపఁ గోరినవు డాపని నెఱవేర్పకుండ నెవ్వఁ డుండఁగలఁడు? ఆసంకల్ప మప్రతిహ తము. బ్రహ్మాదులకేని శిరసావహింపఁదగినది. ఆసంకల్ప మపుడు నందుని బృందావనమునకేగఁ బ్రోత్సహించెను.

ఒకానొకదినమున బాలకృష్ణునింగూడి నందుఁడు బృం దావనమునకుం బోయెను. అందు నొకభాగమునకు భాండీరవన మని పేరుగలదు. ఆవన మతిశృంగారముగా నమరియుండును. బృందావనమున నయ్యది హృదయప్రాయ మనఁదగినదియే. నందుఁ డంతకుమున్నే తన యపార గోధనము నందు నిరుపద్ర వముగా నుండునన్న నమ్మికచేఁ బ్రవేశింపఁజేసి యునిచె. ఆవన భాగమునకే కుమారుం గూడిపోయి యాతోఁటయందలి వినో

దములం గుమారునకుం జూపుచు నందలి విమల సలిలపూరిత జలాశయమును జూపి తత్పావనజలమును శ్రీకృష్ణుఁడు త్రాగునట్లు చేసెను. భగవంతుఁడు తత్సలిలము నాసపోయిఁ ద్రావెను. జలపానమున సంతసించు కుమారు నెత్తుకొని నందుఁ డొక వృక్షమూలమును జేరి శీతలతచ్ఛాయ నానందించుచుఁ గుమారుని ముద్దుపెట్టుకొనుచు స్వవక్షమున నాతని నుంచుకొనెను. ఇంతలో *మాయామానుష విగ్రహుండగు కృష్ణమూర్తి మాయచేఁ దటాలున నాకాశమును మేఘసమాచ్ఛాదితముగ నొనరించెను.

ఆకాశము మేఘావృతమయ్యెను. బృందావనం బెల్ల శ్యామలం బయ్యెను. ఝంఝావాతము వీవఁదొడఁగెను. పిడుగులమ్రోత వినవచ్చుచుండెను. వర్షధారలు హస్తిహస్తాకృతి మించుచుండెను. పాదపములు కంపించుచుండెను. ఘనశాఖలు విఱిగిపడుచుండెను. నందుఁ డిత్తఱి నెట్లు బాలుని రక్షింపఁగలుగుదునో యని భయపడఁ సాగెను. ఈగోవత్సముల విడిచి యాశ్రమమున కెట్లుపోఁగలదనను నూహయుఁ బరితాపము నందునిమది బాధింపఁ జొచ్చెను. ఇంతటికిం బోవకయున్న బాలకునిగతి యేమగునో యన్న శంకయుఁ దోఁచెను.

ఇట్లు నందుఁ డూహించు నంతలో బాలకృష్ణుఁడేడ్వ సాగెను. అంతలో నూరకుండక వర్షధారలకు శీతిల్లినట్లు తం

* మాయామానుషవిగ్రహః. అనిమూ.

డ్రికంఠమును గౌఁగిలించుకొనియెను. అట్టితఱి రాధాదేవి శ్రీకృష్ణుసన్నిధికి వచ్చెను. ఆమె నడక రాజహంససుందర మందగమనమును దిరస్కరించు చుండెను. అందెలు కలనిస్వన మొనర్చుచుండెను. ఆమె మోము శరత్కాల తుహినాంశు పూర్ణబింబమును గ్రిందుసేయు చుండెను. శరన్మధ్యాహ్న పంకజముల లోచనములు నవ్వుచుండెను. తారకములు సుందరములై కనుపట్టి నల్లని రెప్పలలరఁ గాటుకపూత సింగారమును సింగారింపనా సమయమున శ్రీరాధాలోచనముల సోయగము వర్ణనాతీతమైయుండెను. ఖగరాజ చంచుచారు శ్రీ ప్రశంసానాశక నాసిక యందముల కుప్పగాఁ గనుపట్టు చుండెను. ముక్తాఫలములు హారరూపమునవిలసిల్లుచుండెను.మాలతీకుసుమదామములు కబరిని వెలయింపఁ జేయుచుండెను. గ్రీష్మకాల మధ్యాహ్న భాస్కరప్రభలఁ గేలిసేయుచుఁ గుండలములు వర్ణింప నలవికాకుండెను.పరిపక్వ బింబఫలంబుల నరుణిమను మార్దవమును ధిక్కరించుచునధరముసోయగమునీను చుండెను.మౌక్తికములచాలునా దంతపంక్తి సొబగుఁ గూర్చుచుండెను. చిఱునవ్వు నరవికసిత కుందరశ్మి నడంచుచుండెను. కస్తూరికా బిందుసంయుక్త సిందూరబిందువు ఫాలభాగమున నలంకరించియుండెను. మల్లికాయుత కపోలము నునుగాంతి ప్రసరింపఁజేయుచుండెను. మనోహార వర్తులాకార కపోలఫలకము లలరారుచుండెను. మణిరత్నము లింద్రసారములు గలిసిన హారము లురస్థ్సలమును విలసిల్లఁ జేయుచునుండెను. చారు శ్రీఫలయుగకఠినవక్షోజములు

తనరారుచుండెను. పత్త్రావళీ శ్రీసమన్వితమై దీప్తిమంతమై సద్రత్నహార మనోహరమై యుదరము వర్తులాకారమై యొప్పులకుప్పనాఁ దగియుండెను. అతివిచిత్ర వళిత్రయము కన్నులపండువుగా నుండెను. నిమ్ననాభియు, వర్ణింపఁ దగియుండెను. విమల మణిసార విరచిత మేఖలాజాలము మధ్యభాగమున నమరియుండెను. కామాస్త్రసార భ్రూభంగము యోగీంద్రచిత్తముల మోహపరవశముల నొనర్పఁ జాలియుండెను. శ్రోణీ ఫలకము విశాలముగ నుండెను. చరణములు మెట్టదామరల నిందించుచుండెను. సకలవిధ రత్నభూషణములా నారీమణి తను సంగతి విలసిల్లుచుండెను. యావకద్రవము పాదముల నమరి యుండెను. పాదాభరణములు వర్ణింప నలవిగాక యుండెను. లత్తుకపుఁబూతయు వింతగాఁ గనుపట్టుచుండెను. వినిర్మల వివిధ మణివిసర రచిత క్వణన్మంజీర రంజితంబయి పాదారవింద ద్వంద్వము మనోహరముగ నుండెను. రత్నకంకణ కేయూర చారుశంఖ విభూషణము లలరారుచుండెను. అగ్నివలెఁ బరిశుద్ధములగు రత్నాంగుళీయక నికరము మృదుతమ దివ్యాంగుళుల నెలకొని యుండెను. వికసిత చంపకకుసుమ దామకములెల్ల యంగంబుల నిండియుండెను. భగవచ్ఛ్రీముఖసందర్శనార్థము సహస్రదళసంయుక్త మగు లీలారవిందమును రత్నదర్పణమును హస్తములం దాల్చియుండెను.

ఇట్లు సుందరాకారంబు గల శ్రీరాధాంబను భావించి నందనందనుఁడు విస్మయము నొందెను. నిర్జనవనంబున నాసుందరి

యెట్లు కనఁబడియెనో యను సందియము డెందమున నుదయిం చెను. కోటిచంద్ర కళాభాసురంబగు మోముకాంతి దిక్కుల వెలయింప వచ్చియున్న యారాధాంబను గాంచినంతనే నందుఁడు భక్తినమ్రాత్మకంధరుండై యశ్రుసంపూర్ణ నయనుండై నమ స్కరించెను. అంబా! నిన్ను శ్రీహరికి లక్ష్మినిమించిన ప్రియు రాలివిగ, గర్గ మహర్షి వలన వినియున్నవాఁడను. ఈబాలుఁడు నిర్గుణుండు పరాత్పరుండునగు నచ్యుతునిగఁ దెలిసికొంటిని. ఇట్టులయ్యు విష్ణుమాయచే మోహితుఁడనైతిని. మానవమా త్రుఁడను గాన నేమియుఁ దెలిసికొనఁజాలక యున్నవాఁడ. మం గళాంగీ! ప్రాణనాథు నీతని గ్రహియింపుము. యథాసుఖముగాఁ బొమ్ము. నీ మనోరథ మీడేఱిన పిదప నీబాలుని నాకిత్తువు గాక.

ఇట్లు పలికి నందుఁడు భీతిచే రోదనముచేయుబాలకు నారాధకు నొసంగెను. రాధయు నందహస్తమునుండి యానం దనందను నందుకొని మహానందమునొంది సుస్మితము నొనరిం చెను. నందుంగాంచి ప్రకాశము చేయఁదగదని యిట్లు పలికెను. నందభూపాలా! అనేకజన్మకృతసుకృతవితతి పరిణతిచే నన్నుఁగాం చఁజాలితివి. గర్గమహాముని వచియించినరీతి వింటివిగాన మహా ప్రాజ్ఞుఁడవైతివి. కారణజాతమంతయు నెఱింగితివి కాదే. మాయిర్వురచరితము గోకులమున నెవ్వరికిం దెలుపందగదు సుమీ. గోకులాధిపతీ! వరమడుగుము. నీమనోవాంఛితంబు దీర్ప గలదాన. దేవతలకుంగూడ లభింపరానివర మిచ్చెద.

అని యిట్లు రాధాంబిక వచియింప వ్రజేశ్వరుఁడు నందుఁడిట్లు వచించెను. తల్లీ! మీయిర్వురపాదారవిందభక్తినాకు స్థిరముగాఁ గలుగునట్లు లనుగ్రహింపుము. వేఱొండు వరము నొల్లను. దేవతలకుంగూడ దుర్లభమగు మీయిర్వురసన్నిధి నివసించుభాగ్యము నాకుంగల్లున ట్లనుగ్రహింపుము. ఈవరము నాకును యశోదకుంగల్ల ననుగ్రహింపుము. నీవు జగజ్జననివి. పరమేశ్వరివి కదా. అని యిట్లు పలుకునందునిం గాంచి పరమేశ్వరి యిట్టులనియె. అసమానమగు దాస్యము నొసంగితి. స్థిరభక్తియుఁ బ్రసాదించితి; మాయిర్వుర పాదారవిందములయందు మీయిర్వుర మనస్సులు సదాలగ్నములై యుండఁగలవు. ప్రవుల్లహృదయమున ఎన్నిజన్మములకేని దుర్లభమగు స్మృతి నీకుం గల్గుంగాక. విష్ణుమాయ నావరప్రభావమున నిన్నావరింపక యుండుఁగాక. ఈజన్మము కపటగోలోకమునకు భాగ్యంగూడి రాఁగలవు. ఈమానవతనువు నీకిఁకఁ గల్గకుండుఁ గాక. అనిపలికి రాధాదేవి మహానందమున శ్రీకృష్ణుని వక్షమున నిడుకొని వడివడి దూరమునకుం గొంపోయి కౌఁగిలించుకొనియెను. తనివిదీఱఁ గౌఁగిలించుకొని ముఖమును ముద్దిడుకొని పులకాంచిత సర్వాంగియై రాసమండలమును స్మరించెను.

ఇంతలో రాధాదేవి మాయాసద్వృత్తమండలమును గాంచెను. ఆరాసమండలము మంచిరత్నముల శకలములచే నిర్మితంబై యుండెను. నానావిధ విచిత్రచిత్రము లందుఁ

దోఁచు చుండెను. చిత్రకాననము లందుఁ గనఁబడు చుండెను. సిందూరాకారమణులచే నందలి స్తంభములు నిర్మింపఁబడియుం డెను. హరిచందనాగురు కస్తూరీకుంకుమ ద్రవముచే నలఁబడి మాలతీ మాలాదామ సముదాయ విలసిత శయ్య లందమర్పఁ బడి యుండెను. నానావిధ భోగోచిత పదార్థము లందుఁ గను పట్టు చుండెను. దివ్యదర్పణము లసంఖ్యాకము లందుండెను. ఆమండలము వఱియు మణీంద్ర ముక్తామాణిక్య మాలాజాల విభూషితంబై, మణిసారవినిర్మిత కవాట సంశోభితంబై, యమూల్య వస్త్ర విభూషితంబై, పతాకానికరాలంకృతంబై, కుంకుమాకారమణులచే నిర్మింపఁబడిన యేడుసోపానములు గలిగి, భృంగమాలాసంగతి నలరారు పుష్పోద్యానములఁ గనం దగి, కన్నులపండువు గూర్చుచుండెను.

ఆదేవి యా రాసమండలమును గాంచి యభ్యంతరమున కేగెను. అందు నమర్పఁబడియున్న కర్పూరాదిసద్వస్తువిస్తృతం బగు తాంబూలమును గనియెను. స్వచ్ఛమై శీతలమై పరిమళవం తమునగు జలము రత్నకుంభములనిండ నునుపఁబడి యుండెను. సుధామధుపూర్ణములగు రత్నకుంభములందుఁ గనంబడుచుం డెను. అందొక్కచోట శ్యామసుందరుఁడగు బాలుఁడు దృష్టిగో చరుఁడయ్యెను. కోటికోటి కందర్పలీలాభం బగు నాబాలుని రూపము దృష్టికి నామోదముం గూర్పఁజాలియుండెను. ఆకు మారుని శరీరమున దివ్యచందన మలందినట్లు కనఁబడియె. ఆశి

శువు పుష్పశయ్యయందు శయనించి యుండెను. మోమునఁ జిఱునవ్వు మొలకలెత్తుచుండెను. పీతవస్త్రపరీధానంబై, ప్రసన్నవదనంబై, ప్రఫుల్లాంభోజసదృశనయనంబై, మణీంద్రసారవినిర్మిత క్వణన్మంజీరమండితంబై, నవమణిగణరచిత కేయూర కటకాభిరామంబై, రత్నకుండల మండితంబై, కౌస్తుభమణివర విభూషితవత్సంబై, శారద రాకానిశాకర ప్రతిమాన ముఖసమన్వితంబై, శరత్కాల వికసితాంభోరుహ లోచనయుగళ విశాలంబై, మాలతీమాలా శిఖిపింఛసంశోభిత శిరోరుహ కమనీయంబై, త్రివక్ర చూడావిభూషితంబై, రత్నమందిర దర్శనాదర దృష్టిమనోహరంబై, ఆ బాలుని యాకారమును జూడ వేయికన్నులుండినను జాలకుండెను.

ఆ బాలునిం గాంచినంతనే రాధాదేవి తనవక్షస్స్థలమునఁ జూడ్కి నిలిపెను. కాని బాలుఁడులేక క్రోడము శూన్యమై యుండెను.ఇంతలో నాబాలకుఁడు నవయౌవనస్ఫురితుండై కనుపట్టెను. సర్వప్రకృతి స్వరూపిణియగు నా రాధాదేవి యప్పట్టున విస్మయము నొందెను. మనోహరమగునారూపమునుజూచి రాధ మోహపరవశురా లయ్యెను. కామమువలన నయనచకోరములచేఁ దన్ముఖచంద్రునిఁ ద్రాగెను. నిమేషములులేని కన్నులలర నవసంగమలాలసయై పులకాంచిత సర్వాంగియై మదనాతురయై సస్మితాస్యచంద్రయై నిలుచుండెను.

అంత శ్రీకృష్ణమూర్తి స్మేరానన సరోరుహయగు

నా రాధాదేవిం గాంచి యిట్లు పలికెను. శ్రీహరి యామె నవసంగమాలాలసయై వక్రదృష్టిం దన్ను నిరీక్షించుచుండు టెఱింగెను. రాధాదేవీ! సురసభయందు గోలోకవృత్తాంతమును స్మరింపఁగల్గితివి. పూర్వము నీవు కోరిన వాంఛల నిపుడు పూర్తిచేసెదను. సుందరాంగీ! నీవే కదా నాకుం బ్రాణాధిక ప్రియురాలవు. నా వాంఛితముల నీడేర్పఁగలదానవు. *నీవెట్లో నేనట్లే. మనకిర్వురకు భేదము లేదు. పాలయందుఁ దెల్లఁదనము, అగ్నియందుఁ గాల్చుశక్తి, భూమియందు గంధము ఎట్లో అట్లే నీయందు నేనుందును. [1]మృత్తికలేక ఘటము చేయ నెట్లు సాధ్యము కాదో బంగారు లేక కుండలముల నిర్మింప నెట్టు లవకాశము లేదో ఎట్టి కులాలుఁడైనను, ఎట్టి స్వర్ణకారకుఁడైనను మృత్స్వర్ణములు లేక ఘటకుండలముల నెట్లు చేయఁజాలరో అట్లే నీవు లేక నే నేకార్యము చేయఁజాలను. సృష్టియొనరింప నీసహాయమే కావలయును. సృష్టికాధారభూతురాలవు నీవు. బీజరూపుఁడను నేను. కావున నోసుందరీ! రాధాదేవీ! రమ్ము.-ఈదివ్యశయన మలంకరింపుము. నను వక్షమునఁ జేర్పుము. నాకు శోభాస్వరూపురాలవు

---

* యథాత్వంచ తథాహంచ భేదో హి నావయోర్ధ్రువమ్. యథా క్షీరేచ ధావల్యం యథాగ్నౌ దాహికా సతి, యథా పృథివ్యాం గంధశ్చ తథాహం త్వయి సంతతమ్.=అని మూ. 1 వినా మృదా ఘటం కర్తుం వినా స్వర్ణేన కుండలమ్, కులాల స్స్వర్ణకారశ్చ నహి శక్తః కదాచన. తథా త్వయా వినా సృష్టి మహం కర్తుం నచ క్షమః, సృష్టే రాధారభూతా త్వం బీజరూ

నీవే. దేహభూషణ మన నీవే. నినుఁ గూడనితఱిలోకులు *నన్నుఁ
గృష్ణుఁ డందురు. నినుఁగూడియుండుతఱి శ్రీకృష్ణుఁడని నన్నుఁ
బిలుతురు. నీవే శ్రీవి. నీవే సంపత్తివి. ఆధారస్వరూపిణివి నీవే.
సర్వశక్తిస్వరూపవు నీవే. సర్వరూపుఁడనగు నక్షరుఁడను నేను.
నేను తేజస్స్వరూపుఁడ నైనపుడు నీవు తేజస్స్వరూపిణి వగు
దువు. నేను దేహధారిని గానపుడు నీ వశరీరిణి వగుదువు. సుం
దరీ! నేను సర్వబీజస్వరూపుఁడను. నీవు శక్తిస్వరూపిణివి. సర్వ
స్త్రీరూపధారిణవి. నీవు నాదేహాంశస్వరూపవు సుమీ. (1) మూల
ప్రకృతివి. ఈశ్వరివి. శక్తిచేతను బుద్ధిచేతను, జ్ఞానముచేతను
నీవు నాతో సమానవు. (2) అంబికా! మన కిర్వురకు భేదము గల
దని యే నరాధముఁడు తలంచునో అతఁడు కాలసూత్ర
మను నరకమందు రవిచంద్రు లుండుదాఁక నివసించును.
అంతమాత్రమున నాతనిపాపము తొలఁగదు. తనకంటె ముం
దున్న కులజులనేడ్వురను, ముందు పుట్టఁబోవువారి నేడ్వురను
బాపపంకమునఁ బడఁద్రోయఁ గలఁడు. అంతియకాక కోటిజన్మా
ర్జిత పుణ్యమును బోఁగొట్టుకొనును. తెలివితక్కువచేత నేనరా

---

పో౽హ మచ్యుతః. అని మూ. * కృష్ణం వదంతి మాం లోకా స్త్వయై
వ రహితం యదా, శ్రీకృష్ణంచ సదా తేఽపి త్వయైవ సహితం పరమ్.
అని మూలము. (1) మమాంగాంశ స్వరూపా త్వం మూలప్రకృతి రీశ్వరీ,
శక్త్యా బుద్ధ్యా చ జ్ఞానేన మయా తుల్యా వరాననే. అనిమూలము. (2) ఆవ
యో ర్భేదబుద్ధిం చ యః కరోతి నరాధమః, తస్య వాసః కాలసూత్రే
యావ చ్చంద్రదివాకరౌ. అనిమూ.

ధముఁడు మనలనిర్వురను నిందించునో వాఁడు పునరావృత్తిలేని ఘోర నరకకూపమునఁ బడియుండఁగలఁడు. ఎవ్వఁడు పాపభీతుఁడై "రా" అనుశబ్దము నుచ్చరించునో వానికి నిశ్చలభక్తిని బ్రసాదించెదను. వెనుక"ధా" యనుశబ్దము నుచ్చరించిన నాతనికిఁ బ్రత్యక్షమయ్యెదను. ఎవ్వరు నన్ను షోడశోపచారముల సేవింతురో వారిపై నాకెంత ప్రీతి శాశ్వతముగాఁ గల్గునో ఆప్రీతి రాధాశబ్దము నుచ్చరించి యుపాసించువానిపైఁ గల్గును. రాధాశబ్దము నుచ్చరించు భక్తునికంటె, ప్రేయసీ! నీవు కూడఁ బ్రియవుకావు. నీకంటె నాభక్తుఁడే యధికుఁడు. బ్రహ్మయు, ననంతుఁడు, శివుఁడు, ధర్ముఁడు, నరనారాయణమునులు, కపిలుఁడు, గణపతి, కార్తికేయుఁడు, లక్ష్మి, సరస్వతి, దుర్గ, సావిత్రి, ప్రకృతి, దేవతలు మొదలగువారు నాప్రీతికిఁ బాత్రులగువారు. వారుకూడ రాధా మంత్రోపాసకులకంటె నధికులు కారు. వారందఱు నాకుఁ బ్రాణతుల్యులు. నీవన్ననో ప్రాణాధికురాలవు. పైనఁ జెప్పఁబడిన వారెల్ల భిన్నస్థానమున నుండువారు. నీవో మదీయ వక్షస్స్థలమున నుండుదానవు. నా యంశమగు నేచతుర్భుజమూర్తి (విష్ణువు) వక్షస్స్థలమునఁ బ్రియురాలిని (లక్ష్మిని) ధరించుచున్నదో ఆమూర్తిని నేనే. కృష్ణరూపుఁడనగు నేను సదా నిన్ను ధరించియే యున్నవాఁడను.

అని యిట్లు శ్రీకృష్ణమూర్తి పలికి మనోహర సుమశయ్యను బఱచెను. భక్తిభారముచేఁ గంఠమును వంచి రాధి

కయు నాథునిం గాంచి యిట్లు పలికెను. నేను స్మరించిన సమ స్తము నెఱుంగఁజాలుదు. అట్టి నేనెట్లు మఱువఁగలను? ఏనీవు సమస్తము నాస్వరూపమని తెల్పితివో భవదీయ పాదారవింద ప్రసాదమున నేనట్టిదాననే యైతిని. ఈశ్వరునకుఁ గొందఱప్రి యులు, కొందఱు ప్రియులుగలరా? ఎవరు నన్ను స్మరింపరో వారు నీకృపాపాత్రులు కాకుందురు. నాథా! తృణము పర్వత మగునట్లును, పర్వతము తృణ మగునట్లును జేయఁగలవు. ఐనను యోగ్యాయోగ్య సంపత్తియందుఁ దదనురూపకృప నీ కుండును. నేను నిలుచుండియుండునపుడు నీవు శయనించియుండు నపుడు కళలచే నేక్షణము గడపఁబడియెనో ఆక్షణమును యుగ సహస్రములయందైన మరల సంపాదింపఁజాలను. నా వక్షస్స్థల మందును, నాశిరస్సునందును, నీచరణాంబుజము నిలుప ననుగ్ర హింపుము. నామనస్సు భవద్విరహానలమున నిపుడు తపించు చున్నయది. నాదృష్టి భవదీయ పాదారవింద ద్వంద్వముపయిఁ బ్రసరించు చున్నయది. శోకము కళేబరమును జ్వాలగోరి బల వంతపఱచినను రాకయున్నది. నీయవయవముల వరుసగాఁ జూ చుచు నీ ముఖాంబుజమున నిపుడాదృష్టి నిలిచియున్నది. నీ ముఖపంకజమును గాంచి తృప్తినొందు నాదృష్టి సమగ్రము గాకున్నది.

అని యిట్లు రాధాదేవి భాషింప విని శ్రీపరమేశ్వరుఁడు దరహాస మొనరించెను. ప్రియురాలిం గాంచి హితమై సత్యమై



శ్రుతిస్మృతిప్రతిపాదితమై యలరారునట్లుగ నిట్లుపలికెను. ప్రేయసీ! నేఁజెప్పినవాక్యము ఖండింప శక్యముకాదు. మంగళాంగీ! క్షణము నిలువుము. నీకు హితమొనఁగూర్చెదను. నీ మనోరథమును బూర్తిచేయుటకుఁ దగినకాలము సమీపముననే యున్నది. ఎవనికి ఏది వ్రాయఁబడి యుండునో అది కాలమందే నిరూపింపఁ బడినది. దానిని ఖండింప నాకే యవకాశము లేదన నింకవిధికి శక్యమా, ఎవరికేది వ్రాయఁబడినదో యావిధికి నేను విధాతను. అల్పులగు బ్రహ్మాదుల కదిఖండింపఁ దరమా!

అని యిట్లు రాధాదేవితో శ్రీకృష్ణపరమాత్మ పలుకుచుండుతఱి వారియెదుట పితామహుఁడు తోఁచెను. మాలాకమండలువు లాతనికరంబుల నలరారుచుండెను. ముఖముల నాల్గింట సుస్మితము తాండవించుచుండెను. శ్రీకృష్ణమూర్తిచెంతకుంజని నమస్కరించి శ్రుతిహితోక్తుల వినుతించెను. సాశ్రుపూర్ణ నయనుఁడై పులకితసర్వాంగుఁడై భక్తినమ్రాత్మకంధరుఁడై మఱిమఱి వినుతించి నమస్కరించి హరిసన్నిధినిల్చి మఱియు నమస్కరించి రాధికాసన్నిధికిం బోయెను. జగన్మాతయగు నారాధాంబికా చరణారవిందములపైఁబడి తలసోఁక మ్రొక్కి జటాజాలము పాదములఁ గప్పునట్టు లొనరించి కమండలూదకముల నాదివ్యపాదములఁ గడిగి తనవచ్చినపనిని జేతులు జోడించి యిట్లు విన్నవించెను.

తల్లీ ! శ్రీకృష్ణపరమాత్మప్రసాదమున నీపాదాంభోజములఁ గాంచనోచితిని. ఎల్లరకీపాదదర్శనము దుర్లభము.

జననీ! నేను భారతవర్షమున వసియించి యఱువదివేల సంవత్సరములు తపస్సానరించితిని. భాస్కరనిర్మిత పుష్కరతీర్థమందు శ్రీకృష్ణమూర్తిని ధ్యానించితిని. నా తపంబునకు మెచ్చి వరదాతయగు శ్రీహరి తానే నాచెంతకు వచ్చెను. భక్తవర్యా! వర మడుగు మనిపలుక నేను స్వామీ! శ్రీరాధాంబికా చరణారవిందద్వంద్వ మెల్లరకుఁ బరమ దుర్లభము. గుణాతీతా! పరాత్పరా! శీఘ్రముగా నాకుఁ గనఁబడఁ జేయుము. అని నేను ప్రార్థింపఁగా నీ శ్రీహరియే నన్నుంగాంచి వత్సా! ఒకానొకకాలమున నీకుఁగనఁబఱచెదను. ఇపుడు శక్యముకాదనెను. తల్లీ! ఈశ్వరాజ్ఞ విఫలము కానేరదు. ఆ వరప్రభావమున నిపుడాదివ్య భవదీయపాదద్వంద్వమును దర్శించు నదృష్టము గల్గెను. ఎల్లరకు గోలోకమును దర్శింప నిచ్ఛ గల్గియుండును. ఇపుడు భారతవర్షమును దర్శింప నిచ్ఛ యుదయించెను. ఎల్ల దేవీస్వరూపములు ప్రకృత్యంశములు ప్రకృతి యెల్లరఁ బుట్టించునది. రాధాదేవీ! నీవు శ్రీకృష్ణాంగసంభూతురాలవు. ఎల్లవిషయముల శ్రీకృష్ణునితో సమానురాలవు. శ్రీకృష్ణమూర్తివి నీవే. ఈ హరియే రాధాదేవి. నీవే రాధవు. ఈహరియే శ్రీకృష్ణమూర్తి. ఈ విషయము వేదములయందుఁ గనఁబడదని యెవరు చెప్పఁగలరు?

బ్రహ్మాండమునకు వెలుపలఁ బైభాగమునందు గోలోక మలరుచుండును. ఎట్లు గోలోకము సర్వోత్తమమో అట్లు

శ్రీహరియు నీవును బుట్టుకలేనివారలు. సమస్తబ్రహ్మాండవాసులు శ్రీకృష్ణాంశాంశజీవులో అట్లు నీవు శక్తిస్వరూపవై వారియం దుందువు. పురుషులు హర్యంశసంభూతులు. స్త్రీలెల్ల భవదంశసంభూతలు. ఆత్మచేతనే నీవు దేహరూపవైతివి. శరీరమునకాధారము నీవే. శరీరమునకుఁ బ్రాణములు నీవే. త్వత్ప్రాణములచే నీయీశ్వరుఁ డుండును. ఏ హేతువుచే నే నిర్మింపఁబడితినో ఆ హేతువు పరమాత్మయే. ఈ పరమాత్మ యీ హరియే. శ్రీహరి శాశ్వతుఁడు. నీవు శాశ్వతవు. శ్రీహరి యంశము నీవు. నీయంశ మీ శ్రీహరి. నేను జగద్విధాతను. దేవజనకుఁడను. ఈపరమేశ్వరు నుతించియే జనులు పండితు లగుదురు. నిత్యకల్యాణములగు భగవంతుని గుణములలో శతాంశమైన నెవ్వరును వర్ణింపఁజాలరు. వేదముగాని, పండితుఁ డెవ్వఁడుగాని, నిన్ను స్తుతింపఁజాలఁడు. స్తవములకు జనకము జ్ఞానము. బుద్ధి జ్ఞానమునకుఁ దల్లి. నీ వాబుద్ధికి జననివి. అట్టి నిన్ను నెవఁడు వినుతింపఁగలఁడు? ఏవస్తువు కనఁబడుచుండునో దానిని బండితుఁడు వర్ణింపఁజాలును. ఏవస్తువు చూడఁబడదో వినఁబడదో యట్టివస్తువు నెవ్వఁడు నుతింపఁగలఁడు ? నేనును, మహాదేవుఁడు, అనంతుఁడు, నిన్ను వినుతింపఁజాలము. సరస్వతియు వేదములు వినుతింపఁజాలవు. ఇఁక నెవ్వఁడు వినుతింపఁగలరు? యథావేదముగా నాచెప్పిన యీవిషయము నాక్షేపింపకుము. ఈశ్వరులకెల్ల నీశ్వరుఁడగు భగవంతునకు యోగ్యాయోగ్య

లయందుఁ గృప సమానముగ నుండును. ప్రతిపాల్యుఁడగు జనునకు క్షణమందే దోషము. క్షణమందే గుణము. జననీజనకులు పుత్రస్నేహమున నెల్లతప్పుల క్షమింతురు. అని యిట్లుపలికి నలువ వారి మ్రోల నిలుచుండెను. సర్వవంద్యమగు తచ్చరణారవిందములకు మ్రొక్కెను.

---

## బ్రహ్మకృతరాధాస్తుతిః.

శ్లో. హే మాత స్త్వత్పదాంభోజం దృష్టం కృష్ణప్రసాదతః,
సుదుర్లభం చ సర్వేషాం భారతే చ విశేషతః. ౧
షష్టివర్షసహస్రాణి తప స్తప్తం పురా మయా,
భాస్కరే పుష్కరే తీర్థే కృష్ణస్య పరమాత్మనః. ౨
ఆజగామ వరం దాతుం వరదాతా హరి స్స్వయమ్,
వరం వృణీష్వే త్యుక్తే చ స్వాభీష్టం చ వృతం ముదా. ౩
రాధికాచరణాంభోజం సర్వేషా మపి దుర్లభమ్,
హే గుణాతీత మే శీఘ్ర మధునైవ ప్రదర్శయ. ౪
మయే త్యుక్తో హరి రయ మువాచ మాం తపస్వినమ్,
దర్శయిష్యామి కాలే చ వత్సే ఉదానీం క్షమేతి చ. ౫
నహీశ్వరాజ్ఞా విఫలా తేన దృష్టం పదాంబుజమ్,
సర్వేషాం వాంఛితం మాత ర్గోలోకే భారతే ఉధునా. ౬
సర్వా దేవ్యః ప్రకృత్యంశా జన్యాః ప్రాకృతికా ధ్రువమ్,
త్వం కృష్ణాంగార్ధసంభూతా తుల్యా కృష్ణేన సర్వతః. ౭
శ్రీకృష్ణ స్త్వ మయం రాధా త్వం రాధా వా హరి స్స్వయమ్,
నహి వేదేషు మే దృష్ట ఇతి కేన నిరూపితమ్. ౮
బ్రహ్మాండా ద్బహి రూర్ధ్వం చ గోలోకో ఉస్తి యథాంబికే,

ఈస్తోత్రము బ్రహ్మకృతము. కావున దీనిని త్రికాలము లయందుఁ బఠింపవలయును. అట్లు పఠించిన రాధామాధవ పాదభక్తియు దాస్యములభించును. అంతియకాక కర్మనిర్మూలన

---

వైకుంఠ శ్చాప్యజన్య శ్చ త్వ మజన్యా తథాంబికే. ౯
యథా సమస్త బ్రహ్మాండే శ్రీకృష్ణాంశాంశ జీవినః,
తథా శక్తిస్వరూపా త్వం తేషు సర్వేషు సంస్థితా. ౧౦
పురుషాశ్చ హరే రంశా స్త్వదంశా నిఖిలా స్త్రియః,
ఆత్మనా దేహరూపా త్వ మస్యాధార స్త్వమేవ హి. ౧౧
అస్యాసుప్రాణై స్త్వం మాత స్త్వత్ప్రాణై రయ మీశ్వరః,
కిమహో నిర్మితః కేన హేతునా శిల్పకారిణా. ౧౨
*నిత్యోఽయం చ తథా కృష్ణ స్త్వంచ నిత్యా తథాంబికే,
అస్యాంశాత్వం త్వదంశోవా ప్యయం కేన నిరూపితః. ౧౩
అహం విధాతా జగతాం దేవానాం జనక స్స్వయమ్,
తం పఠిత్వా గురుముఖా ద్భవంత్యేవ బుధా జనాః. ౧౪
గుణానాం వా స్తవానాం తే శతాంశం వక్తు మక్షమః,
వేదోవా పండితోవా న్యః కోవా త్వాం స్తోతు మీశ్వరః. ౧౫
స్తవానాం జనకం జ్ఞానం బుద్ధి ర్జ్ఞానాంబికా సదా,
త్వం బుద్ధే ర్జననీ మాతః కోవా త్వాం స్తోతు మీశ్వరః. ౧౬
యద్వస్తు దృష్టం సర్వేషాం తద్ధి వక్తుం బుధః క్షమః,
యదదృష్టా శ్రుతం వస్తు తన్నిర్వక్తుంచ కః క్షమః. ౧౭
అహం మహేశో ఽనంతశ్చ స్తోతుం త్వాం కోఽపి న క్షమః,
సరస్వతీ చ వేదా శ్చ క్షమః కః స్తోతు మీశ్వరః. ౧౮
యథాగమం యథోక్తం చ న మాం నిందితు మర్హసి,

మొనరించి జయింపరాని మృత్యువును జయించి సర్వలోకము లదాఁటి యత్యుత్తమ గోలోకమున కరుగు భాగ్యము గల్గును.

అనిపలికి నారాయణుండు నారదమునికి మఱియు నిట్లు తెలిపెను. మునివర్యా! అవ్వలి వృత్తాంతము నాలకింపుము. బ్రహ్మయొనరించిన స్తవము నాలకించి హర్షమున రాధాదేవి యిట్లుపలికెను. చతురాననా! నీమనమున నేకోరిక గలదో దానిం దీర్చెద. వరము కోరుము. అనుటయుఁ బంకజాసనుం డాజగదంబికం గాంచి తల్లీ! మీయిర్వుర పాదారవింద భక్తి సదాదృఢముగ నిలిచియుండ ననుగ్రహింపుమీ అనియె. వెంటనే రాధాదేవి "తథాస్తు" అని పలికిన నలువయు మరల నాదంపతులకు వందనం బాచరించి వారినడుమ హుతవహు నెలకొలిపి హరిని స్మరించుచు విధియుతముగా హోమముచేసెను. భగ

---

ఈశ్వరాణా మీశ్వరస్య యోగ్యాయోగ్యే సమాకృపా. ౧౯
జనస్య ప్రతిపాల్యస్య క్షణే దోషః క్షణే గుణః,
జననీ జనకో యావా సర్వం క్షమతి స్నేహతః. ౨౦
ఇత్యుక్త్వా జగతాం ధాతా తస్థౌచ పురత స్తయోః,
ప్రణమ్య చరణాంభోజం సర్వేషాం వేద్య మీప్సితమ్. ౨౧
బ్రహ్మణాచ కృతం స్తోత్రం త్రిసంధ్యం యః పఠే న్నరః,
రాధా మాధవయోః పాదే భక్తి ర్దాస్యం లభే ద్ధ్రువమ్. ౨౨
కర్మ నిర్మూలనం కృత్వా మృత్యుం జిత్వా సుదుర్జయమ్,
విలంఘ్య సర్వలోకాంశ్చ యాతి గోలోక ముత్తమమ్. ౨౩

శ్రీకృష్ణజన్మఖండే ౩౬ అధ్యాయః.

వంతుఁడు శయ్యనుండి లేచి బ్రహ్మసన్నిధిఁ గూరుచుండెను. అంత బ్రహ్మ మంత్రములు పఠింప శ్రీకృష్ణమూర్తి హోమము చేసెను. పంకజాసనుండును శ్రీకృష్ణమూర్తికి రాధాంబకు మరల నమస్కరించి యాహుతవహునకు సప్తధా ప్రదక్షిణములు చేయించి మరల రాధాంబ ప్రదక్షిణము చేయున ట్లొనరించి యథోక్తపీఠమున వారిని వసింపఁజేసెను. అవ్వల విధి విధియుక్తముగా శ్రీకృష్ణపరమాత్మ రాధాంబికా హస్తమును గ్రహించునట్లు చేసెను. వేదోక్త మంత్రసప్తకము శ్రీహరిపఠించున ట్లొనరించెను. పిదప వేదవేత్తయగు నాచతుర్ముఖుఁడు రాధాహస్త పంకజము శ్రీహరివక్షమున నుంపఁజేసి శ్రీకృష్ణహస్తము జగన్మాత మెడపై నుండునట్టు లొనరించి తదర్హ మంత్రముల మూఁడింటిని జదివి రాధాదేవిచే వానిం బఠింపఁజేసెను. జానువులవఱకు వ్రేలాడఁజాలు పారిజాతప్రసూనమాలికను శ్రీహరికంధరమున రాధాదేవిచే వేయించెను. ఆమహానందసమయమున నాదంపతులకు నమస్కరించి మనోహర కల్ప ప్రసవమాలికను శ్రీరాధాకంఠమున శ్రీకృష్ణుఁ డలంకరించునట్లు లొనరించి వారి నిర్వురను బీఠముల నలంకరింపఁజేసెను. అందు శ్రీకృష్ణమూర్తి వామపార్శ్వమున రాధాదేవి దోసిలొగ్గి సుస్మితాస్య పంకజాతయై కూరుచుండ విధి ప్రార్థించెను. తరువాత నిర్వురచేతను శ్రుతీరిత పంచమంత్రములఁ బఠింపఁజేసెను. ప్రార్థనాపూర్వకముగా కన్యకను దండ్రి వరునకు సమర్పించునట్లు రాధాదేవిని శ్రీహరికి సమర్పించి శ్రీకృష్ణునెదుట నిలువంబడియెను.

ఆసమయమున దేవత లానందపులకోద్గమ దేహులై యంబరమున దుందుభిని, ఆనక వాద్యమును, మురజాదికమును మ్రోగఁజేసిరి. పారిజాతప్రసూనవృష్టిని గురియఁజేసిరి. గంధర్వప్రవరులు మధురనాదములఁ బాడిరి. అచ్చరకన్నెలు శాస్త్రవిహితముగ నాడిరి. ఆసమయమున నలువ హరిని స్తుతించెను. హరియు స్మితవక్త్రుఁడై యుండెను. బ్రహ్మయు జగన్నాథా! మీ యిర్వుర పాదాంబురుహభక్తిని బ్రసాదింపుమా యని వేఁడెను. ఆమాట లాలకించి శ్రీహరి మాచరణసరసిజభక్తి దృఢముగ నెలకొనుఁగాక. ఇంక నీస్థానమున కరుగుము. నీకు మేలయ్యెడు. నా యాజ్ఞచే నీ కొప్పగించిన కృత్యమును నెఱవేర్పుము.

అని శ్రీహరిపలుక నలువ తదాజ్ఞను శిరసావహించి వారికి నమస్కరించి నిజాలయమునకుఁ బోయెను. బ్రహ్మ లోకమున కరుగ రాధాదేవి సస్మితయై వక్రదృష్టిచే శ్రీహరి ముఖకమలమును దర్శించి సిగ్గుచే ముఖము నాచ్ఛాదించుకొనియె. అంతలో నాదేవి పులకాంచిత సర్వాంగియుఁ గామబాణ పీడితయు నయ్యెను. శ్రీహరికి నమస్కరించి హరిశయనమును జేరెను. పరిమళ సద్వస్తునికర పరిపూర్ణంబై యున్న యాశయనమున లలాటమునఁ దిలకమలర శ్రీకృష్ణవక్షస్స్థలమున నల శారుచుండెను. సుధాపూర్ణ రత్నపాత్రమును మధుపూర్ణ మణిపాత్రమును శ్రీహరికి సమర్పించెను. రాధాహస్తసమర్పింప ప్రద

త్త పదార్థముల భగవంతుఁ డాదరమున గ్రహించి త్రాగెను. కర్పూరాది సద్వస్తుయుతంబయి మనోహరమగు తాంబూలమును శ్రీలోకనాథునకు రాధాదేవి యర్పింప జగన్నాథుం డారగించెను. శ్రీహరియు నాదరమున రాధాంబికకు సుధారసము నీయ నాదేవి పరమానందమున నాస్వాదించెను. తాంబూలమీయ శ్రీహరి మ్రోల నమలెను. శ్రీహరిచర్విత తాంబూలమును దమి రాధకొసంగ నిరుపమభక్తిచే నామె పరిగ్రహించెను. అంతియగాక తన్ముఖపంకజమును బానముచేసెను. అవ్వల శ్రీరాధానాథుఁడానందమున భవచ్చర్విత తాంబూలము నిమ్మాయని యాచించిన నాదేవియు నవ్వి క్షమింపుఁడీయని వేఁడెనుగాని యీయకుండెను. చందనాగురు కస్తూరీకుంకుమ ద్రవ సంయుతమగు గంధమును రాధమేన శ్రీహరియలందెను. ఏ పాదారవిందమును సదా కాముఁడు ధ్యానించు చుండునో యది రాధసంతోషకారణమున శ్రీహరివశ మయ్యెను. నారద మునీ! యత్సేవకసేవకులచే నిత్యము మదనుఁడు జయింపఁబడునో స్వేచ్ఛామయుఁడగు శ్రీహరి కుతూహలమున దానిచే జయింపఁబడియెను. రాధసంతోషార్థమామెనువక్షమున నిడుకొని బహువిధక్రీడలఁ దేలెను. ఆకేళివర్ణనాతీతము. ఇచ్ఛామాత్రము. ఆతరుణమున నారాధాదేవి పులకాంకురాంచిత సకలాంగి యయ్యెను. అది నవసంగమము కదా! ఆతన్వంగి మూర్ఛాక్రాంతయై యహోరాత్ర భేదము నెఱుఁగకుండెను. స్మరశాస్త్రోక్త కల్పనముల నాపరమాత్మ సుఖము నభినయించెను.

అంత స్మృతిగల్గి సుస్మితరై వక్రలోచనరై క్షతవిక్షత సర్వాంగిరై యాకాంతారత్న మలరారెను. ఆకేళీ సమరసము జృంభిత కంకణకింకిణీనాదము మంజీరమృదునాదము మనోహరమై తనరెను. అయ్యదనున విచ్చలవిడి హెచ్చినతమిఁ బచ్చవిలుతుని కేళి యథార్థ్యముగ నాజగజ్జనకులకుఁ జనరె. శ్రీకృష్ణకృత్యములకు రాధయుఁ బ్రతి చేయుచునే యుండెను. రాధాహస్తారవిందమునుండి మాధవుఁడు రత్నదర్పణమును అపహరించెను. రాధికయేమి యూరకుండెనా. ఆమెయు మాధవ కరతలమునుండి మురళిని లాగికొనియెను. అంతఁ గానిమ్మని శ్రీహరి రాధాచిత్తమును దొంగలించెను. రాసమండలమునుండి రాధాదేవియు మాధవమానసము నపహరించెను.

క్రీడా కౌతుకానంతరము నవ్వుచు శ్రీకృష్ణా! మురళి యెందున్నది? చూపుమాయని యడిగి తడఁబడు నాథునిం గాంచి యిదిగో గ్రహింపుమని మురళి నొసంగెను. శ్రీహరియు రత్నదర్పణమును, ప్రఫుల్ల క్రీడాకమలమును బ్రార్థించునట్లు చేసి యీయక యీయక యిచ్చెను. విడివడిన కబరిని జక్కఁజేసి. సిందూరతిలకమును సవరించెను. విచిత్రరీతి మకరికాపత్రముల నలవరించి రూపమును గ్రొత్తరీతి నలరఁజేసెను. శృంగార రచన విశ్వకర్మకే తెలియదన నిఁక సఖిజనులమాట యిట నేటికి?

అంత నొకకాలమందు రాధాదేవి శ్రీకృష్ణు నలంకరింపఁ బూనఁగా నారూపమును వదలి శిశురూపమును భగవంతుఁ

డంగీకరించెను. అప్పుడా దేవి బాలరూపమున నాఁకలిచే రోదనముచేయు శ్రీకృష్ణునిం గాంచెను. నందుఁడు తన కేరూపమున నున్న శ్రీకృష్ణునొసంగెనో యట్టి యాకృతిఁగన్న యచ్యుతునిం గాంచి వేఁడినిట్టూర్పులువదలి హృదయపరితాపమును గాంచెను. ఇచ్చటనచ్చటఁ జూచుచు శోకార్తయై విరహాతురయై కాకూక్తులలర శ్రీకృష్ణు నుద్దేశించి యిట్లుపలికెను. మాయేశ్వరా! మాయ చేయుచున్నావుకదా. కింకరియగు నీరాధయేమి చేయఁజాలును? అని నుడువుచు నాదేవి క్రిందఁబడి విలపించెను. శ్రీకృష్ణమూర్తియు రోదనము చేసెను. అప్పుడశరీరవాక్కొక్కటి వినెంచెను. రాధా! ఏల విలపించెదవు? శ్రీకృష్ణపదారవిందమును స్మరింపుము. రాసమండల పర్యంతము గోలోకమును స్మరింపుము. రాత్రి వచ్చుచున్నయది. నీవు సదా భగవంతునింగూడి సుఖింపఁగలవు. నీ యీాప్సితములెల్ల నీడేఱును. స్వగృహమును శ్రీకృష్ణచ్ఛాయను రచింపుము. తానేవచ్చి నిన్ను సుఖింపఁజేయును. ఏడువకుము. భుజాంతరమున మాయేశుఁడై బాలరూపియు నగు శ్రీకృష్ణు నిడుకొని దుఃఖమును వదలి యింటికిం బొమ్ము. అని వినఁబడియెను.

ఇట్లశరీరవాణి వినఁబడఁగా బాలకృష్ణుని భుజాంతరమున నిడుకొని పుష్పోద్యానమును సద్రత్న మండపమును గాంచెను. వేగముగా బృందావనమునుండి రాధ నందమందిరమునకుఁ బోయెను. ఆరాధ మనోవేగమునఁ బోవునట్టి శక్తిగల

ద్దేవి. కాన నిమిషార్ధమున నందమందిరమునకుం బోయి సంసిక్త స్నిగ్ధ మధురరసనదైయు రక్తలోచనము లలర యశోదాదేవి కా బాలకృష్ణు నీయందలంచి యిట్లుపలికెను. అమ్మా! ఈశిశువుం గైకొనుము. ఈబాలుండు బరువుగ నున్నవాడు. ఆకలిబా ధచే మిగుల నేడ్చుచున్నవాడు. గోష్ఠమున, నీనాథుండు నం దుండే యీబాలుని నాకొసంగెను. మార్గమున వచ్చుచుం బడ రాని కష్టముల ననుభవించితిని. మేఘ మాకాశము నావరించి ధారలుగా వృష్టికురియం దడిసితిని. మార్గము పంకసంకులమై కాలుపెట్ట నలవికాకుండెను. యశోదా! ఈబాలుని మోయం జాలక పోతిని. తల్లి! ఈబాలుం గైకొనుము. ఇల్లువదలి చాల కాల మాయెను. త్వరగా వెళ్లెదను. సుఖము నీకుం గల్గుంగాక.

అనిపలికి బాలు నప్పగించి స్వగృహమునకుం బోయెను. యశోదయు బాలు నెత్తుకొని తడవుగం దడివితడవి ముద్దిడు కొని పాలిచ్చెను. అట రాధయు నింటికింబోయి గృహకృత్యము ల యందంత ప్రీతికలదిగాకయుండి ప్రతిరాత్రియందును శ్రీకృష్ణ కేళీభాగ్యమున సుఖించుచు నుండెను. నారదమునీ! ఇట్లు శ్రీ కృష్ణచరిత్రమును దెల్పితి. ఇది శుభపుఁలకు మూలాధారము, సుఖప్రదము మోక్షప్రదమునగు. ఇంకేమి వినంగోరెదవు ! అని శ్రీమన్నారాయణుం డడిగెను.

భక్తాగ్రగణ్యులారా ! ఈగాథ భగవంతుని గోలోకవా సుప విగ్రహత్వము దెలుపును. విచిత్ర గాథ యిదియే. దీనియం

దనేక శంకలుండినట్లు తోఁచును. ఈ గాథనుండి యనేకవిష యములు గ్రహింపవలసి యుండును. అవెల్ల మీకుం గరతలామలకములుగఁ దోఁచును. ఐన నాత్మతృప్తికై యల్పమతికిఁ దోఁచు వానిని నిట వ్రాయుచున్నవాఁడ. ఏల యీఁగొడవయని నా లేఖిని నిలుపఁ బ్రయత్నింపరని నమ్ముచున్నవాఁడ.

ఇంతకుముందే మీరు రాధాజననవృత్తాంతమును జదివితిరి. శాపవశమున శ్రీరాధాదేవి మర్త్యలోకమున వృషభానునింటఁ బుట్టుటయుఁ జదివితిరి. ఆమెకు శాపవిముక్తి యెంత కాలమునకు ననువిషయము నెఱింగితిరి. ఆకాలమే యిటఁ బ్రారంభమయ్యెనని తలంపుఁడు. కాననే నందుఁడు సంతోషమున నందనునెత్తుకొని గోవులంజూడ బృందావనమునకుఁ బోయెను.

నందుఁడు బృందావనమునకుం బోయినదిమొదలు రాధ శ్రీబాలగోపాలు నెత్తికొనివచ్చి యశోద కిచ్చినంతదనుక జరగినకథ యొక్కపూటలోఁ గొంతభాగముననే యనినమ్ముఁడు. కాని యింతలో నెంతకాలమో రాధాదేవి యాబాలునిం బెండ్లాడి సుఖించెను. అనఁగానే మీకునిది యసంగతమని తొలుదొలుతఁ దోఁపకమానదు. శ్రీకృష్ణమూర్తి పరాత్పరుఁ డన్నమాటను మాత్రము మఱువకుఁడు. అన్నిశంకలు నశించును. నందునకు బృందావన గమనేచ్ఛ కల్గుటయు, నపుడు నందనుని గొనిపోవ నూహా పొడముటయు, నందు గోగణము లుండు

టయు, వానింగాంచి యానందించుచుఁ గొడుకునకు నందలి వినోదపాత్ర భూములఁ జూపుటయు, నంతలో మేఘము లంబరమున నావరించి గర్జనము లొనరించుచు వర్షించుటయు, నద్దానికి భీతిల్లినట్లు బాలుఁడు రోదనము చేయుటయు నొక వింతలుగావు. మనుష్యవ్యవహారమున నసంగతములును గావు. ఉద్యానములకుం బోవుచుఁ దండ్రులు కొడుకులఁ దోడ్కొని పోవుట మనము గనుఁగొనుట లేదా. వర్షముకురియుట చిత్రమా. శిశువులు గర్జనముల కులికిపడి బిట్టు రోదనముచేయుట వింతయా. కాదు. అంతలో రాధాదేవి యచ్చటికి వచ్చుటమాత్రము మనుష్యకృత్యమున నసంగతము. ఏలన వృషభాను నింటినుండి యా ఘనగర్జనములు తటిల్లతలు, శిలావృష్టి యిట్టి యుత్పాతములు గలుగుతఱి నవయువతి యొంటిపాటున నింటికివెలుపలఁ దిరుగుటయుఁ దలిదండ్రు లామెను బోనిచ్చుటయు లౌకిక వ్యవహార విరుద్ధములు. ఎవరేనట్లు చెప్పినను నమ్మఁదగని విషయములు ననుటకు సందేహాము లేదు. కాని యిది భగవద్విషయమున నసంగతము కాదు. శంకనొందఁ బనియు లేదు. భగవత్కృత్యములలో నిదియొక యత్యల్పకార్యము. ధూమశకటము కడువడిఁ బోవుచుండ నదియుప్పొంగి తటములనొరయుచుఁ బ్రాంతభూములనంటి ప్రవహించుచుండ నాధూమశకటమానదిపైఁగట్టిన సేతువు నవలీల ఛేదింప నదిలోఁ ద్రెళ్ళుటయు, నందలి వారొక్కతడవ మ్రందుటయు నందు నొకరిద్దఱు భగవత్కృపచే సజీవులై యుండుటయు నౌరా యని వారు బ్రదు

కుటకై యందఱచ్చెరువందుటయు జరగుట లేదా. అనఁగా నెవ్వరెవ్వరికి సంఘాతమృతి గల్గునట్లు విధిగలదో వారెల్లఁ గార్యములఁ గల్పించుకొనియైన నందుఁ జేరుదురు. ఒకరిద్దఱు కష్టపడి బ్రతుకు నదృష్టముగలవారును ఆదినమే బయలుదేరుదురు. ఆయేట జలపూరమున నట్టివిపత్తునుండి తప్పించుకొను వారిద్దఱు కనఁబడుట సుసంగతమే.

కొంతకాలము క్రిందట భాగ్యనగరమను విఖ్యాతిం గాంచిన గోలకొండనగరమునకుఁ జెంతనున్న మూసి యను నేఱు పొంగెను.జలమయముగా నగరమును జేసెను. ఎన్నియో సౌధములు నేలపాలయ్యెను. ధనరాశి యేటఁగలిసెను. లక్షాధికారు లుదయానంతరము భిక్షాధికారులైరి. ఎన్నియో మనుష్యకళేబరములు నదివెంటఁ గనఁబడియెను. ఒక్కరాత్రికి జననష్ట మపారమయ్యెను.మఱుదినము ప్రభువునాజ్ఞచే భటులు ప్రజలకు సాయము చేయుచుండిరి. పంకసంకులములగు సౌధపంక్తులం జొచ్చి మృతకళేబరముల వెలుపలికిఁ దీయుచుండిరి. ఒకసౌధమున నొకవేదిక (తిన్నె) క్రిందఁ బదార్థములుంచుకొనఁ గట్టిన గూటియందు నిండినపంకమును ద్రవ్వి తీయుచుండ నందొక కళేబర మగపడియె. దానిం దీసిచూడఁగా నించుక ప్రాణావశిష్టమని తోఁచెను. ఆరక్షకభటు లిదియేటిప్రాణమని పాఱవేయక యీశ్వరాజ్ఞచేఁ జక్కనియుపచారములు చేయ నాకళేబరము పూటలాడెను. ఎనిమిదిదినములు పంకమునఁ

బూడియున్న యాప్రాణి యెట్లు బ్రదికెనో యను విషయమును విమర్శించిన విశ్వాసమున కది దూరమే యగును. కాని యట్లే జరగెను. ఈవార్తయే కొంతకాలమునకుఁ బిమ్మట నొకగ్రంథమున వ్రాయఁబడినచో నిదికల్పితమని యాకాలపువారు వచింపక మానరు. ఏలయన మనుష్యవ్యాపారమున నిది శక్యమగునది కాదని యనుభవమున నున్నందున వారట్లు పల్కుదురు. ఈకాలముననే జరగిన విషయమును నమ్మువారు లేకుండఁగా నిఁక మనుష్యవ్యవహారాతీత విషయముల నమ్ముదురా. నమ్మరనుట నిక్కము. కాని యెట్టివారైనను మనుష్యకృత్యములకన్న దైవకృత్యములు మహత్తరములని యూహించిన నీకథలోని విషయము లసంగతములే కావని యొప్పుకొనక తప్పదు. "సర్వంమిథ్యా సాగరంమిథ్యా" యనువారిజోలి మనకేల గాని సద్బుద్ధిగల వారలం గూర్చియే మన మూహింతము.

ఒక్కొక్కకాలమందే వృష్టిగలుగును. ఒక్క తరుణమువనే యెండలు మెండుగ నుండును. ఒక్కతఱి శీతము జనుల నేఁచును. ఇట్లేల? స్వభావమిదియనునది తుచ్ఛవాదము. దానికంతస్సారము శూన్యము. ఏలయనఁగా నది స్వభావమైనచో నొక్కవత్సరమున వృష్టి లేకపోనేల? కాన స్వభావమను వాదమే సభాముఖమున నడుగుమోపి నిలువఁజాలదు. ఇది దైవయత్నమనుచో నందంతస్సారము సత్యమును పేరవెలయునుగాన నావాదము నిలుచును. కావున మనపాలిశోయు

లారా ! రాధకు శాపవిముక్తికాలము సమీపించెనుగాన, దదనుగుణముగ నన్నియు సమకూరెను. గోలోకమున వరమిచ్చునపుడు రాధతో శ్రీకృష్ణపరమాత్మ నీకు రాత్రులయందుఁ బొడసూపుదు ననియెఁగాన నట్లే యనుగ్రహించెను. నందుఁడు వృష్టిబాధ కోర్వక బాలుఁడు రోదనము చేయుచున్న వాఁడని తొలుత దలంచెను. ఎట్లీబాలు నీబాధనుండి కాపాడి యిల్లు చేర్పఁ గలుగుదునాయని చింతించెను. ఇంతలో రాధాంబ యచ్చటికి వచ్చెను. ఆపరదేవిని జూడఁగనే జ్ఞాన ముదయించెను. తమోగుణము పటాపంచ లయ్యెను. నిక్కమగు విజ్ఞాన ముదయించి యీబాలుఁడు పరాత్పరుఁ డనియు, నారాధాదేవి మూలప్రకృతి యనియుఁ దెలియఁ జేసెను. మహాత్ముల సందర్శన మననే జ్ఞానము పొడముననని మనము వినలేదా. మనుష్యమాత్రుల దర్శనమే యిట్టిదికాఁగా నిఁకఁ బరమేశ్వరి సందర్శనమున జ్ఞాన ముదయించెనన వింతయేమియున్నది?

ఇప్పట్టునఁ బట్టువదలక నాలుగుమాటలు వ్రాయక మానవీలులేదు. ద్వేషబుద్ధిమాని పరిశీలింపుఁడు. భగవంతుఁడు రాధతో సంభాషించుచు మనకిరువురకు భేదము లేదనియె. నీవు మూలప్రకృతివి. నేను బురుషుఁడ ననియె. నా రూపమునుండి నిన్ను వేఱుచేయ శక్యముగాదని యుపదేశించెను. అగ్నినుండి యుష్ణము, పాలనుండి ధావళ్యమును వేఱుచేయ శక్యమా యనిప్రశ్నించెను. రాధా! నీవు లేకున్న నేనుండఁగలనా యని

యడిగెను. మృత్తిక లేక ఘటనిర్మాణము సాగునా యనిపలికె. దీని భావమేమి? ప్రకృతిసాయము లేకున్నఁ బురుషుఁడు (విరాట్టువు) ఏపనియుఁ జేయఁజాలఁడని యొత్తిచెప్పెను. ప్రకృతియే నీవని స్థిరపఱచెను.

తథా త్వయా వినా సృష్టి మహం కర్తుం నచ క్షమః.

అని గట్టిగాఁ బలికెను. ఇప్పట్టునఁ గొందఱు బొడ్డున జన్నిదముఁ దోఁపి కలహమునకుఁ గాలుత్రవ్వుదురు. వారిని గాంచినపుడు జాలికలుగక మానదు. వారి యభిమానము వ్యర్థాభిమానము. మా విష్ణువునకన్న గొప్పవాఁడు లేఁడనుట యు, మా శివునకన్న నధికుఁ డుండఁడనుటయుఁ గేవలము పిచ్చివాదము. భగవంతుఁ డొకఁడనుట యందఱంగీకరింతురు. ఆ మహనీయమూర్తి కనేకనామములు కలవందురు. కాని విష్ణు వనునది యొక్కనామమే కాని రెండవపేరు లేదనిపలుకరు. అనేక కోటినామములుగా వెలసిన భగవంతునకు విరుద్ధముగనున్న పదార్థమేది? శివనారాయణాది నామముల వ్యవహరించుచుండు భగవంతున కేకత్వము సిద్ధాంతమగుచుండ నీపిచ్చివాదము లేటికో తెలియఁజాలకున్నవాఁడ.

శ్రు. యస్మిం త్సర్వాణి భూతాని ఆత్మైవా భూ ద్విజానతః,
తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః.

ఈశావాస్యోపనిషత్. ౭.

అని శ్రుతి యేకత్వము నుపపాదించు చున్నది.

శ్రుతి. ఏకో నారాయణః న ద్వితీయోఽస్తి కశ్చిత్. అనియు
శ్రుతి. ఏకఝైవ రుద్రో న ద్వితీయాయ తస్థే.

అనియుఁ బ్రతిపాదించుచున్నది. సర్వదేవతాస్వరూపుఁడు విరాట్టువని శ్రుతులు నెత్తినోరుపెట్టుకొని మొత్తుకొనుచుండఁగా దేవతాభేదమున నుత్తమమధ్యమాధమ భేదకల్పన మెంత స్వారస్యమో యూహింపఁజాల కున్నాను. విష్ణువే భగవంతుఁ డనుటలోఁ గాని, శంకరుఁడే పరమాత్మ యనుటలోఁ గాని తప్పేమియు నాకు నింతదనుక గోచరింప కున్నది. నామములు కల్పితములు. నామరూపక్రియాశూన్యుఁడు భగవంతుఁడు గదా. ఆతత్త్వము నెట్లుపిలిచిన నేమి? ఎట్లుపూజించిన నేమి? ఇదియే పరతత్త్వమను దృఢబుద్ధియున్నఁ జాలును. అది లేనిచో నాపూజ నిష్ఫలము. ఎవనిదూషించినను ఆ తత్త్వమును దూషించినట్లేకదా. ఇట్టి విషయముల వాదము లేల?

ఇట్లు వాదించువారు మూర్ఖులని చెప్పుట మహాపాతకము. వారి కాద్వైతమునందు దృఢభక్తి గలదు. దానికి నమస్కారములు. కాని దేవతాంతర దూషణముమాత్రము నీచము. అది యాభక్తుని పురోవృద్ధికి మార్గము కాదు. తన్నిరోధకము. కాఁబట్టి దేవతాంతర దూషణము మానినచో నట్టి దేవతాభిమానము ముక్తిదాయకము, ప్రశంసార్హమునగు. దేవతయందు దృఢాభిమానము లేకున్న నాభక్తి ఫలమునీఁజాల

దనుట నిష్కృష్టము. అనఁగా దేవతాంతర దూషణ విరహితాత్మ దేవతాభిమానము ప్రశంసార్హ మనునది యిట సారము.

ఇఁక రాధామాధవ సంవాదమునుండి కొన్ని విషయములు గ్రహింపఁ దగినవి. రాధామాధవ సంభాషణమున రాధ మూలప్రకృతి యనియు మాధవుఁడు విరాట్పురుషుఁ డనియుఁ దేలెను. రాధయే శక్తి యనియుఁ దేలినది. కాఁబట్టి రాధామాధవులకు భేదములేదని దీనిసార మనక తప్పదు. విరాట్పురుషుఁడు సృష్టిచేయఁ దలంచుకొనఁగాఁ బ్రకృతి (పరమాత్మే చ్ఛాశక్తి) రూపధారిణియగు. విరాట్పురుషుఁడు తత్సహాయమున ననఁగా ఆమెద్వారా సృష్టికృత్యము నిర్వహింపఁ జేయును. సృష్టికి ముందు వారిద్దఱేకరూపమున నుందురు. అగ్నియం దుష్ణగుణము వేఱురూపముగాఁ గానఁబడదు కదా. అనఁగాఁ బ్రకృతిపురుషుల కభేదమని తేటపడును. శక్తి పరాధీనయయ్యుఁ గానిండు. దానఁ బ్రమాదమేమి? సృష్టికిముందు వారి కభేదమే. సృష్టియనఁగా భగవంతునకుఁ బ్రపంచము సృజింప నిచ్ఛ గల్గుటయే. ఆయిచ్ఛ గల్గినపుడే ప్రకృతి యావిర్భవించును. ఆమెతోఁ గూడినపుడు భగవంతుని కేమని పేరు? సగుణబ్రహ్మ మని పేరు. బ్రహ్మమను శబ్దము నపుంసకలింగము. ప్రకృతిశబ్దము స్త్రీలింగము. బ్రహ్మము నపుంసకలింగ మనఁగా భావ మేమి? పురుషుఁడు లోకమునఁ జేయు కృత్యములవలె వాఁడుజేయఁడని కదా. అనఁగాఁ దానై సృష్టికృత్యమునఁ బ్రవర్తిం

పఁడు. మఱెట్లు? ఇచ్ఛామాత్రమునఁ బ్రకృతి ప్రపంచమును నానావిధముల నలరించును. ప్రకృతి స్వతంత్రురాలా? కాదు. మఱియెవ్వరు? తదిచ్ఛాధీనురాలు. విరాట్టువు నిచ్ఛయే ప్రకృతి. కాననే ప్రకృతి లయమే ప్రళయము. భగవంతునకు సృష్టియు త్సాహము వదలుటయే ప్రళయమని భావము. ఎపుడుసృష్టియందు మహాపురుషున కిచ్ఛ లేదో, అపుడు ప్రకృతి భగవంతునందు విలీనయగు. సృష్టి యెట్టులలరును? అంతయు నశించును. కాఁబట్టియే,

శివ శ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్,
నచే దేవం దేవో నఖలు కుశల స్స్పందితు మపి. అను

శ్రీ శంకరోక్తి సమంజసమై యొప్పారెను. శక్తితోఁ గూడనపుడు కదలఁజాలఁ డనఁగా మూర్తిధరుఁడు కాఁడని భావము. సృష్టిచేయు నూహలేక సకలబ్రహ్మాండములు తన కుక్షి బీజరూపమున వెలయ మహానందమున యోగనిద్రాపరుఁడై యుండునని సారాంశము. ఇట్లుండఁగా బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ప్రకృతి నిబద్ధులై సృష్టిస్థితిసంహారములు చేయ నియుక్తులై స్వకార్యరతులై యుండఁగా నందొకఁ డధికుఁడు వేఱొకఁడు తక్కువవాఁడు. అని భేదము చెప్పునవకాశమే కలుగ లేదు. ఈ త్రిమూర్తులకుఁ బ్రభువై సకలబ్రహ్మాండ నాయకుఁడై యచింత్య మహిముఁడై నిర్గుణుఁడై నిరీహుఁడై జగత్సాక్షియై సకలకార్య కారణభూతుఁడై విరాట్టు వెలయుచుండునని యుప

నిషత్తులు వదరుచుండఁ, బురాణము లుద్ఘోషించుచుండ, నితి హాసములు నిశ్చయతత్త్వ మిదియే యని పిలిచిపిలిచి ప్రార్థించి ప్రార్థించి తెలుపుచుండ "నేఁబట్టినకుందేటికి మూఁడేకాళ్ల"ని మొగము చిట్లించి యధరము నల్లల నాడించి కలహించి పాప మొడిగట్టుకొన నేలొకో తెలియరాకున్నది. ఆ విరాట్టు విష్ణుశ బ్దవాచ్యుఁ డన్నఁజాలునాఁ జాలదుగదా. సకలదేవతాస్వరూ పుఁడు. ఏ పేరునఁ బిలిచిన నేమి? ఏవిధిఁ బూజించిన నేమి? నిశ్చల భక్తియున్న ఫలము నిచ్చును. లేకున్నఁ బూజ నిష్ఫలము.

ఇఁక నొక్కవిషయమును దెలుపక వీలుగాకున్నది. ప్ర కృతి యనఁగాఁ బార్వతి యనియు, నామెను బూజించువాఁడు శాక్తుఁడనియు, ఆపూజ అసురీపూజ యనియు, నాశక్తి తమ శ్శక్తియనియు, నదియే యవిద్యయనియుఁ, దద్భక్తులు

"అంధం తమః ప్రవిశంతి యే ఽవిద్యా ముపాసతే"

అను నుపనిషత్తు బోధించు చున్నదనియుఁ గొందఱు వాదిం తురు. ఇంతకంటె మూర్ఖ లున్నట్లు నాకుం దోఁచలేదు. ఏ దేవతను బూజించినను బ్రకృతిని బూజించినట్లే. సగుణ తత్త్వ మునకుఁ బూజ కలదు గాని నిర్గుణతత్త్వమునకుఁ బూజయే లేదు. అది యచింత్య మవ్యక్త మనంతము నగునని తెల్పు చుండఁగా నావాహనము చేయుటెట్లు? ఏ దేవతను బూజించి నను నామము రూపము గలదిగా భావించి పూజింపవలయునే కాని వేఱుగతియే లేదు. రూపవిశిష్ట వస్తువులెల్లఁ బ్రకృత

విశిష్టములే. కావున లోకమున నందఱును శాక్తులే. శాక్తులము మేము కామనువారు తమ్మును దమ రెఱుంగరు. వారి పూజ భస్మమునఁ బోసిన పన్నీరువలె నిష్ఫలము.

ప్రకృతి యన నేమి?

అనునదియే ముఖ్య ప్రశ్నము. ప్రకృతి పార్వతియే కాదు. లక్ష్మి యన్నను, సరస్వతి యన్నను పార్వతి యన్నను నొక్కటియే గాని వేఱుగాదు. సర్వశబ్దము లాపరదేవికిం జెల్లు. ఆపరదేవి యనఁగా పరమాత్ము నిచ్ఛాశక్తి. కాఁబట్టియే

ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ.

అని చెప్పఁబడినది. విష్ణుభక్తులు విష్ణువే పరమాత్మయని తదిచ్ఛయే ప్రకృతియని. ఆమెయే శ్రీ మహాలక్ష్మియని తలంచినను దోషము లేదు. శైవులు శివుఁడే విరాట్టువని, పార్వతియే ప్రకృతియని పూజించినను దోషము లేదు. జ్ఞానులు బ్రహ్మయే విరాట్టువని, సరస్వతియే మూలప్రకృతియని ధ్యానించినను బాధ లేదు. సద్భక్తి కుదిరినచో నాపూజ ఫలమునిచ్చును. భక్తి స్థిరతఁ గాంచనిచో నాపూజ నిరర్థకమే. కాఁబట్టి శాక్తులనఁగా వేఱని భ్రాంతినొందఁ బనిలేదు. ఎల్లవారు శాక్తులే. శాక్తులు కానివా రేమతమునను లేరని మూఁటికి ముమ్మాటికి నిరాఘాటముగాఁ జెప్పఁగలను. ఐన శాక్తులని షణ్మతములలోఁ బ్రఖ్యాతి గానేల యని ప్రశ్నము రాకమానదని నే నెఱుంగుదు. శాక్తులనఁగా సర్వాధారస్వరూపిణి పరదేవి యందుఱు.

ఆ మతమున యోగము ప్రధానము. చక్కఁగాఁ జతుష్షష్టి తంత్రములు పరిశీలించినచోఁ గనఁబడు సారాంశ మిదియొక్కటియే. జితేంద్రియత్వము తత్ఫలము. దానికై పెక్కురీతులఁ బూజావిధులు చెప్పఁబడినవి. ఎన్నివిధములఁ బూచినను దాని సారము శాస్త్రులనఁగా యోగులనునదియే కాని వేఱొకటి కానేకాదు. సత్యము. సత్యము. ఐతే తంత్రవిధులు చాల భీతికరములుగా నున్నవిగదా. హేతువేల? అని యడుగ వచ్చును.

ఏకార్యమునందుఁగాని యధికారిభేదము లుండక మానవు. ఏపూజయందుఁగాని యోగ్యత ననుసరించి భేదము లుండకపోవు. ఏల? అందఱొక్కరీతిఁ గర్మముచేసినవారు కారు. కర్మానుసారము బుద్ధి భేదించు చుండును. అందఱిని దరింపఁ జేయుటయే భగవత్సంకల్పము. కాఁబట్టి పెక్కు దేవత లేర్పడిరి. పెక్కువిధములఁ బూజ లేర్పడియె. ఎవరెవరి యోగ్యత ననుసరించి వారివారి కనుగుణముగా నాపూజయం దావృత్తి కల్గునుఁ కొందఱకు శీఘ్రకాలమునఁ దపస్సు ఫలించును. కొందఱకుఁ జిరకాలమునకుఁ గాని యది ఫలింపదు. మఱికొందఱకు ఫలింపనే ఫలింపదు. ఎవరు పూర్వజన్మమునఁ జక్కని కృషి సల్పియుందురో వారికి మఱుజన్మమున వేగముగా నాతపస్సు ఫలించును. ఎవరు తొలిజన్మమున నత్యల్పకృషి తపస్సునఁ జేసియుందురో వారికి జన్మాంతరమునఁ జిరకాలక్రమమున నది ఫలిం

-చును. ఎవ్వరు పూర్వజన్మమునఁ గృషియేచేయక సంకల్పము మాత్రము చేయుదురో వారికి జన్మాంతరమునఁ దద్విషయమునఁ గృషిచేయు నూహ కలుగునే కాని తత్ఫలము తజ్జన్మమునఁ గలుగదు. మఱొకజన్మమునఁ గల్గును. అంతియకాని ఫలమునకు హేతువులు మంత్రోపదేశము, తంత్రభేదములు కావు. కాఁబట్టి యపసిద్ధాంతములకుఁ జోటు మనసున నీయరాదు. దాన మేలు చేకూరదు. ముక్తి లభింపదు.

శాక్తమున బహువిధ పూజాభేదములు గలవు. ధ్యాన భేదములు కలవు. స్తుతిభేదములు గలవు.అవి వారివారి యోగ్యతకుఁ దగినట్లు లేర్పడినవి. అందును గుణానుసారము పూజలున్నవి. మద్యమాంసములు భగవతికిఁ బ్రియములని చెప్పఁబడినది. అవి క్షత్రియులకొఱ కేర్పడిన తంత్రములు. కావుననే,

బ్రాహ్మణో మదిరాం దత్వా బ్రాహ్మణ్యా దేవహీయతే.

అని కాళీపురాణము తెల్పుచున్నది. సిద్ధాంతములు తంత్రములు క్షత్రియాదుల కేర్పడినవి. శుభాగమపంచకము విప్రులకుఁగా నేర్పడినది. అందు మదిరామాంసముల ప్రస్తావనయు నుండదు. కాఁబట్టి లేనిపోని కుశంకలకుఁ జోటిచ్చి ప్రశ్నింపరాదు. చండియను పేరందఱెఱుంగుదురు. చండియనఁగా లక్ష్మీ సరస్వతీ కాళీ అను దేవతల సమష్టిరూపము. ఇందుఁ జండియనఁగా వైష్ణవులకుఁ గోపమేటికో తెలియరాకున్నది. కాళి యిష్టదేవత కాకున్ననేమి? శ్రీమహాలక్ష్మినిఁ బూజింపవచ్చును. శాక్తమునఁ

గాఁ బ్రకృతి నుపాసించుట యనునదియే గ్రహింపఁదగిన విష యము. మహావిష్ణువు భక్తులకు లక్ష్మీద్వారా వాంఛితార్థముల నొసంగును గాని దానుగా నీయఁడని కదా శ్రీవైష్ణవమతము. దీని భావమేమి? శ్రీమన్నారాయణమూర్తియే పరమాత్మ. లక్ష్మి యే యాయన హృదయేశ్వరి. కావున నామహాదేవి నాశ్రయిం చిన సకలవాంఛలు లభించునని కదా. ఇదిశాక్తము కాదా. శాక్తమను మాట నంగీకరింపకున్న మానె. కృత్యమంతయు నొక్కటియే. కావున శ్రీవైష్ణవులును శాక్తులేకాని వేఱుగాదు. శక్తియనఁగాఁ బార్వతియని యెందువ్రాయఁబడి యున్నదో యూహింపఁ జాలక విచారించుచున్నవాఁడ. ఒకవైష్ణవులేల? సర్వమతములవారును శాక్తులే. విరాట్టువును ధ్యానించు సన కసనందనాదుల మాట వేఱు. కాఁబట్టి శాక్తులనఁగాఁ గుమా ర్గప్రవర్తకులని, హింసకులని తలంచుట మిగులఁ బొరపాటు ఈవిషయము నీగాథయే సిద్ధాంతము చేయుచున్నది. రాధా దేవితో శ్రీకృష్ణపరమాత్మ,

మమాంగాంశ స్వరూపా త్వం మూలప్రకృతి రీశ్వరీ,
శక్త్యా బుద్ధ్యా చ జ్ఞానేన మయా తుల్యా వరాననే.
ఆవయో ర్భేదబుద్ధిం చ యః కరోతి నరాధమః,
తస్య వాసః కాలసూత్రే యావ చ్చంద్రదివాకరౌ.

అని చెప్పెఁగదా. ఇపుడు మూలప్రకృతి రాధాదేవికదా. తత్పూజకులు శాక్తులుకారా. బుద్ధిభేదమున నాగ్రహావశమునఁ

గలిగిన భేదములే మనల బాధించుచున్నవి గాని శాస్త్రములు పురాణములు బాధించుట లేదు. కావున నో మహాశయులారా! ఈ దివ్యగాథనుండి శ్రీకృష్ణపరమాత్మకు రాధాదేవి మేనయత్త యనియు నామెను బత్నిగా గ్రహించె ననియుఁ గావున జారశిఖామణి యనియుఁ గల్గిన యపవాదము మిథ్యయనియు, రాధాదేవి భగవంతుని యర్ధాంగ లక్ష్మియేగాని వసుదేవుని తోఁబుట్టువుగాని నందుని సహోదరిగాని గాదనియు,గోలోకమున వెలయు శ్రీకృష్ణమూర్తి ప్రియభార్యయయి శాపము నిమిత్తముగా భూమి నవతరించె ననియుఁ దెలిసికొనవలయును. చిరకాలము నుండి వినవచ్చు దుర్వాదము కల్పితమే గాని యందు సత్యమే మాత్రము లేదనియు గ్రహింపఁ దగును. లీలాశుకులు నుతించినది యీ రాధామాధవులనే కదా. రాధకు మాధవుఁ డల్లుఁడన్న వాడుక ననుసరించి యెవ్వఁడో కవి,

ఉ. ఆలికి నల్లుఁడై మరల నల్లునకుం దగఁదానె యల్లుఁడై
యాలికి బావయై మనుమ రాలికి ముద్దుకుమారుఁడై సదా
యాలిమఱంది కుఱ్ఱఁడయి యాశ్రిత వత్సలుఁడైన మేటి గో
పాలుఁడు రంగశాయి మనపాల గలండు విచారమేటికిన్.

అని శ్రీకృష్ణమూర్తిని వినుతించెను. ఇది యేమో పెద్ద చమత్కారమని పద్యము చెప్పెనే గాని యిందుఁ బొసంగు దోషముల విచారింపఁ డయ్యె. ఇట్టివెన్నియో ఆధారములుగా రాధకు మాధవుఁ డల్లుఁడన్న వాడుక కలిగినది. ఇంచలి సత్య

మెఱుంగక లోకులు శ్రీకృష్ణుఁడు జారుఁ డందురు. కావున నీది వ్యగాథను జక్కఁగాఁ బఠించిన నాభ్రమ తొలంగును. పరిశుద్ధ శ్రీకృష్ణభక్తి యలవడును. "అతిసర్వత్రవర్జయేత్" అనున్యా యము ననుసరించి యీవిషయము నింతట మెల్లగా వదలి తర్వాతికథను వ్రాయఁ బూనెదను. నా వ్రాసిన యీసిద్ధాంత ములలో నెవరికే నేది యిష్టములేకున్నను వారుదానిపై నాగ్ర హింపకుందురు గాక యని చేతులొగ్గి వేఁడుచున్నాఁడను.

## శ్రీకృష్ణబలరాములు గోవుల మేపుట.

*శ్రీకృష్ణబలరాములు క్రమక్రమముగానిల్లువదలిపోయి యాడుకొనునంత యీడుగల వారలైరి. గోపబాలకులు కృష్ణ బలరాములు తఱచుగా నాడుకొనుచుండు వారు. ఇల్లు దాఁటి పోయినంతనే తలిదండ్రులు పుత్త్రుల వెదకుచుఁ బరుగు వాఱుట మానిరి. యమళార్జున భంజనము కాఁగానే శ్రీకృష్ణాద్భుతచరి త్రము మదికిఁ దోఁచినను భగవన్మాయామోహితులై నందా దులు శ్రీకృష్ణుని మహిమమును మఱచిరి. కేవల పుత్రప్రేమ ముననే చూచుచుండిరి. భాండీరవనమున నందుఁడు కన్నులార రాధాదేవిం గాంచి దివ్యవాక్కుల వినుతించి తత్పాదారవింద సేవను గోరెను గాని మరల గోపాలమూర్తి రాధహస్తము నుండి తనకరముల నలంకరింపఁగనే పూర్వవిజ్ఞానమును మఱచి

* ఈకథ సర్వపురాణములనుండి గ్రహింపఁబడినదని దెలియంగ వలయును.

తనపుత్ర మాత్రుఁడనియే భావించెను. ఇంచుకంతయైనను రాధాదర్శన జ్ఞానము లేకుండెను. కాఁబట్టి గోపాలబాలకు లతో నాడుకొనుచుండు పుత్రునిం గాంచి వేడుక పడుచుం డునే గాని యీబాలుఁడు పరాత్పరుఁ డన్నమాట స్మరింప కయే యుండెను. కాని పరమానందము ననుభవించు చుండెను. పరాత్పరుని సాంగత్య మెన్నటికైన నూరకపోదనుట సిద్ధాం తము. సల్లాపములను, ఆటలను, తనుసంబంధమునను దలిదం డ్రులను మిత్రులను బంధువులను సంతోషపరవశులఁ జేయు చుండెను.

క్రమక్రమముగా గోపాలబాలుఁడు గోపబాలకులం గూడి గోగణముల వెంటఁ దిరుగాడ సాగెను. బంగరుమొల త్రాడు కన్నులపండువు సేయ, పాదములయందు హస్తముల యందును గల యాభరణములందలి చిఱుగజ్జెల కలనిస్వనము మనోహర మగుచుండ గోకులమునఁ దిరుగుచుండెను. ఆమహ నీయ రూపమును జూడ నోచినవారే యదృష్టవంతులని యెల్ల రూహించుచుండిరి. ఆరూపమునే శ్రీలీలాశుకులు శ్రీకృష్ణ కర్ణామృతమున నిట్లు వర్ణించిరి.

శ్లో. హస్తాంఘ్రి నిక్వణిత కంకణ కింకిణీకం
మధ్యే నితంబ మవలంబిత హేమసూత్రమ్,
ముక్తాకలాప ముకులీకృత కాకపక్షం
వందామహే వ్రజచరం వసుదేవభాగ్యమ్. ౨౬ ౨౦ శ్లో.

ఇట్టు లాశ్రీహరి తిరుగుచు బాలకులం గూడి యాడు చుఁ బాడుచు క్రమక్రమముగా గోవులవెంటఁ దిరుగ మొదలు పెట్టెను. శ్రీకృష్ణుని బలభద్రుఁ డెడఁబాయక యుండెను. వీరి ద్దఱు పరస్పరానురాగముగలవా రగుట సహజము కదా. భగవ దనంతులకు భేదము చెప్పువాఁ డెవ్వఁడు? భ్రాతృవాత్స ల్యము ప్రపంచమున కుదాహరణభూతముగ నుండెను. ఇట్టు లాడుకొనుచు సవయస్కులగు గోపాలకబాలకులంగూడి తిరు గుచుండిరి.

కొలఁదిదినము లిట్లు సుఖముగాఁ గాలము జరగెను. యశోదారోహిణీనందులు పరమానందభరితులై యుండిరి. కర్ణాకర్ణికగ నాకర్ణించి దేవకీవసుదేవులును నిర్భరప్రమోద సాగరమున నోలలాడుచుండిరి. నారదాదిమహర్షు లందఱు శ్రీ గోపాలబాలుని దర్శించి తద్విచిత్రచర్యలఁ గాంచి యమానుష చర్యలం గాంచియుఁ బామరు లించుకయైనఁ దెలిసికొనరుగదా. వైష్ణవమాయామహాత్వ మెంతే యనిర్వచనీయమని యబ్బురప డుచుండిరి. సకలబ్రహ్మాండనాయకుఁడయ్యు నాగోకులమున మహావిచిత్రగతులఁ దిరుగుచు నానందించువానిపగిది నటించు చుండెను.

భగవదవతారమున కెన్నియో ప్రయోజనము లుండ వలయుఁగదా. గోకులముననే యుండినఁ గొన్ని కార్యములు చేయవీలుండదనియుఁ, గార్యాంతరమును గల్పించి స్థానాంతర

మున కందలు పోవునట్లు చేయవలయుననియు శ్రీకృష్ణునకుం దోఁచెను. ఆకాలమున బకాసురాదులు బృందావనప్రాంతమునఁ దిరుగుచు సజ్జనుల బాధించుచుండిరి. వారిబాధలం దీర్చినఁ గాని తనరాకకు ఫలముగలుగదని భగవంతునకుఁ దోఁచెను. ఏదే నొకమిషను గల్పించి కార్యము సాగునట్లుచేసి తాను సాక్షిభూతుఁడుగ నుండుట పరమేశ్వరునకు సహజము. కర్మమే వారివారి నాడించుచుండును. పరాత్పరుఁడు సర్వద్రష్ట గావున నూరకుండి చూచుచు నానందస్వరూపుఁడై యుండును. అట్టి సమయ మపుడు తటస్థించెను. తదుచితరీతి మెలఁగసాగెను. ఆవులవెంట గోకులమునకుఁ జెంతనున్న యడవులకుం బోవుటయు, వేళ కందలుంగూడి మరల నింటికివచ్చుటయుఁ దత్కాలమున శ్రీకృష్ణకృత్యములుగ నుండెను. ఇట్లు పరాత్పరుఁడు లీలామానుష వేషమూని కావించు నద్భుతచర్యల తత్త్వ మెఱుంగక గోకులమంతయు సామాన్య శిశువనియే భావించి బాలక్రీడల కానందించుచుండిరి.

**శ్రీకృష్ణబలరాములు గోవులమేపుచుండ వృకములు గోకులమును గలంచుట.**

*ఇవ్విధమున శ్రీకృష్ణబలరాములు గోకులమున శిశుచర్యలఁ గాలముఁ బుచ్చుచు మెలమెల్లన బాల్యమును గడపిరి. కౌమారావస్థఁ బ్రాపించిరి. అప్పటికి శ్రీకృష్ణావతారమున

* ఈకథ హరివంశాంతర్గత విష్ణుపర్వమున నెనిమిదవ యధ్యాయము నుండి గ్రహింపఁబడినది.

నేడుసంవత్సరములు మనుష్యమానమునఁ గడచెను. అత్తరుణ మున నాబలరామశ్రీకృష్ణులు*నీలపీతాంబరములఁ దాల్చిపీతశ్వే తచందనచర్చలం గడునందముగాఁ గనఁబడుచుఁ దమయీడు బాలురతో నాడుచుఁ దత్పాలకులగుచుఁ, గాకపక్షములలర, శ్రుతిసుఖము గల్గినవాద్యముల మ్రోఁగఁజేయుచు, ముఖ తేజస్సులు చూచువారల కచ్చెరువును గల్గింప, గోవులవెంట నడవికిఁ బోవునపు డెంతో వేడుకగా నుండెను. నెమలిపింఛము శ్రుతులవెలయ భుజశిఖరము లొప్పారఁ, బల్లవములఁ దాల్చి, వక్షస్థలముల వనమాల లొప్పుచుండ నాసోదరు లరుగుచుండఁ జిగురుటాకుల విలసిల్లు వృక్షములా యను నూహను జూపరు లకుఁ బుట్టించు చుండిరి. వికసితపంకజముల శిరస్సులం దాల్చి, రజ్జు యజ్ఞోపవీతముల విలసిల్లుచు, ఒకచేతనుట్టి వేఱొకహ స్తమునఁ దుంబపాత్రమును ధరించి, వేణువు లూఁదుచు, నొక్క పుడు నవ్వుచు, వేఱొకతఱి నన్యోన్యవిలాసములఁ దేలుచు, నొక్కతరుణమునఁ జిగురుటాకుల పాన్పుపై నిదుర పవ్వళిం చుచు, వేఱొకసమయమున నిద్రచేఁ గన్నుల మూయుచుఁ, దోడి బాలుర కేమానియు లేకుండఁ గాపాడుచు, నావనమును బ్రకాశింపఁ జేయుచుండిరి. వారిరువురు సింగపుఁ బిల్లలవలె వేడుకమీఱ నాడుచుండిరి.

ఒక్కతఱి నావనమున నావుల మేపుచు శ్రీకృష్ణుఁడు బలరామునిం గాంచి యిట్లు పలికెను. ఆర్యా! ఈమహావన

---

* నీలపీతాంబరధరౌ పీతశ్వేతానులేపనౌ—అని మూలము.

మున మన మీగోపాలబాలకులతోఁ గ్రీడింప నిఁకశక్యము గాదు. మనము చాలదినములుగా నిందు విహరించితిమి. ఇది యిప్రుడు సుఖావహముగ లేదు. ఇందలి తృణకాష్ఠములు క్షీణించినవి. గోపాలకు లెల్లయెడలఁ దిరిగితిరిగి చిఱువృక్షముల నలఁగఁ ద్రొక్కిరి. పచ్చికబయళ్లు మొఱడులచేఁ గన నందము తప్పియున్నవి. వనభూములెల్ల నాకాశమువలెఁ గనుపట్టుచున్నవి. మందలుండు తావులనున్న భూరుహములు పరస్పరసంఘర్షణమున నుదయించిన నగ్నిచే మండిపోవుచున్నవి. వాని చెంతనున్న వృక్షములు పచ్చికయు శుష్కించి నశించుచున్నవి. తృణభూములు నవపల్లవవృక్షములు వెదకినఁగాని గానరావు. కావున నీయరణ్య మిప్రుడు స్వల్పోదకముగను, దృణభూమి విరహితముగను, నిరాశ్రయముగను గనుపట్టెడు. ఇంతియ గాదు. చల్లగాఁ గూరుచుండుతావు లెందుండునా యని వెదకవలసియున్నవి. భయంకరముగఁ గన్పట్టుచున్నవి. కాని సుఖావహముగ లేదు. వృక్షములు దూరదూరముగా న్నవికాని దట్టముగ నడవి నావరించి కానరావు. ఈకాననమును జూడఁగా ఆనందము గలుగుటలేదు. మారుతము కూడ నేత్రమోజనమును గల్పింప కున్నయది. ఇందలి విహంగములు వనాంతరమునకుఁ బోయిన ట్లగపడియెడిని. శూన్యప్రాయమై కానన మిది తోఁచుచున్నది. వ్యంజనాదులు లేని యన్నమువలె హితము గాకున్నయది. ఇందలితరువుల ఖండించి గ్రామములకుం బోయి యాటవికులు కఱ్ఱల నమ్ముచున్నవారు. వనశాకములు నశించి

నవి. తృణములు గోతృప్తినిఁ గల్పింపఁజాలవు. కాన నీఘోషము నగరముపలె నున్నది.

శైలముల కలంకారము ఘోషములు. ఈఘోషముల కలంకారము వనములు. వనముల కలంకారములు గోవులు. మన కాగోవులు పరమగతి. కావున మనకుఁ బ్రాణాధారములుగ నుండు గోవులకుఁ దృప్తిఁగల్గించు వనమొండు కావలయును. మన మీగోవులం దోలుకొని కాననాంతరమునకుం బోవుదము. నవీనగ్రాసము సమృద్ధశీతల జలముగల చోటు మనకు గమ్యము. మనగోవులు మేసినచోట మరల మేయ నిష్టపడకున్నవి. ఈగోవులు నవతృణమును గోరుచున్నట్లు కానవచ్చెడిని. ఇన్నియు నాలోచించి ధనవంతులగు గోపకులు గోధనముం దోలుకొని వేఱొక మంచితావునకుం బోవుటొప్పు. ఈ యడవిలో గృహావరణములు లేవు. భూములులేవు. చక్రవర్తులవలె గోపకులు యథేచ్ఛముగా నెచ్చట గోవులకు మంచియాహారము దొరకునో యందులకుం బోఁదగువారుగదా.

ఇంతియగాక యీగోవులు మూత్రము పోసి పేఁడపెట్టినకారణమున నింపలి గడ్డి క్షారరసముగలదిగాన రుచిగాలేనట్లు తోఁచుచున్నయది. కావుననే గడ్డిమేయక పడియలలోని జలమును ద్రాగక మోరలెత్తి యంబారవములఁ గావించుచుఁ జూచువారలకుఁ దమభావములఁ దెల్పుచున్నయవి. చక్కఁబెట్టినట్లున్న మార్గములు గలిగి క్రొత్తఁగా వనరాజులు గనఁబ

డఁగా నందుల మనము గోపులవెంటఁ జరింతము. కావున నీగోపకులఁ బయనమునఁ గాయత్తపఱపుము. సమీపమునందే సకలవిధ తృణసంకులమై రమ్యతమమై స్వాదుఫల వృక్షనిబిడంబై, పానార్హోదకమై బృందావనము చెలువారుచున్నయట్లు వినవచ్చెడిని. ఈలపురుగులు లేక కంటకద్రుమములు కానరాక వనగుణముల నలరారుచు, ననేకకదంబవృక్షము లొప్పుచుండ యమునాతీరమునఁ జూడఁజూడ వేడుకల నిచ్చుచుఁ, జల్లని గాలివీవ సర్వర్తునిలయమై శుభముల కావాసమై, గోపికలకు సుఖసంచార మొనర్పఁదగి, మనోహర చిత్రోపవనములు నడుమనడుమ కనుపట్టుచుండ బృందావనము సాటిలేకయున్న యట్లు నేనాకర్ణించితిని.

ఆబృందావనమునకుఁ జెంతనే గోవర్ధన మహీధర మున్నదఁట. అది విశాలోన్నత శృంగసంఘ విరాజితమఁట. నందనవనము చెంత మందరాద్రియుండునట్లు గోవర్ధనము వెలయునని పెద్దలుపలుకుదురు. దాని నడుమ యోజనమాత్రోచ్ఛ్రితమై మఱ్ఱివృక్ష మొక్కఁడు విచిత్రరీతి నుండునఁట. దానిపేరు భాండీర మఁట. ఆకాశమున నీలమేఘమువలె నాపర్వతోపరి భాగమున నదియుండునఁట. ఆపర్వతమునకు బృందావనమునకు నడుమ యమునానది సీమంతమువలెఁ గనఁబడుచుఁ బ్రవహించుచుండ నందనవనమున దివ్యసరస్సు స్మృతిగోచర మగునఁట. ఆగోవర్ధన పర్వతమును, భాండీర వనస్పతిని, రమ్యతమ విశ్వా

లింగాంచిన యమునానదిని గన్నుల పండువుగాఁ జూచుచు సుఖముగఁ దిరుగుదము. అందు మనగోపకుల కావాసమును గల్పింపుము. నిర్గుణమగు నీవనమున నివాసము మాన్పింపుము. ఇట నుండి వేఱొకతావునకుఁ బ్రయాణముసేయుట కొకకారణమును గల్పించి భీతిని బుట్టింతము.

అని యీరీతి నా వారిజాక్షుఁడు శ్రీహరి యగ్రజుని తోఁ బలుకునంతలో శ్రీవాసుదేవుని యిచ్ఛామాత్రమున రక్తమాంస వసాశనములగు వృకములు శతసహస్రసంఖ్యలు వెలువడెను. వాని వెండ్రుకలు భయమును గల్గించునవి కాఁగా నాతోఁడేలువులు వందలువందలుగాఁ జుట్టుకొనియెను. గోపాలకుల యావాసములపై నొక్కుమ్మడిగఁ బడి చీకాకుపఱచెను. వృకములు చుట్టుకొనఁగా మందలయందును, గొల్లపల్లియలందు, గోపకులయందు, గోపికలయందు నొక్కసారి హాహాకారము తోఁచెను. అవి యైదుగాఁ, బదులుగా, నిరువదిగా, ముప్పదులుగా, వందలుగాఁగూడి, శ్రీవత్సకృత లక్షణములతో బయలువెడలెను. కృష్ణవదనములై గోపాలకులకు భయమును గల్గించుచు, వత్సముల భక్షించుచు, గోపికల భయపెట్టుచు, రాత్రులయందు బాలకుల హరించుచు, వ్రజమెల్లఁ జీకాకుపడఁ జరించెను.

అత్తఱి గోపకు లడవికిం బోఁజాలక, గోవులరక్షించు శక్తిలేక, వనమునుండి యేపదార్థమునైనఁ దెచ్చుకొను శక్తి

లేక, నదినిదాఁట వీలులేక, భీతిల్లి, యుద్విగ్నచిత్తులై యవ్వ నంబున నుండఁజాల కుండిరి. పెద్దపులులవలెఁ బరాక్రమించు నావృకములచే వ్రజమెల్లఁ. గదలమెదల వీలులేక యుండినది. అప్పటిదానిస్థితి యొకయంగుళమాత్రమైనఁ గదలలేక యుండి నట్టి దయ్యెను.

ఆర్యులారా! ఈగాథను వింటిరిగదా. భగవంతుని లీల యెట్టిదో తెలిసికొన నశక్యమని దీనిచేఁ దేటపడియెఁ గదా. కర్తు మకర్తు మన్యథాకర్తుం సమర్థుఁడు భగవంతుఁడని మనము నమ్మవలసినదియేకదా.

"ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిః"

అనున్యాయముకలదుకదా. క్షణమాత్రమున బ్రహ్మాండ ములనిర్మించి క్షణార్థమున నడఁగించు సర్వశక్తిమంతున కీసృష్టి యొక్క లెక్కయా. బృందావనమునకు గోకులమును లేవదీయ సంకల్పించెనని ముందువ్రాసితిని. దానికీగాథ యాధారమని విశ్వసింపుఁడు. ఏక్షణమున భగవంతుఁడు గోలోకమును వద లెనో అవల నొకక్షణమైన వృథయుండుట యాతని కిష్టము కాదు. గోకులమున నుండుపని పూర్తియైనది. అందుండి పూత నాదులకు ముక్తినొసంగెను. బాలక్రీడల గోపికాగోపకుల రంజిల్లఁజేసెను. తనసర్వేశ్వరత్వము వెలిపుచ్చెను. అంతలో ముందుగాఁదగుకార్యములకు భంగము వాటిల్లునని వెంటనే మాయాసంవృతులనుగా నొనరించెను. ఇఁక బృందావనమునకుఁ

బోయినఁగాని యందున్న బకాద్యసురుల నడంప వీలు లేదని యూహించెను. వారు ప్రచ్ఛన్నాకారముల నందందుఁ దిరుగుచు సజ్జనుల హింసించుచుండిరి. వారి నాయాయిసమయముల నడంచుటయే కృత్యమని పరాత్పరుఁడు తలంచెను. అందులకుఁ దగుప్రయత్నములఁ దాఁజేయఁగూడదని యెంచి యద్దినెఱవేఱుదగుచమత్కృతులఁ జేయఁదలంచెను. సృష్టిచమత్కృతి యిట్టిదని వచింప నెవ్వరికి నలవిగాదు. దానిమహిమ మాపరాత్పరునకే తెలియును. ప్రకృతిపరిణామ మాపరమాత్మ తప్ప నెవ్వ రెఱుంగఁజాలుదురు? దాని మహిమ మెఱింగి సంతోషింప నింక నెవరికి శక్యము?

బలరామునితో మాటలాడుచు నిజాభిప్రాయమును దెలియఁజేయుచు నంతలో నిచ్ఛామాత్రమున మున్నెన్నఁ డే నెఱుంగని వృకములుపుట్టి గోకులమును నిలువనీకలేకుండఁ జేయవలయునని సంకల్పించెను ఉత్తరక్షణముననే నేల యీనినట్లు వృకములు వెలువడి భయంకరరూపముల గోపాలకులకు భీతిపుట్టించెను. ఇఁక క్షణమైన నిట నుండఁజాలమని వారు తలంచిరి. శ్రీకృష్ణబలరాముల ప్రోత్సాహము వాగ్రూపముగా లేకయే యెప్పుడెప్పు డీబాధనుండి తప్పించుకొందుమా యని గోపాలకు లూహింపఁ గారణమును గల్పించెను. దైవప్రయత్న మెంతగొప్పదో దీన స్పష్టమాయెఁగదా.

మనమే సకలకార్యదక్షులమని విఱ్ఱవీఁగుట తెలివితక్కువచే ననియు, మన మేకార్యముచేయ సమర్థులము కామనియు

నుత్తరక్షణమున నేమిజరగునో మన మెఱుంగఁజాలమనియు, నింతమాత్ర మెఱుంగని మనము సమర్థులమని ప్రల్లదములాడుట మహాపాపకార్యమనియు గ్రహించి గర్వమునకుఁ జోటుంచక భగవంతుని నమ్మి నీపాదసేవ ప్రసాదింపవే కరుణానిధీ! యని ప్రార్థించుచు, నిష్కపటభక్తిగలిగి, పరవంచనముచేయక, లేని శక్తులఁ దనయం దారోపించుకొనక భగవత్పాదారవిందధ్యానమునఁ గాలముగడపుచుండుటయే యుత్తమమార్గము. అంత కన్న నిట్లుమీఁగి సాధించుపురుషార్థముకూడ లేదుగాని దాన నధోగతిమాత్రముతప్పదు. కావున శ్రీమన్నారాయణచరణారవిందచింతనమునఁ దప్పఁ గృతార్థులమగుటకు మార్గము వేఱొకటి కానరాదు. ఇంతట నీవిషయమును వదలి తరువాత శ్రీకృష్ణమూర్తి యొనరించు నద్భుతచర్యలం బఠింపఁ బ్రయత్నింతము.

### శ్రీకృష్ణమూర్తి బకాసురునివధించుట.

* గోకులమంతయు స్థలాంతరజిగమిషనుండునంతలో శ్రీకృష్ణమూర్తి బలరాముని గోపకులంగూడి గోధనమునుదోలు కొని శ్రీవనమునకుం బోయెను. అందు హాయిగాఁ గూరుచుండి చల్దు లారగించుచు, మధురశీతలజలంబులం ద్రాగుచు, బాలకులం గూడియాడుచు, బహువిధవినోదములఁ గాలముపుచ్చు

* ఈగాథ శ్రీకృష్ణజన్మఖండము పదునాఱవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

ఘుండెను. అందు నిచ్ఛానుసారము విహరించి దాని చెంతనుండు మధువనమునకుం బోవుదమని గోపకుల హెచ్చరించి యాల మందమరలించి మధువనములకుం బోయెను.

ఆవనమున నొకదానవుఁడు సజ్జనుల కపకారముచేయుచుఁ బ్రచ్ఛన్నరూపంబుననుండి మోసపుచ్చి యెందఱినో మ్రందఁ జేయుచుండెను. ఆవిషయము భగవంతునకు స్మృతిపథమునఁ బడియెను. కావునఁ గార్యాంతరమూని యటఁ బోవ సమకట్టెను. ఆదైత్యునకుఁ గాలము సమీపించెను. కాలము సమీపించు వఱకు నెవ్వరును ఏమియుఁ జేయఁజాలరు. భగవంతున కట్టిశక్తి లేదా యనఁగూడదు. ఆసిద్ధాంతముకూడ భగవదాజ్ఞయే. కావున నవ్యాహతముగ శ్రీహరి యొక కార్యము చేయఁ బూనునా. శ్రుతులు స్మృతులు భగవదాజ్ఞారూపములే. కాని స్వతంత్రములు గావు.

"శ్రుతి స్మృతీ మమై వాజ్ఞే యస్తే ఉల్లంఘ్య వర్తతే."

అనువాక్యము పెద్ద లెఱుంగనిదియా. కావున నాదానవునకు మనుష్యలోకనివాసమున కవకాశ మింకలేదని భగవంతునకుఁ దోఁచెను. కావుననే శ్రీవనమునుండి మధువనమునకుం బోయెను. ఎందుల కీప్రయాణమని యం దెవ్వ రెఱుంగరు. బలరాముఁడు దెలియనట్లు నటించువాఁడు.

ఇట్లు మధువనమును బ్రవేశించి సుస్వాదుజలమును ద్రావి స్వేచ్ఛగా వారింగూడి తిరుగుచుండెను. అందొక్క

రక్కసుఁడు మిగుల బలవంతుఁడుండెను. వాఁడు శ్వేతవర్ణుఁడు. సకలభూతభయంకరుఁడు. వికృతాకారవదనుఁడు. పర్వతతుల్య గాత్రుఁడు. బకవత్పరిదృశ్యమానుఁడు. ఆకారమునుబట్టియే బకాసురుఁడని ప్రఖ్యాతినొందెను. ఆదానవుఁడు గోపకులతో నలరారు బలరామకృష్ణులం గాంచెను. గోకులమున బలరామానుజుండై యున్నవాఁ డీకృష్ణమూర్తియేకదా. ఈతనిం జంపక విడువరాదని తలంచెను. కాని తనశక్తికిమించిన శక్తి కలవాఁడా కాఁడా యని యోజింపఁడయ్యెను.

అంతలో నాదానవుండు మిక్కుటమగురోషంబున మేనుఁబెంచి యగస్త్యముని వాతాపిని మ్రింగినట్లు శ్రీకృష్ణమూర్తిని గుటుక్కున మ్రింగెను. బకాసురుఁడు భగవంతుని మ్రింగగనే శ్రీకృష్ణుఁడు కనఁబడమికిఁ జింతించి భయాన్వితులై దేవతలు మింట హాహాకారము లొనరించిరి. త్వరపడి తమతమ యాయుధముల ధరించి రక్షింపఁ బరువెత్తిరి. అంత శతమఖుఁడు దధీచిమునివరతనుభవమయి యప్రతిహతతేజమున నలరారు వజ్రమును బకాసురునిపైఁ బ్రయోగించెను. దాన నాతఁడు మృతినొందఁడయ్యెఁగాని యప్రతిహతమని పేరుఁగాంచినది కాన నాబకాంగసంభూతైకపక్షమునుమాత్రము దహింపఁజాలెను. చంద్రుఁ డంతలోఁ ద్వరపడి నీహారాస్త్రమును బ్రయోగించెను, దాన నాదైత్యుఁడు శీతార్తుఁడయ్యెఁగాని పౌరుషమున డిందుపడఁడయ్యెను. యముఁడు క్రుద్ధుఁడై దండమును

ప్రయోగించెను. దాన నించుక దానవుఁడు కుందుపొందెను. వాయువంతట వాయవ్యాస్త్రమును ప్రయోగించెనుగాని దాన నించుక స్థానాంతరమున కరుగఁజాలెనుగాని మృతినొందఁ డయ్యెను. వరుణుఁడు శిలావృష్టి దానవుపయిం గురిపించెను. దాన నించుక పీడితుఁడయ్యెను. హుతవహుఁడు స్వీయాస్త్ర మున నతనియొఁకలఁ గాల్చెను. కుబేరుఁ డాగ్రహించి యర్థ చంద్రాకారబాణమును వైచెను. దానఁ బాదములు తెగిరయె. ఈశానుఁడు శూలముం ప్రయోగించెను. దాన నాతఁడు మూర్ఛిల్లెను. ఋషులును, మునులును శ్రీకృష్ణమూర్తికి బాధ గలుగఁగూడదని యాశీర్వదించిరి.

ఇట్లు దిక్పాలకు లెనమండ్రుగురు మహర్షులు నశానులు తమతమశక్తి నుపయోగించి యాదైత్యునిం జంపఁజూచిరిగాని వాఁడు శ్రీహరిచేఁ జావవలసినవాఁడుగాన వారిశక్తి వ్యర్థ యయ్యె. ఇంతలో శ్రీకృష్ణపరమాత్మ ప్రజ్వలద్బ్రహ్మతేజస్సు చే నాదైత్యుని సర్వాంగమును బాహ్యాభ్యంతరమును దహించెను. దానవుఁ డంతట శ్రీకృష్ణుని వెడలఁగ్రక్కుచుఁ బ్రాణ ములవదలెను. తద్దేహము శ్రీకృష్ణబ్రహ్మతేజమున భస్మ మయ్యెను. ఇట్లు బకదానవుంజంపి శ్రీహరి బాలకులం గూడి గోధనములవెంట నామధువనముననుండి మనోహరదర్శనంబగు కదంబాటవిం జొచ్చెను.

కథాసారము.

మహాశయులారా! కర్మసిద్ధాంత మిందుఁ జక్కఁగాఁ

గానఁబడును. ప్రాణులెల్ల స్వస్వకర్మానుసారము రూపములఁ దాల్తురు. ఎవ్వరి కేరీతి మరణము వాటిల్లవలయునని విధియుండునో దానికి విరుద్ధముగా నెవ్వరెవ్వ రెట్టిరెట్టిప్రయత్నము లొనరించినను ఫలింపవు. కాఁబట్టియేకదా?

హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి,
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం న శక్యతే.

అన్నసూక్తి జగత్ప్రసిద్ధిఁ గాంచినది. ఎవనివలన నేపని కావలయునో దాని నాచోటికి కావిధియే యీడ్చుకొనిపోవును. పామరులు తెలియకయే యచ్చోటికిం బోవుదురు. భగవంతుఁడు సర్వజ్ఞుఁడుకానఁ దానే కారణమును గల్పించుకొనిపోవును. బకాసురుని దిక్పాలకుల దివ్యాస్త్రములు చంపఁజాలక పోయినవి. ఏల? శక్తిలేనివికావు కదా అన్న వానిచేఁ జావకుండ భగవదాజ్ఞగలదు. భగవంతు నాజ్ఞ మీఱి యేదియుఁ బ్రవర్తింపఁజాలదుకదా. కాఁబట్టి కర్మమే బలవత్తరమైనది. దానిని మించినబలము గలదేదియు బ్రహ్మాండమునలేదు. కావున సకలబ్రహ్మాండాంతర్గత ప్రాణికోటులు కర్మనిబద్ధములుగాని వేఱుగావు. ఆకర్మమే త్రాడుగట్టి యీప్రాణుల నాడించుచుండును. ఈనాటకమున కర్మస్వరూపుఁడగు భగవంతుఁడే సూత్రధారుఁడు, చర్మనిర్మితములగు బొమ్మలవలె మనల నాడించుచుండును. అదియే భగవద్విలాసము. ఆవిధమెఱుంగక మనము కర్తృత్వమును మనయందారోపించుకొని విఱ్ఱవీఁగుచుందుము-

భగవంతుఁడు బకాసురుఁడుకలఁడని యెఱింగెనుగదా. వెంటనే వానింబొలిగ్రుంపక తా వానిచే మ్రింగఁబడనేల యనుప్రశ్నము రావచ్చును. సమాధాన మీవిధముగాఁ జెప్ప వచ్చును. బకాసురుఁడు కనఁబడఁగనే శ్రీహరి వధించి యేయుం డిన నిరపరాధిని వధించెనన్న యపకీర్తికిం బాత్రుఁడగును. భగ వచ్చర్యలు లోకదృష్టాంతభూతములుగాని దోషలేశముగల విగా నుండఁదగవు కాన వానిచే మ్రింగఁబడెను. భగవంతుని మ్రింగువాఁ డొకఁడుండునా అనకుఁడు. కారణము లేక కార్యము పుట్టఁగూడదు. ఇంతియగాదు. వేఱొకఫలముగలదు. అదియే మనము నేర్చుకోఁదగినది. ఆపత్కాలమునఁ దన్నుఁదాఁ గా పాడుకొనవలయునేగాని యితరులు కాపాడఁజాలరు, అన్న సూక్తి జగద్విఖ్యాతము. శ్రీకృష్ణుని బకాసురుఁడు మ్రింగెను. దేవతలాయుధములఁ బ్రయోగించిరిగాని చెంతకువచ్చి దానిని నఱకి శ్రీహరిని బ్రదికింపఁబూనినవారు లేదు. పిట్టిపోటి మును లాశీ ర్వదించిరి. ఎచ్చటనుండి? ఆకాశమునందునిలిచియే. చెంతనున్న బలరాముఁడుగాని గోపబాలకులుగాని రక్షింపఁ బ్రయత్నించి నారా? లేదుకదా. శ్రీకృష్ణుఁడు లోకసామాన్యుఁడైయున్న మాఱు మాటాడక మ్రందవలసినదియేకదా. ఎవ్వరిసహాయముగాని ఆప త్కాలమునఁ బనికిరాదు. తన్ను రక్షింపఁబూనునది తాఁజేసి కొన్నధర్మము. ఆధర్మముకూడ విధిగతిని మారలింపఁజాలదు. విధిగతి ననుసరించి కాపాడవీలున్నఁ గాపాడును. అవకాశము లేనిచోఁ గాపాడఁజాలదు. ఇట్లనుటచే ధర్మము వ్యర్థమని

కాదు. పురాకృతకర్మము దృఢమూలమేర్పైన దానిననుభవించియేతీఱవలయునుగాని యూరక మాన్పరాదు. కావున నట్టితఱి ధర్మమును దూఱిన లాభమేమి? ఈ రెండు భగవదాజ్ఞాబద్ధము లేకదా. అట్టులౌట కీధర్మము ఆపత్తులనన్నింటిని బాపఁజాలదు.

ఇప్పట్టున నొకకథ స్మృతికిఁ దగులుచున్నయది. శ్రీమహాభారతమునఁ గర్ణుఁడు విజయునితోఁబోరాడుచు శాపవశమునఁ దనరథచక్రము భూమిలో డిగఁగా నిట్లు పలికెను.

శ్లో. అమృష్యమాణో వ్యసనానితాని
హస్తౌ విధున్వన్ సవిగర్హమాణః. ౯౧
ధర్మప్రధానం కిల పాతి ధర్మ
ఇత్యబ్రువన్ ధర్మవిద స్సదైవ,
వయం చ ధర్మే ప్రయతా మనిత్యం
యథాబలం శక్తియథాశ్రుతంచ. ౯౨
స చాపి నిఘ్నాతి నపాతి భక్తాన్
మన్యేన నిత్యం పరిపాతిధర్మః
ఏవం బ్రువన్ ప్రస్థలితాశ్వసూతో
విచాల్యమానోఽర్జునబాణపాతైః. ౯౧ అధ్యాయము.

వీనికర్థమును వ్రాయుటకన్న శ్రీకవిబ్రహ్మయగు తిక్కన సోమయాజిగారిపద్యముల వ్రాయుట మేలని యట్లొనరించు వాఁడ.

వ. తనమనంబున నొవ్వడరి యక్కర్ణుండు కరంబులు విదుర్చుచు.

తే. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన
చిత్తులగువారిఁ బూని రక్షించుధర్మ
మందు రదిబొంకు గావించె నతులధర్మ
శీలుఁడగు నన్ను ధర్మువు సెలవులేద.

ఇదియే పైఁబద్యముల సారము.

ఇట్టు లొకానొకప్పుడు ధర్మమురక్షింప వీలులేకున్నను వానిని దూలనాడరాదు. అంతకంటె నెక్కుడగుబంధువు లోకమున లేఁడు. కాఁబట్టి దేవత లెన్ని ప్రయత్నములు దూరమునుండియే చేసిరి. అవన్నియు నిష్ఫలములు కావు. శక్తి కనురూపముగ సాయముచేసినవి. ఆత్మశక్తియే భగవంతునిఁ గాపాడినది. కాఁబట్టి యేకాలమునఁగాని స్వశక్తినే నమ్మియుండవలయునుగాని పరుల నమ్మియుండరాదు.

ఇట్లు భగవంతుఁడు బకాసురుం బొలియించి వానికక్షయసుఖమును బ్రసాదించెను. శ్రీకృష్ణుఁ డవతరించి దుష్టరాక్షసబాధనుండి మ మ్ముద్ధరించునాయని మొఱ్ఱయిడుచున్న సజ్జనులయార్తి కొంతతొలఁగెను. సకలదుష్కృతములు తొలంగ నా రాక్షసత్వముపోవ వాఁడు శాశ్వతపుణ్యలోకసుఖ మొందెను. ఇదియే భగదవతారఫలము.

## వృషభాసురుఁడు మృతినొందుట.

* ఇట్లు బకాసురుఁడు హతుఁడుకాఁగానే గోపాలబా

---

* ఈకథయుం శ్రీకృష్ణజన్మఖండము పదునాఱవయధ్యాయమునుండియే గ్రహింపఁబడినది.

లురు సంతసించిరి. ఇంద్రాదులు భగవన్మహిమమును గొనియాడిరి. మహర్షు లచింత్యశక్తి యగుపరాత్పరుని ధ్యానించిరి. అంత నాగోపాలకృష్ణుఁడు కదంబారణ్యమును ప్రవేశించెను. అందొకదానవుఁడు వృషభరూపంబుననుండి మానవుల బాధించుచుండెను. వానికిని గాలము సమీపించినట్లు శ్రీకృష్ణుఁ డెఱింగెను. వానిపేరు ప్రలంబాసురుఁడు. వాఁడు మహాబలవంతుఁడు. అంతియకాక ధూర్తుఁడు. పర్వతాకారుఁడు. ఆవనమున వానిబాధ మెండుగనుండెను. వృషభరూపంబున వాఁ డుండుట నెందఱో వానిం గనుంగొనఁజాలక మోసపోవుచుండిరి. చెంతకుఁబోఁగానే కొమ్ములఁగ్రుమ్మిచంపుట ఆతనివాడుక.

ఆరక్కసుఁడు మిక్కిలి కోపమూని బకాసురుం జంపుట మఱింత క్రుద్ధునిగాఁ దనుంజేయఁగాఁ బైఁగవిసి పర్వతశృంగములం గేలిచేయుశృంగములం గ్రుమ్మి కృష్ణమూర్తిని పైకెత్తెను. అంతట నూరకుండక కుమ్మరిసారెవలెఁ ద్రిప్పెను. ఆవిధముం గాంచి తోడిబాలురు భీతిల్లి పరుగెత్తిరి. దూరమున నిలువంబడి మొఱ్ఱోయని యేడ్చుచుఁ గేకలిడిరి. *బలరాముఁడు సోదరుఁడు భగవంతుఁడని యెఱుంగునుగాన నవ్వెను. వానిబలము నెఱుంగును. భగవంతునిబలము నెఱుంగును. కావున నీమూర్ఖుఁడు ముందున్నవాఁడు భగవంతుఁడని యెఱుంగక సామాన్యమాన

* బలాజ్జవాస బలవాన్ జ్ఞాత్వా సోదరమీశ్వరమ్–అనిమూలము.

వునివలెఁ జంపఁ జూచుచున్నవాఁ డెంతమూర్ఖుఁడని తలంచి పక్కున నవ్వెను. అంతతో నూరకుండక గోపబాలకులంగాంచి యేలభయంపడితిరి? భయమున కవకాశ మేమిగలిగెనని ప్రశ్నించెను.

ఇట్లు మాటలాడుచు బలరాముఁడు గోపాలబాలకుల భీతిఁ బాపుచుండఁగా శ్రీమధుసూదనుఁ డద్దానవునిఁదృణముగా భావించి వానికొమ్ముల గట్టిగాఁబట్టుకొని గిరగిరఁద్రిప్పి ఆకసమున కెగురవైచెను. కొంతదూరము మీఁదికింబోయి యొక్క-మాఱు క్రిందఁబడియెను. భూమిమీఁదఁబడఁగనే ఆ దేహమును వదలి ప్రాణపంచక మెచ్చటికో పోయెను. వానిచావుఁగాంచిన బాలకులు పక్కున నొక్క-సారి నవ్విరి. ఆడిరి. పాడిరి. కోయని యార్చిరి. సంతసమునఁ బాడిరి. వేణువు లూదిరి. ఇట్లు శ్రీకృష్ణమూర్తి ప్రలంబాసురుం బొలియించి బలరామునింగూడి తోడిబాలురంగూడి గోధనమును మరలించి వేగముగా భాండీరవనమునకుం బోయెను.

### కథావిశేషములు.

పాఠకులారా! ఇందలివిశేష మొక్క-టియే. బలరాముఁ డవతారపురుషుఁడైనచోఁ దనసామర్థ్య మెఱుఁగకుండునాయని యు నట్టివిధ మాతనిచర్యవలన నగపడు కాన నంశావతారమనియుఁ గొందఱు వచింతురు. అది మిగులఁ బొరపాటు. బలరాముఁడు దశావతారముల నెనిమిదవయవతారమని పరిగణింపఁ

బడు ననంతుఁడే. అనంతుఁ డనఁగా భగవత్పర్యంకభూతమగు నాదిశేషువని కొందఱు తలంతురు. అనంతుఁ డనఁగా భగవంతుఁడే యని యెఱుంగుట న్యాయ్యము.

'బలోజహాస బలవాన్ జ్ఞాత్వా భ్రాతర మీశ్వరమ్.'

అనువాక్యముంజూచిన విభ్రాంతి తొలంగును. సోదరు నీశ్వరునిగా భావించుట సర్వజ్ఞత్వమునఁగాక వేఱొండు హేతువున నగునా? ఎవ్వ రెవ్వరు శ్రీకృష్ణునిచేతను, ఎవ్వ రెవ్వరు తనచేతను మృతినొందఁదగుదురో బలరాముఁ డెఱుంగును. కావుననే యిపుడు భయపడ నవకాశమేమని ప్రశ్నించెను. ఈతుచ్ఛదానవునిచేఁ బరమేశ్వరునకు బాధకల్గునా యని యూహింపఁజాలరుగదా యనినవ్వెను. కాఁబట్టి బలరాముఁడు తెలియనట్లుండుట తన యపరస్వరూపము కార్యక్షమమగుచుండఁ బానేటికి మరలఁ బ్రయత్నించుట యనియేగాని వేఱుగాదని మనము గ్రహింపవలయును.

### శ్రీకృష్ణమూర్తి కేశిదైత్యుం బొలియించుట.

* శ్రీకృష్ణమూర్తి బలదేవగోపబాలకులంగూడి గోవుల వెంట భాండీరవనముం బ్రవేశించి తిరుగుచుండఁగా నందున్న కేశిదానవుఁడు మిగులగర్వించి తన్నుఁదానెఱుంగక మార్కొనియెను. వాఁడు ఘోటకాకారంబున నుండువాఁడు. ఆరూపము

* ఈకథయుఁ బదునాఱవయధ్యాయమునుండియే గ్రహింపఁబడినదని గ్రహింపఁదగును.

వాని కిష్టమైనది. కావున నారూపంబున నందుండువాఁడు. ఎం దఱినో హింసించువాఁడు. కావున శ్రీహరిని పై కెగిరి పట్టరా నియాగ్రహామునఁ గఱచెను భగవంతునిమృదు దేహ మప్పుడు వజ్రకఠినమయ్యెను. కాన నాదేహమును గఱవఁగనే దంతములు భగ్నములయ్యెను. అంతట శ్రీకృష్ణమూర్తి యాగ్రహదృష్టిం గాంచెను. ఆ తేజస్సుచే దహింపఁబడి వాఁడు పరలోకమునకుం బోయెను. అతనిచావుం గాంచి దేవతలు దుందుభులమ్రోయిం చిరి. పూలవాన భగవంతునిపైఁ గురియించిరి.

అంతట శ్రీవిష్ణుకింకరులగు పార్షదులు దివ్యరూపముల నలరారుచు నద్భుతదర్శనులై రథారూఢులై ద్విభుజములొప్పఁ బీతవస్త్రములఁ దాల్చి కిరీటకుండలమండితులై వనమాలావిభూ షితవక్షులై, వినోదమురళీహస్తులై, క్వణన్మంజీరరంజితపదులై, శ్రీచందనోక్షితసర్వాంగులై, దివ్యతమగోపవేషధారులై, ఇం చుకహాస్యమునఁ బ్రసన్నములగుమోము లొప్పుచుండ, భక్తా నుగ్రహకాతరులగుచు, నతిశయతేజోవిరాజమాన స్యందన మును గైకొని ప్రత్యక్షమైరి. ఆరథము నానారత్నవిరాజితమై చూడఁజూడఁ వేడుకగా నుండెను.

ఇట్లు వారు భాండీరవనమును బ్రవేశించిరి. అందే శ్రీమ న్నారాయణమూర్తి గోపబాలురం గూడియుండెను. ఆపార్ష దులు దివ్యవస్త్రములందాల్చి రత్నాలంకారములఁదాల్చి శ్రీహ రిపాదారవిందములకు నమస్కరించి నుతించి గోలోకమునకు

భగవదాజ్ఞనొంది పోయిరి. వారింగూడి యారాక్షసులు ముప్వురు దేహములవదలి వైష్ణవరూపములధరించి కారణాంతరమున దానవులై భగవంతునిచే వధింపఁబడి శ్రీకృష్ణపార్షదులనఁ బరిగణింపఁబడుచు సంతోషమున గోలోకమునకుం బోయిరి.

అని నారాయణమూర్తి తెలుప నారదుం డిట్లు ప్రశ్నించెను. మహానుభావా! నారాయణా! దానవరూపములఁదాల్చి నవైష్ణవులగు నాదివ్యపురుషు లెవ్వరు? ఇది పరమాద్భుతవృత్తాంతము. విన వేడుకయ్యెడు. ఎఱింగింపవే యని ప్రార్థింప నారాయణమూర్తి యిట్లు బదులు చెప్పెను. బ్రహ్మావతాసీ! నారదా! పురాతనేతిహాసమును దెలుపువాఁడ. ఆలకింపుము. అది పరమాద్భుతము. ఆయితిహాసము విచిత్రము. పుష్కరతీర్థమున సూర్యగ్రహణపర్వమున మహాదేవునిచే నెఱిఁగింపఁబడినది. ఆసుసమయమున శ్రీహరిగుణప్రశంసము రాఁగా శంకరుఁడెఱిఁగించెను. ఆతరుణమున నేనును ధర్ముఁడు బ్రహ్మాయు ముని సంఘములందుంటిమి. త్రిభువనపావనమగు నాకథారత్నము నాలకింపుము. అది సంగ్రహముగఁ జెప్పఁబడక విస్తరించి శంకరునిచేఁ జెప్పఁబడినది.

### బకప్రలంబకేశిరాక్షసుల పూర్వజన్మవృత్తాంతము.

గంధమాదనపర్వతమునఁ బూర్వము గంధర్వాధిపతి యగు గంధవాహుఁడు వసించుచుండెను. ఆతఁడు మునిప్రవ

రుఁడు హరిపాదసేవాపరాయణుఁడు. ఆతనికి నలువురుకొడు కులు గంధర్వప్రవరులు గల్గిరి. వారెల్ల శ్రీకృష్ణపాదారవింద ముల జ్ఞానమునందును, స్వప్నమందును, దివానిశము స్మరించు చుండిరి. ఆనల్వురు దుర్వాసుఁడను మహామునిశిష్యులు. శ్రీకృ ష్ణపూజాతత్పరులు. వారు ప్రతిదినము కమలముల భగవంతుం బూజించి ఆవల జలపానముచేయువారు. వసుదేవుఁడు, సుహో త్రుఁడు, సుదర్శనుఁడు, సుపార్శ్వకుఁడు అని వారిపేరులు. ఆనల్వురు విష్ణుభక్తాగ్రేసరులును బుష్కరతీరమున నతిశయనిష్ఠ దపం బొనరించిరి. ఆతపము చిరకాలముసాగెను. సిద్ధిఁగాంచిరి. అందు జ్యేష్ఠుఁడు దుర్వాసునింగూడి యోగవిద్యాపారగుండై తపస్సంసిద్ధిఁగాంచి వివాహముచేసికొనకయే బ్రహ్మవర్చస్సుచేఁ బ్రజ్వలించుచు యోగాభ్యాసనిరతుఁడై యుండెను. కొంతకా లమునకు దేహమునువదలి శ్రీకృష్ణపార్షదుండయ్యెను.

తక్కుంగలమూవురుసు బుష్కరతీరమును వదలి చిత్ర సరోవరమును జేరిరి. ఆసరోవరంబునఁగల దివ్యకమలములను శ్రీకృష్ణపూజానిమిత్తముభయకాలమునఁ గోసికొని విష్ణుభక్తు లయి కొనిపోవుచుండువారు. శంకరకింకరులు వారినడ్డగించి వాని లాగికొనిరి. వారు దుర్బలులు. కింకరులు బలవంతులు. కావున సరసిజముల నపహరించి వారిం దోడ్కొని శంకరుస న్నిధికిం బోయిరి. శంకరునిదర్శించి సాష్టాంగనమస్కారము లొనరించిరి.

వారింజూచి శంకరుఁ డాశీర్వదించి చిఱునవ్వుమోమున నొకవింతకాంతి దోఁపఁజేయ భక్తానుగ్రహతత్పరుఁడై యిట్లు పలికెను. పార్వతీసరోవరంబునఁ బద్మముల నపహరించిన మీ రెవ్వరు! పార్వతీవ్రతమునకొఱకు లక్షయక్షులచే నాసరోవరము రక్షింపఁబడుచున్నది. ప్రతిదినము సహస్రకమలములఁ బార్వతి హరిపాదముల సమర్పించును. భర్తృసౌభాగ్యవర్ధనమగు నీవ్రతమును మూఁడుమాసములు జరపఁదగును. అట్లుండ మీ రేల పద్మముల నపహరించితిరి? అని ప్రశ్నించెను.

మహాదేవుని యామాట లాలించి విష్ణుభక్తులగు నాగంధర్వులు మువ్వురు నిట్లు విన్నవించిరి. వారిశిరములు భక్తిచే వంగియుండెను. కరములు రెండును జోడింపఁబడియుండెను. శాంతము వారియందు మూర్తీభవించియుండెను. మహాప్రభూ! మేము గంధర్వులము. గంధవాహతనయులము. శ్రీహరికిఁ గమలమును సమర్పించి జలపానముచేయువారము. పూజింపక జలములఁ ద్రాగము. ఈసరస్సు పార్వతీసంరక్షితంబని మే మెఱుంగము. ఈకమలముల గ్రహింపుము. ఫలమును బ్రసాదింపుము. నేఁడు శ్రీహరికిఁ గమలము నీయఁజాలము. ఐనను జలపానము చేయుదుము. ఏలయనఁగా నీకమలము మీ కర్పింపఁబడియెఁగాన శ్రీకృష్ణున కర్పించినట్లే. ప్రతిదిన మేభగవత్పాదాంబుజమును ధ్యానించి కమలమునఁ బూజించుచుంటిమో యాపద్మాబ్జమే మీపదాబ్జము. ప్రత్యక్షమైన నీపాదాంబుజ

ములయందుఁ బద్మము లర్పింపఁబడియెఁ గానఁ బవిత్రులమై తిమి. పరబ్రహ్మ మద్వితీయము. ఏకము. దానికి దేహమెక్కడ? ఆతత్వము రూపవంతమగు టెక్కడ? భక్తానుగ్రహకారార్థము మాయచే నాబ్రహ్మమే దేహమును ధరించును. రూపభేదములఁ గానంబడును. కావున నోపరశివా! ఈకమలములఁ బరిగ్రహింపుము. నీవే మాకుఁ బ్రభువవు. అచ్యుతా! మా మానసంబుల ధ్యానించురూపమును గనఁబఱుపుము. ద్విభుజముల నలరుచుఁ, జూడ మనోహరమై కిశోరమై శ్యామసుందరమై వినోదమురళీహస్తమై పీతాంబరమును దాల్చి నిరుపమానమై, ఏకవక్త్రమై నేత్రద్వయమున నలరుచుఁ, జందనాగురుచర్చితమై, సురుచిరసుస్మితాస్యమున మనోహరమై రత్నాలంకారభూషితమై మణివరమగుకౌస్తుభరత్నము వక్షమున రుచుల నీనుచుఁ బ్రకాశించుచుండ, మయూరపింఛభూషమై మాలతీమాల్యవిభూషితమై, పారిజాతప్రసూనమాలాజాలముల మనోహరముగఁ జూపఁబడి, కోటికందర్పలావణ్యలీలాధామమై, గోపీసంఘుజుష్టమై వక్రలోచనములఁ గాంతమై, నవయౌవనసంపన్నమై రాధావక్షస్థలస్థితమై, బ్రహ్మాదులచే నుతింపఁబడుచు వంద్యమై ధ్యేయమై, భక్తాభీష్టప్రదంబై, స్వాత్మారామమై, పూర్ణకామమై, భక్తానుగ్రహార్థము త్వరపడుచు నుండు రూపమును గనఁబఱుపుమాయని ప్రార్థించిరి. ఇట్లు ప్రార్థించి శివునిమ్రోల దోసిలిపట్టి నిలువఁబడిరి.

శ్రీకృష్ణరూపశ్రవణమువలనఁ బులకాంచితవిగ్రహుఁడై గంధర్వులపలుకు లాలకించి శంకరుఁడు వారిఁ గాంచి యిట్లు పలికెను. అపుడు శ్రీకృష్ణరూపశ్రవణమున నేత్రము లానందబాష్పపరిపూర్ణములయ్యెను. గంధర్వప్రవరులారా! యని శివుఁడు వారిని సంబోధించెను. మీరు వైష్ణవప్రవరులని నేనే యెఱింగితి. ధరాలోకమును మీచరణాంభోజరేణువులఁ బవిత్రము చేయుటకుగా సంచరింపుఁడు. నేను సదా శ్రీకృష్ణభక్తదర్శనమును జేయఁగోరుచుందును. సాధుసమాగమము త్రిలోకములయందు దుర్లభము. శ్రీకృష్ణభక్తులగుసాధువులు దేవతలకుఁ బార్వతికి నాకును సదా ప్రియులు. నాకంటె నాభక్తులకంటె విష్ణుభక్తులు ప్రియతములు. ఐనను బూర్వము నేనాడినమాట వ్యర్థము కాఁగూడదు. మహాభక్తులారా! ఆవిధము నెఱింగించెద నాలకింపుఁడు. ఈసరోవరమందలి పద్మముల వృత్తాంతరముకొఱకెవరు హరింతురో వారు వెంటనే దానవయోనిం బుట్టుదురు గాక సంశయములేదు.

శ్రీకృష్ణభక్తుల కశుభముకలుగదు. అట్టి మీరు మానవలోకమునఁ బుట్టువుంగాంచి గోలోకమునకుఁ బోవవలయును. ఇదితప్పదు. మీరు శ్రీకృష్ణరూపమును జూడఁగోరుచున్నవారు కదా వత్సలారా! సత్యముగా నట దర్శింపఁగలరు. భరతఖండమున బృందారణ్యమున శ్రీకృష్ణబాలరూపమును గన్నులారఁ గాంతురు. విష్ణుభక్తవరులారా! శ్రీకృష్ణునిదర్శించి మృత్యువు

నొంది గోలోకమునకుం బోవఁజాలుదురు. దివ్యవిమానారూఢులై శ్రీహరిగృహమునకుఁ బోవఁగలరు. ఇపుడు మీరు చూడఁగోరినరూపమును జూపెద. అని శివుఁడు వారిమనోహారాంచారీతిరూపమును జూపెను. ఆరూపమును గాంచి సాశ్రునేత్రులై సర్వరూపియగు పరశివునిం గాంచి నమస్కరించి భూలోకమున దానవకులమునఁ బుట్టంబోయిరి.

నారదమునీ! వసుదేవుఁడుముందే ముక్తుఁడయ్యెఁగదా. తక్కినమూవురుగంధర్వులలో బకాసురుఁడైనవాఁడు సహోత్రుఁడు. ప్రలంబాసురుఁడు సుదర్శనుఁడు. సుపార్శ్వకుఁడు కేశిదానవుఁడు. శంకరవరప్రభావమున శ్రీకృష్ణరూపమును గాంచి మృతినొంది శ్రీకృష్ణమందిరమగు గోలోకమునకుం బోయిరి. ఇది శ్రీహరిదివ్యప్రభావచరితము. బకకేశిప్రలంబుల శాపవిమోచనము చెప్పితిని. ఇది విన్నచోఁ బుణ్యముగల్గును.

ఆర్యులారా! ఈగాథలు శ్రీభాగవతమున నించుక భేదముగాఁ జెప్పఁబడినవి. కేశిదైత్యుఁడు కంసునిపంపున శ్రీకృష్ణునిపై కరుదెంచినట్లు చెప్పఁబడినది. ఏదియెట్లున్నను గథాభాగమునందు మార్పులు కానరావు. ఈమువ్వురు శ్రీకృష్ణమూర్తిచే నిహతులైరి. సమయభేదమే కాని విషయభేదము కానరాదు. శ్రీకృష్ణజన్మఖండమునుండి ప్రధానముగా వ్రాయఁబడునని ముందే దెలిపితినిగదా.

ఇందలిసారము.

ఈగాథలనుండి మనమెఱుంగఁదగినవిషయములు కొన్ని కన్పట్టుచున్నవి. గంధర్వులు మూవురును బరమభక్తులు. భగవంతుఁడు శ్రీకృష్ణునిబూజింపఁ గమలములఁ గోసిరి. అంతలో శివకింకరు లరుదెంచి వీరింబట్టుకొని యాకమలములఁ గైకొని శివునిసాన్నిధ్యమును జేరిరి. గతవార్తల విన్నవించిరి. మువ్వురనుజూపి వీరె యాచోరులని విన్నవించిరి. శంకరుఁడు చిఱునవ్వునవ్వి పార్వతీసరోవరమున నేల కమలములను గోసితిరి? అని ప్రశ్నించెను. వారు వినయముట్టిపడఁ జేతులొగ్గి శ్రీకృష్ణపరమాత్మను బూజింపక గంగాప్రాశనము చేయమని నియమము చేసికొంటిమి. అందునఁ జక్కనికమలములం గోసితిమి. ఆపుష్పములు మీపాదారవిందముల నర్పింపఁబడినందున శ్రీహరిని బూజించినట్లే కావున నీక గంగాప్రాశన మొనరింతు మనిరి. అంతియకాక శ్రీకృష్ణమూర్తికి నీకును భేదములేదనిరి. ఎందుఁ బూజించినను సమానఫలమే యనిరి. నీవే మాకుఁ బ్రభువవనిరి.

శ్లో. నిత్యం ధ్యాత్వా య త్పదాబ్జం పద్మేన పూజయామహే,
సాక్షాత్తస్మై ప్రదత్వాచ పద్మం పూతా వయం ప్రభో.
ఏకం బ్రహ్మా హ్యద్వితీయం క్వదేహాః క్వచరూపవాక్,
భక్తానుగ్రహతో దేహో రూపభేదశ్చ మాయయా,
కింతు గృహాణ పద్మాని త్వమేవ మత్ప్రభుః ప్రభో. ౫౨

అను నీశ్లోకములంబట్టి పైయర్థము తేటపడియెఁగదా. భక్తానుగ్రహార్థము విరాట్పురుషుఁడు రూపనామక్రియాశూన్యుఁడయ్యు రూపనామక్రియావంతుఁడయ్యెను. బహువిధ రూపములఁ దాల్చినపుడు భేదమెట్లు కలుగును? హరిహర బ్రహ్మాదిరూపములన్నియు భగవంతునివే యగుట సత్యమైన నిఁక వారిలో నుత్తమమధ్యమాధమభేదము లెట్లువచ్చెనో యెఱుంగఁజాలకున్నాఁడను. అపరతత్వమే వీరుకాదన్నచో భేదము లుండవచ్చును. వేదములు వేదాంతములు శాస్త్రములు పురాణము లితిహాసములు లోనగునవియన్నియు భగవంతుఁ డొక్కఁడేయని చెప్పుచున్నవి. అట్టియెడఁదెలివితక్కువచే భేద కల్పనము చేయఁబడుచున్నది. ఇంద్రుఁడే విరాట్పురుషరూపము. ఈరూపమున నాభగవంతుఁ డవతరించెనన్న దృఢవిశ్వాసమున నింద్రు నారాధించినచో నేమితక్కువ? భగవంతునికన్న నింద్రుఁడు వేఱన్నయెడల ఫలముగలుగదు. కాని తత్వమొక్కటియే యని యారాధించిన ఫలముగలుగకమానదు. ఇట్టులుండ భేదబుద్ధికలుగుట యేలొకో తెలియఁబడదు. మఱియొక విశేషమును జిత్తగింపుఁడు.

యత్రోనోమానసంపూర్ణం తద్రూపం దర్శయాచ్యుత,

ఓశంకరా! చిరకాలమునుండి యేరూపధ్యానమున మామనస్సులు పరిపూర్ణములగుచుండెనో యారూపమును గనఁబఱపుము. అని వేఁడిరి. అంతియకాక అచ్యుతా! యని

శంకరుని సంబోధించిరి. అచ్యుతయనునామము శ్రీహరికిఁదప్ప నితరులకుం జెల్లదన్నవాద మెంతనీచమో యోజింపుఁడు. శివ యన విష్ణువునకుఁ జెల్లదేని ఆతని పరమేశ్వరత్వమెక్కడ? సర్వ నామవాచ్యుఁడుకదా భగవంతుఁడు. శివకేశవులలోనే భేదము గలిగినపు డమ్మహాత్ముని సర్వనామమవాచ్యత్వము వ్యర్థమాయెఁ గదా. వ్యర్థమైనచో సర్వేశ్వరత్వము నశింపదా. మఱొక్క విశేషముగలదు. శ్రీబాలకృష్ణరూపమును గనఁబఱుపుమా య నఁగనే శ్రీశంకరుఁడు కరుణమీఱఁగా శ్రీబాలకృష్ణరూపమును

అధునా వాంఛనీయంచ రూపం ద్రష్టు మిహోద్యతాః,
తత్సర్వం పశ్యతే త్యుక్త్వా దర్శయామాస తచ్ఛివః,
రూపం దృష్ట్వా సాశ్రునేత్రాః ప్రణమ్య సర్వరూపిణం. ౭౦

గనఁబఱచెను. ఆరూపమునుగాంచి వా రానందబాష్పపూర్ణన యనులైరి. మహాశయులారా! పై ప్రమాణవచనముల వింటిరి గదా. గంధర్వులు మువ్వురు మా కుపాస్యదైవమగు శ్రీకృష్ణ రూపమును గనఁబఱుపుమనఁగా నట్లే శంకరుఁడు కనఁబఱచెను. అనఁగా దీనిభావమేమి? శంకరుఁడే శ్రీకృష్ణమూర్తి యాయె ననిగదా. అపుడు శివకృష్ణుల కభేదమేకదా. శివుఁడు తక్కువ. శ్రీకృష్ణపరమాత్మ యెక్కువ యన నవకాశ మేలాగునఁ గలదు. ఇది కేవల మజ్ఞానకల్పితము. శ్రీకృష్ణభక్తులు భగవంతుఁడే శ్రీ కృష్ణపరమాత్మ యని ధ్యానింపఁదగు. శ్రీశివభక్తులు విరా రుషుఁడు శంకరుఁడే యని ధ్యానింపఁదగు. ఫలమొక్కటి

గాని రవంతయైనను భేదము కానఁబడదు. కాని తా నమ్మినదైవ తముతప్పఁ దక్కఁగలదేవత లధములనిమాత్రము వచింప నలవికాదు. అదియే పాపకార్యము. దానినిమించిన దొక్కటియుఁ గానరాదు. సకలదేవతాస్వరూపుఁ డొక్కఁడే పరమాత్మ. అతఁడు శ్రీహరియు నగును. శ్రీశివుఁడునగు. ఎవరిని నమ్మిననుసరియే. ఏకాగ్రమనసున నభీష్టదేవతను బూజించుట కృత్యము. దేవతాదూషణము పనికిరాదు.

ఇంతటి నీవిషయమునువదలి ప్రస్తుతప్రస్తావమునకు వచ్చుట మంచిది. ఇట్లు నారాయణమూర్తిపలుక నారదముని యిట్లు ప్రశ్నించెను. మహాత్మా! మీయనుగ్రహమున నద్భుత చరిత్రమును వింటిని. ఇపుడు పార్వతి యొనరించిన వ్రతమును వినఁగోరెదను. ఆవ్రతమున నారాధింపఁదగినదేవుఁ డెవ్వఁడు? దాని నియమ మేది? ఆవ్రతమున నుపయోగింపఁదగు పదార్థములేవేవి? ఎంతకాల మావ్రత మాచరింపఁదగు? ప్రతిష్ఠానిరూపణ మేరీతి? చక్కఁగ నాకుం దెలియుమార్గ మాలోచించి వచింపుమా. వినఁ గౌతూహలమగుచున్నది. అనిపలుక నారాయణమూర్తి యిట్లుపలికెను.

## పార్వతీదేవి శ్రీకృష్ణవ్రత మొనరించుట.

* నారదమునీ! ఆవ్రతము మూఁడుమాసము లాచరింపఁ

* ఈగాథయుం శ్రీకృష్ణజన్మఖండము పదాఱవయధ్యాయాంతర్గతమే యని యెఱుంగఁదగు.

దగినది. పతిసౌభాగ్యవర్ధనమా వ్రతము. అందారాధ్యుఁడు శ్రీ రాధాసహితుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మము. విషువత్కాలమం దారంభించి దక్షిణాయనమున సమాప్తినొందించవలయును. పూర్వదివసమున నుపవసించి యథావిధిగఁ గృత్యముల నిర్వర్తించి హోమాదుల నొనరించి మఱుదినము వైశాఖసంక్రాంతి యందు జాహ్నవీతటమున స్నానమొనరించి సంకల్పింపవలయును. వ్రతముచేయువాఁడు భగవంతుని ఘటమందుగాని, మణియందుఁగాని సాలగ్రామమునఁగాని యావాహన మొనరించి పూజింపవలయును. ముందుగఁ బంచదేవతలఁ బూజించి పిదపఁ బ్రధానదైవమగు శ్రీకృష్ణమూర్తిని బూజింపవలయును. ధ్యానము సామవేదమురీతిఁ జేయవలయును. అదెట్లనినవనవ నీరద శ్యాముఁడై, పీతకౌశేయవసనుఁడై, శరత్పార్వణచంద్రాస్యుఁడై, ఈషత్స్మితసమన్వితుఁడై, శరత్కాలమున వికసించినపద్మములవలె నొప్పునేత్రములలర, మనోహరలాంఛనములొప్ప, గోపికాకాంతల మానసముల మోహింపఁజేయుచు రాధాంబం గూడి, రాధావక్షస్స్థలస్థితుఁడై, బ్రహ్మేశంతేశధర్మాదులచే వినుతింపఁబడు శ్రీకృష్ణపరబ్రహ్మమును ధ్యానించెదనని ధ్యానింపవలయు. ఇట్లు శ్రీకృష్ణుని ధ్యానించి పిదప రాసమండలమధ్య స్థితయై రాసాధిష్ఠాతృదేవతయై రాసేశ్వరవక్షస్స్థలస్థితయై రసికయు, రసికప్రియయు, రసికప్రవరయు, రమ్యాంగియు, రమయు, రమణోత్సుకయునై, శరత్కాలమునఁ బూచిన రాజీవకాంతి నపహసించులోచనము లొప్పార, వక్రభ్రూభం

గము లలరార, మంజీరములు విరాజిల్ల, శరద్రాత్రికాశీతాంశు సమానముఖ మరుదుగఁ గన్పడ, ఆముఖమునఁ జిఱునగవు చిందులాడ, మనోహరచంపకవర్ణాభ దేహచ్ఛాయ యొకన్పడఁ జందనచర్చలు సౌందర్యమును ద్విగుణముచేయ, కస్తూరీబిందువుతోఁటి సిందూరబిందువును ధరించి, చారుపత్త్రావళీసంయుక్తయై వహ్నివలెఁ బరిశుద్ధమగు నంశుకమును ధరించి, సురుచిరమణిని కరఖచితకుండలములఁదాల్చి వానిచే గండములు మఱింత వింతగ వెలయ, రత్నేంద్రసారహారము వక్షస్థ్సలమున వ్రేలాడ, రత్నకంకణకేయూరకింకిణీరత్నరంజితయై, నిరుపమమణీరచితక్వణన్మంజీరభూషితయై, బ్రహ్మాదిసంసేవ్యుఁడగు శ్రీకృష్ణమూర్తి తన్ను లాలింపఁగా సర్వేశ్వరస్తూయమానయై సర్వజగద్బీజభూతయై నిరుపమాన మహిమమునఁ దనరు రాధాంబను ధ్యానించెను. అని ధ్యానించి శ్రీకృష్ణసహితయగు రాధాదేవిని బూజింపవలయును. ప్రతిదినము భక్తిచే షోడశోపచారములు సమర్పింపవలయును. ఒక్కొక్కటి ప్రత్యేకముగా సమర్పింపవలయును. నూటయెనిమిదిసహస్రకమలములచేఁ బూజింపవలయును. వ్రతముచేయువాఁడు ప్రతిదినము నూటయెనిమిదియాహుతుల హోమముచేయవలయును. శ్రీకృష్ణాయస్వాహా=అని భక్తియుక్తుఁడై పలుకుచు హోమముచేయవలయును. చక్కనిమామిడిపండ్లుగాని,పతిపక్వకదళీ ఫలములుగాని ప్రతిదిన మష్టోత్తరశతము అక్షతలతోఁటి సమర్పింపవలయు.నిత్యమునూట యెనిమిదిమంది బ్రాహ్మణోత్తములను మృష్టాన్నమున నలరింప

వలయు రాధామాధవమూర్తికి నాజ్యమిశ్రతిలలతో హవనము అష్టోత్తరశతవారములు చేయవలయును. శుభతమ వాద్యముల వాయించుచు హరినామసంకీర్తనము చేయవలయును.

ఇట్లు మూఁడుమాసము లొనరించి యవ్వలఁ బ్రతిష్ఠ చేయవలయును. ప్రతిష్ఠాదినమునఁ జేయఁదగువిధి నెఱింగించెద. అవధరింపుము. ఏమాత్రము వాడువారకయుండు కమలములఁ దొమ్మిదివేలను సేకరింపవలయు. తొమ్మిదివేలమంది విప్రవర్యులకు భుక్తినిడవలయు. వారి కిడుపదార్థములు మిగుల రుచిగలిగి సుఖపరిమళవంతములై మధురతరములై యుండవలయు. తొమ్మిదివేల యిరువదియేడుఫలముల సంగ్రహింపవలయు. ఇవికాక బహువిధమధురపదార్థముల సంగ్రహించి యాకమలముల శ్రీహరిని బూజించి నైవేద్యము సమర్పింపవలయును. ఆవల సంస్కృతాగ్నియందు హోమముచేయవలయును. తిలలచే నాజ్యముచేఁ దొమ్మిదివేలసంఖ్యగా హోమముసాగవలయును. వస్త్రములతోఁగూడి సభోజ్యమై, యజ్ఞసూత్రఫలాన్వితమై గంధపుష్పాదులంగూడిన తొంబదిలడ్డుకములను, దొంబదికుంభములను, శీతసలిలాన్వితములుగా సమర్పింపవలయును.

ఈరీతి వ్రతము సాంగముగా నొనరించి వసిష్ఠునకు దక్షిణల నొసంగవలయును. దక్షిణలపరిమితి వేదప్రతిపాదిత మయినదియే. వేయిగోవులను స్వర్ణశృంగవిభూషితములుగ నొనరించి

వేయిమందికి దానమీవలయును. నారదమునీ! ఇది త్రైమాసికవ్రతము. ఇది పరిశుద్ధసంతానప్రదము. ఇది సౌభాగ్యవర్ధనము. ఈవ్రతప్రభావమున నూఱుజన్మములయందు నారీమణి పతిసౌభాగ్యము కలదగును. సత్పుత్రజననియగు. ఇట్లు శతజన్మములపర్యంత మీవ్రతప్రభావము వెలయును. ఆస్త్రీపతిపుత్త్రులకేజన్మమందుఁగాని భేదముగలుగదు. ఆమెకుఁ బుత్త్రుఁడు దాసతుల్యుఁడగు. భర్త తనమాటను నెఱవేర్చువాఁడగును. ప్రతిక్షణ మాకాంతామణి రాధామాధవభక్తియుక్తయేయగు. ఈవ్రతమహిమమున శ్రీహరిభక్తి గలదియగును. ఈవ్రతము సామవేదప్రతిపాదితము. మే మీవ్రతము నాచరించితిమి. నారదమునీ! ఒక్కమాట వినుము. ఈవ్రతము సర్వవ్రతసారమని యెఱుంగుము. స్వాయంభువుఁడు మనువుగనుండఁగా శతరూపయను నారీమణి అగస్త్యమహాముని పురోహితుఁడైయుండ నీవ్రతమును జేసెను. ఆమెయే తొలుత నీవ్రతమును మన్వంతరమున నొనరించెను. అవల దేవహూతియు, ఆకూతియు నను నారీరత్నములు. పులస్త్యమునిని బురోహితునిగ వరించి వేదోక్తమార్గమున నొనరించిరి. రోహిణీదేవి క్రతుమహర్షిని బురోహితునిగా నంగీకరించి యొనరించెను. రతీదేవియు గౌతముఁడు పురోహితుఁడు కాఁగా నీవ్రతము నెఱవేర్చెను. బృహస్పతిభార్యయగు తారయు భక్తిచే నీవ్రతమును జేసెను. ఆవ్రతమున ననేకదివ్యపదార్థములు సంపాదింపఁబడఁగా: వసిష్ఠుఁడు పురోహితుఁడయ్యెను. ఆవ్రతమును.

గాంచి శక్రపత్ని శచీదేవియు వ్రతమును జేసెను. ఆవ్రతమునఁ బురోహితుఁడు బృహస్పతియయ్యెను. వీరందఱిని మించునట్లు స్వాహాదేవియు నీవ్రతమును సకలపదార్థముల రాసులుగా నేకరించి మరీచిముని పురోహితుఁడై యుండ విధిప్రకారము చేసెను.

ఆవ్రతమునుజూచి పార్వతి మహానందమున శంకరుం గాంచి వినయమునఁ జేతులొగ్గి లజ్జచే శిరస్సునువంచి యిట్లు పలికెను. జగన్నాయకా! మీ రాజ్ఞయిచ్చిన నీవ్రతము నేనొనరింతును. ఇది మనకిరువ్వరకు నిష్టదైవమగు కృష్ణవ్రతముగాన నే నొనరింపనెంచితి. శ్రీహరిపూజనము సర్వమంగళకారకము. ఇష్ట దానము, వేదపాఠము, తీర్థసేవ, పృథ్వీప్రదక్షిణము ననునివి శ్రీహరిపూజాఫలమునఁ బదాఱవపాలు ఫలము నీఁజాలవు. బాహ్యాభ్యంతరములఁ బ్రతిక్షణము శ్రీహరిస్మృతి యేపురుషునకుఁ గలుగునో జీవన్ముక్తుఁడగు. నాపూతాత్మునకు భగవద్దర్శన మాత్రమున ముక్తికల్గును. అట్టిభక్తుని పాదధూళిచే వసుంధర పవిత్రయగును. ఆభక్తునిదర్శనమున ముల్లోకములు పవిత్రములగును. బ్రహ్మాయు విష్ణువు, ధర్ముఁడు శేషుఁడు, నీవు, గణేశ్వరుఁడు ఏమహాత్ముని పాదాంబుజముల ధ్యానించి ధ్యానించి తత్సములయి తేజస్సుల నధికులయిరో ఆమహాత్ము నారాధించుట ముఖ్యము. ఎవ్వరు నిరంతర మెవ్వని ధ్యానింతురో వారు తత్సములగుదురు. ఇది నిశ్చయము. గుణముచేతను, దేజస్సుచే

తను, బుద్ధిచేతను, జ్ఞానముచేతను వత్సముండగునని పెద్దలందురు. ప్రాణేశ్వరా! శ్రీకృష్ణుని స్మరణమున, ధ్యానమునఁ, దపమున, సేవచేత, నీవంటిభగవంతుని భర్తను గాంచితి. సత్పుత్రులం గాంచితి. లీలచేత నామానసాభీష్టము సఫలమయ్యెను. నీవంటిభర్తయుఁ గార్తికేయగణేశులవంటిపుత్రులును గల్గుట సామాన్యమా! శ్రీకృష్ణాంశనుగు హిమాద్రి తండ్రిగదా. కావున నాకిఁక దుర్లభం బెయ్యది.

ఇట్లు పార్వతిపలుక శంకరుఁడు ప్రీతుఁడై పక్కునవ్వి పులకాంకితవిగ్రహుండై యిట్లుపలికెను. ఓదేవీ! యీశ్వరీ! మహాలక్ష్మీస్వరూపురాలవుగదానీవు. ఇట్టి నీకసాధ్య మేదియుండును? నీవు సర్వసంపత్స్వరూపురాలవు. అనంతశక్తిరూపిణివి. ఇట్టి నీ వెవరియింటనుందువో అతఁడు సర్వైశ్వర్యభాజనుఁడగు. ఎవనియింట లక్ష్మీదేవియుండదో వాఁడు జీవించుటకన్న మృతినొందుట శ్రేయము *నేనును బ్రహ్మయు విష్ణువు, నీయందలి భక్తిచే సృష్టికాలమందును ప్రళయకాలమందును నాశముం గాంచక అక్షయదేహులమై యున్నవారము. ఎవ్వారెవ్వారు పతివ్రతలని శ్రుతిప్రసిద్ధిఁగాంచిరో వారందఱు త్వద్భక్తిగలవా

* అహం బ్రహ్మాచ విష్ణుశ్చ త్వయి భక్త్యా శుభప్రదే, సంహారసృష్టికాలేచ త్వత్ప్రసాదా ద్వయం క్షమాః, కోవా హిమాలయః కోఽహం కార్తికేయ గణేశ్వరౌ, త్వద్విహీనా అశక్తాశ్చ త్వయాచ వయమీశ్వరాః. అని మూ.

రలే. ఈశ్వరాజ్ఞం గైకొని వ్రత మాచరింపుము. ఈవ్రతము నెవ్వరెవ్వ రాచరించిరో వారికంటె విలక్షణముగా వ్రతమొన రింపుము. నీవు చేయఁబూనువ్రతమునకుఁ బురోహితుఁడు సనత్కుమారుఁడగునుగాక. వలసినన్నికమలములను, బ్రాహ్మణులను, ద్రవ్యము నిచ్చువాఁడను నేను. సుందరీ! కుబేరుని గోశాధిపతిగానుండ నియమింపుము. నేను ధనాధ్యక్షుఁడ నయ్యెదను. లక్ష్మీదేవి ధనదాత్రియగు. పాలకుఁడు బ్రహ్మదేవుఁడగు. వరుణుఁడు జలదాయకుఁడు. వస్తువులఁగొని తెచ్చువారు యక్షులు. వారి కధ్యక్షుఁడు షడాననుఁడు. స్థానసంస్కారకర్త సాక్షాత్పవమానుఁడే. వలసినకార్యములఁ గనుఁగొనువాఁడు శక్రుఁడు. అధిష్ఠాపకుఁడు చంద్రుఁడగు. ఈదాన మిప్పుడు చేయఁదగునని నిర్వచనముచేయువాఁడు సూర్యుఁడు. అతఁడు యోగ్యాయోగ్యకృత్యముల నెఱింగినవాఁడు. వ్రతోపయుక్తముగ నియత ద్రవ్యము నొసంగి తదధికముగా భగవంతునకుఁ బుష్పముల నర్పింపుము. వ్రతమున నియమితులగువిప్రులను భుజింపఁజేసి వారికంటె యోగ్యులగువిప్రులను బ్రార్థించి యారాధింపుము. వ్రతాంతమున సకలరత్నములను యథోక్తముగఁ బురోహితున కర్పింపుము.

అనిపలికి శ్రీశంకరుఁడు పార్వతిచే నావ్రతమును జేయించెను. ఆదుర్గాదేవియు నందఱికన్న మిన్నగాఁ దద్వ్రతము నొనరించెను. నారదమునీ! ఇది పార్వతియొనరించిన వ్రతవిధానము.

ఆవ్రతమున రత్నముల మోయఁజాలక విప్రు లలసిపోయిరి. అనివింటిని. నారదా! ప్రకృతవిషయమును వినుము. అని మఱి యుఁ జెప్ప నారంభించెను.

భక్తాగ్రగణ్యులారా! ఈవ్రతవిషయమున వ్రాయఁదగినవిశేషాంశములులేవు. కాని యిందుఁ బరమరహస్యవిషయ మొక్కటికలదు. ఏవ్రతము చెప్పఁబడిన నది సర్వవ్రతములలో నుత్తమోత్తమమని చెప్పుటకలదుకదా. దానికిఁదగినకారణమే దీనినుండి గ్రహింపుఁడు. పార్వతి శంకరుని ఈవ్రతరాజము నీయాజ్ఞనొంది చేయఁబూనెదనని ప్రార్థించెను. శంకరుఁడాదరమున నంగీకరించెను. ఆవ్రతమున కనుజ్ఞయిచ్చుచు,

అహం బ్రహ్మాచ విష్ణుశ్చ త్వయి భక్త్యాశుభప్రదే,
సంహారసృష్టికాలేచ త్వ త్ప్రసాదా ద్వయం క్షమాః.

అని వచించెను. దీనిభావ మీలాగు గ్రహింపనగును. హరిహరబ్రహ్మాదు లెల్లఁ బ్రకృతినిబద్ధులు. ప్రకృతియన శక్తి. అనఁగా విరాట్పురుషునిచ్ఛ. ఆయిచ్ఛాధీనము ప్రపంచము. కావున సకలబ్రహ్మాండములు తదంతరస్థభూతకోటులు తత్పాలకులు తత్కర్తలు వీరెల్లఁ బ్రకృతినిబద్ధులుగాని వేఱుకారు. ప్రకృత్యతీతము పరబ్రహ్మమే. కావున నీరూపమును ధ్యానింపుము. నీవే యాదిశక్తివి. మహాలక్ష్మీస్వరూపురాలవు నీవే. ఇట్టి నీ వీవ్రతము నాచరింపఁబూనుట యేటికని సంశయింపకుము.

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః,

సయత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే.

అనుట సుప్రసిద్ధమేకదా. పార్వతియే యొనరించెను గదా. అదెంత పెద్దవ్రతమో యని యెల్ల రాచరింతురు. ఎల్లరకు భగవద్భక్తి కుదురవలయునని భావమేకాని వేఱుభావము కానరాదు. ఇందుఁ బార్వతియే సర్వశక్తులుగల పరదేవతయని చెప్పఁబడినది. ఇంతకుముందు గాథలో రాధాదేవియే మూలప్రకృతిగాఁ జెప్పఁబడినది. అనఁగా నెవ్వనిని బూజించినను సమానమే యని దీనిసారము. ఏభక్తునకుఁ గర్మానుసారము ఏదేవతయందు దృఢభక్తికుదురునో ఆదేవతోపాసనముననే వాఁడు తరించును. ఒకదేవత యధికము. ఇంకొక్కదేవత యధమము అన్న భేద మజ్ఞానజనితము. సర్వ మాపరమాత్మస్వరూపమే.ఆపరబ్రహ్మమే యీరూపమున వెలసెనన్న నమ్మకమునఁ బూజించినచో నదియే సత్ఫలప్రదము. లేకున్న నిష్ఫలము. కాఁబట్టి యేదేవతను జెప్పినను అదియే పరదేవతయని చెప్పుట సుసంగతమేకాని యసంగతముకాదు.

ఇఁకఁ దరువాతికథకు మరలుదము. ఇట్లు శ్రీకృష్ణమూర్తి దానవులముప్పురం జంపెను. గోపకులంగూడి ధేనుధనముతో గోకులమున కేతెంచెను. కుబేరభవనసమానమగు తనగృహమును శ్రీకృష్ణుఁడు ప్రవేశించెను. అంతట శిశువులందఱు వనమున జరగిన యద్భుతవార్తల నెల్లరకుం దెల్పిరి. విన్నవారెల్ల నాశ్చర్యమగ్నమానసులైరి. నందుఁడుమాత్రము భీతుఁడయ్యె

ను. మఱుదినము గోకులమునఁగల గోపికలను గోపకులను రా వించెను. ముఖ్యముగా వృద్ధులను బిలువఁబంచెను. వారల కీ వార్తలం దెల్పి సమయోచితవ్యాపారముననుండెను. ఆలోచన చేయునపుడు నందుఁడు గోకులమును వదలిపెట్టుటయే మేలని తనభావమును దెల్పెను. బృందావనమునకుఁ బోవుట సర్వవిధ ముల మేలని నొక్కిపల్కెను.

## నందాదులు బృందావనమునకుం బయనముచేయుట.

నందానుమతిని గోపకులెల్ల గోకులమునువదలి బృందావ నమునకుంబోవు టుచితమని తలంచిరి. సమ్మతించిరి. ఈవిషయమే శ్రీభాగవతమున నించుక భేదముగాఁ జెప్పఁబడినది. ఒకవృద్ధగో పకుఁడు యెఱుక పఱిచి,

ఉ. ఇక్కడ నుండు రే మనుజు లీమనకృష్ణున కెగ్గుచేయఁగా
రక్కసురాలు చన్నిసఁగె ఱాలపయిన్ సుడిగాలివీచెఁ బై
గ్రక్కిఁతియందరుల్ పడియెఁ గేళ్వుసత్కృపఁ దప్పెఁ బాలు
డెక్కడకైనఁ బోవలయు నింకిట గోపకు లారవింటిరే. [నేఁ

శ్లో. తత్రోపనందనా మాహ గోపో జ్ఞానవయోఽధికః,
దేశకాలార్థతత్వజ్ఞః ప్రియకృద్రామకృష్ణయోః. 29
ఉత్థాతవ్యమితోఽస్మాభి ర్గోకులస్య హితైషిభిః,
ఆయాంత్యత్ర మహోత్పాతా ప్రజానాం నాశహేతవః.
ముక్తః కథంచి ద్రాక్షస్యా బాలఘ్న్యా బాలకోఽప్యసౌ,
హరే రనుగ్రహా న్నూన మనశ్చోపరినాపతత్. 30

చక్రవాతేన నీతోఽయం దైత్యేన విపదం వియత్,
శిలాయాం పతిత స్తత్ర పరిత్రాత స్సురేశ్వరైః. ౩౧
యన్న మ్రియేత ద్రుమయో రంతరం ప్రాప్య బాలకః,
అసావన్యతమో వాపి తచ్చాప్యచ్యుతరక్షణమ్. ౩౨
యావదౌత్పాతికోఽరిష్టో వ్రజం నాభిభవే దితః,
తావద్బాలానుపాదాయ యాస్యామోఽన్యత్ర సానుగాః.

శ్రీ భాగవతము ౧౦ స్కం. ౧౧ అధ్యాయము.

ఇం యిరువదితొమ్మిదవశ్లోకము మొదలు ముప్పదిమూఁడవ శ్లోకము తుదగాఁగలవిషయమునకుఁ బైపద్య మొక్కటియే భాగవతమున శ్రీపోతనకవిగారు వ్రాసిరి. మక్కికిమక్కి యన్నట్లు గాక సామాన్యకథాభాగమున సారముమాత్రము గ్రహించియు, భక్తిశృంగారములయందు విస్తృతినొనరించియుఁ దెనిఁగించిరని స్పష్టమగు. ఇదియే శ్రీపోతనమహాకవిగారి చమత్కారము. అనవసరమగుతావులఁ బెంచిపెంచి మహోపయుక్తములగు విషయముల సంక్షేపముగఁజెప్పుట కొందఱినైజము. ఇఁకఁ గథాభాగమును వినుఁడు.

భగవంతునియుద్దేశము సఫలముకాకతప్పదు. బలరామునితో భగవంతుఁ డేతఱుణమున స్థానాంతరగమనము మిగుల మేలని తోఁచెడునని చెప్పెనో యాక్షణముననే నందాదుల డెందము లనేకసంశయములకు లోనయ్యెను. తుదకు బృందావనగమనము నిశ్చయింపఁబడియె. నందాజ్ఞ శిరసావహించి

స్వస్థానచ్యుతివిషయమై భేదమందక యెల్లరుఁ బెండ్లికిఁబోవుచందమున బయలుదేరిరి. బాలికలు బాలకులు గోపికలు గోపకులు వృద్ధులు వీరు వారననేల యెల్లరు పయనము సాగించిరి. బాలకులందఱు శ్రీకృష్ణబలదేవాన్వితులై సంతసమున గంతులువైచుచుఁ బోవసాగిరి. కొందఱు సంగీతముపాడుచుండిరి. బహువిధశృంగారవేషములఁ దాల్చిరి. అందుఁ గొందఱు వేణుగానమున విశారదులు. వేఱొకకొందఱు శృంగప్రవాదననిపుణులు. మఱికొందఱు కరతాళవాదనదక్షులు. ఇంకనుంగొందఱు వీణాహస్తులు. ఒక్కకొందఱు శరయంత్రకరులు. శృంగహస్తులుగ నరుగువారుగాఁ గొందఱు నై చనిరి. బాలకులు కొంతమంది నవపల్లవాభిరామకర్ణులు, ముకుళకర్ణులును, పుష్పకర్ణులును, ఆజానుబాహువులును, పల్లవచూడులును, పుష్పచూడులును నై గుంపులుగుంపులుగాఁ బోయిరి. గోపికలు తోడిచేడియలంగూడి వేడుకమీఱఁ బాడుచు ననేకశతసంఖ్యలుగఁ జనిరి. ముదుసలులు గుంపుగాఁగూడి పయనముసాగించిరి.

రాధాదేవీ సహవాసభాగ్యముగలచేడియలు కొందఱు గోపాలికలు సంతసమునఁబోయిరి. వారందఱు సత్ప్రియవ్యగ్రనముల నలరారుచు, మనోహరాకారముల నిట్టవీఁగుచు, నానాలంకారభూషితలగుచు, దివ్యవస్త్రములందాల్చి, సస్మితాస్యసరోరుహముల విరాజిల్లుచు, మహానందంబున నడచిరి. వీరలే గోలోకమున రాధికాంబకుఁ బరిచారికలు. చెలికత్తెలుగనుండిరి

గాన నీపుట్టుకయందును ఆయిచ్ఛగలవారలేయైరి. కొందఱం గనామణులు శిబికలనారోహించి వెడలిరి. కొందఱు కామినీ రత్నములు రథముల నధిరోహించి పయనముచేసిరి.

రాధాదేవియు స్వర్ణపరిచ్ఛదముగల స్యందనోత్తమ మున నలరారి చేడియలంగూడి రత్నాలంకారభూషితాంగియై ప్రయాణముచేసెను. భాండీరవనమునుండి శ్రీగోపాలమూర్తిని గొనివచ్చి యశోదకర్పించిననాటినుండి వచ్చుచుంబోవుచుండె నని పాఠకమహాశయు లెఱుఁగఁగలరు. యశోదారోహిణులు రత్నమయాలంకృతులనొప్పి బంగరురంగుగల శతాంగము నెక్కి బృందావనదర్శనేచ్ఛ మైకొనఁబోయిరి.

నందుఁడు సునందుఁడు శ్రీదాముఁడు, గిరిభానుఁడు, విభాకరుఁడు, వీరభానుఁడు, చండభానుఁడు, గజాస్యుఁడు సంతోషమున నావేడుకఁ జూచుచుఁ జనిరి. శ్రీకృష్ణబలదేవులు రత్నాలంకారభూషితులై గొంతదూరముపోయి యట నందాజ్ఞచే హాటకస్యందనమునెక్కి, మహానందమున నుబ్బుచుఁబోయిరి. కోటులుకోటులుగా వృద్ధులు వృద్ధులను, వయస్స్ఫురితులు వయోవిరాజితులనుగూడి గజముల, ఘోటకముల, రథముల నధిరోహించి ప్రయాణముచేసిరి. నందకింకరు లానందమున నొడలుతెలియకవెళ్లిరి. వృషభముల, నశ్వేతరముల (కంచరగాడిదల)నెక్కి కింకరులు కొందఱు సంగీతగానతత్పరులై వెడలిరి. కొందఱు రాధికాదాసీజనములు త్రిసప్తశతకోటులు (గుంపుగా)

మహానందమున దేహములు పరవశములు కాఁగాఁ జిలువవ్రేలు ముఖముల కొక్రొత్తయలంకారమునీయఁగా సకలమండన మండితలై, సిందూరహస్తలై కొందఱు, కజ్జలవాహికలై కొందఱు, కందుకహస్తలై కొందఱు, పుత్తలికలఁదాల్చి కొందఱును, భోగద్రవ్యములంబూని కొందఱును, క్రీడావస్తువులం గైకొని కొందఱును, వేషద్రవ్యములంబూని కొందఱును, సులలితమాలాజాలములంగైకొని కొందఱును, వాద్యములం బూని కొందఱును, మహాప్రమోదమునఁబోయిరి. అందు నింక నుంగొందఱు, వివిధవిచిత్రవర్ణముల విరాజిల్లు విమలవస్త్రములం గైకొని పోయిరి. చందనాగురుకస్తూరికుంకుమద్రవముల గ్రహించి కొందఱరిగిరి. కొందఱానందమునఁ బాటలు పాడుచుఁ, గొందఱు విచిత్రకథలఁజెప్పుచు, శిబికలం గూర్చుచుండి వెడలిరి. అశ్వములు రథములు, శకటములు ద్రవ్యపూరితములగుబండ్లు, వృషభేంద్రములు, భారములమోయునెద్దులు, మదకరులు లెక్కపెట్ట నలవిగానియట్లు బృందావనమున కరిగినవి.

ఎల్లరు బృందావనముచేరిరి. కాని యందు గృహములులేవు. కావున నతివిశాలశీతలచ్ఛాయావిలసితములగు వృక్షమూలముల దిగిరి. అపుడు శ్రీకృష్ణమూర్తి గోపకులం గాంచి మీాకిష్టగృహము లిందుఁగలవు. ఈదిన మిందుండుఁడు. అనెను. శ్రీకృష్ణవాక్యముల నాలకించి శ్రీహరీ! మాకు గృహము లెం

దుఁగలవు? అని మరల భగవంతునిఁ బ్రశ్నించిరి. వారిపల్కులు విని శ్రీహరి యిట్లునుడివెను. గోపకులారా! ఈవనమునందే దేవనిర్మితములు మనోహరగృహములుగలవు. దేవతాప్రీతిపాత్రులు కానివారల కవి లభింపవు. చూడనుగూడ. వీలులేదు. కాన నోగోపకులారా! నేఁడునిలువుఁడు. వనదేవతలఁ బూజింపుఁడు. రేపుదయము మనోహరపద్ధతి నిర్మింపఁబడిన దివ్యగృహముల నివసింపఁగలరు. ఇదిసత్యము. అందు మీకు మహానందముగలుగు. ధూపదీపనైవేద్యముల చేతను, బలివస్తువుల చేతను, జందనాగురుప్రముఖపరిమళవస్తువులచేతను, దివ్యప్రసూనముల చేతను, *వటమూలనివాసినిని జండికాదేవిని బూజింపుఁడు.

ఇట్లు కృష్ణుండుపలుక గోపకులెల్లఁ దదుక్తప్రకారము చండికను బూజించిరి. ఆదినమునఁ జక్కఁగ భుజించి రాత్రి సుఖనిద్ర చేసిరి. ఈరీతి గోబాలకు లాదినమంతయు బృందావన సౌందర్యమును దిలకించుచు, నిచ్ఛానుసారము తిరుగుచు, శీతలచ్ఛాయాతరువులంగాంచి ప్రమోదించుచు, సలిలాశయముల విలోకించి మహానందమున నోలలాడుచు గుంపులుగాఁ గూడియు నొంటిపాటునఁ దిరిగియు తృణకాలమట్లు దినమును గడపిరి.

మహానుభావులారా! యిందలివిశేషముల నించుక యాలకింపుఁడు. ఓపికం బూనుఁడు. అధికప్రసంగమని యాక్షేపింప

* దేవీంచ వటమూలస్థాం పూజాం కురుత చండికాం-ఆనిమూలము

కుఁడు. విషయము కడుంగడుంగొప్పది. కాని నాకుఁ దెలిసిన భాగము కొంచెమే. దానినే వ్రాయఁదలఁచితిని రాధాదేవి శాపకారణమునఁగదా జన్మించెను. శ్రీదాముఁడు తజ్జనకుఁడు కదా. శ్రీదామాదులెల్ల నందాజ్ఞావశవర్తులే. నందరాజ్యమున నుండువారలే. కావున వారెల్ల బృందావనమునకుం బోవనుం కించిరి. గ్రామనివాసమునకంటెఁ జల్లనివనముల నివసించుటయే మేలని వారిభావమయ్యెను. గ్రామమున నున్న బాధలు వనమున నుండవనుటయు సిద్ధాంతమే. గోధనమున కందుఁ దగినస్థానములు కలవు. పచ్చికబయళ్లుగలవు. మంచినీరుగలదు. చల్లఁగఁ బరుండఁ జోటులుగలవు. దుష్టమృగబాధలులేవు. కావున వారెల్ల బృందావనమునకుంబోయిరనుటలో విచిత్రమేదియుఁ గానరాదు. ఒకక్కని శేషము గనఁబడుచున్నది. అదియే మన మీగాథనుండి కనుఁగొనఁదగినది. కనుఁగొంటిమని యూరకుండక తన్మార్గమునఁ బ్రవర్తింపఁదగినది.

శ్రీకృష్ణపరమాత్మ బృందావనమున గృహములులేవని యించుకవిచారించి యేదో యొకతావుననుండిన గోపాలకుల వీక్షించి గృహములిందుఁగలవు కాని దేవతాభక్తిలేనిచో నవి కానరావు. భక్తియుక్తులరై వనదేవతలఁ బూజింపుఁడు. అందుఁ బ్రధానదేవతయగు చండికాదేవిని సకలవిధోపచారములఁ బూజింపుఁడు. రేపుదయము దివ్యహర్మ్యములంబోలు గృహములు చక్షుర్గోచరములగు. అని యుపదేశించెను. అందు

వటమూలముననుండు శ్రీచండికను బూజింపుఁడీ యని హిత
మును దెలిపెను.

దేవీంచవటమూలస్థాం పూజాం కురుతచండికామ్.

అని మూలమున శ్రీకృష్ణవాక్యముగాఁ గన్పట్టుచున్నది.
ఇదియే యిందలిరహస్యము. దాని వినుఁడు.

శ్రీకృష్ణమూర్తి లీలామానుషవిగ్రహుఁడగు పరమా
త్మ. ఆ మహాపురుషుఁడే వటమూలస్థితయగు చండికను బూజిం
పుఁడనియెఁగదా ఏల? జనాకీర్ణమగుస్థలములయందు దేవత
లుందురు. వనముల విశేషించియుందురు. ఇందునందు నననేల?
సకలప్రదేశములయందును దేవతలుందురు.

శ్రు. యేవృక్షేషు సస్పింజరా నీలగ్రీవావిలోహితాః
యే భూతానామధిపతయో విశిఖాసః కపర్దినః
యే అన్నేషు వివిధ్యంతి పాత్రేషు పిబతో జనాన్
యే పథాం పథిరక్షయ ఐలబృదాయ వ్యుధః
యే తీర్థాని ప్రచరంతి సృకావంతో నిషంగిణః
య ఏతావంతశ్చ భూయాగ్ంసశ్చ దిశో రుద్రావితస్థిరే
తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వాని తన్మసి
యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యో
రుద్రో విశ్వా భువనావివేశ తస్మై రుద్రాయ నమో అస్తు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఇట్లు వేదమున దేవతలు లేని తావులు లేవనియు నాయా తావులకుం బోయినపు డాయాయి దేవతలకు నమస్కరించి తనపనిం దాఁ జేయవలయుననియుఁ జెప్పఁబడినది. గృహములఁ గట్టఁ బూనుపురుషుఁడు తానే యడవికింబోయి వృక్షరాజము నుబూజించి యారేయి సుఖనిద్ర చేయవలయుననియు, నారేయి స్వప్నమున దేవతానుజ్ఞయైనచో నావృక్షమును ఛేదింపవలయుననియు లేకున్న దానిఁగొట్టకుండఁ బోవలయుననియు వాస్తుశాస్త్రమునఁ జెప్పఁబడినది. దీనిచేతనుగూడ వృక్షాధిదేవతయున్నట్లు కనుపట్టు. వటవృక్షము త్రిమూర్త్యాత్మకమని ప్రతీతిగలదు. అనేకబాధలు తత్ప్రదక్షిణములచేఁ దొలఁగుట కన్నులారఁ గాంచుచున్నవారము. వృక్షశక్తికంటెఁ దదధిష్ఠానదేవతాశక్తి యధికము. దేవతలు భక్తిచేఁ బ్రీతులగుదురు. కావున భయభక్తులతో సేవించినవారికి దుష్టగ్రహచారబాధలఁ దొలఁగించి సుఖములఁగూర్తురు. కర్మశేషముండినచో ఫలముగలుగదు! దానఁ దత్ప్రదక్షిణములు నిష్ఫలము లనరాదు. కర్మశేషమున్నదని భావింపవలయును. ఇట్లు వృక్షములయందు విశేషించి దేవతలుందురనియు, నందును వటాశ్వత్థాదిమహావృక్షములయందుఁ బెక్కుమంది దేవత లుందురనియు శ్రుతులు ఘోషించుచున్నవి. శాస్త్రములు హెచ్చరించుచున్నవి. పురాణములు నెత్తిననోరుపెట్టుకొని వాపోవుచున్నవి. కావున వృక్షమూలములఁ బూజించిన నేమిలాభమను మాట పాటింపఁదగదు. అది నాస్తికోక్తివంటిది.

ఇఁక వటమూలమునఁ జండికాదేవిని బూజింపుఁడను శ్రీ కృష్ణమూర్తి యుపదేశాభిప్రాయమును వినుఁడు. భగవంతుఁడు సర్వాంతర్యామి. నిర్లిప్తుఁడు. నిరాకారుఁడు. నిర్గుణుఁడు. నిరంజనుఁడు. అట్టిభగవంతుని ధ్యానింపఁ బూజింప నుతింప శక్యము కాదు. అట్లైనచో భక్తులు తరించుటెట్లు? అనునదియే పెద్ద ప్రశ్నము. శ్రీభగవంతుఁడు భక్తానుగ్రహార్థము వివిధరూపముల నవతరించును. స్త్రీపురుషరూపములుగా నవతరించి వివిధనామముల నొప్పు నాపరాత్పరుని తత్తదుచితకర్మముల నొనరించినవా రుపాసింతురు. తరింతురు కొందఱు ఐహికఫలములనే పొందుదురు. కొంద ఱాముష్మికఫలములనే పొందుదురు. ఇందులకుఁ గారణము దేవత గాదు. ఈయుపాసకునికర్మమే. ఫలమునుగోరిన తపస్సు ముక్తినీఁజాలదు. భగవత్సమర్పణముగాఁ దపఃఫలము నుద్దేశించిన వారు ముక్తికిఁ బాత్రులగుదురు. కావుననే భగవద్గీతోపనిషత్తునందు,

మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః.

అని చెప్పఁబడినది సుసంగతమే. క్రూరత్వము దేవతయందుఁ గానరాదు. తదుచితకార్యమునం గ్రూరత్వముగలదు నృసింహమూర్తి నుపాసించువారికి ముక్తిలేదనవచ్చునా? కార్యమునుబట్టి భగవంతుఁడు తదుచితాకారమును దాల్చును. కాళిని బూజించువారలకు శాంతము గలుగదనిచెప్పుటయు వెఱ్ఱితనమే. కాఁబట్టి వివిధనామములరూపముల వెలయు సర్వే

శ్వరుఁడు సగుణబ్రహ్మమని పిలువంబడును. సగుణమనఁగాఁ బ్రకృతితోఁ గూడుట. ఆస్థితియందే యాభగవంతుని నిష్కాముఁడై యుపాసించిన ముక్తిపదము కరతలామలకము.

ప్రకృతము శ్రీకృష్ణమూర్తి చండికాంబను బూజింపుఁడనియె. చండికయనఁగా లక్ష్మీసరస్వతీకాళీవిశిష్టరూపము. అనఁగా సత్త్వరజస్తమోగుణవిశిష్టరూపమని భావము. అట్టిచండికను శ్రీకృష్ణమూర్తి పూజింపుఁడని చెప్పెఁగదా. ఇది సంగతముకాదని కొందఱు దేవానాంప్రియులు వాదింతురు. అది మిగుల పొరపాటు. చండిక శివశక్తియని చెప్పరాదు. శాక్తమనఁగా ప్రకృతిని బూజించుటయన్నమాట. శక్తియనఁగాఁ బార్వతిమాత్రమే గాదు. శ్రీదేవియు, సరస్వతియు నగును. అవయవిగా భగవంతు నుపాసించుటయే శాక్తమని పేరు. కాన వైష్ణవులును శాక్తులే. అందఱును శాక్తులే. శాక్తులుగానివారు ప్రపంచమున నేమతమునను లేరు. నిరాకారు నుద్దేశించి నామరూపముల ధ్యానింప వీలుండదు. కాన సగుణబ్రహ్మము నుపాసింపవలయు. అదియే శాక్తమని చెప్పఁబడును. శాక్తులు దురాచారరతులు అన్నమాట న్యాయముగాదు. దురాచారరతులు గలరనుట యసత్యముకాదు కాని అదిశాక్తధర్మముమాత్రము గాదు. శాక్తము పరిశుద్ధయోగమతము. శాక్తమునకుఁ బ్రతిఫలము జితేంద్రియత్వము. మద్యపానము మాంసభక్షణము గలదన్నమాట యథార్థమే. కాని క్షత్రియాదుల కట్టి పూజ చెప్పఁబడినది.

బ్రాహ్మణో మదిరాం దత్వా బ్రాహ్మణ్యా దేవహీయతే.
అని కాళివాక్యము వినఁబడియెడు.

'యదన్నం పురుషో భుఙ్క్తే తదన్నం తస్య దేవతాః'

అనుట యసంగతమా. ఏయన్నము విధిప్రకారము ఏపురుషుఁడు భుజించునో ఆయన్నము తత్పూజితదేవత లంగీకరింతురని భావము. కావున వర్ణాశ్రమధర్మముల ననుసరించి శాక్తులు పూజింతురు. శబరియిచ్చిన ఫలముల శ్రీరామపరబ్రహ్మ మంగీకరింపలేదా. కావున శాక్తమతము సర్వమతములయందిమిడియున్నది. నేను శాక్తుఁడను గానని చెప్పుట అతనికి మతమననేమో సత్యముగాఁ దెలియకయే యని బుద్ధిమంతుఁడు గ్రహింపవలయును.

## వైష్ణవశాక్తము.

శ్రీమహావిష్ణువు విరాట్పురుషుఁడు. శ్రీదేవి మూలప్రకృతి. తద్భవ మీబ్రహ్మాండజాలము. తదంశభూతులే ఇతరదేవతలు. వేదములు భగవన్మహిమమును దెలుపునవి. ఇందు భగవంతునికృపనొందుట శ్రీదేవీమూలముగనే. ఏలయనఁగాఁ బ్రకృతివిశిష్టుఁడైనపుడే భగవంతుఁడు రూపవంతుఁడు. లేకున్న నిరంజనుఁడు. నిర్వికారుఁడు. ఆతత్త్వము నుపాసించుటెట్లు? కాఁబట్టియే విష్ణుభక్తులు శ్రీదేవి నుపాసింతురు. శ్రీదేవియన్నఁగా శ్రీమహావిష్ణువు నిచ్ఛాశక్తి. తద్విశిష్టుఁడయినపుడే సృష్టి. లేకున్న లయము. ఇచ్ఛను భగవంతునుండి వేఱుచేయ శక్యముగాదు.

కాఁబట్టి విష్ణ్వనపాయిని శ్రీదేవియన్నమాట సత్యము. ఈపూజకులే శాక్తులు.

ఇట్లే అన్నిమతములవారును గ్రహింపవలయును. ఈవిషయము కవితార్కికసింహులు సర్వతంత్రస్వతంత్రులునగు శ్రీవేదాంతదేశికులు శ్రీస్తుతియం దిట్లు వివరించిరి.

మానాతీత ప్రథితవిభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయంతీం స్వకాంత్యా!
ప్రత్యక్షానుశ్రవికమహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే.
శ్రేయస్కామాః కమలనిలయే చిత్రమామ్నాయ వాచాం
చూడాపీడం తవ పదయుగం చేతసాధారయంతః,
ఛత్రచ్ఛాయా సుభగశిరస శ్చామరస్మేరపార్శ్వా
శ్లాఘాశబ్దం శ్రవణముదితాః స్రగ్విణ స్సంచరంతి.

మహాత్ములభావము లెంతశ్లాఘ్యములో పరిశీలించితిరి గదా. శ్రీమద్రామానుజాచార్యులు సకలగ్రంథములు పరిశీలించియే శ్రీదేవికిఁ బ్రాధాన్యము భక్తోద్ధారణమున నంగీకరించిరి. అట్టిమహాత్ములకు భేదమేమియుండును. సర్వదేవతల నుపాసించుట శక్యముకాదుగాన నిష్టదేవత నొక్కని నుపాసించుట సహజముగాన వారు శ్రీమహావిష్ణువు నుపాసించిరి.

ఇట్లు శాక్తమనఁగా భగవదుపాసనమని యర్థమును గ్రహింపుఁడు. దేవతాదూషణము తొలఁగును. సర్వమతముల

ధర్మములు సమానములన్న భావము దృఢమగును. దేవతాభేద మడుగంటును. ఆర్యులారా! ఎక్కువగా వ్రాయఁజాలక వదలు చున్నాఁడను. శ్రీకృష్ణమూర్తి తనయిచ్ఛాశక్తియగుచండికను బూజింపుఁడని యాజ్ఞాపించెను. స్త్రీ దేవతల నుపాసించుట శీఘ్ర ఫలముకొఱకే యని యెఱుంగవలయు. చండికను దుర్గాదేవి యను నామాంతరముగలదు. ఆదుర్గలు తొమ్మండ్రుగురు. అందు వనదుర్గ ప్రధానదేవత. వటమూలనివాసినియగు చండికను బూజింపుఁడని భగవంతుఁ డానతిచ్చెను. దేవతానుగ్రహము లేకున్న గృహములు కనఁబడవని తెల్పెను. కావున దేవతాంతరదూషణ ముచేయరాదని దీనినుండి గ్రహింపవలయును. ఇంతట నీవిష యమును "అతి సర్వత్ర వర్జయేత్" అన్నసూక్తి ననుసరించి వదలి యవ్వలికథాభాగమును వ్రాయ లేఖినిం ద్రిప్పుచున్నాఁ డను

శ్రీకృష్ణునియిచ్ఛానుసారము నందాదులు గోపబృంద ములఁగూడి బృందావనమును బ్రవేశించిరి. అదినము శీతవృక్ష చ్ఛాయల సుఖముగఁ గాలముం గడపిరి. సకలఫలభరితములగు నావృక్షరాజములం గాంచి పరమానందభరితులైరి. యాదవు లకు గోధనము ప్రధానము. ఆగోరత్నములకుఁదగిన ఘాసము గలదు. తీయనినీరుగలదు. చల్లనితావులు విశ్రమార్థము పెక్కు లుగలవు. ఆరోగ్యమును గలిగించుగాలి యందుఁగలదు. గోవుల కేవిధమున నేమాత్రము లోపముకలుగకుండుటయే యాదవు లకు మహానందము. ఆబృందావనమున నాపగలు రాత్రియు

మహావినోదములం గడపిరి. గోలమును విడిచితిమన్న విచారము వారి కిసుమంతయుఁ గలుగలేదు. ఇంక బృందావనమహిమ మెట్టిదియో దానివ్యుత్పత్త్యర్థమెట్టిదియో మీరు వినవలయు. సావధానముగా నాలకింపుఁడు. ఆవనవైభవవర్ణనము మహాపావనముగాన భక్తులగుమీ రాలకింపవలయు.

## బృందావనవర్ణనము.

* 'హృదయే మమ హృద్యవిభ్రమాణాం
హృదయం హర్షవిశాలలోలనేత్రమ్,
తరుణం వ్రజబాలసుందరీణాం
తరళం కించన ధామ సన్నిధత్తామ్.'

నారదమునివర్యునకు శ్రీకృష్ణకథలఁ దెల్పుచు నారాయణుండు మఱియు నిట్లనియె. మునివర్యా! బృందావనవృత్తాంతమును వినుము. అది యపారమహిమాన్వితము. భగవన్నామాంకితము. కావున శ్రద్ధాయుక్తుఁడవై యాలకింపుము. శ్రీకృష్ణునాజ్ఞానుసారమందఱు బృందావనమున నాఁడుసుఖముగఁ గాలముం గడపి నిద్రించిరి. మాతృవక్షస్థలమున నిద్రేశుఁడగు శ్రీకృష్ణుఁడు పరుండెను. గోపికలు నిద్రించిరి. వారిశయ్యలు విచిత్రరమ్యములు. కొందఱు ప్రాణనాథులంగూడి శయనించిరి. కొంతమందియంగనలు శిశువులం బరుండఁ బెట్టుకొని పండు

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము పదునేడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినదని గ్రహింపవలయు.

కొనిరి. కొందఱు సఖీజనులంగూడి శయనించిరి. కొందఱు శకటంబులయందే పరుండిరి. కొందఱు స్యందనములందే సుఖనిద్ర చేసిరి. కొందఱు మనోహరమై పూర్ణేందుకౌముదీవిరాజితమగు భూభాగమున మృదుశయనంబులఁ బరుండిరి. ఆచోటు స్వర్గమునకన్న మనోజ్ఞముగనుండెను. కొందఱు నానావిధపరిమళమృదులకుసుమవిసరసాంద్రం బగుభాగమున శయనించిరి.

ఇట్టు లాబృందావనమున నందఱు శయనించియుండఁ జీమచిటుక్కుమన్నను వినఁబడునంత నిశ్శబ్దముగనుండ నైదవ ముహూర్తము గడచెను. అనఁగా రాత్రియందు మూఁడవ భాగము గడచెనని భావము. అత్తఱి నొకవిచిత్ర మందు జరగెను. అపగలు సకలయాదవులంగూర్చి శ్రీకృష్ణమూర్తి దుర్గనుపాసించిన గృహములు కనఁబడుననియు లేకయున్నఁ గనఁబడవనియుఁ దెల్పెఁగదా. ఆమాటల కానందమొంది యందఱు నిశ్చలభక్తితో దుర్గ నారాధించిరి. భగవన్మనసునం దీరాత్రి గృహములు వెలయవలయునని సంకల్పముపుట్టగనే తదాజ్ఞను శిరసావహించి శిల్పగణాచార్యుఁడు, గురువులకు గురువు నిజభృత్యులంగూడి యచ్చటి కరుదెంచెను. ఆమహాత్ముఁడు దివ్యాంశుకముసుధరించి మనోహరరత్నమాల్యమును వక్షస్థ్సలమున వెలుఁగొందఁజేసి మకరకుండలఖచితరత్నకాంతులు సాటిలేక ప్రకాశించుచుండ జ్ఞానముచేతను వయస్సుచేతను వృద్ధులై చూడఁదగిన ట్లొప్పి బాలునివలె మిగుల సుందరా

కారుఁడై కామదేవుఁడా యని తోఁపింపఁజేయుచు శిల్పశాస్త్రమున నాఱితేఱినమూఁడుకోటులశిల్పివరులంగూడి విమలమణులు, మృదుపాటకము, లోహాదిపరికరములుహస్తములం దాల్చి భృత్యు లరుదేర వచ్చెను. ఆభృత్యులు కుబేరవనకింకరులగు యక్షులు. ఆభృత్యులలోఁ గొందఱు స్ఫటికమణిహారధారులు. దీర్ఘస్కంధులు. కొందఱు పద్మరాగాలంకృతహస్తులు. మఱికొందఱు ఇంద్రనీలవిభూషణవిలసత్కరులు. ఇంకనుం గొందఱు స్యమంతరత్నకంకణవిభూషితహస్తులు. మఱియుఁ గొందఱు చంద్రకాంతహస్తులు. యక్షులందుఁ గొందఱు సూర్యకాంతాలంకారాలంకృతకరులు. కొందఱు ప్రభావిశేషభూషణవిభూషితదోర్యుగులు. మఱికొందఱు పరశుహస్తులుగానుండిరి. లోహసారములఁ దాల్చియు, గంధసారములంబూనియు, మణివరములఁ బట్టుకొనియుఁ, జామరములం జెలువారియు, దర్పణముల నలరారియు, స్వర్ణపాత్రఘటాదులవహించియును గొందఱుభృత్యు లరుదెంచిరి.

విశ్వకర్మయు సకలవిధసామగ్రులంజూచి కరముహర్షించి వీనిసాయమునఁ గట్టుపురము మనోహరముగానుండునే యని తలంచుచు నగరమునుగట్ట నారంభించెను. తొలుదొలుత శ్రీపరమేశ్వరుండగు శ్రీకృష్ణమూర్తిని ధ్యానించి యందుఁ బంచయోజనవిస్తీర్ణముగలిగి భరతఖండమున నుత్తమోత్తమ మనఁదగి పుణ్యక్షేత్రమై తీర్థసారమనందగి హరిప్రియతమమై, అందు

వసించుముముక్షువులకు నిర్వాణకారణమై, గోలోకసోపాన మనందగి, సర్వభక్తవాంఛితప్రదమై, చతుష్కోటియై, చతుశ్శాలమై, మిగుల మనోహరమై యలరార నగరమును నిర్మించెను.

అందలిగృహవర్యములు కవాటస్తంభసోపానసహితము లై సురుచిరప్రస్తరవరనిర్మితములై, విచిత్రపుత్తలికాపుష్పకల శోజ్జ్వలశేఖరములై, శైలవశానీతపాషాణవేదిప్రాంగణశోభిత ములై, శిలాప్రాకారసంయుతములై యమరియుండెను. అట్టి నగరవర్యమును లీలామాత్రమున నలవరించెను. కొన్నిమందిర ములకు మహాద్వారములు. కొన్నిగృహముల కల్పద్వార ములు. అవి స్ఫటికాకారమణివినిర్మితస్తంభములు, లోహసార కవాటములు రాజతకలశములు, వజ్రసారవినిర్మితప్రాకార ములు వెలయఁ గొన్నిహర్మ్యములు మహానందమును గలిగించు నట్లు విరచించెను.

వల్లవుల కందు యథోచితముగ స్థానములు నిర్మింపఁబ డియె. అంత వృషభానునకు దివ్యసౌధమును నిర్మింప నారంభిం చెను. ఆసౌధమునకుదివ్యప్రాకారములు, అగాధపరిఖలు, చతు ర్ద్వారములు, మనోహరవింశచ్చతుశ్శాలములు గలిగియుండెను. మహామణివినిర్మితములై యాయాయిభాగములు తనరారుచుం డెను. మఱియు నాదివ్యప్రాసాదము రత్నసారవికారతూలికా నికరములచేతను, సువర్ణాకారమణివినిర్మితాతిసుందరారోహ

ములచేతను, లోహసారకవాటములచేతను, మిగుల మనో హరమైయుండెను. దానియం దంతర్మందిరములుగలవు. అవి యొక్కొక్కటియు సువర్ణకలశోజ్జ్వలము. ఆమందిరవరము బృందావనైకదేశమున నిర్జనమై యతిమనోహరమునగుస్థలమున మృదులతమచంపక వృక్షప్రధాన మహోద్యానాభ్యంతరమున, కళావతీదేవీసుఖార్థము మణిసారముల నేర్చికూర్చి యట్టాల కాలయ మనుపేర విరాజిల్లఁజేసెను. అది యింద్రనీలమణులచేఁ గట్టఁబడినతొమ్మిదియంతరములు (అనఁగా నొకదానిపై నొకటిగ నుండునట్లు కట్టఁబడినవి) కనుపట్టుచుండెను. గంధసారవికారము లగు స్థూణాకవాటనికరములు చూడఁజూడ వేడుకఁగా నం దమరియుండెను. అయ్యవి 'అత్యుచ్ఛ్రితములై మనోరమ్య ములై యొప్పుచుండెను. అని నారాయణమూర్తిపలుక నార దుం డాదరమున నిట్లు ప్రశ్నించెను.

## కళావతీవృత్తాంతము.

మహాత్మా! నారాయణమూర్తీ! కళావతి యెవ్వతుక? ఆమె యెవ్వనిభార్య? ఆమెకొఱకు ఆదివ్యహర్మ్యమును విశ్వ కర్మ ప్రయత్నపూర్వకముగా నిర్మించెనుగదా. ఆమహాత్మ్య చరితమును దెలుపుమా యని వేఁడ నారాయణుం డిట్లుపలి కెను. నారదమునీ! కళావతీచరిత్ర మాలింపుము. కళావతి పితృదేవతల మానసపుత్రిక. కమలాంశసంభూతురాలు. కళావ తియనుపేర విఖ్యాతినొందెను. వృషభానునకు భార్య. పతివ్రత

పరాయణురాలు. ఆమె పుత్రికయే శ్రీకృష్ణప్రాణాధికప్రి యయగురాధాదేవి. శ్రీకృష్ణార్ధాంశవతి. తేజస్సుచే శ్రీకృష్ణ సమానయునగు. ఈభూమి ఆరాధాంబాచరణారవిందరజస్సం స్పర్శమునఁ బవిత్రయగును. ఆమహాదేవియందు దృఢభక్తినే స్సజ్జనవరులు సంతతము వాంఛింతురు.

అనవిని నారదముని మరల నిట్లు ప్రశ్నించెను. మహా త్మా! పితరులమానసీపుత్రి వ్రజమున నుండనేల? మానవుఁడగు వృషభానుఁడు సుదుర్లభయగు నాకన్యక నేపుణ్యమున భార్య గాఁబడసెను? వృషభానుఁడు వ్రజాధిపతిగా నెపుడుండెను? ఆతనికి శ్రీరాధాదేవి యేపుణ్యమునఁ బుత్రికయాయెను? అని నారదముని ప్రశ్నింప జ్ఞానివరుఁడగు నామహాముని వచనమును విని నవ్వి ప్రీతిచేఁ బురాతనేతిహాసమును దెల్పఁబూని యిట్లు పలికెను.

మునివరా! వినుము. పూర్వము పితృదేవతలకు ముగ్గురు మానసీపుత్రికలుండిరి. కలావతి, రత్నమాల, మేనక యని వారి పేరులు. వీరు దుర్లభదర్శనులు. అందు రత్నమాల జనకుని వరించెను. హర్యంశసంభూతుఁడయి శైలాధిపతియగు హిమవం తుని మేనాదేవి వరించెను. రత్నమాల కొమరిత అయోనిసం భూత సాక్షాచ్ఛ్రీదేవియు నగుసీత శ్రీరామునకుఁ బత్నియ య్యెను. ఆమె సత్యపరాయణురాలు. మేనకాదేవికిఁ గన్యక కల్గెను. పార్వతియని యామెపేరు. ఆమెయు నయోనిసంభూ తురాలు, సనాతని. ఆదేవి నారాయణాత్మని శంకరునివరించెను.

కలావతియు మనువంశసముద్భవుఁడగు సుచంద్రుని వరించెను. ఆరాజు హరియంశమున వెలసినపుణ్యమూర్తి. ఆరాజచంద్రుఁడు కలావతిని బెండ్లియాడి తన్ను గుణవద్భార్యనిఁగా భావించెను. ఆకలావతీ రూపము, వేషము, నవవయస్సు, సుకోమలాంగము, శరచ్చంద్రాధికాననము ననునివి వర్ణనాతీతములు. ఆమెగమనము గజఖంజనగంజనము. ఆమె మునీంద్రులమానసమును గూడఁ గటాక్షముల మోహింపఁజేయఁగలదు. శ్రోణీయుగ్మము లలితము. రంభాస్తంభవినిర్మిత మనఁదగినది. అతిపీనోన్నతమగు నురోజద్వంద్వము నుత్యము. నితంబయుగళము రథచక్రవినిర్మితము. మనోహరమునగు. హస్తములు పాదములు రక్తవర్ణములు. అధరము పక్వబింబఫలాకారము. దంతములవరుస పరిపక్వదాడిమీబీజాభము. లోచనములజంట మధ్యాహ్నకాలమునఁ బద్మములఁ దిరస్కరించు ప్రభావంతము. భూషణములకు భూషణమునఁదగు నామెశరీరము సద్రత్నభూషితము.

అని తలపోసి యారాజచంద్రుఁడు కామబాణప్రపీడితుఁడై దివ్యస్యందనారూఢుఁడై తనయం దవ్యాజప్రేమమునఁ దమకపడుచున్న కాంతారత్నముంగూడి మనోహరములగు ప్రతివిహారస్థానములయందును గ్రీడించెను. మనస్సున కింపుఁ బెంచు మలయద్రోణియందుఁ జందనాగురువాయువులు వీచుచుండఁగా విహరించెను. అందుఁ జారుచంపకశయ్యలయందు

రతిశాస్త్రపండితుఁ డౌట సుఖాంభోధి నోలలాడెను. మాలతీ మల్లికోద్యానమందును, పుష్పభద్రానదీతీరమందలి కేతకీవనమందును, పడమరసంద్రముతీరముననున్న జంతుశూన్యవనముల యందును, నందనవనమందును, మందరద్రోణియందును, కావేరీతీరదివ్యకాననమందును, ఇవ్వియుఁగాక ప్రతిపర్వతమందును, ప్రతినదియందును, ప్రతినదమునందును, ప్రతిద్వీపమందును, ఆతనిఁ గూడి విహరించెను. నవసంగమసంయోగమువలన దివానిశలను భేద మెఱుంగఁ జాలఁడయ్యెను.

ఇట్లు కాంతారత్నముంగూడియుండు నామహాత్మునకు వర్షసహస్ర మొక్కముహూర్తమువలెఁ దోఁచెను. అంతఁ గొంతకాలమున కాప్రభువతంసునకుఁ జిరకాలవిహారమువలన విరక్తిపొడసూపెను. వెంటనే భార్యంగూడి వింధ్యాద్రియందుఁ దప మొనరింపఁ బోయెను. అందుఁ బులహమునివరు నాశ్రమముగలదు. అది యుత్తమోత్తమము. అందు నియతుఁడై దివ్యవర్షసహస్రము తప మొనరించెను. నిరాహారుఁడు కృశోదరుఁడునై నిస్పృహుఁడై మోహాపేతుఁడై దపముచేసెను. శ్రీకృష్ణపదారవిందధ్యానమున నొక్కనాఁడు మూర్ఛపోయెను. అత్తఱిఁ జీమలు పుట్టలుపెట్టసాగఁగా నాతనిభార్య వానిని దొలఁగించుచుండెను.

అంతఁ గలావతి నిశ్చేష్టితుఁడై పడియున్న ప్రాణనాయకుం గాంచి పంచప్రాణవిరహితుఁడైనట్లు తలంచి మాంసశోణిత

విహీనమై, అస్థిసంసక్తవిగ్రహమైన యాకృతింగాంచి గట్టిగా రోదనముచేసెను. శోకార్తయై తడవు విలపించెను. ఓ ప్రాణ నాయకా! అని సంబోధించి వక్షము మోదుకొనుచు మూర్ఛిల్లి వెంటనే లేచి మహాదీనయై విలపించెను. పతివ్రతలలో మిన్న యగు నాసన్నుతాంగి నిరాహారుఁడై కృశుఁడై నాడీమాత్ర శిష్టతనుఁడైన నాథునిం దిలకించి మఱియు నిట్లు విలపించెను.

ఇట్లు లాకలావతి కరము విలపింప నాసుదతి రోదనధ్వ నుల నాలకించి కరుణానిధియగు పంకజాసనుఁడు మనస్సు కరు ణచే ద్రవింపఁగా నామె యెదుట నావిర్భవించెను. భగవంతుఁ డగునాలోకవిభుఁడు ఆరాజును గ్రోడమం దునుచుకొని దుః ఖించి కరుణాకరుఁడు కానఁ గమండలూదకమున నారాజవిగ్ర హమును దడిపి ప్రాణముల నొసఁగెను. బ్రహ్మజ్ఞానమున నాత నికి జీవనములఁ బ్రసాదించిన నారాజచంద్రుఁడు చేతనముం గాంచి యెదుటనున్న సకలలోకకర్తను దిలకించి నమస్కరిం చెను. ఇట్లు లానందపరవశంబున నమస్కరించిన యానృపవరుం జూచి కరుణమెఱయఁ బ్రజానాథుఁడు వరమును వేఁడుమనియె. ఆమాట లాలించి నిర్వాణమే నాకభీష్టవరమని ప్రార్థించెను. అత్తరుణమున నిట్లు పలికెను. మహానుభావా, విజ్ఞాననిధీ! కరు ణానీరనిధీ! అభీష్టవరమును బ్రసాదింపవచ్చితివి. నీమోమును సుప్రసన్నమైనది. కాన నిర్వాణమును బ్రసాదింపుమా యని వేఁడెను.

అంతఁ గళావతి మనసున ననుమానించుచు శుష్కకంఠోష్ఠతాలుకయై పతివ్రతాశిరోమణి కావున భయంపడుచు వరమునీయఁ దలఁచియున్న బ్రహ్మను గాంచి యిట్లు వేఁడెను. కమలోద్భవా! యీనరేంద్రునకు ముక్తిని బ్రసాదింతువేని ఆప్రాణినే నమ్మి యబలనై దీనురాలైయున్న యీనాగతియేమి? వచింపుమా. చతురాననా! ప్రాణకాంతు నెడఁబాసినచో నారీమణికి శోభయెక్కడిది? పతివ్రతకు వ్రతము భర్తయే కదా. ఈమాట శ్రుతిప్రసిద్ధముకదా? ప్రాణేశ్వరుఁడు గురువు. అభీష్టదేవత. తపోధర్మమయుఁడునగు అందఱికన్న మిగులఁ బ్రీతిపాత్రుఁడు నాథుఁడే. ఆభర్తనువదలిన ప్రియబంధువు వేఱొకఁడు వనితకు లేఁడు. బ్రహ్మదేవా! సర్వధర్మములకంటె సుదుర్లభమనఁబడు పతిసేవయే ముఖ్యము. భర్తృసేవావిహీనయగు నాతికి మఱియేధర్మములును నిష్ఫలములు. వ్రతదానతపఃపూజాజపహోమాదికములు సర్వతీర్థస్నానము, పృథ్వీప్రదక్షిణము సర్వయజ్ఞదీక్షయు, మహాదానములును, సర్వవేదపఠనము, సర్వ తపస్సులు, వేదవేత్తలగు బ్రాహ్మణులకు భోజనమిడుటయు, దేవతలసేవించుటయు ననునీలోనగు మహాకార్యములన్నియు స్వామిసేవాపుణ్యమునఁ బదాఱవపాలునకు సరిరావు. ఏనారి భర్తృసేవాపరాయణురాలుకాదో ఆవనితస్వామిశత్రువను పేరఁ బరఁగునని పెద్దలందురు. అట్టిస్త్రీలు కాలసూత్రనరకమునఁ బడఁగలరు. ఆనివాసము చంద్రసూర్యు లుండునంతదాఁక సాగును. ఆస్త్రీలను సర్వప్రమాణములగు పురుఁగులు

దివానిశములు పొడుచుచుండును. ఆబాధల కోర్వఁజాలక మహాదైన్యమున వా రేడ్చుచుందురు. నిరంతర మట్టి పాపమతు లగుస్త్రీలు మూత్రశ్లేష్మపురీషభక్షణము చేయుచుందురు. యమ కింకరు లవ్వారిముఖములం దయశ్శంకువుల నాటుచుందురు. ఇట్లు ఎంతోకాలము సకలకష్టముల ననుభవించి మరలఁ గృమి యోనిం బుట్టువుం గాంతురు. నూఱుజన్మములు రక్తమాంసపు రీషముల భక్షించుచు నట్టిజన్మములనే కాంతురు. నారదమునీ! ఈవిషయము విద్వాంసులముఖములనుండియు వేదవాక్యముల నుండియు గ్రహించితిని. మహాత్మా! అబలనగు నేను సుంత యెఱుంగుదు. నీవు వేదజనకుండవు. గురువులకు గురువవు. విద్వాంసులలో విద్వాంసుఁడవు. జ్ఞానులలో జ్ఞానివి. ఇట్టి సర్వ జ్ఞుని నిన్ను నేనీతుచ్ఛవాక్కులచే బోధించుచున్నదానను. *ప్రా ణాధికుఁడగు నాకాంతుఁడు ముక్తినొందిన నన్ను రక్షించువా రెవరు? నాధర్మమునకు నాయౌవనమునకు రక్షకుఁ డెవఁడు? (1) స్త్రీ.

---

* ప్రాణాధికోఽయం కాంతోఽయం యది ముక్తో బభూవహ, మమకో రక్షితా బ్రహ్మన్ ధర్మస్య యౌవనస్యచ. అని మూ. (1) కౌమారే రక్షితా తాతో దత్వా పాత్రాయ సత్కృతీ, సర్వదా రక్షితా కాంత స్తద భావేచ తత్సుతః. త్రిష్వవస్థాసునారీణాం త్రాతార శ్చత్ర యస్స్మృతాః, యా స్వతంత్రాశ్చ తానష్టా స్సర్వధర్మబహిష్కృతాః, అసత్కులప్రసూ తాస్తాః కులటాదుష్టమానసాః, శతజన్మకృతం పాపం తాసాం నశ్యతి పద్మజ, పుత్రస్నేహో యథా బాల్యే తథా యౌవనేచ వార్ధకే, పతిప్రతానాం కాం తేచ సర్వకాలే సమాస్పృహా. అని మూలము.

లకు బాల్యమున రక్షకుఁడు తండ్రి. ఆతండ్రి తగినవరున కొసఁగి రక్షించును. కాంతుఁడు సదా రక్షకుఁడు. ఆకాంతుఁడు లేనిచో బుత్త్రుఁడు రక్షింపవలయు. నారీజనముల కీమూఁడవస్థలయందును రక్షకులు మూవురని చెప్పఁబడును. ఈపద్ధతిని విడనాడి యేస్త్రీలు స్వతంత్రలై యుందురో వారు నశింతురు. వారు సర్వధర్మబహిష్కృతలు. అసద్వంశప్రసూతలు.కులటలు. దుష్టమానసలు నగుదురు. అట్టివా రింతకుముందు నూఱుజన్మముల నొనరించిన పుణ్యము నశించును. బాల్యమునఁ బుత్త్రప్రేమ మెట్లో అట్లే వయోవార్ధకములందుఁ బతివ్రతలగుస్త్రీలకుఁ బ్రాణనాథునియందు సమస్పృహ వెలయును.

పాలుత్రాగుపుత్త్రునియందు స్నేహము తల్లులకు మిగులఁ బ్రశస్తము. ఆస్నేహము భర్తృస్నేహమునఁ బదాఱవపాలున కీడుగాదు. స్త్రీలకు బాలురయందు స్నేహము పాలిచ్చువఱకు నుండును. ఇష్టాన్నమందు స్నేహము భోజనావధియుండును. సతులకు భర్తయందుఁ జిత్తము స్వప్నమందును జ్ఞానమునందును సదా సమముగనుండును. బంధువిచ్ఛేదము దుఃఖాంతము. దానికంటె నధికము పుత్త్రులయందుండును. స్వామివిషయకదుఃఖము మిగుల భయంకరము. దానికంటె భయంకరమగునది లేనేలేదు. భర్త క్రూరమతియయ్యేనేని తద్భార్యయవిదగ్ధమండునగ్నియందుఁ గాష్ఠములవలెఁ దచ్చిత్తము కాలుచుండును. అట్లే విదగ్ధ (చతురురాలు) యగు నారీమణి చతురుఁడగు

భర్త నెడఁబాసినఁ గాలి కూలును. ఏలన నావిరహ మగ్నికంటె భయంకరము. సాధ్వులగుకాంతలకు భర్తలపదలి యన్నమం దుఁగాని నీటియందుఁగాని తృష్ణయుండదు. అగ్నియందు నెం డినతరుశాఖ కాలినట్లు విరహాగ్నియందుఁ బతివ్రతాచిత్తము కాలిపోవును.

*పతికంటె నధికబంధువుగాని, మిత్త్రుఁడుగాని, దేవుఁ డుగాని, గురువుగాని, ధర్మముగాని, ధనముగాని, ప్రాణము లుగాని, ముక్తిగాని లేదు. వీనియన్నింటికంటె నధికుఁడు భర్త యగును. శ్రీవిష్ణుభక్తులకు శ్రీకృష్ణపాదారవిందమం దెట్లు మనసు నిమగ్నమైయుండునో, ఏకపుత్త్రునియందుఁ దల్లిమన స్సెంతప్రీతియుక్తముగనుండునో, కాముకులచిత్త మెట్లు కాంతలయం దాసక్తిఁగాంచియుండునో, చిరకాలార్జిత ధన మం దెట్లు లుబ్ధులచిత్తము ఆసక్తియైయుండునో, భీతులచిత్త మెట్లు భయస్థానమందుఁ జకితముగనుండునో, విద్వాంసుల చిత్తము శాస్త్రములయం దెట్లు నిరుత్సాహముగనుండునో, శిశువులచిత్త మెట్లు స్తన్యపానమున నాశవహించియుండునో శిల్పివరులచిత్త మేలాగున శిల్పములయందు సమాసక్తముగ నుండునో, కులటయగుస్త్రీచిత్తము వార్ధకమం దెట్లు విర

* నహికాంతా త్పరో బంధు ర్నహి కాంతా త్పరః ప్రియః, నహి కాంతా త్పరో దేవో నహి కాంతా త్పరో గురుః, నహి కాంతా త్పరో ధర్మో నహికాంతా త్పరం ధనం, నహికాంతా త్పరాః ప్రాణాః నహి కాంతా త్పరః ప్రియాః. అని మూలము.

క్తమైయుండునో, పతివ్రతలమనస్సు భర్తయం దట్లు సదా ప్రీతిపాత్రమైయుండును. అట్లు ప్రీతిపాత్రుఁడగు భర్తనువదలి యోచతుర్ముఖా! క్షణమైన జీవింప శక్యము కాదు. భర్తను వదలిన స్త్రీలకు మరణమే జీవనము. జీవించుట మరణాధికము.

చతుర్ముఖా! ఇతరబంధువులు భోగదేహాంతమున నశింతురు. భర్తజన్మాంతరమునఁగూడఁ బతివ్రతను వదలఁజాలఁడు. కావున నోమహాప్రభూ! నన్ను వదలి యీనాభర్తను ముక్తునిగా నొనర్చిన నేను నిన్ను శపింతును. అంతియ కాక స్త్రీవధపాపము నీయందు సంక్రమింపంజేసెద. అని యిట్లు కలావతి తనసాధ్వీత్వము నాధారముగా భావించి పలుక విస్మితుఁడై నలువ తన యాత్మలో నీవాక్యములు సుధాతుల్యములు కాన సత్యములు. అని తలంచి భయ మంకురింప నిట్లు పలికెను.

కాంతాశిరోమణీ! నిన్నువదలి నీప్రాణనాథుని ముక్తునిగ నొనరింపనుజుమీ. నీతోఁగూడ నీరాజును ముక్తునిగ నొనరింప నాకిపు డధికారము లేదు. తల్లీ! వినుము. భోగమునుండి కాక ముక్తి దుర్లభము. ఇది సర్వసమ్మతము. భోగియగువాఁడు భోగవిక్రుంతనమందు నిర్వాణత్వమునొందును. చాలకాలము నీస్వామింగూడి స్వర్గభోగము ననుభవింపుము. సాధ్వీ! ఆవల భారతభూమియందు మీకిరువురకుఁ బుట్టుక సిద్ధింపఁగలదు. ఎప్పుడు నీకు రాధికాంబ కుమార్తెగా జన్మించునో అపుడు మీరు జీవన్ముక్తులరై ఆరాధాంబంగూడి గోలోకమునకుఁ బోవఁగలరు.

అనిపలికి రాజేంద్రుంగాంచి ఓరాజపుంగవా! ఇంకనుం గొంత కాలము కలావతింగూడి సుఖమనుభవింపుము. ఈపతివ్రత మిగుల సత్వగుణయుక్త. నీవు నన్ను శపింపఁజాలవు. ఈమె శపింపఁగలదు. ఇంక మీరిరువురు జీవన్ముక్తసమానులుగనుండి శ్రీకృష్ణపాదాబ్జాధీనమానసము లొప్ప నుండుఁడు. భక్తులు శ్రీహరిదాస్యమును వాంఛింతురు. ముక్తిని వాంఛింపరు.

అనిపలికి బ్రహ్మ వారలకు వరములిచ్చి వారియెదుట నుండెను. వారు విధికి నమస్కరించి తమగృహమునకుం బోయిరి. విధియు సత్యలోకమున కరిగెను. ఆదంపతు లిర్వురును జిరకాలము సుఖముల ననుభవించి భరతభూమిని జన్మించిరి. భరతఖండము పరమపావనము. బ్రహ్మాదులకుఁ గోరఁదగినది. సుచంద్రుఁడు వృషభానుఁడై జన్మించెను. అతనినివాసము గోకులము. ఆపావనచరిత్రుఁడు పద్మావతి తల్లిగా సురభానువు తండ్రిగా జాతిస్మరత్వముగలుగ శ్రీహర్యంశమున శుక్లపక్షశశాంకునం బోలి ప్రతిదినము వృద్ధినొందుచు ప్రజాధిపుండయ్యెను. సర్వజ్ఞుఁడై మహాయోగియై శ్రీహరిపాదారవిందసమాసక్తమానసుఁడై * నందునకు బంధువై మహోదాత్తుఁడై రూపవంతుఁడు గుణవంతుఁడునై వృషభానుఁ డలరారెను.

కలావతి కాన్యకుబ్జమున నయోనిసంభవయయ్యెను. ఆమెకు జాతిస్మృతి గలిగియుండెను. పతివ్రతామతల్లి యనఁబరఁ

---

* నందబంధుర్వదాన్యశ్చ రూపవాన్ గుణవాన్ సుధీః—అనిమా.

గెను. సుందరాంగియుఁ, గమలాంశసంభూతయు నయ్యెను. కాన్యకుబ్జమున రాజేంద్రుఁడై భనందనుఁడన వెలసియుండెను. ఆరాజు యజ్ఞ మొనరించుచు యజ్ఞకుండసంభూతయగు కుమారితం గాంచి సంతసించెను. ఆమె వెడలివచ్చునప్పుడు పాలుత్రాగునంతటి యీడుకలదియు, మహారూపవతియు నయి యొప్పారెను. తేజస్సుచే దిక్కులఁ బ్రకాశింపఁజేయుచుఁ, బుటము పెట్టిన బంగరువంటి మేనిచాయ తగియుండ నాబాలిక యల్లారుముద్దుగాఁ బొడకట్టెను. ఆరాజేంద్రుఁ డయ్యాత్మజను వక్షమున నిడుకొని ముద్దిడుకొని తనప్రియపత్ని కొసఁగెను. ఆరాజపత్ని మాలావతి కలావతినెత్తుకొని పాలిచ్చెను. ఆబాలికకు నామకరణముచేయునపుడు, అన్నప్రాశన మొనరించుతఱిని ఆకాశవాణి యిట్లు వినఁబడియెను. "ఓరాజా! ఈకన్యకకుఁ గలావతియని పేరుపెట్టుము." ఈవచనము రెండుపర్యాయములు వినఁబడఁగా రాజు పరమానందమంది యజ్ఞ మొనరించెను. ఆమహోత్సవములతఱి రాజు బ్రాహ్మణోత్తములకు, భిక్షువులకు, వందిమాగధులకు మిగుల ధనమొసఁగెను. నీరుగాక తక్కినవారల కన్నదానమొసఁగి మహోత్సవము గావించెను.

కాలముగడువఁగా నాకలావతి బాల్యమునువదలి యౌవనము నలంకరించెను. అతిసుందరాంగియు మునిమానసమోహినియునయ్యెను. చారుచంపకవర్ణాభయై శరచ్చంద్రతుల్యాస్యయై

పంకజాక్షులైై నితంబశ్రోణిభారార్తయై, వక్షోజభారనతాంగియై యాకలావతి రాజమార్గమున నరుగుతఱి గజేంద్రగామిని యనంబరఁగుచు, నసమానలావణ్యవిరాజితయై యొప్పార నాశ్యామ కన్నులపండువుగా నుండెను. నందుఁ డొకనాఁ డాతన్విం గివీక్షించి ముదన్వితుఁడై రాజితేంద్రియుఁడైనను, జ్ఞానియైనను మూర్ఛాపరవశుండయ్యెను. తనువు కంపమొందఁగా మార్గమునఁ బోవుచున్నవారి నిట్లు ప్రశ్నించెను. ఓజనులారా! ఈకన్యక యెవరికుమారిత? ఎవ్వరిభార్య? అన వారు నందభూపాలా! ఈమె భనందపుత్రి. కలావతియనుపేరఁ బరఁగును. కమలాంశమున రాజమందిరమున జన్మించెను. ఇపు డీమె కౌతూహలమున సఖీమందిరమున కరుగుచున్నయది. ఇఁక నీవింటికింబొమ్మా యని తమదారింబోయిరి.

నందుఁ డంత సంప్రహృష్టమానసుండై రాజమందిరము నకుఁ బోయెను. రథావతరణ మొనరించి రాజమందిరమును బ్రవేశించి సభాస్థలికరిగెను. భనందుఁడు లేచి యెదురుచని కొని వచ్చి యాతిథేయము లాచరించి యర్హాసనమునఁ గూర్చుచుండఁజేసెను. వారి కన్యోన్యమిష్టాలాపములు సాగెను. నందుఁడు వినయావనతుఁడై ప్రస్తావముగా సంబంధవాక్యములు జరపెను.

రాజేంద్రా! నామాట లాలకింపుము. ఇది విశేషవచనముగా భావింపుము. ఇపుడు కలావతీకన్యకను సురభానుసుతుఁడగువృషభానున కొసంగుము. అతఁడు వ్రజేశ్వరుఁడుకదా!

నారాయణాంశసంభూతుఁడు, గుణి, సుందరాకారుఁడు, పండితుఁడునగు. స్థిరయౌవనవవిశిష్టుఁడు, యోగి, జాతిస్మరుఁడు, ప్రాయపుఁబురుషుఁడు. కుమారితయు నయోనిసంభూతురాలు, యజ్ఞకుండమునఁబుట్టిన పవిత్రచరిత్ర. త్రైలోక్యమోహిని, శాంత, కమలాంశసంభవయు నగు. అతఁడు నీదుహితకుఁ దగినవరుఁడు. నీదుహితయు నాతనికిఁ దగినకన్యక. రాజవర్యా! విదగ్ధుఁడగుపురుషునకు విదగ్ధయగుకన్యక నిచ్చుట యోగ్యము సుమా. అనిపలికి నందుఁ డూరకుండెను.

నారదమునీ! యవ్వలిగాథను వినుము.నందుఁ డిట్లు పెండ్లివిషయము ప్రస్తాపింప నాభనందుఁడు వినయముట్టిపడ నిట్లు బదులుచెప్పెను. ప్రజాధినాథా! ఈసంబంధము విధివశము. కాని నాకు శక్యముగానిది. ప్రజాపతియే యోగకర్త. నేను జన్మకారణుఁడను. ఏకన్యక కేవరుఁడుతగునో యది సమకూడునట్లుచేయుట విధికృత్యము. కర్మానురూపఫలదుఁడు. సర్వకారణము ఆవిధియే. వేదములయందుఁ గాఁదగినది కాకమానదని యుద్ఘోషింపఁబడుచున్నయది. అసమర్థుని ప్రయత్నమట్లు విధియత్నమునకు విరుద్ధముగాఁ గార్యము సంఘటిల్లినను నిష్ఫలమగును. వృషభానునకు నాకుమారిత పత్నిగాఁదగినదని వ్రాయఁబడి యుండెనేని అట్లేయగును. ఆమె వివాహము పూర్వమే జరగెను. ఇపు డిద్దాని దృఢపఱుప నీవెవఁడవు? నే నెవఁడను? అని యిట్లు వినయములోలుకఁ బలికి మృష్టాన్నమును భుజింప

జేసి సాగనంపెను. నందుఁడు రాజానుమతినొంది గోకులమును బ్రవేశించెను. సురభాను సభకుంబోయి గతవార్తల నెఱిఁగించెను. సురభానుఁడు సాదరమున నాసంబంధమునకై ప్రయత్నించెను. ఈశ్వరేచ్ఛవలన నాసంబంధము కుదిరెను.

ఆకలావతీవివాహకాలమున విశేషముగ యౌతకమిచ్చి యల్లుని నందుఁడు గౌరవించెను. గజరత్నములను, అశ్వరత్నములను, మణిభూషణములను, గలావతిని వృషభానుఁడు పరిగ్రహించెను. వినిర్మలనిర్జనస్థలముల విహరించెను. దివానిశము లను దెలియఁజాలకపోయెను. ఆకలావతియు స్వామివిరహమును సహింపఁజాలక, నిమేషమునుగూడ నిష్టపడకుండెను. క్షణమాత్రము కలావతీవిరహము గలిగినవృషభానుఁ డోర్వఁజాలకుండెను. మాయామానుషరూపిణియగు నాకలావతి జాతిస్మరణముగలదియైయుండఁ, జాతిస్మృతిగల్గి వృషభానుఁడుండ వారి మైత్రి క్షణక్షణాభివృద్ధినొందెను. కలావతి ప్రతిక్షణము సకామయగుటయు, నాతనిభర్తయుఁ గాముకుఁడగుటయు వారి దాంపత్యమునకు వన్నెదెచ్చుచుండెను.

ఆదంపతులకే కొంతకాలమునకు రాధిక పుత్రికయై జనించెను. గోలోకమున మున్ను సుదామశాపంబునను శ్రీకృష్ణాజ్ఞను అయోనిసంభవయై శ్రీకృష్ణప్రాణాధిక యగురాధ యుదయించెను. ఆరాధాసందర్శనమాత్రమున నాదంపతులు ముక్తులైరి. నారదమునీ! ఈయితిహాసము వచించితిని. కలావతీ

చరిత్రమును వింటివి. రాధాదేవి తత్పుత్రికయనియు నాలకించితివి. ఇఁకఁ బ్రకృతకథాంశమును వినుమని నారాయణమూర్తి యిట్లుపలికెను.

నారదా! ఈగాథ పాపేంధనములకు జ్వాలదగ్నిసదృశము. సర్వార్థసిద్ధిదము. శిల్పివర్యుఁడగు నావిశ్వకర్మ వృషభానుగృహంబున కరిగి తనభృత్యులంగూడి స్థానాంతరము నొకదానిఁగల్పించెను. తత్త్వవిదుఁడగు శిల్పినాయకుఁడు క్రోశమాత్రము మనోహరస్థలమును మనసుచేఁ జక్కఁగా నాలోచించి స్థానము నొకదానిం గల్పించెను.

అవ్వల మహాత్ముఁడగు నందున కాశ్రమంబు గట్టఁదలంచెను. శ్రీకృష్ణనివాసమున కర్హముగ నుండవలయుఁగదా యని తలంచి తనబుద్ధిచమత్కృతినంతయు నుపయోగించి ఇతరగృహవిలక్షణముగఁగట్ట నిశ్చయించెను. గభీరపరిఖలు నాలుగు చెలువారునట్లు లలవరించెను. దాఁటశక్యముగాని ఖనిత్రలు కనఁబడుచుండఁగా, సర్వర్తు కుసుమసంభృతపుష్పోద్యానము లొప్పార, నవి నదీతీరములయం దుండునట్లు, ఆవనములయందు విశేషించి చంపకవృక్షములు పుష్పసంభృతములై కనుపట్టునట్లు, సుగంధివాయువు లన్నికడల వ్యాపించునట్లు, సహకారములోనగుసత్ఫలద్రుమములు వెలయునట్లు నిర్మించెను. ఆయుద్యానరాజియందుఁ బ్రతివృక్షమునందును బుష్పములు ఫలములు నిండియుండునట్టు లలరించెను. మఱియు నాపూఁదోఁ

టలు క్రీడార్హములై, అతిరహస్యములై, కోరఁదగినవియై కనుపట్టుచుండెను. పరిఖలనుండి గృహమును బ్రవేశింప నొక రహస్యమార్గమును నిర్మించెను. అది యరివర్గదుర్గమమై, స్వజన సుగమమై యుండెను.

అందొకసుందరమందిరము కట్టఁబడియె. అది సంకేతస్థలమున నుండెను దానికి మణిస్తంభములుగలవు. ఆ స్తంభములు విచిత్రరీతి నమరుపఁబడియె. చూడంజూడఁ గలిసికొనినట్లులుండు. పరికింప నవి గూడియుండవు. అట్టి స్తంభములచే నలంకృత మగు మందిర మొకఁ డందుఁ గనుపట్టును.

ఆపరిఖలఁజుట్టి ప్రాకార మొండు నేత్రపర్వముగనుండు. దానియెత్తు ధనుశ్శతప్రమాణము. దానిపై నసిపుత్త్రిక లొప్పారుచుండు. అవి యుద్ధసమయములందు వీరభటుల కుపకరించు. ప్రస్తరప్రమాణను పంచవింశతిహస్తపరిమితము. మణిసారకవాటము లద్దానికిఁ గల్పితములు. ఇంద్రనీలకలశముల నాద్వార మలరారుచుఁ జూచువారల కచ్చెరువును గొలుపుననుట యొకవింతగాదు.

ఇట్లు ప్రాకారాదులచే నలర నందగృహము నతిసుందరముగ నిర్మించి నగరనిర్మాణపరీక్షార్థ మెల్లయెడలఁ దిరిగెను. రాజమార్గములు చారుతరములై యుండెను. ఆనదీతీరములఁ జల్లనితావుల రక్తభానువికారములగు వేదిక లమర్పఁబడియుండెను. వ్యాపారమున కుపయుక్తములగునట్లు మణిమంటపము

లందుఁ గన్పట్టుచుండెను ఆమండపములు మార్గములకు రెండు ప్రక్కలయందు నమర్పఁబడినవియే.

ఆవల నాశిల్పివర్యుఁడు విశ్వకర్మ బృందావనమునకుంజని రాసమండలము నేర్పఱచెను. అయ్యది సుందరమై, వలయాకృతిం జెలంగి, యంకెట యోజనాయామముగఁ గనుపట్టుచు, మణివేదికలఁ గమనీయంబై, రత్నమండపముల నయ్యారే! యనఁ జేయుచు, శృంగారార్హములై చిత్రములై, రతితల్ప సమన్వితములై, నానాజాతిప్రసూనాలంకృతలతావితానసాంద్రములై, ఆపూవులనుండి వాయువుగొనివచ్చు మంచివాసనలచే హాయిని గల్పింపంజాలి, సకలపుష్పజలసంభృతసరోవరము లలరార, నా రాసమండలము దేవతలకైన నచ్చెరువుకల్పించుచు నుండెను. ఇట్లు బృందావనమును విచిత్రమండపాదుల నలంకరించి తమిదీఱం గాంచి కరము హర్షించెను.

ఆబృందావనమున మఁ బ్రతిపదమునందును విజనముగా నుండుచోటులఁ న్నింటి నియమించి విచిత్రశృంగారవనముల సృజించెను. అవి ముప్పదిసంఖ్యలుగలవి. అయ్యవి శ్రీరాధామాధవక్రీడార్థమే నియమింపఁబడినవి. ఆవల మధువనమున వినిర్మలమగు నిర్జనస్థలమున వటమూలమున కించుక చెంత సరోవరపశ్చిమతీరంబున శ్రీరాధామాధవులకుమాత్రమే విహారార్హ మనఁదగి, చంపకోద్యానపూర్వభాగమునఁ దనరారి, కేతకీవనమధ్యభాగమునఁ జూడఁదగి యనర్ఘ్యమునగు

నొకరత్నమండల మేర్పఱుపఁబడినది. దానిచుట్టు నాలుగు వేదిక లొప్పుచుండెను. సద్రత్నసారరచితతూలికాశతము లందుఁ దగి యుండెను. తొమ్మిదికవాటము లందుఁగలవు. అవి రత్నవినిర్మిత ములు. చిత్రాకృతిందగినవి. నవద్వారమనోహరములు. రత్నేంద్రచిత్రకలశసంయుతములు. దానికి నన్నివైపుల నెత్తగుకవాటము లున్నవి. వానిపై భాగము వర్ణనాతీతము. వానిపై (నంతస్థులు) మేడలు తొమ్మిదిగలవు. వానిపై భాగముల మణికలశము లమర్పఁబడినవి. సదా పతాకలు, తోరణములు, శ్వేతచామరములు గన్పట్టుచుండ నాదివ్యస్థలము కన్నులపండువుగ నుండును. రత్నదర్పణము లందుఁ గన్పట్టు. దానిప్రమాణము మూఁడువిండ్ల పట్టు. దానియూర్ధ్వభాగము హుతవహశిఖోపమమై కనుపట్టు. వర్తులాకృతియగు ప్రస్తారము శతహస్తప్రమాణము. అందు రత్నఖచితతల్పము లొప్పారు. అరుణవస్త్రములు మాలాజాలవిచిత్రితము లట వెలయు.

ఆచోటు కుంకుమాగురుకస్తూరీప్రముఖ నిఖిలపరిమళసద్వస్తుపరిమిళితములు. నవవిధశృంగారయోగ్యములు. కామవర్ధనహేతువులునగు. మాలతీచంపకప్రసూనహారము లచ్చోటఁ గన్పట్టు. రత్నపాత్రమున సకర్పూరతాంబూల మసుర్పఁబడి యుండు. వజ్రఖచితఘటములందుఁ జెలువారు. రత్నపీఠము లచ్చట ముచ్చటమీఱ నమర్పఁబడియుండు. మణిమయసింహాసనము లలరార, చంద్రకాంతపాత్రనిగళజ్జలబిందువులఁ జూడఁ

దగు పరిమళశీతలజలపూర్ణపానపాత్రము లటఁగలవు. ఇంతియ గాక భోగార్హసకలపదార్థములందు లేనివిలేవు.

ఇట్లు శ్రీరాధామాధవక్రీడామందిరమును నిర్మించి సంతుష్టహృదయుఁడై నగరమున కరిగెను. ఎవ్వరెవ్వరి కేయే మందిరము లేర్పఱుపఁబడినవో అవి తన్నామములఁ జిహ్నితములై యుండెను. వానింగాంచి యవ్విశ్వకర్మ కరముహర్షించి తనశిష్యులగు యక్షగణములంగూడి నిద్రేశ్వరుఁడు శ్రీకృష్ణపరబ్రహ్మముంగాంచి నమస్కరించి తననెలవున కరిగెను.

నారదా! సుకృతులకు సర్వత్ర భగవత్కృప యిట్టిదే సుమీ! ఆనగరము నిర్మించుట యాశ్చర్యమును బుట్టింపక పోదు. ఈశ్వరేచ్ఛవలన నట్లగును. ప్రతికార్యము భగవత్కృపాపాత్రమైన నాశ్చర్యజనకమయిపోగు. ఇది శ్రీహరిచరితము. మంగళప్రదము. సుఖదము. పాతకహరము. మునివరా! ఇంకేమి వినఁగోరుదువు? అవ విని నారదముని యిట్లు ప్రశ్నించెను.

మహాశయులారా! ఈగాథయందలి సారము నించుక వినుఁడు. నావ్రాసినదియకాక యింక నెన్నియో రహస్యసద్విషయము లిందుఁగలవు. భరతఖండమున స్త్రీలపాతివ్రత్యమే యలంకారవస్తువు. దానినిమించిన యలంకార మీఖండమున లేదు. సత్యముగలేదు. మతాచారములు స్త్రీలయాధారమున నింతదనుక నున్నవి. పవిత్రప్రవృత్తినేర్పుట తల్లులపనికదా. వారు పవిత్రచరిత్రలైనఁగాని కులజనితులు పావనచరిత్రులు కా

నేరరు. సద్విద్యయు వారియధీనము. కుటుంబసుఖము తదధీనము. తత్సహాయములేక యేశిశువులు వర్ధిల్లి పవిత్రచరిత్రులు కానేరరు. ఇల్లాలనుమాట యెల్లెడలఁ బ్రసిద్ధమే కదా. కుటుంబమనఁగా నిల్లాలు? కాఁబట్టియే యొకమహాకవి,

'ఇల్లుచూచినఁ దోఁచు నిల్లాలి శుచివృత్తి
కూఁతురు ప్రకటించు మాతగుణము.'

అని వ్రాసెను. ఇల్లాలు లేనిగృహము మఠమో సత్రమో యనుపేర నొప్పంజను. కావుననే మనభరతఖండమున పాతివ్రత్యము ప్రధానముగా భావింపఁబడియె. ఏద్వీపమందైన నిది వలయుననియే సిద్ధాంతము. పతివ్రతలు మునులకంటె మిన్నలని యెన్నఁబడుట యెఱుఁగమా. ఈకలావతీచరిత్రమును జక్కఁగా నూహింపుఁడు. భార్యాభర్తలయధికారము లిటఁ గన్పట్టు.

మొదట సుచంద్రుఁడు కలావతింగూడి యత్యంతకాముకుఁడై పలుతావుల విహరించెను. సకలవిధముల హాయిఁ జెందెను. ఆకాలము సుచంద్రున కొకక్షణముగాఁ గనఁబడెను. కొంతకాలమున కామహాత్మునకు కామసుఖము తుచ్ఛమనుమని తోఁచెను. తనమనసు ననుసరించుభార్యంగూడి సబాన్రవమునఁ దపస్సొనరింపఁబోయెను. ఎన్నియోసంవత్సరములు నిష్ఠమెయిఁ దపస్సొనరించెను. ఆసాధ్వియు నెమ్మనమున నన్నికష్టముల కోర్పుగలిగి మెలఁగుచుఁ బతిసేవానిరతయై యుండెను.

నిరశనవ్రతదీక్షవహించిన భూభర్త తూలిపడిపోయెను. ఆమూర్ఛలోఁ బ్రాణములుపోయినవని కలావతి తలంచి బిట్టు రోదనముచేసెను. భగవంతా! నామొఱ్ఱ యాలింపుమా యని దీనయై వేఁడెను. శతానందుఁ డత్యంతకృపాసాంద్రుఁడై ప్రత్యక్షమయ్యెను. కమండలూదకమునఁ బ్రోక్షించి ప్రాణదానమొనర్చెను. సుచంద్రుఁ డంతట సచేతనుఁడై పరమేష్ఠిం గాంచి నమస్కరించి తదనుజ్ఞాతుఁడై వరముగోరఁదలఁచి ముక్తినడిగెను. బ్రహ్మయు నిచ్చితినని పల్కనంతకుముందే కలావతి పతివ్రతాశిరోమణికాన వలగొని మ్రొక్కినిలిచి స్వామీ యని సంబోధించి భార్యాభర్తలకుఁగల సంబంధమును దెలిపెను.

పాఠకులారా! భార్యను విడనాడుట భర్త కనుచితకృత్యములలో నొక్కటియని నమ్ముఁడు. తుదకు ముక్తికూడ నన్నువదలి నాభర్త కెట్లిత్తువని బ్రహ్మాదేవుని హెచ్చరించెను గదా. హేతువేమి? పాతివ్రత్య మామె కంతటిశక్తిని బ్రసాదించినది. త్రిలోకముల గడగడలాడింపఁజాలుదునని యాకలావతికి ధైర్యముగలదు. పతివ్రతకుఁ ద్రిమూర్తులు భయంపడుదురు. ఆశక్తి ప్రసాదించినది వారేకాన స్వోక్తివ్యాఘాతముగా వారు ప్రవర్తింపరు. అట్టిశక్తి పాతివ్రత్యమునసేకదా కలిగెను. కాఁబట్టియే కలావతి నన్నువదలి భర్తకుముక్తినిచ్చిన నన్ను రక్షించు వా రెవ్వరని ప్రశ్నించినది? ఆసందర్భమున నామె పలికిన సులలితములగు పలుకులు శ్రుతిసమ్మతములనుట

కన్న మిన్నయగుమాట యేమున్నది? ఆ పలుకు లాకా లమున మనదేశమున వాడుకలోనుండి ఆచరణమున నుం డెను. ఇపు డవి మార్పునొందినవి. వివాహనియమములు తాఱుమాఱగుచున్నయవి. పతివ్రతానియమము లోకరీతి మాఱినవి. సతులయంతశ్శక్తియు నించుకతగ్గినది. శాపానుగ్రహ సమర్థత యడుగంటినది. విద్యాతిశయము వారియందుఁ బ్రబ లినదని కొందఱందురు. ఆవిద్య యాముష్మికోపకారిణి కాదు. ఐహికోపయుక్తవిద్యలు విద్యాశబ్దార్థమును సఫలముచేయఁ జాలవు. ఉపన్యాసములకుఁ బనికివచ్చుపాండిత్యము ఆముష్మిక మున కుపయోగింపదు. ఆచరణము ప్రధానముకాని చదువు ప్రధానముకాదు. సదాచారములు విపరీతములుగాఁ దోఁచు చున్నవి. పూర్వాచారములన్నియు నిక్కాలమున మార్పుచెం దకుండ నుండఁజాలకున్నవి. దీనంగలుగులాభమేమి? మనశ్శక్తి తగ్గుటయే.

కలావతియుపదేశవాక్యములు స్త్రీల కేకాలమందు నుదాహరణభూతములు. వానిననుసరించుకాంతలు సజ్జనవినుతిఁ గాంతురు. లోకము నుద్ధరింతురు. సదాచారములు శాశ్వత ములుగా నుండునట్లుచేయుదురు. ఆత్మశక్తి గలిగియుందురు. క్షమగలవారుగ నుందురు. శాపానుగ్రహసమర్థతగలవార లగుదురు? ఆయుపదేశసారమేమి? భర్తతోడిదేలోకము. భర్త కన్న నధికదైవమే లేఁడు. పతినిమించిన బంధువు లేఁడు అనునది

యేకదా. ఇవి యుపన్యసించుటకు సులభముగ నుండునుగాని యాచరణమున వానిని లగింపఁజేయుటమాత్రము అతికష్టముగా నుండును. తుదకు బ్రహ్మదేవుఁడాకలావతిపలుకులకు బదులాడఁజాలకపోయెను. ఈమెను దిరస్కరించినచో బ్రదుకుట దుర్లభమని తలంచెను. బుద్ధివైభవమున భవిష్యత్థితి నాలోచించెను. యుక్తియుక్తముగా భర్తృసంగతి, శాశ్వత సుఖప్రదమగు గోలోకమును బ్రసాదించెను. బ్రదికితినిరా స్వామీ యని తనలోకమునకుం బోయెను. కావున నీకథావతంసమునుండి కులస్త్రీలమూలమున ధర్మము నిలిచియున్నదనియు, వారు చెడినచో మూలముచెడినచెట్టువలె ధర్మము నిర్మూలమగుననియు, ననవసరములగు నలవాటులు యువతులకు నేర్పరాదనియుఁ, బ్రాచీనసదాచారములకు నారీమణులే మూలభూతలనియు,సద్విద్య వారలకుం బ్రసాదింపవలయునేగాని వేఱొకటి పనికిరాదనియు, వారివిషయమై లేనిపోనిక్రొత్తయూహాల నలవఱచుకొనుట మనక్షేమమునకు భంగమనియు నేర్చుకొనఁదగినవిషయములు. ఇంక నీవిషయమును వదలి కథాభాగమును దెలుపఁ బ్రయత్నించువాఁడను.

### బృందావనశబ్దనిరుక్తి.

నారదముని నారాయణుంగాంచి స్వామీ! భరతభూతలమున నీవనమునకు బృంధావనమనుపేరెట్లువచ్చెను? వ్యుత్పత్తి యెట్టిది? లేక యాశబ్దము సంజ్ఞామాత్రమా, దానితత్త్వమును

వచింపుము. అని వినయమున వేఁడ నారాయణుం డిట్టులని యెను. మునివరా! పూర్వము కేదారనృపాలకుఁ డుండెను. అతఁడు సప్తద్వీపముల నేలురాజులలో నగ్రగణ్యుఁడు. కృతయుగమున నాతఁడుండెను. సత్యధర్మనిరతుఁడని యతనిం గొనియాడుదురు. ఆయనకుఁ బెక్కండ్రు భార్యలుగలరు. కొడుకులును బెక్కుమందిగలరు. ధర్మాత్ముఁడగు నారాజు కన్నకొడుకులంబలెఁ బ్రజలఁ బోషించెను. ఇంద్రపదమును గోరక శతక్రతువు లొనరించెను. అనేక ధర్మముల నొనరించెఁగాని ఫలకాముఁడై దేనిని జేయలేదు. నిత్యనైమిత్తిక కర్మముల శ్రీకృష్ణ ప్రీతిగా నొనరించిన యారాజు కృతార్థుఁడనుట కేసందియము గలదు? కేదారతుల్యుఁడగు రాజు లేఁడు. పుట్టబోవఁడు.

ఆరాజు తనతనయులపై రాజ్యభారము మోపి ప్రాణాధికప్రియయగు కళత్రమును బుత్త్రుల కప్పగించి తల్లిమాటమీఱక వర్తింపుండని హెచ్చరించి దిగ్విజయయాత్రావ్యాజమునఁ దపస్సొనరింప నడవికింబోయెను. ఆనరపతి శ్రీహరి కేకాంత భక్తుఁడు. కావున సదా శ్రీహరిని ధ్యానించుచుండెను. శ్రీహరిచక్ర మారాజువశముననే యుండెను. అవ్వనమున నారీతి దృఢభక్తిఁ దపంబుసలిపి భగవత్కృపాపాత్రుఁడై గోలోకమున కరిగెను. ఆరాజుపేరనే కేదారతీర్థము జగత్ప్రసిద్ధిం గాంచినది. ఆతీర్థపరిసరమున మృతుండగు ప్రాణి సద్యోముక్తి నొందును జుమీ.

### బృందాకన్యచరిత్రము.

ఆ కేదారనృపతికుమారిక చిన్ననాటనుండి యతినియమశీలరాయై బృందావ్హాయమున సర్వజనప్రీతిపాత్రురాలుగానుండెను. యోగశాస్త్రవిశారదయగు నాకన్యక భగవంతునికరుణకుం బాత్రురాలయియు సేవరమును గోరకుండెను. ఆకన్యకామణికి దుర్వాసుఁడు పరమదుర్లభమగు శ్రీహరిమంత్రరాజమును బ్రసాదించెను. ఆమె వయస్సురాకపూర్వమే విరక్తయై గృహమును బరిత్యజించి వనమునఁ దపస్సుచేయ నరిగెను. నిర్జనవనమున నాకాంతారత్న మఱువదివేలసంవత్సరములు తపస్సొనరించెను. ఆమె తపస్సున కలరి శ్రీకృష్ణపరమాత్మ గోలోకమునుండి సాక్షాత్కరించెను. భక్తవత్సలుఁడగు శ్రీకృష్ణమూర్తి ప్రసన్నవదనుఁడై వరముంగోరుమా యని పలికెను. సుందరవిగ్రహుఁడై శాంతమూర్తియై రాధికాకాంతుఁడగు శ్రీకృష్ణుని దివ్యసుందరవిగ్రహామునుజూచి పరవశురాలయ్యెను. ఆమూర్తింగోరి కామబాణ ప్రపీడితయయ్యెను. కొంలఁదినిమేషముల కా కాంతామణి మూర్ఛనుండి తెలివినొంది పులకాంచితవిగ్రహయై శ్రీరాధానాధా! నీవు నాకు భర్తవుకమ్మా యని మనస్సుకరఁగునట్లు ప్రార్థించెను. భగవంతుఁ డట్లేయని పలికి యితరాదృశ్యరూపముతో నామెం గలిసి విహరించెను. అంతియకాక యాతన్వంగిం దోడుకొని గోలోకమున కరిగెను. ఆబృంద రాధాసమానరూపవతియై గోపీకాంతాశిరోమణి యయ్యెను.

కేదారనరపాలతనూభవయగు బృందాదేవి యేచోటం దపస్సొనరించెనో ఆవనము బృందావనమను ప్రసిద్ధిం గాంచెను. శ్రీకృష్ణమూర్తి బృందతో నేకాంతవిహారము సల్పిన కారణము చేతను బృందావనమను విఖ్యాతిం గాంచెను. నారదా! మునిపుంగవా! ఈవిషయమై వేఱొకయితిహాసమును వచించెద. సావధానముగా నాకర్ణింపుము. బృందావననామము ఏహేతువుచేఁ బ్రసిద్ధిం గాంచెనో దాని కనురూపమగు నితిహాసము కలదు. అది విన్నవారికిఁ బుణ్యము గల్గును.

భూలోకమున విఖ్యాతిం గాంచిన రాజు కుశధ్వజుఁడను పేర భూపాలన మొనరించుచుండెను. ఆభూపతి కిర్వురు తనయలు గలరు. వారు ధర్మశాస్త్రవిశారదలు. తులసియనియు, వేదవతియనియు వారి పేరులు. వారు పుట్టిననాటనుండి సంసారవిరక్తలుగా నుండిరి. అందు వేదవతి తపస్సొనరించి నారాయణుని బరమపురుషుని జేరెను. ఆమెయే జనకమహీపాలుకుమారికయై సీతానామమునఁ బరికీర్తితయయ్యెను

తులసియను తొలికొమరిత శ్రీహరింగూర్చి తీవ్రతమతపస్సుచేసి విధివశమున దుర్వాసుని శాపముంగని శంఖచూడుఁడను దానవునికడం జేరి పిదపఁ గమలాకాంతుఁడగు శ్రీహరిని భర్తగాఁ బడసెను. ఆతులసియే శ్రీహరిశాపమున వృక్షరూపిణి యయ్యెను. తులసీశాపమున శ్రీహరియు సాలగ్రామరూపము నొందెను. ఆతులసి శిలావక్షమున నివసించెను. తులసీచరిత్ర

మును మున్ను చెప్పితిని. మరలఁ బ్రసంగవశమున నిట సంక్షేప ముగాఁ జెప్పితిని.

నారదమునివరా! ఈవన మాకాంతామణి తపంబొనరించినతావు. కావుననే బృందావన మనుపేరు గలిగినది. ఇప్పుడు వచించినకారణములు కాక కారణాంతరమును వచించెద. భారతవర్షమున బృందావనము పుణ్యక్షేత్రమేలయయ్యెనో తత్కారణమును వేఱొక గాథారూపమున వచించెద. రాధాదేవికింగల పదాఱునామములలో బృందానామము శ్రుతిప్రసిద్ధము. ఆరాధాదేవికిఁ గ్రీడావనము కావున బృందావనమయ్యెను. గోలోకమున శ్రీకృష్ణమూర్తియే రాధాదేవీప్రీతికై బృందావనమును గ్రీడార్థము నిర్మించెను.

## రాధాషోడశనామ నిర్వచనము.

అనిన విని నారదుఁడిట్లు ప్రశ్నించెను.నారాయణా! మహాపురుషా! రాధాదేవికింగల పదాఱునామములెవ్వి? జగద్గురూ! శిష్యుఁడనగు నాకానామషోడశకమును వచింపుము. వినవేడుకయయ్యెడు. స్వామీ! శ్రీరాధా సహస్రనామములు సామవేదప్రసిద్ధములు. ఇపుడు నీవలన నీపదాఱునామములు వినఁగోరుచున్నవాఁడను. వానిరహస్యార్థములు; ఇదియుఁగాక యింకే నామములు రాధాప్రీతిపాత్రములుగలవో అవియు వచింపుము. పుండరీకాక్షా! ఆనామములు పుణ్యస్వరూపములు. భక్తులు కోరఁదగినవి. ఆనామములు, వానివ్యుత్పత్తులు సర్వజనసుగమ

ములుకావు. దుర్లభములుకాన వినఁగోరెదను. జగన్మాతయగు రాధానామము జగత్కారణము, అని ప్రశ్నింప నారాయణ మూర్తి యిట్లు బదులుపలికెను.

మునివర్యా! రాధా షోడశనామముల నాకర్ణింపుము. రాధా, రాసేశ్వరీ, రాసవాసినీ, రసికేశ్వరీ, కృష్ణప్రాణాధికా, కృష్ణప్రియా, కృష్ణస్వరూపిణీ, కృష్ణవామాంగసంభూతా, పరమానందరూపిణీ, కృష్ణా, బృందావనీ, బృందా, బృందావనవినోదినీ, చంద్రావతీ, చంద్రకాంతా, శతచంద్రనిభాననా, నామములు రాధాదేవికిఁ బ్రియతమములు పదారు. వాని రహస్యార్థముల నాలకింపుము. "రాధా" యనునది తొలినామము. రాకారము దానవాచకము. స్వయముగా ముక్తిని బ్రసాదించునుగాన రాధానామము జగత్ప్రసిద్ధమయ్యెను. రెండవది రాసేశ్వరీనామము. రాసమనఁగా విహారస్థలము. తదధిపతి శ్రీకృష్ణపరమాత్మ. ఆయనకుఁ బత్నిగాన రాసేశ్వరీనామము జగత్ప్రసిద్ధంబయ్యె. మూఁడవది రాసవాసినీనామము. రాస మే దేవికి నివాసభూతమో ఆదేవి రాసవాసినీనామమునఁ బరఁగు. నాల్గవది రసికేశ్వరీనామము. రసికలనఁగా గోలోకమున నివసించు భగవత్ప్రీతికిం బాత్రభూతలగు కాంతలు. వారికధిపతిగాన రసికేశ్వరి యనంబరఁగె. ప్రాణాధికప్రేయసి కావున శ్రీకృష్ణమూర్తియే "కృష్ణప్రాణాధికా" యని పిలిచెను. కాన ఆపేరుకలిగినది. శ్రీకృష్ణునకు నత్యంతప్రియురాలు. శ్రీకృష్ణమూర్తియే

ప్రియుఁడుగాఁగలది. కాన, కృష్ణప్రియానామము విఖ్యాతమ య్యెను. ఇది సర్వదేవతలు వచించిననామము. శ్రీకృష్ణరూప మును విలాసముచేతను ధరించుటకు శక్తురాలు. సర్వాంశము లచేఁ గృష్ణసదృశి. ఆ హేతువున రాధ కృష్ణసదృశీనామధేయ మున ప్రఖ్యాతిని వహించెను. ఏపతివ్రతాశిరోమణి శ్రీకృష్ణ వామాంగార్ధసంభూతయో ఆమెయే శ్రీకృష్ణమూర్తిచే "కృష్ణ వామాంగసంభూతా" యని పిలువంబడియె. కాన నాపేరుచె ల్లెను. పరమానందరాశియై తాను శరీరమునుదాల్చెను. శ్రుతి వితతు లీవిషయమును వినుతించెను. కాఁబట్టి పరమానందరూ పిణి యన్న నామము రాధకువర్తిల్లె. ఎవ్వతుకకు విహారవనము బృందానామమునఁ బరఁగునో అందే ముఖ్యముగా విహరిం చుచున్నందున బృందావనీనామ మారాధకుఁదగియె. లేక బృం దావనాధిదేవతకాన బృందావనీనామము ప్రఖ్యాతింగాంచెన నియుఁ జెప్పంబడు. సఖిబృందము సదా సేవించుచున్నకతన బృందానామముచెల్లెను. బృందావనవినోదము రాధకు మిగులఁ బ్రియమైనది. కావున బృందావనవినోదినీ నామధేయ మామెకు వేదవినుతమయ్యెను. నఖచంద్రసముదాయము వక్త్రచంద్రుఁడు కలిగినందున రాధ చంద్రావలీనామము (చంద్రావతీ) నఁ బరఁ గెను. అహోరాత్రములు చంద్రతుల్యకాంతి రాధాదేవికిఁ గలదు. శ్రీకృష్ణమూర్తి మహానందమున రాధను, చంద్రకాంతా నామధేయమునఁ జీరెను. శరచ్చంద్రకాంతి రాధాముఖము సదా కనఁబడుచుండెను. కావున మునివితతి శరచ్చంద్రప్రభా

ననా (శతచంద్రనిభాననా) నామము తగియుండునని వినుతించెను. కాన నాపే రామెకుఁ బెట్టఁబడినది.

*నారదా! ఇదియే రాధాంబాషోడశనామములు. వాని వ్యుత్పత్తులు వర్ణింపఁబడియెఁగదా. శ్రీనారాయణమూర్తి నాభి పంకజసంభూతుఁడగు బ్రహ్మకుఁజెప్పెను. నాజనకుఁడగుధర్మునకు బ్రహ్మ యుపదేశించెను. సూర్యగ్రహణసమయమున దయచే నాతండ్రి నాకొసంగెను. ఇట్లీనామపరంపర సాంప్రదాయానుసారము లభించినది. మాతండ్రి పుష్కరమహాతీర్థమందుఁ బుణ్యదినమందు దేవసభయందు రాధాప్రభావప్రస్తావమున సుప్రసన్నమనస్సున నా కుపదేశించెను. ఈస్తోత్రము మహాపుణ్యప్రదము. కావున నీకు నొసంగితి. నిందించుస్వభావముగలవానికి, విష్ణుభక్తిశూన్యునకు, ఎట్టి కాలములందు నుపదేశింపరాదు. మూఁడు వేళలందును, యావజ్జీవము ఏనరుఁడు దీనింబఠించునో వానికి శ్రీరాధామాధవపాదాంభోజములందు దృఢభక్తి నెలకొనియుండును. అంతమున వారిదాస్యము లభించును. వారికి సహచరుఁడై యుండఁ దగుభాగ్యము లభించును.

---

*శ్రీరాధాషోడశదివ్యనామస్తుతిః.

రాధా రాసేశ్వరీ రాసవాసినీ రసికేశ్వరీ,
కృష్ణప్రాణాధికా కృష్ణప్రియా కృష్ణస్వరూపిణీ. ౧
కృష్ణవామాంగసంభూతా పరమానందరూపిణీ,
కృష్ణాబృందావనీ బృందా బృందావనవినోదినీ. ౨
చంద్రావతీ చంద్రకాంతా శతచంద్రనిభాననా.

అణిమాదిసిద్ధులు వానివశమున నుండు. వలయునంతకాల మా నరుఁడు క్షితిపై నుండు. వ్రతదానోపవాసంబులన్నియు నియమపూర్వకముగ నొనరించిన నేఫలమో, నాలుగువేదములు విధి నర్థవంతములు గాఁ బఠించిన నేపుణ్యమో, విధిబోధితసకల యజ్ఞముల నొనరించి, యఖిలతీర్థముల సేవించిన నేసుకృతమో, భూప్రదక్షిణ మేడుమాఱు లొనరించిన నేఫలమో, శరణాగతరక్షణము, అజ్ఞానులకుజ్ఞానదానము, దేవతాదర్శనము, విష్ణుభక్తసందర్శనము ననునీపుణ్యకార్యములవలన నే పుణ్యరాశియో, ఆసత్పుణ్య మీస్తోత్రపాఠజనితఫలమునఁ బదాఱవభాగమునకుం బోలవు. ఇంతయేల యీస్తోత్రరాజప్రభావమున జీవన్ముక్తుఁడగును.

అని వచియింపఁ బరమానందమున నారదముని యిట్లు వచియించెను. పరమపురుషా! నారాయణా! పరమాశ్చర్యకరమగు స్తోత్రము లభించెను. ఇది పరమదుర్లభమైనది. ఇంకఁ గృపయుంచి కవచమునుగూడఁ బ్రసాదింపుము. అది సంసారవిజయమని విందును. శ్రీకృష్ణపరమాత్మవిషయమున నేయేరహస్యవిషయములుగలవో వానినెల్ల వచింపుము. మఱుదినము నగరమును గాంచి వల్లవు లేమిపల్కిరి? ఆవిధమునుగూడఁ దెల్పుమా యని ప్రశ్నింప నారాయణుం డిట్లనియె.

నారదమునీ! వినుమిా. విశ్వకర్మయుఁ దనభృత్యవితతిం గూడి యరుగ రాత్రియంతయుఁ గడచెను. అరుణోదయంబు

తటి నెల్లరు మేలుకాంచిరి. నగరమునంతయుం గాంచిరి. అది సర్వ నగరవిలక్షణముగనుండెను. ఇదేమియాశ్చర్యము! ఇదేమివింత! అని యెల్లరు చెప్పుకొనసాగిరి. కొందఱు నగర మిదెట్లు సిద్ధ మయ్యెనని మఱికొందఱ నడిగిరి. ఇదెట్లు సిద్ధమయ్యెనో మే మెఱుంగమని కొందఱు బదులుచెప్పిరి. నందుఁడు గర్గమునివాక్య మును స్మరించుచు మనమున నిది శ్రీకృష్ణకృతమని యొఱిం గెను. శ్రీహరి యిచ్ఛామాత్రమున నీసకలచరాచరప్రపంచ మంతయుం గలుగుననియు నెఱింగెను. బ్రహ్మాదితృణపర్యంత మాశ్రీకృష్ణమూర్తి భ్రూభంగలీలచే నావిర్భవించుననియుఁ దదసాధ్యమయినపని లోకమున లేదనియు నెఱింగెను. ఆవి ర్భూతతిరోభూతవిషయమున నాతని కసాధ్యమే లేదు. ఆప రమ పురుషుని లోమకూపాంతరముల సకలబ్రహ్మాండములు నిండియుండును. ఈశ్వరుఁడై శ్రీమహావిష్ణువనంబరఁగు హరికి సాధ్యముకాని దేదియుండును? ఏమహావిష్ణువు పాదాంబుజము లను బ్రహ్మానంతేశధర్మాదులు సదా ధ్యానింతురో అట్టి సకల బ్రహ్మాండనాథున కసాధ్యముకలదా. అనిర్వాచ్యు మాయామానుషు షరూపధారియునగు. అని యిట్లు నందుఁడు తలంచెను.

అవ్వల నందుఁడు తత్పట్టణమునంతటం దిరిగితిరిగి ప్రతి గృహము నాదరమునం గాంచి ఆగృహములముందు వ్రాయఁ బడిన యక్కరములం జదివిచదివి పరమానందభరితహృదయుఁ డై వారివారికాయాయిగృహముల నొసంగెను. అవ్వల నొక

సుముహూర్తంబున నందుఁడు సానందుఁడై వృషభానుని సాద రంబునం గొనిచని తత్సౌధంబునఁ బ్రవేశింపఁజేసెను. అంత నా బృందావనవాసులందఱును బ్రసన్నవదనారవిందులై మహాసం తోషమునఁ దమతమయిండ్లం బ్రవేశించి యత్యంతమనోహర ములగు నాగృహములం బరిశీలించి పట్టరానియానందమున నోలలాడిరి. బాలికలు బాలకులు ప్రహర్షితులై విహారపరా యణత్వమున నుండిరి. శ్రీకృష్ణబలదేవులు తోడిబాలురంగూడి వేడుకమై మనోహరక్రీడాస్థానములయందు బాలలీలల వినో దించుచుండిరి. నారదా! బృందావననగరనిర్మాణముం దెల్పితిని. స్త్రీలువిహరింప ననువగునట్లు రాసమండలము నిర్మింపఁబడెన నియు వచించితి. ఇఁకనేమి వినవాంఛింతువు? తెలుపుమా యని నారాయణమూర్తి యాదరమున నడిగెను.

భక్తవరులారా! రాధానామమహిమమును వింటిరి. ఆదేవీమంత్ర ముపాస్యమనియు నెఱింగితిరి. ఇంతియగాక బృం దావనశబ్దనిర్వచనము నెఱింగితిరి. బృందానామ మెటులంగల్గె నో ఆకథనువినఁగల్గితిరి. తులసీదేవిచరిత్ర మీావఱకే చదివియుం టిరి. ఇపు డీకథలనుండి గ్రహింపఁదగినవిషయ మేమన శ్రద్ధగా నాలకింపవలయును. బృందాకన్యక కేదారనృపతిపుత్రికకదా. ఆమె బాల్యమునందే విరక్తయై యోగశాస్త్రవిశారదయై తప స్సొనరించెను. భగవంతుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మము ప్రత్యక్ష మయ్యెను. తద్దర్శనమున భగవంతుఁడు భర్తకావలెనని కోరె

ను. ఆపరవశత్వమున నుండఁగా శ్రీహరి యామెంగలిసి తదిష్ట
ముందీర్చి గోలోకమునకుం దోడుకొనిపోయెననికదా కథయం
దున్న విషయము. దీనింబట్టి పూర్వకాలము వివాహముచేసికొన
కయే స్త్రీలుకొంద ఱుండిరనియు వారు తపస్సుచేసిరనియుఁ
దెలియవచ్చెను. అట్లే యిప్పుడుకూడ వివాహితలుకాకుండనుం
డిన నేమిదోష మను ప్రశ్నము రావచ్చును. కాని యొక్కమా
టవినుఁడు. కన్యకలు పెండ్లియాడక యున్న వారిపూర్వచరిత్ర
ముల వింటిరికదా. వారు ఐహికసుఖములఁ దృణములుగా
భావించి యాముష్మికమునే కోరిరి. యోగశాస్త్ర మభ్యసిం
చిరి. భగవంతునిగురించి యాహారమునుమాని తపస్సొనరించిరి.
భగవంతునిఁ జూడఁగల్గిరి. అట్టివారల కీశాస్త్రనియమము అక్క
ఱలేదు. జ్ఞానమే ప్రధానముగాఁగలవారికి సాంసారికధర్మము
లనవసరములు. వానిని వారు పాటింప నక్కఱలేదని శాస్త్ర
ములే ఘోషించుచున్నవి. మేము నట్టియాచారమునే యవలం
బింతుమన్నచో వృత్తి యట్టిదికావలదా. అహారమునుమాని
యొకపూటనైనఁ గడుపఁజాలక, తపస్సొనరించుజాడఁదెలి
యక వేషమునకుమాత్రము ఆధర్మముల నవలంబించినచో
నపాయముకలుగదా. వారు రెండులోకములకుంగాకచెడరా.
అట్లుగాక పూర్వజన్మార్జితసుకృతపరిపాకమున జ్ఞాన ముద
యించి యోగము నభ్యసించునేర్పుగలిగి దృఢభక్తియుండి
నచో సామాన్యధర్మములకు వారు లొంగవలసినపనియే లేదు.
వారి నాక్షేపించుటకంటెఁ బాపకార్యముకలదా. వేదాంతుల

మని యోగులమని జ్ఞానులమని సర్వసంగపరిత్యాగులమని చెప్పుకొనుమూర్ఖులు వంచకులు, జారులు చోరులు పెక్కుమం దిగలయిక్కాలమున, వేషమునకు నవకాశము దొరకుచున్న యీకలివేళ, నెన్నియో దుష్కృత్యముల నొనరించు నీదుష్ట సమయమున, మాటలుమాత్రముచెప్పుచు నాచారమున విము ఖులుండు నీతరుణమునఁ బ్రాఁతమాటలు మాత్రము పనికి రావు. పైకిమాత్రము మంచిమాటలు. వృత్తి సద్వృత్తికా నిచో నది విరుద్ధముకాదా? అట్టివా రుండిన నాదేశముచెడదా. అందు మర్యాదనిలుచునా. కావున సనాతనాచారము లిక్కా లమునఁ బైకారణములంబట్టి పనికిరావని చెప్పవలసివచ్చినది. కాని వేఱుకారణములచేఁగాదు. తపస్సనునది యిక్కాలమున నుపన్యాసములయందు వినఁబడుచున్నయదికాని ఆచరణమున కనఁబడుట లేదు.నిరశనవ్రతము కథాశేషముగనున్నది. వేళకుభో జనము, నడుమనడుమ నుపహారములు లేకున్న నొకపూఁటయైన జీవింపలేనియిక్కాలమున మనపూర్వమహర్షులమాటలు పరిహా సపాత్రములగునట్టి దుస్థితికలిగినది.ఇంతకన్న దుస్థితి మనదేశ మున నేమిక్కావలయు? యోగము నభ్యసించుచు శిష్యులచే నభ్య సింపఁజేయుగురువు లపుడుండిరి. యోగమునుగూర్చి పొడిమా టల నుపన్యసించువా రిక్కాలమునఁ బెక్కుమందిగలరు. కొలఁ దిమంది లేరని నాభావముకాదు. తఱచుగా డాంబికులుకలర నియే నానమ్మకము. ఉపన్యాసకులలో లక్షకుఁదొంబదితొమ్మిది వేలు తొమ్మిదివందలు తొంబదితొమ్మిదిసంఖ్యగలవారు డాంబి

కులు. అనఁగా యోగాభ్యాసము భక్తియు లేనివారే. వారివృత్తిధనాకర్షణరూపముగనుండును. వారినిజూచినపుడొకరిద్దఱు యోగులు భక్తులునుండినను "గలిపికొట్టరా కస్తూరిరంగా" అన్నట్లు నమ్మఁజాలక పైవారిలో వీరినిజేర్తుము. కావున మహాత్ములారా! నామాటలకుం గినియకుఁడని వేఁడుచున్నవాఁడను. హరిభక్తులు హరినామమునమ్ముకొని జీవించుచున్నవారు. ఏమి చేయవచ్చును? కుచేలునివంటి హరిభక్తుఁడుకలఁడా. సప్తప్రస్థునివంటి నియతుఁడుకలఁడా. దుర్వాసునివంటి యోగికలఁడా. వసిష్ఠునివంటి జ్ఞానికలఁడా. దధీచివంటి దాతకలఁడా. కర్ణునివంటి పరోపకారతత్పరుఁడుకలఁడా. హరిశ్చంద్రునివంటి సత్యసంధుఁడుకలఁడా. విభీషణునివంటి వివేకిగలఁడా. హనుమంతునివంటి కింకరుఁడుకలఁడా. భరతలక్ష్మణులవంటి సోదరులు కలరా. రామధర్మజులవంటి యన్నలుకలరా. రుక్మాంగదునివంటి వ్రతపరాయణులుకలరా. అంబరీషునివంటి హరిసేవకులుగలరా. సుగ్రీవునివంటి మిత్రుఁడుకలఁడా. విదురునివంటి మంత్రిగలఁడా. సూతునివంటి కథకుఁడుగలఁడా. శౌనకాదులవంటి శ్రోతలుకలరా. చంద్రమతివంటి పతివ్రతకలదా. వాల్మీకివంటి కవికలఁడా. శుకునివంటి యనఘాతకిలఁడా. రావణునివంటి వేదవేత్తకలఁడా. అశ్వత్థామవంటికృతజ్ఞుఁడుకలఁడా. యయాతింబోలు తండ్రికలఁడా. విశ్వామిత్రునింబోలు క్రియాదక్షుఁడుకలఁడా. సుమంతునివంటి సారథికలఁడా. గుహునివంటి పతుపాతిగలఁడా? అగస్త్యునింబోలు శక్తిమంతుఁడుకలఁడా? జాంబ

వంతునివంటి సమయోచితజ్ఞానికలఁడా. భీమునివంటి ధీరుఁడు కలఁడా. ఇట్టి సద్వస్తువితతి పూర్వ మెంతయోయుండెను. ఇపు డట్టిరత్నము లపరూపములైనవి. కావునఁ బూర్వాచారము లన్నియు నిపుడు పాశ్చాత్యములైనవి.

బృందాకన్య తపస్సొనరించినతావు పరమపవిత్రమైనది. ఏల? శ్రీకృష్ణపరమాత్మ యందుఁ బాదములనుంచెను. ఎవరికృత్యము వారియనంతరము ప్రఖ్యాతిని వీడకయుండునో వారి చరిత్రమే పరమపవిత్రము. దానిని మీఱునది లేదు. కాన నట్టి చరిత్రము నిలుచుటకు మనము ప్రయత్నింపవలయు. దానికి మూలకారణము భగవద్భక్తి. అది లేకున్న నేదియునుండదు. ఇది యిందలిసారము. నిశ్చయముగా నిదియే సారము. సారము. సారము. ఇఁక నవ్వలికథాసుధారసముం గ్రోలుఁడు.

విప్రపత్నులు శ్రీహరిప్రముఖుల కన్నము పెట్టుట.

*నారదముని నారాయణప్రోక్తనగర నిర్మాణవృత్తాంతము నాలకించి భక్తిభరమున నోడలెఱుంగకయుండి నారాయణుం జూచి మహాత్మా! శ్రీకృష్ణదివ్యచరితము పీయూషతుల్యము. విశేషించి శిష్యవాత్సల్యమున శ్రీహరిగాథల నింకను దెల్పుము. అని ప్రార్థింప భగవద్దివ్యచరిత్రమును దెలుపందలంచి నారాయణమూర్తి యిట్లనియె. దేవర్షివర్యా! భగవచ్చరితము

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము పదునెనిమిదవయధ్యాయమునుండిపరి గృహీతమని తెలియఁదగు.

నాలకింపుము. శ్రీహరి తనతత్త్వము నెవ్వరెఱుంగకుండనుండ వలయుననియే తలంచెను. బాలచేష్టలఁ దృప్తినొందఁడయ్యెను. ఏల? ఆబాలకులు తరించుటెట్లు? ఆబాలకులు గోలోకవాసులు కదా. శ్రీహరితో విహరింపనేకదా యవతరించిరి. వారికోర్కి తీఱుటెట్లు? కావున శ్రీకృష్ణమూర్తి యాగోపాలబాలురతో నాడుకొనఁబూనెను. ఆసందర్భమున జరగినయొకయద్భుతచరిత్రమును వివరించెద వినుము.

ఒకానొకదినంబున మాధవుఁడు బలదేవుని గోపబాలురనుగూడి శ్రీమంతమగు మధువనమున కరిగెను. అయ్యది యమునాతీరముననున్నది. అందలితరువరములు మనోహరసుఖకరములు. కావున నందు గోసహస్రములమేపుచు బాలకులాడుకొనుచుండిరి. ఆటలాడినకతన నాబాలకులలసిరి. దప్పిగొనిరి. ఆఁకలిబాధకుఁ బాత్రులైరి. శ్రీకృష్ణునింజూచి మహానందభరితులై గంపెడాసఁబూని యిట్లుపలికిరి. శ్రీకృష్ణా! మమ్మాఁకలి బాధించుచున్నయది. ఏమిచేయుదుము? మీకింకరులము. ఏమిబదులుచెప్పెదువు? అనవిని దయానిధియగు శ్రీహరి యిట్లు పలికెను. ఆపలుకు వారికి హితము సత్యమునై యుండెను. అత్తఱి శ్రీహరిమోము సుప్రసన్నమై యలరారెను.

బాలకులారా! సుఖావహమగు విప్రయజ్ఞస్థానమున కరుగుఁడు. వినయమున నందు నన్నమును యాచింపుఁడు. క్రతువును జేయించు విప్రవరు లందుందురు. వారింజేరి యన్న

మును యాచింపుఁడు. ఆవిప్రవర్యు లాంగిరసులు. శ్రీవనాం తికమునసుందురు. శ్రుతిస్మృతులయం దాఱితేఱినవారు. యజ్ఞ మును జేయుచున్నవారు. నిస్స్పృహులు.విష్ణుభక్తులు. ముము క్షువులుగాన నన్నుంగూర్చియే యాయజ్ఞములను జేయుచున్న వారు. నన్ను మాయచే నెఱుంగఁజాలకున్నవారు. మాయా మానుషరూపమునుదాల్చితి నని వారూహింపలేదు. క్రతువు చేయుసందడిలో నాఁకొన్న మీకన్న మిడకయున్న వారిభార్య లను యాచింపుఁడు. వారు శిశువులపయి దయగలవారు. కాన మీయాఁకలి వారెఱుంగఁగలరు. అని తేనెలొలుకఁబలికెను.

శ్రీకృష్ణునిమాటలు విన్నయంతనే యాశిశువులందఱు పరుగెత్తిరి. బ్రాహ్మణులయొద్దల నిలువంబడిరి. తలలువంచిరి. విప్రప్రవరులారా! ఆఁకలిగొంటిమి. మాకన్నమిడుఁడు. వేగమ యన్నముపెట్టుఁడు. అనువారిమాట లావిప్రులచెవులఁ జొరఁ బడవయ్యెను. కొందఱుమాత్ర మాలకించిరి. కాని వారూర కుండిరి. అంత బాలకు లటనిలువక పాకశాలకరిగిరి. అందుఁ బాచకులుగలరు. అందు విప్రపత్నులు కానఁబడిరి. వారింగాం చినంతనే శిరసులువంచి నమస్కరించిరి. లేచినిలిచి పతివ్రతా శిరోమణులారా! మాతల్లులారా! ఆఁకలిబాధలకోర్వఁజాలము. అన్నముపెట్టుఁడు. మేము మీపిల్లలము అనివేఁడ మనో హరాకారులగు నాబాలకులంజూచి సాదరముగా విప్రభార్య లిట్టులడిగిరి. వారిమోములు చిఱునవ్వులకు నిధానములుగ నుండెను.

బాలకులారా! మీరలెవరు? ఎవరుపంపవచ్చితిరి? మిమ్మే పేరులతోఁ బిల్తురు? మీరుకోరినయన్నము పెట్టుదుము. రుచిని గల్గించుసాధకములున్నవి. అన విని విప్రపత్నులంజూచి బాలకు లిట్లుపల్కిరి. అపుడు వారిమోములు చిఱునవ్వులతోఁ గ్రొత్తయందమును దాల్చియుండెను. తల్లులారా! మమ్ము శ్రీకృష్ణులు పంపిరి. మిగుల నాఁకలిగొంటిమి. కాన మాకన్నము పెట్టుఁడు. వేగముగా వారిచెంతకుఁ బోవలయును. ఇచ్చటికిఁ గొంతదూరమున భాండీరవనముగలదు. దానియంతరమున మధువనముగలదు. దానిచెంత వటమూలమున శ్రీరామకృష్ణు లున్నవారు. వారును ఆటలాడియలసిరి, ఆఁకలిగొనిరి. జనను లారా! వారికి నన్నము కావలయును. మాకన్నము పెట్టుదురా. త్వరగా బదులిండు. అనుబాలకుల యాలాపములు వినినంతనే పరమానందమున లోచనకంజములు వికసింపఁ బులకాంకుర ములు సర్వాంగముల మురువుసూప శ్రీరామకేశవపాదార విందసమాసక్తమానసలై యావిప్రపత్నులు బహువిధవ్యంజన ములంగూడి మనోహరరీతి నమరింపఁబడినయన్నమును, పాయ సమును, బిండివంటలును, స్వాదువగుదధియుఁ, జిక్కనిపాలు, సుస్వాదుఘృతము, తేనెయు, బంగరు, వెండి, కంచుపాత్రము లలో నునిచి మహార్షమున మేనులు పరవశములుకాఁగా నాబ్రాహ్మణపత్నులు శ్రీబలరామకృష్ణులసన్నిధికింబోయిరి. పోవు వెడలునప్పుడు బహువిధముల భగవంతు నర్గించుచు ధన్యల

మైతిమని యానందించుచు, శ్రీకృష్ణపరమాత్మను దర్శింపఁ గో ర్కులెల్ల ఫలించునన్న దృఢవిశ్వాసమున నుండిరి.

ఇట్లు వెడలి వటవిటపిమూలముననున్న శ్రీకృష్ణపర బ్రహ్మమును బలరామదేవుని బాలకులనుజూచిరి. అపుడు నక్ష త్రరాశినడుమఁగన్పట్టు పూర్ణశీతాంశుంబోలి బాలకులనడుమఁ దనయపూర్వసౌందర్యము వెలయ నలరు శ్రీకృష్ణునింజూచి పర మానంద మందిరి. శ్యామసుందరమూర్తియై కిశోరవయస్కుఁ డై, పీతకౌశేయవస్త్రమునుదాల్చి, రుచిరాంగుఁడై, సుస్మితా ననుఁడై, శాంతరసముట్టిపడుచుండ, మనోహరుఁడై, మోము శరత్పార్వణశశాంకు నీసడింప, రత్నాలంకారములు మేనునిండ వెలయ, మణికుండలమండితుఁడై, రత్నకేయూరవలయాదిభూ షణపరిభూషితుఁడై, జానుపర్యంతము వ్రేలాడు రత్నమాలిక కన్నులపండువుగా నుండఁగా, మాలతీమాలాపరిభూషితకంఠ వక్షస్స్థలుండై, చందనాగురుప్రముఖనిఖిలపరిమళవస్తువిశేషాం చితగాత్ర మొప్పార, నఖమరీచులు దిక్కులవెలిఁగింపఁ గపోల ములు యథార్థముగఁ జెన్నారఁ, బక్వబింబాధరము మనోజ్ఞ మై తనరఁ, బరిపక్వదాడిమీబీజతుల్యదంతపంక్తి కనుపట్టఁగా, శిఖిపింఛము శిరమున భాసిల్లఁ, బరాత్పరుండై కదంబపుష్ప ముల జంట శ్రుతులయందుఁ బరిఢవిల్ల, యోగివరులకేని ధ్యానగమ్యుఁడుగాక, భక్తానుగ్రహకాతరుఁడై, బ్రహ్మశి ధర్మశేషేంద్రులచేత వినుతింపఁబడుచు,నలరారురాధాకాంతుం

గన్నులారఁ దిలకించి పరమేశ్వరుని, సకలలోకాధినాథుని, అచింత్యమహిముని, నిరతిశయశక్తునిఁ గాంచితిమి. జన్మములు ఫలించె నని తలంచుచు నాసాధ్వీమతల్లులు నమస్కరించిరి. తమయోగ్యతకుఁ దగినట్లు వినుతించిరి.

## విప్రపత్నులు శ్రీకృష్ణు వినుతించుట.

శ్రీకృష్ణా! పరబ్రహ్మము నీవే. పరమధామమను నీవే. నిరీహుఁడవు, నిరహంకృతివి, నిర్గుణుండవు, నిరాకారుఁడవు, సాకారుఁడవు, సగుణుఁడవు, సాక్షిరూపుఁడవు, నిర్లిప్తుఁడవు,పరమాత్మవు, నిరాకృతివి, ప్రకృతివి, పురుషుఁడవు, తత్కారణము నీవే. సృష్టిస్థిత్యంతవిషయమున నియుక్తులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు త్వదంశసంభూతులే. వారే సర్వజంతుబీజస్వరూపులు. ఓయీశ్వరా! నీలోమవివరమందు సకలబ్రహ్మాండము లుండును. మహావిరాట్టువు, మహావిష్ణువు. నీవే తేజస్సు; తేజస్వివి నీవే. జ్ఞానము జ్ఞానియు తత్పరుఁడవును నీవే. వేదమందనిర్వచనీయుఁడవు, ఇట్టి నిన్నెవఁడు వినుతించును? మహదాదిసృష్టిసూత్రము నీయధీనము. సర్వశక్తిబీజస్వరూపుఁడవు నీవు. సర్వశక్తీశ్వరుఁడవు. సర్వశక్త్యాశ్రయుఁడవు.నీవు స్వయం

---

విప్రపత్నీకృత శ్రీకృష్ణస్తుతిః.

త్వం బ్రహ్మ పరమం ధామ నిరీహో నిరహంకృతిః,
నిర్గుణశ్చ నిరాకార స్సాకార స్సగుణస్స్వయం. ౧
సాక్షిరూపశ్చ నిర్లిప్తః పరమాత్మా నిరాకృతిః,
ప్రకృతిః పురుష స్త్వంచ కారణంచ తయోః పరం.

జ్యోతివి సర్వానందుఁడవు. సనాతనుఁడవు. మహాపురుషా!

---

సృష్టిస్థిత్యంతవిషయే యేచ దేవాస్త్రయస్స్మృతాః,
తే త్వదంశా స్సర్వబీజా బ్రహ్మ విష్ణుమహేశ్వరాః. ౩
యస్యలోమ్నాంచ వివరే చాఖిలం విశ్వమీశ్వర,
మహావిరాణ్మహావిష్ణు స్త్వంతస్య జనకోవిభో. ౪
తేజస్త్వం చాపి తేజస్వీ జ్ఞానం జ్ఞానీచ తత్పరః,
వేదేఽనిర్వచనీయస్త్వం కస్త్వాం స్తోతు మిహేశ్వరః. ౫
మహదాదిసృష్టిమాత్రం పంచతన్మాత్రమేవచ,
బీజం త్వం సర్వశక్తీనాం సర్వశక్తిస్వరూపకః. ౬
సర్వశక్తీశ్వర స్సర్వ స్సర్వశక్త్యాశ్రయ స్సదా,
త్వమనీహ స్స్వయంజ్యోతి స్సర్వానందస్సనాతనః. ౭
అహోప్యాకారహీనస్త్వం సర్వవిగ్రహవానపి,
సర్వేంద్రియాణాం విషయం జానాసి నేంద్రియీ భవాన్. ౮
సరస్వతీ జడీభూతా యత్స్తోత్రే యన్నిరూపణే,
జడీభూతో మహేశశ్చ శేషో ధర్మో విధిస్స్వయం. ౯
పార్వతీ కమలారాధా సావిత్రీ వేదసూరపి,
వేదశ్చ జడతాం యాతి కేవాశక్తా విపశ్చితః. ౧౦
యం కిం స్తవనం కుర్మ స్త్రియః ప్రాణేశ్వరేశ్వర,
ప్రసన్నో భవ నో దేవ దీనబంధో కృపాంకురు. ౧౧
ఇతిపేతు శ్చతావిప్రపత్న్య స్తచ్చరణాంబుజే,
అభయం ప్రదదౌ తాభ్యః ప్రసన్నవదనే క్షణః. ౧౨
విప్రపత్నీ కృతంస్తోత్రం పూజాకాలేచయః పఠేత్,
సగతిం విప్రపత్నీనాం లభతే నాత్రసంశయః. ౧౩

విప్రపత్నీకృతం శ్రీకృష్ణస్తోత్రం సంపూర్ణమ్.

సకల విగ్రహములు నీవేయైనను నీవాకారహీనుఁడవు. సకలేంద్రియవిషయముల నెఱుంగుదువుకాని నీకింద్రియములు లేవు. ఏ నీస్తుతియందును, నిరూపణమందును సరస్వతీదేవి జడమతియయ్యెనో, మహేశ్వరుఁడు జడీభూతుఁడయ్యెనో, శేషుఁడు ధర్ముఁడు విధియు జడీభూతులయిరో, పార్వతియు, రమాదేవియు, రాధయు, వేదమాతయగు సావిత్రియు జడీభూతలయిరో, వేదము జడీభూతమయ్యెనో, అట్టి నిన్ను నుతించుటకుఁ బండితు లేపాటిశక్తిమంతులు? ఇఁక సామాన్యజ్ఞానముగల మేమెంతవారము. స్త్రీలముకదా. ప్రాణేశ్వరేశ్వరా! మాకుఁ బ్రసన్నుఁడవుకమ్ము. దీనబంధూ! కృపయుంచుము.

అని వినుతించి శ్రీకృష్ణచరణాంబుజములపైఁబడిరి. పరమాత్మప్రసన్నవదనేక్షణుఁడై వారి కభయంబొసంగెను. నారదమునివర్యా! విప్రపత్నీకృతస్తోత్రమును దీని నెవ్వఁడు పూజాకాలమునఁ బఠించునో వాఁడువిప్రపత్నులకుశ్రీకృష్ణమూర్తి ప్రసాదించిన గతికింబోవును. సంశయములేదు. అని నారాయణుఁడు వచించి మఱియు నిట్లనియె. ఇట్లు తనపాదారవిందములపైఁబడిన యావిప్రభార్యలంజూచి మధుసూదనుఁడు సాధ్వీమణులారా! మీకు వరమిచ్చెద. దేన మీకు మంగళము కల్గునో అట్టివరమును గోరుఁడు. అనఁగా నామునిభార్యలు పరమానందభరితస్వాంతలై భక్తిచేఁ గంఠములవంచి వినయమున నిట్లువేఁడిరి. మహానుభావా! శ్రీకృష్ణా! మాకు వరమువలదు. మాకుఁ

గలకోరిక మీపాదారవిందసేవయే. మీకల్యాణపాదారవింద దాస్యము ననుగ్రహింపుము. దుర్లభమనందగు దృఢభక్తిని బ్రసాదింపుము. దానిచే నిరంతరము నీముఖసరోజమును జూచుచుందుము. అనుగ్రహింపుమా. ఇఁక మేమింట్లకుఁ బోనొల్లము.

అని పతివ్రతలుపలుక దయానీరధియగు శ్రీహరి యట్లే యగుఁగాకయని పలికి బాలకులం గూడియుండెను. విప్రపత్నులు తమరు తెచ్చిన మృష్టాన్నమును భక్తిమెయి నొసంగిరి. బాలకుల భుజింపుఁడని హెచ్చరించి లోకప్రభువు శ్రీకృష్ణమూర్తి తాను భుజించెను. ఇంతలో నాచోటఁ బైనుండివచ్చుచున్న సువర్ణమయరథ మాసాధ్వీమణులకుం గనఁబడియె. అది రత్నమయదర్పణవిరాజితము, రత్నసారపరిచ్ఛదోపశోభితము, రత్నస్తంభనిబద్ధము, మణికలశాన్వితము, శ్వేతచామరసంయుక్తము, వహ్నిశుద్ధాంశుకసమన్వితము, పారిజాత ప్రసూనమాలికాసమంచితము, శతచక్రసంయుతము, మనోగతిమంతము, మనోహరము, దేవపార్షదులచే నది పరివేష్టితము, వారు వనమాలావిభూషితకంధరులు, పీతవస్త్రధరులు, రత్నాలంకారభూషితులు, నవయౌవనసంపన్నులు, శ్యామలాంగులు, సుమనోహరులు, ద్విభుజులు, మురళీహస్తులు, గోపవేషధరులు, నిరుపమాకారులు, శిఖిపింఛము గుంజమాలయుఁగల వక్రిమచూడులు. ఇట్టి విష్ణుభక్తులాదివ్యకాంచనరథమునుండి యవతరించి శ్రీహరిపాదము

లకు నమస్కరించి రథమెక్కింపఁబూని యావిప్రపత్నుల కిట్టుల నిరి. తల్లులారా! గోలోకమున కరుగదమురండు. రథము నధిరోహింపుఁడు. అన విని యావిప్రపత్నులు శ్రీహరికి నమస్కరించి తమకుం గోరికలనెఱవేర్చుగోలోకమున కరిగిరి. రథము నధిరోహింపఁబూనునంతలో వారిమానుషదేహములు మాఱి గోపీతనువు లలరారెను.

శ్రీహరియు వారిఛాయలను విష్ణుమాయచేఁగప్పి వారి భర్త లుండుచోటికిం బోవ ననుమతి నొసంగెను. అంతకుముందే యచ్చటికి విప్రులు తమతమభార్యలం గానక పరమోద్విగ్నహృదయులై యందందు వెదకుచు మార్గమునవచ్చుచున్న కాంతలం గాంచిరి. చూచినంతనే యెచ్చటికేగితిరని ప్రశ్నించిరి. వారు వినయమునఁ జేతులొగ్గి పులకాంచిత సర్వావయవలై ప్రసన్నవదనేక్షణము లొప్ప వార్తలవదలక తెల్పిరి. ఆవార్తాశ్రవణమున సంతుష్టహృదయులై యాబ్రాహ్మణులు పతివ్రతలారా! మీరుధన్యాత్మలు. భగవంతుఁడు మీకు దర్శనమొసఁగెను. మాబ్రదుకు వ్యర్థము. వేదపాఠము నిష్ఫలము. వేదమునందుఁ బురాణమునందు, ఇందం దననేల యెల్లతావుల విద్వత్సముదాయముచే భగవద్విభూతులు పరికీర్తితములగుచుండు. అందఱకుఁ దండ్రిగదా శ్రీహరి. తపము, జపము, వ్రతము, దానము, జ్ఞానము, వేదాధ్యయనము, అర్చనము, తీర్థస్నానము, నిరశనము, లోనగువానికి ఫలప్రదాత యీశ్వరుఁడు. ఎవఁడు

శ్రీకృష్ణుని సేవించునో వానికి తపఃఫలము లేల? కల్పతరువు స్వాధీనమున నుండువానికి మఱియొకవృక్షమున నేమిలాభము? ఎవ్వని హృదయమున శ్రీకృష్ణుఁ డుండునో వాఁ డితరకర్మముల నొనరింపఁ బూననేల? సముద్రము లంఘించినవానికిఁ గోపాలంఘనమునఁ గలుగుపౌరుషమేమి? అని పలికి వారలు తమభార్యలు గానే భావించి పరిగ్రహించిరి. వారిం దోడ్కొని తమతమగృహంబుల కరిగి యిష్టగోష్ఠినుండిరి. వీరు కృత్రిమవేషధారిణులన్నవివేకము లేక పత్నులకంటె మిక్కిలి వారినిసమ్మానించుచు, వారింగూడి విహరించుచు సర్వకృత్యములయందు వారియాదృతిని గాంచుచునుండిరి. కాని మాయాశక్తి సామర్థ్యము నాలోచింపకపోయిరి.

అట నారాయణుండు గోపడింభకులంగూడి వేవేగ తన యింటికింబోయెను. నారదమునీ! ఇది శ్రీకృష్ణలీలాజాలమున నొకటి. హరిమహిమమును విస్తరించి తెల్పును. ధర్ముఁడు వచియింప వింటిని. దాని నెఱింగించితి. మఱియేమి వినఁగోరుదువు? అని పలికి యూరకుండెను. నారదుండును మునిచంద్రా! యని సంబోధించి యెట్టిపుణ్యముచేత విప్రపత్నుల కింతటియదృష్టము గల్గినది? మునీంద్రులకు, యోగులకు, సిద్ధులకుంగూడ నింతటియదృష్టము దుర్లభముకదా. ఈస్త్రీలు పూర్వ మెట్టి పుణ్యము నొనరించిరి? భూలోకమున నేల పుట్టిరి? ఏపాపము చేసిరి? ఈసంశయభంగ మొనరింపు మన నారాయణుఁ డిట్టులనియెను.

## విప్రపత్నుల పూర్వవృత్తాంతము.

నారదమునీంద్రా! వినుము. పూర్వము సప్తర్షులభార్యలు సౌందర్యమున నప్రతిమానలై గుణవతులై సదాచారపరాయణలై ధర్మనిరతలై పతివ్రతలై యుండిరి. మఱియుఁ గ్రొత్తఁగా నెలకొనుయౌవనమున వారలరుచుండిరి. దివ్యవస్త్రములంగట్టి రత్నాలంకారములందాల్చి, పుటముపెట్టినబంగరువంటి దేహచ్ఛాయయొప్ప, ధైర్యముల్ఁ జిఱునగవు మొలకలెత్త మహర్షులంగూడ మోహింపఁజేయఁజాలియుండిరి. మోహింపఁజేయఁదగు తదవయవములం గాంచి మించినతమి మదనప్రేరితుఁడై యగ్ని పరితపించుచు వారింగోరెను. హోమార్థమగ్నికుండముచెంతకు వారురాఁగా జ్వాలాహస్తములచే వారినిబట్ట నుంకించి తదీయాప్రతిమానాంగముల నంట సాగెను. దాన నాతనిప్రజ్ఞ నశించెను ఆపతివ్రతలు భర్తృపాదాబ్జాధీనమానసలుకాన నాతనివాంఛ యెఱుఁగఁజాలకుండిరి. అగ్నియు వారియంగముల స్పృశించుచు మిగులఁ గాముకుఁడై మూర్ఛాపరవశుఁడయ్యెను.

అంతఁ గొంతకాలమునకు వీతిహోత్రు నభిప్రాయ మిట్టిదని యంగిరసుండనుముని గ్రహించెను. కోపానలంబున మానసంబుదూల హవ్యవాహనా! సర్వభక్షకుఁడవు గమ్మా యని శపించెను. వహ్నియు నంతట బుద్ధిబలము వెలయఁ దన యకృత్యముం దలంచికొని కడుంగడు విచారించి యంగిరసుని సంతో

పింపఁజేసెను. ఆముని బ్రహ్మతేజస్సును దెలిసికొని వణఁకెను. లజ్జచే మోమువంచెను. అప్పుడు క్రుద్ధుఁడై యమ్ముని యగ్నికి చ్చినశాపమునఁ దనివిచెందక యగ్నిచేఁ దాఁకఁబడిన మునిప త్నులం దిలకించి యిట్లు శపించెను. వనితలారా! మీరు మను ష్యయోనింబుట్టుఁడు. భారతమున బ్రాహ్మణు నింట జన్మిం పుఁడు. కులశీలోపేతులగు విప్రప్రవరులే మిమ్ముఁ బెండ్లియా డఁగలరు.

ఆశాపమును విని యాకాంతలు ప్రేమవిహ్వలలై విల పించిరి. చేతులు జోడించిరి. కరము నిర్వేదమందిరి. అయ్యో! ఎట్టిపాపమెఱుంగని మనకిట్టి నికృష్టజన్మము రాఁజెల్లునే యని వగలఁబొగిలిరి. ఏమిచేసిన నేఁక లాభమేమని విద్వద్వరిష్ఠు నాతని కిట్లు విన్నవించిరి. మునివర్యా! మమ్ము వదలకుము. మాయం దించుకయుఁ బాపములేదు. సదా పతిభక్తిపరాయణలను. పరునిస్పర్శనమును మేమెఱుంగము. కాన మమ్ము వదలుట న్యాయముకాదు. భక్తులకు, కింకరులకు దండము విధింపరాదు. మహాత్మా! మీపాదారవిందముల నెప్పుడు మరల దర్శింపఁగ లము? సతులకుఁ బతివియోగము ఖడ్గమున ఛేదించుటకంటె, వజ్రపాతమునకంటె, సర్వప్రహారణములకంటె దారుణమైనది కదా. అది భరింపశక్యమా. బ్రహ్మవేత్తలై, గుణవంతులై, మహాత్ములై మహర్షులై యలరుకాంతులను వదలి భూతలమున కెట్లు పోవనేర్తుము. మీయానతినంది వెళ్లిన నిటను మం

వచ్చు జెప్పుడు? అజ్ఞానస్పర్శదోషము మాకు లేకుండుఁగాక. విధి యాజ్ఞయు నిట్టిదేకదా. పూర్వ మహల్యాదేవి యింద్రునిమోసమునకు లోఁబడి యతనింగూడి సుఖించె కాని యామె శుద్ధురాలయ్యెను. ఆమె యదృష్టవంతురాలుగాన నట్లయ్యెను. తెలియక యగ్నిచే స్పృశింపఁబడిన మేము త్యజింపఁబడితిమి. మహాత్మా! నీవు వేదవేదాంగపారగుఁడవు. ధర్మిష్ఠుఁడవు. కాన నాలోచింపుము. విశేషించి నీవు విశ్వకర్తకుఁ బుత్త్రుఁడవు. ఇతరులు భయపెట్టినచో స్త్రీలు భర్తను శరణుచొత్తురు. భర్తయే భయపెట్టిన నింక నెవ్వనిమఱుఁగుఁ జొత్తురు? ధర్మాత్మా! మా కభయమిమ్ము. మేము మిగుల భీతిల్లితిమి. శిష్యునకుఁ బుత్త్రునకుఁ గళత్రమునకు నేదండము విధింపవచ్చును? ప్రబలుఁడుగాని దుర్బలుఁడుగాని తనవస్తువులకు నధిపతికదా. స్వద్రవ్యమును విక్రయించుటకు అధికారి మఱియొకఁడు కాఁడుకదా!

అని వనితామణులుపలుక మునిపుంగవుఁడు దయాళువై వారికిఁ దానొసంగినశాపంబునుదలంచి బిట్టు విలపించెను. వారి ముఖసరోజముల నిరీక్షించి మిగులఁ బరితపించెను. వేదవేదాంగపారజ్ఞుఁడు. జ్ఞానులలో యోగులలో నుత్తముఁడునగు నాయంగిరసుఁడు మునిపత్నులపరితాపమును దలంచి మూర్ఛిల్లెను. వారును మునింగాంచి సంతప్తలైరి. ఎల్లరుం గందికుందిరి. విరహము నెట్లు భరింపఁగలమా యని యాలోచింపఁ

దొడఁగిరి. పిదప వారి మరలం బరికించి వేదవేదాంగముల నెఱింగినముని చాలసేపు పరితపించి సోదరులంగూడి యాలోచించి దయాంతరంగుఁడై యిట్లుపలికెను. పతివ్రతలారా! ఒక్కమాట చెప్పెద. సత్యమనినమ్ముఁడు. స్వకర్మపరిభోగము శ్రుతిప్రసిద్ధము. అది మఱియొకకర్మ మొనర్చినంతదనుక నుండును. మమ్ముంగూడియుండుమాట, యసత్యము. అదిచెడినది. భోగము గతముకాఁగా మరల దానిననుభవించుటయుఁ బొసఁగదు. శుభాశుభరూపకర్మము భారతభూమి ననుభవింపక తప్పదు. ఎన్నిజన్మము లెత్తినను దప్పదు. పరభుక్తయగు కాంతనే నరాధముఁ డనుభవించునో ఆవాఁడు కాలసూత్రమునఁ జంద్రసూర్యులుండుదాఁకఁ బడియుండును.పరభుక్తయగు వనిత దైవకార్యమందును పితృకార్యమందును, పాకముచేయఁబనికి రాదు. దానియాలింగనము భర్తను లక్ష్మీవిరహితుని జేయును. దేవతలు హవ్యమును, పితరులు తర్పణమును గ్రహింపరు. సుఖవంతులుకాకుందురు. అని బ్రహ్మశాసించెను. కావున భార్యారక్షణమును బ్రయత్నపూర్వముగఁ జేయవలయు. లేనిచోఁ దద్భర్త పాపాత్ముఁడగును. నరకభోక్తయునగు. కాఁబట్టియే పండితుఁడు భార్యను పెక్కువిధముల రక్షింపఁబూనును. వనిత వ్రతపరాయణురాలుకాదు. సకలదోషనిధియగును. కళత్రమును పాకపాత్రమును సదా రక్షింపఁదగును. స్త్రీ పరపురుషస్పర్శనమున నశుద్ధయగు. స్వభర్తృస్పర్శనమునఁ బరిశుద్ధురాలగు.ఏయధమ వనిత తనమగనివదలి పరపురుషునిగోరునో అదికుంభీపాకమునం

బడు. చంద్రసూర్యులుండుదాఁక నందుండును. ఆయాఁడుదా నినే యమదూతలు నరకాంతరమున నునిచి యందుండి లేచు నేని దూరముననుండి పరికించి దండింతురు. సర్పములంత పెద్ద పురుఁగులు వాఁడిదంతములుగలవియై భయంకరాకారములుగల వియై పుంశ్చలియగువనితను దివానిశములుపొడుచుచుండును. ఆబాధలకుఁ దాళఁజాలక వికృతశబ్దము నొనరించుచు నటనుం దురు సూక్ష్మదేహమును దాల్తురుగాన దెబ్బలచే వారు మరణింపరు. క్షణకాలసుఖమనుభవించి యశస్సుపోఁగా పతితయై పరలోకమున నిట్టిగతిని గులటపొందునుజుఁడీ. ఎవతుక పరపురుషస్పర్శనమునుగోరునో యాపాపాత్మురాలు పరిత్యాజ్యయే యగునని పితామహుఁడు శాసించెను. కాఁబట్టియే నారిని బరపురుషుని కంటఁబడకుండఁ బ్రయత్నపూర్వకముగ భర్తలు కాపాడుటొప్పు. ఏవనిత లసూర్యంపశ్యలగుదురో శుద్ధాంతవాసమునఁ జెలువారుదురో వారే పతివ్రతలగుదురు. స్వచ్ఛందగామినియై స్వతంత్రయగునో ఆవనిత సూకరీతుల్యయగు. మనసున దుష్టయగుకాంత సత్యముగఁ బరగామినియేయగు. కులధర్మభీతయై యేకాంతస్వామిసాధ్వయో అట్టికాంత భర్తంగూడి వైకుంఠమున కరుగును.

కామినీమణులారా! మీరు భూలోకమునకుంబొండు. ఇష్టమువచ్చినతావునఁ బుట్టుఁడు. శ్రీకృష్ణదర్శనమాత్రమున గోలోకమునకుఁ బోవఁగలరు. ఇది యథార్థము. శ్రీహరినిర్మిత

చ్ఛాయ మీకుబదులుగా విప్రమందిరమున నునిచి మరల మిమ్ము మాదగ్గరంజేర్చును. మీరు గోలోకమునసుండియే యొకయంశమున నవతరించి మాకు భార్యలగుదురు. సంశయింపకుఁడు. కాన మీకు నాశాపము వరమునకంటె నెక్కుడుగ మేలుచేసినట్లయ్యెను. అనిపలికి యాయంగిరసుఁడు విచారసాగరనిమగ్నుఁడై యూరకుండెను. ఆస్త్రీలు శాపవశమున మర్త్యలోకమునంబుట్టి విప్రపత్నులైరి. శ్రీహరికి భక్తిచే నన్నము పెట్టి శ్రీహరిమందిరమునకుఁ బోవఁగల్గిరి. వారి కాశాపము వరమునకంటె నెక్కుడయ్యెను. సంపత్తి నింద్యము నీచమునగు. విపత్తి వరమునకన్న నధికము. ఔరా! సాధువులయాకస్మికకోపము పరోపకారమునకు సాధనమయ్యెఁగదా. విపత్తిమహిమము లేక సంపద్వృద్ధికలుగనేరదు. ఆకాంతలు కాంతపరిత్యాగమున బ్రాహ్మణవనితలైరి.

నారదా! ఇట్లు మహాద్భుతంబగు శ్రీహరిదివ్యచరిత్రమును వినిపించితిని. పుణ్యచరితలగు కాంతలమోక్షోపాయము గూడ వచించితిని. శ్రీహరిచరితము ప్రతిక్షణమునందుఁ గ్రొత్తక్రొత్తయగుచుండును. వినువారికిఁ జాలుననుతృప్తికలుగదు. శ్రేయోవిషయమునఁ దృప్తినొందువాఁడుండునా. ఎంతమాత్రము గురువునుండి వింటినో ఎంతమాత్రము వచింపఁదగునో అంతయు వచించితిని. ఇంకనేమి వినఁగోరికకలదో దానింజెప్పుము. అన నారదముని నారాయణునిఁజూచి గురుముఖమునుండి

విన్నయంత నాకుం దెల్పుము. శ్రీకృష్ణాద్భుతచరిత్రమును వినఁ గోరెద. అని నారదుఁడు ప్రశ్నింప శ్రీమన్నారాయణుఁ డిట్లు పలుకఁబూనెను.

పాఠకమహాశయులారా! ఈగాథనుండి విశేషాంశములు కొన్ని మనము నేర్చుకొనఁదగినవి కలవు. అందు ముఖ్యవిషయముల వ్రాసెద. బాలకు లాఁకలింగొని శ్రీకృష్ణునిం బ్రార్థించిరి. విష్ణువు కాఁగల కార్యమున కిది సాధనమయ్యెనని యోజించి యజ్ఞవాటమునకుంబోయి మునుల యాచింపుఁడు. వారు పలుకకున్న వారిపత్నుల నడుగుఁడు. వా రన్న మొసఁగుదురు. వారు తల్లులు. మీరు పిల్లలుగానఁ బిల్లలయాఁకలి తల్లులకంటె నెక్కువగఁ దెలిసినవా రుండరని పంపెను. వారుపోయి శ్రీకృష్ణానుమతిని యజ్ఞకార్యనిరతులగు విప్రోత్తముల నడిగిరి. వారు బదులిడరైరి. నీ రేలవచ్చిరి? వీరి కుపకారముచేయుట ఇపుడు చేయుకార్యమునకంటె నుత్కృష్టముకాదా యని యోజింపరైరి. వారియాచన యేమియనిరైనఁ దలంపరైరి. ఆఁకలిగొని యన్నమడుగువారి కన్నమిడుట సకలధర్మకార్యములకంటె నత్యుత్తమమని యూహింపరైరి. తుదకు వారిప్రార్థనములఁ జెవినైనఁ జేర్పరైరి. వారు వారిభార్యలకడకుంబోయి శ్రీకృష్ణానుమతిం దెల్పిరి. ఆమాట చెవులసోఁకినంతనే వారి నాదరించి శ్రీకృష్ణాజ్ఞనిర్వహించి ముక్తింగాంచిరి. ఇదియే కథాసారముకదా.

ఎవ్వరికర్మము పరిపక్వమగునో వారికి విజ్ఞానము శీఘ్రమున మనసునం బొడసూపును. అపరిపక్వకర్ములకు జ్ఞానము వికసింపక కప్పఁబడియుండును. విప్రులు యజ్ఞకార్యనిరతులే కాని యాజన్మము వారికిఁ గడపటిదికాదు. ఇపుడే సత్కర్మానుష్ఠానముచేయ నారంభించిరి. కావున వారిమనస్సులు పరిపక్వములుగాలేదు. అట్టులౌటనే వారలేకర్మ ముత్కృష్టములో ఏవి నికృష్టములో తెలియఁజాలరైరి. యజ్ఞమునఁగూడ భగవదారాధనమే ప్రధానము. కాని యజ్ఞములకంటె జపయజ్ఞము ప్రధానము. అనంతపుణ్యప్రదము. బాహ్యపూజకంటె మానసికపూజ ప్రధానమైనయట్లు సత్కర్మములయందుఁ దారతమ్యముగలదు. అందు నన్నింటికంటె భగవదాజ్ఞ ప్రధానముకదా. దాని నెఱుంగఁజాలకపోయిరి. వారిభార్యలకు ముక్తిచేరువనున్నది. కాన వారు శ్రీకృష్ణాజ్ఞను వినఁగనే భర్తలనడుగక ధన్యులమైతిమని యున్న యన్నముంగొనిచని భగవంతునింగాంచి ముక్తికింబోయిరి. చెంతనున్న భగవంతుని దెలిసికొనఁజాలఁక యేలోకములోనో యున్నభగవంతుని భావించుచుఁ దత్ప్రీతికై కర్మము లాచరించువారు పరిపక్వజీవులు గారనక తప్పదుగదా. అంతియగాక వారిమనసులందుఁ దారతమ్యము నెలకొనియున్నది. జ్ఞాననిష్ఠునిమానసము సమత్వమునకు గురియైయుండును. అది నీటిపై భాగమువలె సమభావముగలది. దానియందున్న తప్రాస్వభావములుండ నవకాశమే లేదు. కావుననే వారిచిత్తములు పరిపక్వములైయుండును. కాఁబట్టి నిమిత్తము

దొరకఁగనే వారు ముక్తులగుదురు. పరిపక్వము గాని మనస్సు గలవారు నిమిత్తమెుదవినను దెలిసికొనక మూఢప్రాయులుగ నుందురు.

వేదవేదాంగపారగులైనను మునులు భగవదాజ్ఞ ఎట్టిదో తెలిసికొనఁజాలక పోయిరి. దీనిచే వేదపఠనమే చాలద నియు, దానియర్థము నెఱింగి తద్రీతి నాచరించి పరిపక్వమన స్కులైనఁగాని తరింపఁజాలఁడనియు నెఱుంగవలయు. వేద పఠనము వ్యర్థమూ యని ప్రశ్నింపరాదు. వ్యర్థముకాదుకాని కేవలపఠనము జన్మాంతరములందు విజ్ఞానమును గల్గించును. కావున నాజన్మముననే ఫలము వారికింగలుగదు. చదువుట, దానియర్థమును గ్రహించుట, గ్రహించినదాని నాచారమున నునుచుట, ఇతరులచే నాచరింపఁజేయుట యనునవి యుత్తరో త్తరశ్రేష్ఠములు గాన నాచరణము ప్రధానము. ఈవిషయ మీకథయందు మునుల ప్రవర్తనమునఁ దెలియఁబడును. కాఁ బట్టి మన మేకార్యముచేసినను జ్ఞానముకలిగి యేదియుత్తమ మని తీర్మానించుకొని పెద్ద లాచరించినరీతిని శ్రద్ధగాఁ దిలకించి సత్కార్యములఁ జేయవలయు. దుష్కృత్యములు సుకృతము లచే నశించునని కొందఱందురు. అది పాటింపఁదగనిమాట.

మునిపత్నులు పతివ్రతలుకదా పతియాజ్ఞ లేక యన్నము తీసికొని వేఱొకతావునకుం బోవచ్చునా. యజ్ఞము చేయు చుండునపుడు తత్పత్నులకు దీక్షకదా. స్థలాంతరమున కేల్లు

పోయిరి? అనునది ప్రశ్నము. సమాధానమును వినుఁడు. మునులు చేయునవి సాధారణముగా సత్రయాగములు. ఇక్ష్వాకులమునఁ జేయుయజ్ఞముల వారు చేయఁబూనరు. దాక్షిణ్యాదిష్ఠాణ్యము వారికి లేదు. తపఃప్రధానులగు మహాత్ములకు మనకున్న స్వల్పనియమము లుండవు. సత్యము ప్రధానము. దానిని వదలనివారికి ఏయజ్ఞములు కర్తవ్యములుగావు. మహర్షులు ధర్మఫలములను గోరనివారు. ఎప్పుడేని లోకోపకారము చేయఁబూని మునులనందఱిం జేర్చుకొని దీర్ఘసత్రయాగము చేయఁబూనుదురు. అపుడు చెప్పినవియే పురాణములు. వారి మాటలు శాస్త్రములగును. భగవద్భక్తిని, మనుజకర్తవ్యమును బోధించును. నీతియందుఁ బ్రధానమని సిద్ధాంతము చేయఁబడును. కావున మహర్షులయజ్ఞములు మనముచేయు రీతినియమవంతములు కావు. అట్టులౌట వారిపత్నులు దీక్షం బూని యేకార్యములు చేయక యజ్ఞమండపమును వదలకయుండవలసిన నియమములకు లోఁబడరు. దినకృత్యములు యథావిధి నిర్వర్తించుకొనుచు హోమకాలమున సంసిద్ధలైయుందురు.

భర్తయాజ్ఞ లేక యేకార్యము చేయఁగూడదన్నది సామాన్యనియమము. విశేషవిధిలేనిసామాన్యశాస్త్రము జగమునకుండ నవకాశము లేదు. కేవల పరిపక్వచిత్తముగలిగి దర్శనమాత్రమున ముక్తికిం బోవఁదగుజీవులకు సర్వసామాన్య శాస్త్రము లన్వయింపవు. లోకసామాన్యదృష్టి కిప్పటిబుషి

పత్నులకార్యము తప్పుగాఁదోఁచినను విశేషదృష్టింజూడ నది కర్తవ్యమనియే కన్పట్టును. ప్రహ్లాదుఁడు తండ్రియాజ్ఞ మీఱెఁగదా యనుటయు, శ్రీరామచంద్రుఁడు తల్లియాజ్ఞ లెక్కసేయక యడవులకరుగుట న్యాయముకాదనియు, విభీషణుఁడు "పితృసమోజ్యేష్ఠః" అన్న సూక్తినివదలి శత్రువగు రామచంద్రునిచెంతఁ జేరుట యవివేకముకాదా యనియు, నలుఁడు దమయంతి నడవులలో వదలి తననియమమును లెక్కసేయక వెడలుట దోషముకాదా యనియు, హరిశ్చంద్రుఁడు రాజ్యమును దానముచేసి భార్యను విక్రయించుట యసంగతముకాదా యనియు, విశ్వామిత్రుఁడు తపోబలంబున సర్వవిదుండయ్యు హరిశ్చంద్రునినోట అసత్యమును బల్కించెదనని పట్టుపట్టుట ధర్మసమ్మతముగా నున్నదియా యనియుఁ, గర్ణుఁడు బాసమాని చేఁజిక్కిన ధర్మజభీమసకులసహదేవులఁజంపక పక్షపాతముచూపుట యుక్తముగనుండునా యనియు,భీష్ముఁడు "ప్రజాంతంతుంమావ్యవచ్ఛేత్సీః" అను విధివాక్యమునకు విరుద్ధముగ బ్రహ్మచర్యమూనుట శాస్త్రవిహితమా యనుటయు, ధర్మరాజు గురునియెదుట మిషనుగల్పించి మాటచెప్పుట మహాపాపహేతువుకాదా యనియు, లక్ష్మణుఁడు యౌవరాజ్యపదమును గ్రహింపుమని శ్రీరామమూర్తిపలుక వలదనుట విధివిహితమా యనియు, భరతుఁడు తల్లియాజ్ఞ దాఁటుటయగాక యామెను బదలుట తప్పుకాదా యనియు, శ్రీకృష్ణపరబ్రహ్మము చక్రము నడ్డుపెట్టి సైంధవు నర్జునునిచేఁ జంపించుట చేయఁదగినపని

యగునా యనియు, ద్రోణాచార్యుఁడు పక్షపాతముచూపి యుద్ధమొనరించుట శాస్త్రసమ్మతమా యనియుఁ, బరాశరముని ఉదయకాలమున మత్స్యగంధింగూడుట మునికృత్యమేనా యనియు, నీమొదలగువిషయములఁ బ్రశ్నించుట వివేకిలక్షణ ముకాదు. అట్లే పైవిధముగాఁ బ్రశ్నించుటయు నగు.

భర్త యానతిమీఱి పనిచేయుట న్యాయముకాదు. పతియే దైవముకదా యన్నదాని కించుకసమాధానము చెప్ప కతప్పదు. పతియే దైవమనఁగా నుపాస్యదేవతయం దెట్టిభక్తి యునుపవలయునో,అంతటి విశ్వాసము భర్తయం దునుపవలయు నని దానిభావము.పతిఁదప్ప భగవంతు నుపాసింపరాదనికాదు. అజ్ఞానముప్రధానముగాఁగలభర్తనుసుజ్ఞానముప్రధానముగాఁ గలిగిపైజన్మమెత్తఁదగనిపుణ్యముచేసి పుట్టినకాంతామణి యా చరింపఁదగునియమములు వేఱు.సామాన్యనియమములు వేఱు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ.

అన్నసూక్తి యట్టివనితలకుం బ్రమాణమగును. అట్టి వారికిఁ బునరావృత్తిరహితశాశ్వతభగవత్సాయుజ్యము దొర కును. కావున సామాన్యదృష్టిని శాస్త్రములను బరికింపక విశే షదృష్టిం బరికించిన విశేషవిధులు ప్రత్యక్షములగు. వాని నను సరింపఁదగునేకాని సామాన్యధర్మములఁ బాటింపరాదు. అవి యెంతకాలముపాటించినను ముక్తిని గూర్పఁజాలవు. కాని విశే షవిధుల ననుష్ఠింపఁదగినవానిని జేయఁగలవు. కావున సామా

న్యశాస్త్రము వ్యర్థముకాదు కాని దానిని మీఁఱఁజాలుయో గ్యత గలవారి కవి యాచరణార్హములు కావు. కావున నిట్టి కుప్రశ్నములంజేయుచుఁ గాలము వృథసేయక భగవత్సేవ చేయవలయు. పాఠకమహాశయులారా! ఇఁకఁ దరువాతిభగవత్కథల నాలకింపుఁడు.

## అఘాసురసంహారము.

* ఒకనాఁడు గోపకుమారు లందఱు గోసముదయమును గదలించి వినోదముగా వనమునకుంబోవ నెంచిరి. రాధాకాంతుఁడు వేణువునుదాల్చి వారివెంట బయలువెడలెను. అడవింజేరిరి. ఇచ్ఛానుసార మాడ మొదలుపెట్టిరి. ఆనాఁడు డాఁగుడు మూఁతలాడవలయునని వారికిం గోరికకలిగెను. ముందు శ్రీకృష్ణుఁ డెచ్చటికోపోవుట, వెనుక నేను నేనని బాలకులుపోవుట ముందెవ్వఁ డాభగవంతునింజేర సరిగి ముట్టునో వాఁడు జయమొందుట లోనగునియములందుఁగలవు. ఆనియమములు వారే నిర్ణయించుకొనినవేగాని యితరులు నిర్ణయించినవి కావు. ఆనియమములకు లోఁబడినఁగాని యాయాటసాగదు.

ముందు వనజాక్షుఁడు ఎచ్చటికోపోయెను. ఆవల బాలకులు తమలోఁదారు ముందునేఁ జని కృష్ణమూర్తిం బట్టుకొని యెదనని యొకఁడు, నీకంటెముందు నేఁజని పట్టుకొనియెదనని

* ఈకథ శ్రీభాగవతము దశమస్కంధము పండ్రెండవయధ్యాయము నుండి వ్రాయఁబడినదని తెలియందగు.

వేఱొకఁడు నిట్లు పందెములు వేసికొనిరి. ఈఘట్టమున శ్రీభాగవతమునందు,

యత్పాదపాంసు ర్బహుజన్మకృచ్ఛ్రైం
ధృతాత్మభి ర్యోగిభి రప్యలభ్యః,
సఏవ యద్దృగ్విషయే స్వయంస్థితః
కింవర్ణ్యతే దిష్ట మహో వ్రజౌకసామ్. ౧౨. శ్లో.

దీనికి మహాకవి పోతనగారు,

ఉ. ఎన్నఁడునైన యోగివిభు లెవ్వనిపాదపరాగ మింతయుం,గన్నులఁ గాన రట్టిహరిఁ గౌఁగిటఁజేర్చుచుఁ జెట్టఁబట్టుచుం,దన్నుచు గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బైఁబడి కూడియాడుచున్, మన్ననసేయువల్లవకుమారులభాగ్యము లింత యొప్పునే.

అని వ్రాసిరి. ఇంతచాలక,

క. విందులకును బ్రహ్మాసుఖా
నందంబై భక్తగణమునకు దైవతమై
మందులకు బాలుఁడగుహరి
పొందుఁ గనిరి గొల్ల లిట్టి పుణ్యులు గలరే.

అనియు వ్రాసిరి. ఇందు మొదటిపద్యములోని రెండవ మూఁడవపాదములకు మూలమునఁగల "యద్దృగ్విషయే స్వయంస్థితః" అన్నదియే శరణము. దాని నాధారముగఁజేసికొని "కౌఁగిటఁజేర్చుచుఁ జెట్టఁబట్టుచుం దన్నుచు గ్రుద్దుచున్ నగుచుఁ

దద్ధయుఁ బైఁబడి కూడియాడుచుఁ" అని బాలకులయాట లను వ్రాసిరి. సెబాసు! పోతనగారూ! మెచ్చవచ్చు నీవైదుష్య ము! నీలోకజ్ఞానము ప్రశంసింపఁదగినదియకాక విద్వచ్ఛిరోమ ణులకు శిరసున ధరింపఁదగినది. భక్తిరసప్రభావము నెఱుంగవ లయునన్న నిన్నుదాహరణముగాఁ గొనిన శాస్త్రములఁ జదువ నక్కఱలేదు. మహాత్మా! నీజన్మమే జన్మము.

రెండవపద్యమంతయుఁ గల్పితమే కాని యందలి యర్థముపనిషత్సారము. పోతనగారెట్టిపుణ్యాత్ముఁడు. ముక్తి సామ్రాజ్యమున కభిషిక్తుఁడుకదా.

ఇట్లు బాలకులు శ్రీహరితో నాడుకొనుచుఁ గ్రీడించు చుండిరిగాని భగవంతుఁడనిమాత్రము తెలియరైరి. ఎన్నిపర్యా యములు మహాద్భుతావహ శ్రీకృష్ణచర్యలంజూచినను వైష్ణవ మాయ గాఢముగాఁ గప్పుటచే మఱచి సామాన్యబాలునిగా భావించి క్రీడించుచుండిరిగాని భగవంతుఁడని తలంపనైన శక్తు లుగాకుండిరి. ఔరా! వైష్ణవమాయాప్రభావము! దానిమీఱ నెవ్వనితరము? వైష్ణవమాయ యనఁగాఁ బ్రకృతి. వైష్ణవమనఁ గాఁ బ్రపంచమును వ్యాపించునట్టిశక్తి. కావునఁ బ్రకృతిచిత్ర చరిత్రము నెవ్వఁడెఱుంగఁగలఁడు? ఎఱింగితిననుట పిచ్చితనము కదా! అంతియగాక యది తుచ్ఛమనుట యంతకన్న నవివేక ముకదా. ఈవిషయమును జక్కఁగా నెఱింగిన శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులుగారు, సౌందర్యలహరియందు,

శ్లో. తనీయాంసంపాంసుం తవచరణ పంకేరుహభవం
విరించిస్సంచిన్వ న్విరచయతి లోకానవికలమ్,
వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం
హరస్సంక్షుద్యైనం భజతి భసితోద్ధూళనవిధిమ్.
త్వదన్యః పాణిభ్యా మభయ వరదో దైవతగణ
స్త్వమేకానైవాసి ప్రకటితపరాభీత్యభినయా,
భయాం త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవహి చరణావేవనిపుణౌ. ౧౬౫

ఇట్లు మహాత్ములు నుడువుచుండ మేము ప్రకృత్యతీతమగు బ్రహ్మము నుపాసింతుముగాని ప్రకృతి నుపాసింపమనువారికిఁ బ్రపంచజ్ఞానము తక్కువయనవలసివచ్చినది. ప్రకృతియనఁగాఁ బార్వతియని వారిభావము. కాఁబట్టియే శాక్తమనఁగా వారికిఁ దలనొప్పి. త్రిమూర్తులు ప్రకృత్యతీతులు కారని వారూహింపఁ జాలరని తోఁచెడిని. రూపనామక్రియావంతమగునదియెల్లఁ బ్రకృతివికారమే యని వారు గ్రహించినచో వారి కేశంకలు పుట్టవు. క్షణముక్రింద శ్రీభగవంతుఁడు స్వవక్త్రమున బ్రహ్మాండములుచూపి తల్లిని విస్మితస్వాంతగా నొనరించి యంతట వైష్ణవఛాయచేఁగప్ప నాయశోద యంతలో మఱచి పుత్త్రునిగనే భావించెననిన మాయాశక్తి యెట్టిదో తెలియఁబడదా. అట్టిదాని నతిక్రమించెదమను నూహయే అసంగతము.

అంతట బాలకులు శ్రీకృష్ణుఁడు సంతోషముతో నాడు కొనుచుండిరి. కొంతసేపు వేణుగానము చేయుచుండిరి. ఫలములఁ దినుచుండిరి. ఆసంతోషమునకు అంతము లేకుండెను. వారి యుత్సాహమునకుఁ బారములేకుండెను. ఏలయన ననంతు నింగూడుటచే నానంద మనంతము. ఉత్సాహమనంతము. వారి సామర్థ్య మనంతము. ఇట్లు వారానందసాగరమున నోలలాడు చుండుకాలమున నాయడవియందుండి సకలభూతసంహారము చేయఁగోరురాక్షసుఁ డొకఁ డానందపరవశులగు నాగోపబాల కులం జూచెను. వానిపేరే యఘాసురుఁడు. వాఁ డితరులయా నందమున కోర్వఁజాలఁడు. తుచ్ఛప్రకృతిగలవాఁడు. మహా క్రూరుఁడు *కాఁబట్టియే యమృతపానముచేసిన దేవత లాయ సురునిమృతికై నిరీక్షించుచుందురు. వాఁడు మృతినొందినఁ గాని తమకు సుఖములేదని దేవతలభావము. అట్టి యిక్కట్టు లంబెట్టి దేవతల నిట్టట్టులాడించినజెట్టి. అట్టి దుష్టాత్మునిమృతికై కనిపెట్టియుండనిసాధు వెవ్వఁడుండును? లోకాపకారిమృతిని బంధువులే కోరుదురు. వానిమృతికై యెవ్వరును జింతింపరు.

తొలుదొలుతఁ గృష్ణునింజంపఁ గంసుఁడుపంపిన పూతన బకాసురునిసోదరి. ఆపూతనాబకాసురుల కీయఘాసురుఁ డనుజుఁడు. కావున నాయరణ్యములో నాడుచున్న కృష్ణుంగాంచి

* నిత్యం య దంతో నిజజీవితేప్సుభిః పీతామృతై రప్యమరైః ప్రతీక్ష్యతే-అని మూలము.

హుంకరించి మేనుపెంచి తనపగఁ దీర్చుకొనఁ బ్రయత్నించెను. సోదరుం జంపినవానిం జంపక తప్పదని సిద్ధాంతముచేసికొనియెను. పూతనాదులకందఱకును గంసుఁడు రక్షకుఁడు. తదాజ్ఞమెయి వారు మెలఁగుచుండిరి. ఇర్వురు మరణించిరి. వీఁడొక్కఁడు కొదువయుండెను. కంసునాజ్ఞం దలంచెను. బకాంతకునిం జంపినఁగాని నాపగమాయ దనునూహచే నతఁడు వధింప సమకట్టెను.

ఆయఘాసురున కజగరాకృతియం దిష్టము మెండు. కాన నజగరాకారముందాల్చెను. దానిపొడవు యోజనప్రమాణము. దానియెత్తు పెద్దపర్వతమంతయుండును. దానినోరు భూరిభూధరగుహాయంతటిది. కోఱలు భయంకరములైయుండును. దాని నిట్టూర్పువలన సమీపమందున్నకొండలు కదలుచుండును. ముఖము దిలకించిన వారిలో బ్రదికినవారు దేవతలేకాని మనుష్యులు లేరు. ముఖమారుతము విషసాంద్రముగాన నెన్నియో భూతములు దూరమందున్నను ఆవేఁడిసోఁకి మృతినొందుట యలవాటు. అట్టిరాక్షసుఁడు గోపకులతో శ్రీకృష్ణునిం బొలియించి తమయేలికకుఁ బ్రీతిచేయ నిశ్చయించుకొనెను.

అంత నయ్యఘాసురుండు తనదేహమును గడుంగడుం బెంచి గోపకులు శ్రీకృష్ణమూర్తియు వచ్చుచున్నత్రోవలో నడ్డముగా శయనించినట్లుండెను. ఒక్కుమ్మడిగా వీరినందఱిని మ్రింగెదఁగాక యని తలంచుచుండెను. చుఱుకుఁజూపుల వారలం

జూచుచు ఎపుడువత్తురా యని వేచియుండెను. అంతలో గోప కు లాపెనుఁబామును దూరమునుండియే కనుఁగొనిరి. కొంద ఱిదియేమి పర్వతమా యని యూహించిరి. మఱికొందఱు దానియాకృతింగాంచి యిది ఘోరసర్పము. కొండచిలువయని పిలువఁబడున దిదియేకాఁబోలుననితలంచిరి. మఱికొంద ఱిదియే యజగరంబని పురాణములలోఁ జెప్పఁబడునదియని నిశ్చయిం చిరి.మఱియుంగొందఱద్దానిదృష్టింగాంచిఇదిమనలనందఱనొక్క త్తున మ్రింగఁదలంచిన ట్లగపడియెడు. దీనిని దొలంగిపోవు వెరవు కానఁబడదని విచారింపసాగిరి. ఇంకనుంగొంద ఱద్దాని దుర్బుద్ధిం బరికించి మనల నిది చంపఁబూనిన ట్లగపడు. కాని యిది మన కేమే నపకార మొనరింపఁబూనినచో బకునిగతియే దీనికిం బట్టును. బకునిసంహరించి మనయిడుమలఁబాపిన కృష్ణుఁడు మనకండగానుండ భయంపడనేల? అని సిద్ధాంతముచేసిరి. అం దుఁ బెద్దవారగు మఱికొంద ఱీయజగరము దురాలోచనము చేయుచుఁ ద్రోవలోఁ బడియుండి మనల మ్రింగనే ప్రయత్నిం చుచున్నది. అపుడపుడు మనలంజూచుచుఁ గనులమూయుచు మరలఁ దెఱచుచున్నది. దీనిజాడఁదలంచిన నేదోపాపబుద్ధిం గొనియున్న ట్లగపడియెడు. మనము దీనినిదాఁటి గోవులపరిసర మునకుం బోవలసియున్నది. పోవకున్న గోవులు నలుదెసలకుం జెదఱిపఱచును. కావున శ్రీకృష్ణునిపై భారమునిచి మనమరుగు దము. దానిని దాఁటునపుడు మ్రింగఁదలఁచినచోఁ గృష్ణాయని ప్రార్థింతము మనలఁ గష్టములనుండి గట్టెక్కింప మనకృష్ణుఁడు

సిద్ధముగనున్నాఁడు. ఈవఱకు గతించినరాక్షసులకంటె వీఁడు గొప్పవాఁడా? వారేపాటుపడిరి? ఆగతి వీనికింబట్టును. భయమేల యని నిశ్చితస్వాంతులై శ్రీకృష్ణా! మమ్ము రక్షించుభారము నీది. నిన్ను నమ్మియున్నవారము. ఈక్రూరభుజంగమును దాఁటెదము. తర్వాత నేమిజరిగినను నీవే మాకుదిక్కు. అని పలుకుచు నొండొరులు భుజములపైఁ జేతులువ్రేసికొనుచు నడువసాగిరి. భీతిల్లినవారుకూడ ముందు నిర్భయముగాఁ బఱచు బాలకులంజూచి మనకేలభయమని ధైర్యమును దెచ్చుకొని వడివడి సుద్ధులై నడువసాగిరి. కొందఱు బాలకులు నిలువంబడి ముందుపోవువారిగతిం గాంచి మనమరుగుదము. త్వరపడనేల యని యూహించుచుండిరి. ఇంతలో గోవత్సము లంబారవంబుగావించెను. దాన మఱియు వారలచిత్తంబు లాతురత నందెను. త్వరగా దీనిని దాఁటిపోవకున్న నీదూడలు తల్లులం జూడఁజాలక వగచెందునని తలంచి నిర్భయముగా నడువసాగిరి.

* అంత శ్రీకృష్ణమూర్తి కేవలసర్పబుద్ధిచే దాని లెక్కగొనకపోవుచున్న బాలురంజూచి మోఱకుఁదనమున రాక్షసుఁడని యెఱుంగక తన్నే నమ్మిపోవుచున్నవారే. ఏమి యిడుమ

---

* ఇత్థం మిథోఽతథ్యమతజ్ఞభాషితం శ్రుత్వా విచింత్యేత్యమృషామృషాయతే, రక్షోవిదిత్వాఖిలలోకహృద్ధిస్తతః స్వానాం నిషేద్ధుం భగవా న్మనో దధే-అని మూలము.

వాటిల్లునో యనియైనఁ దలంపలేదే యని భావించి వారిని నివారింపఁ దలంచునంతలోనే యాకలతోడబాలకులు అజగర ముఖబిలమును జొచ్చిరి. పాపము! ఆసమయమున వారి కది సర్పముఖబిలమని తోఁపలేదు కాఁబోలు! ఆవక్త్రబిల మొక కొండగుహావలె విశాలమై యంధకారావృతమై కడుభయంకరమై వేఁడినిట్టూర్పులచే సంతాపజనకమై యుండెను. ఎన్నిగోవత్సములు, ఎందఱు గోపబాలకులు పోవుచుండినను ఇంకను విశాలమగుచుండెను. ఆరాక్షసుఁడు త్వరగారండు. ప్రవేశింపుఁడు. నోరుమూయులోపల నందఱు చొరఁబడుఁడు. కృష్ణుఁడు గూడఁ బ్రవేశించుఁగాక. నోరుబిగించెద. లోపల మాడిచత్తురు. కంసుని మనఃక్లేశముపాయు. నీక్రోధము తొలఁగును. మాఅన్నయగుబకునకు అక్కయగు పూతనకు మహోపకారమొనర్చినవాఁడ నగుదును. వారిఋణము తీర్చుకొన్నవాఁడ నగుదును. ఇంకను వేవేగ ప్రవేశింపకున్నారేమి? అని తలంచుచు వక్త్రబిలము నింకను బెద్దదిగాఁజేయుచు మహాక్రూరమతియై చింతించుచుండెను.

అంతలో గోపాలబాలకులు బిలమువంటిదానిమోమును జొచ్చిరి. గోపకులందఱు లోనఁజొచ్చుటం గాంచి యాయఘాసురుండు తనవక్త్రమును మూయఁదలఁచునంతలో *శ్రీకృష్ణుఁ డిఁక నాలస్యముచేసినఁ గార్యముచెడునని యో

---

* కృత్యం కి మత్రాస్య ఖలస్య జీవనం నోవా అమీషాంచ సతాం

జించి తానును దద్బిలంబుఁజొచ్చెను. చొచ్చినంతనే యయ్యనంతుఁడు తనదేహమును బెంచి దానియూపిరి వెడలకుండ బంధించెను. కంఠమున కడ్డముగా మేను పెంచి నిర్బంధించినవెంటనే దానియూపిరి లోపలనే నిలిచెను. వాయునిర్బంధము చేత నది యింక బ్రదుకనని నిశ్చయించుకొని పెనుగులాడఁజొచ్చెను. ఎంత ప్రయత్నించినను ఆయనంతుని యనంతశక్తిని మించఁజాలునా! ఇట్లు కొలఁదినిమేషములు వెతలంబడియెను. అంతట దానిప్రాణవాయువులు లో నుండఁజాలక వెడలువెరవు తోఁపక శిరస్సు భేదించుకొని యెచటికో పోయెను. ప్రాణవాయువులు వెడలఁగనే దానిదేహమున శక్తిలేకపోయెను.

అవ్వల శ్రీహరి గోవత్సబాలకులంగూడి ముఖద్వారమునుండి వెడలివచ్చెను. ఎవ్వరికి నేబాధయుఁ గలుగకయుండెను. ముందు శ్రీహరియు వెనుక గోవత్సంబులును, ఆవల బాలకులుగా నందఱు మరల వెలుపలికివచ్చిరి. ఇప్పట్టున శ్రీభాగవతమున లేకున్నను జక్కనిభావమును మహాకవి శ్రీపోతనగా రొక్కపద్యమున భక్తిని, భగవంతు నార్తత్రాణపరాయణత్వమును దెలిపెను.

ఆ. అమరవరులకొఱకుఁ గమలజాండం బెల్ల
బలిఁ దిరస్కరించి బలియు వడుగు

---

వినాశనం, ద్వయం కథం స్యాదితి సంవిచింత్య తత్ జ్ఞాత్వా వికత్తుండమశే షద్భాగ్ఘరిః-అని మూ.

గోపసుతులకొఱకుఁ బాపపుఁ బెనుబాము
గళము దూఁటుగట్టి బలియకున్నె.

ఇందార్తత్రాణుఁడు భగవంతుఁడను నర్థము మూర్తీభవించినట్లీపద్య మలరారుచున్నయది. ఇందొక్క విశేషార్థము పొడకట్టెడు. ఏమన, దేవతలకొఱకు బలిని యాచించి బ్రహ్మాండంబంతయు నావరించిన శ్రీహరి గోపసుతులకొఱకుఁ గ్రూరభుజంగముఖద్వారము నరికట్టకపోవునా యనికదా దీనిసారము. దీనిచే దేవతలకంటె గోపబాలకులు భగవత్ప్రీతి కెక్కుడుపాత్రులని తేలునుగదా. దేవతలపనికై బలినిజూచి దానమును గ్రహించి ప్రపంచము నావరించెఁగదా. ఇఁక గోపసుతులకొఱకు ఎట్టికార్యమునైనఁ జేయకుండునా యనునర్థము స్ఫురింపకమానదు. ఈయర్థము ప్రశస్తమే. ఏలయన, గోపసుతులెవ్వరు? గోలోకవాసులగు పాదసేవకులు. తన్నే నమ్మియున్నవారు. అనన్యశరణ్యులు. సదా తన్నే భజించుచు నుండువారు. సఖులు, సేవకులు, ఆశ్రితులు. మిత్రులు ఇంకనెన్నియోశబ్దములచేఁ జెప్పఁదగువారు. కావున వీరికొఱకుఁ దానెట్టి గట్టిపనియైనఁ జేయకమానఁ డనునర్థము ప్రశస్తము. ఇట్టియర్థము మూలమున లేదేయని వదలక మహాకవి తనచమత్కృతిని జూపెను. ఇట్టిదియే భాషాంతరీకరణమనఁగా, "ముక్కస్య ముక్కార్థః" అన్నట్లు తెనిఁగించినది యొకభాషాంతరీకరణమా. భావమును విస్తరించి సారమును బాఠకులకు వలదనుకొన్నను

దెలియునట్లు చేయువాఁడేకవి. అట్టిశక్తి లేకున్న నాజోలికేఁ బోకుండుటేమంచిది. చేతగానిపనికిం బూనుకొని మూలకర్తభావమును బాడుచేయఁబూనుటకన్నఁ బాపకార్య మేదికలదు ?

అంతట నందఱకు స్పష్టమగున ట్లొక్కవిశేష మాచోట జరగెను. ఆపెనుఁబాము మస్తకమును భేదించుకొని వెడలిన ప్రాణవాయుజ్యోతిస్సు మింటనుండు దేవతలు వెఱగంద సూర్య తేజస్సును దిరస్కరించుచువచ్చి శ్రీకృష్ణపరమాత్మ దేహమును బ్రవేశించెను. ఆవిచిత్రమును జూచి దేవతలు పుష్పవర్షములు గురియించిరి. దుందుభులు మ్రోఁగెను. అచ్చరలాడిరి. గంధర్వులుపాడిరి. దిక్పాలకులు శ్రీహరిని సర్వేశ్వరా ! నీయద్భుత చరిత్ర మెఱుఁగఁదరమా యని వినుతించి కృతార్థులమైతిమని విన్నవించిరి. ఆవాద్యములధ్వనులు దేవతా స్తుతిరవములు చెవింబడఁ బితామహుండు తనపని చాలించి యరుదెంచి యాచరిత్రమును గాంచి కరము హర్షించెను.

భక్తులారా! ఈయఘాసురవృత్తాంతమునుండి విశేషవిషయములు గ్రహింపఁదగినవి చాలలేవు. ఐన నొక్కవిషయము వ్రాయకతప్పదు. ఏమన, రాక్షసులు తఱచుగా వికృతరూపములనుండఁ గారణమేమన్న ప్రశ్నమునకు నుత్తరమే. అదియే దీనినుండి గ్రహింపఁదగినది. ప్రాయశః జీవులు స్వస్వకర్మానుగత రూపముల నిష్టముగఁ జెందుచుందురు. మనుజులలోఁ గూడఁ గొందఱకు నొక్కజంతుజాతిపై నెక్కుడుప్రేముడియుండును.

మఱికొందఱకు నింకొక్కజాతిపై విశేషప్రేమముండును. మఱియుఁ గొందఱకు వేఱొకజాతిజంతువులపై నధికప్రీతియుండును. కారణ మేమన్నచో ఈమనుష్యుఁడు తొలిజన్మములయందాజాతిజంతువుగాఁ జిరకాలముండిగాని, యనేకపర్యాయము లాజంతుకులమున జన్మించిగాని యుండును. పూర్వజన్మవాసన యన నిదియే యని గ్రహింపఁదగు. సర్వజంతుదయాపరులు కొందఱు లేరా యన్న నట్టివారు పరిశుద్ధజ్ఞానులైయుందురు. సమబుద్ధిగలవారికే సకలభూతములయందు దయ సదాకలిగి యుండును. లేకున్న నుండదు. అట్టివారిమాట యిట ప్రస్తావింపవలదు. సామాన్యజీవకోటియందు పైవ్రాసిననియమమే చెల్లుచున్నయది. సాధారణముగా నిర్వురు క్రొత్తవారు కలహింపఁగా మనము చూచినపుడు వారిలో నొకఁడు గెల్చిన మేలని యొకరికి, ఇంకొకఁడు గెలుపొందిన మేలని యింకొకనికిఁ దోఁచును. అభిమానము హఠాత్తుగా నొకనిపై వ్యాపించును. ఈయిర్వురు మనదృష్టికిం గ్రొత్తవారే. ఐనను దర్శనమాత్రంబుననే యొకరియందు మనలో నొకరి కభిమానము వేఱొకనియందు మనలో నింకొక్కనికిఁ బక్షపాతము కల్గును. కారణ మేమనినచోఁ దొలిజన్మమున వీరిర్వురకు నెక్కుడుసంబంధము గలదు. ఆవాసనాబలమున దర్శనమాత్రమున నప్రయత్నముగఁ బక్షపాతము పొడమును. ఇది యందఱ కనుభవసిద్ధము. అట్లే జంతువులయందుఁగూడ నభిమానము గలుగుచుండును. దానిచే వానిం బ్రేమించి రక్షించుచుందురు. ఆఁకలియు

దప్పియుంగూడ నెఱుంగక వానింజూచి యానందించుచుం దురు.

ప్రస్తుతకథయందలి యఘాసురుఁడు దారుణకర్మముల నొనరించినవాఁడు. కావున విషదుర్వారమై భయంకరాకారమై సకలజంతు వినాశకరమునైన యజగరమయ్యెను. పూర్వము నహుషుఁ డింద్రపదమునుండిగర్వించి పతివ్రతయగు శచీదేవిం గోరి యామెయింటికిం జనంగోరి మునిసప్తకమును శిబికమోయ నియమించెను. వారు విధిలేక మోయుచుండఁ దమిపెల్లిదంబునఁ ద్వరగాఁ జనుండని శాసింపఁగా నందొక్కమహర్షి నీవజగరమవై పడియుండుమని శపించెను. సదా పరపీడాకృత్యంబుల నొనరించువారు కదలమెదలలేని యజగరంబులయియుందురు. పైగాథ భారతమున నుండుట క్రొత్తదిగాదుకదా. ఆయజగరమే భీమునిం బట్టుకొనఁగా ధర్మరాజు వెదకుచుంబోయి దానివచనంబులకుం బ్రతివచనం బిచ్చిన దానికి శాపాంతంబయ్యెను. కాఁబట్టి యతిక్రూరహృదయులు, సదా పరహింసాపరాయణులు, విషమవాక్కులుగలజీవు లిట్లు సర్పంబులగుదురు. అఘాసురుండును బూర్వకర్మవైభవంబున నజగరరూపమునం దిష్టముకలవాఁడైనను శ్రీకృష్ణదర్శనమాత్రంబున విగతకల్మషుఁడై భగవంతునిచే మృతుఁడై యాపరమాత్మయందు లీనుఁ డయ్యెను. శ్రీకృష్ణావతారమున ముక్తినొందవలసినజీవులలో వీఁడొకఁడు నిముక్తినొందెను.

దీనిచే మనుష్యరూపమెత్తి యందు నుత్కృష్టకులమునc బుట్టినంగాని ముక్తి లేదన్న హఠవాదము దుర్వాదమని స్పష్టమాయెను. ఏజాతిదైనను బూర్వకర్మము పరిపక్వమయ్యేనేని భగవద్దర్శనమో, తద్భక్తదర్శనమో లభించును. దానc గృతకృత్యుcడగును. జన్మముచేతనే ముక్తిదొరకుననుట దుర్వాదమన వలసివచ్చునేమో, అంతమాటకన్న హఠవాదమనుట మంచిదేమో. ఏదియెట్టులైనను బూర్వజన్మకర్మము బలవత్తరమని సిద్ధాంతమగుచున్నయది. కాcబట్టి యెట్టిజీవుcడైనను భగవత్సేవచేయుచుc దన్నామసంకీర్తనమొనరించుచుc దచ్చరిత్రమును బఠించుచుc గాలముపుచ్చుచుc బెద్దల నాశ్రయించి కడతేఱు తెరవు పరికించుటకన్న నుత్తమకార్యము వేఱుగలేదు. ఇంకc దరువాతి భగవల్లీలలc బఠించి వినోదింతము. దీనికిమించిన మానుషానందము వేఱులేదుకదా. ఈకథాపఠనానంతర మీభగవన్నామస్తుతిని బఠించి యవ్వల మఱియొకలీలం జదువుదము.

శ్లో. మందం మందం మధురనినదై ర్వేణు మాపూరయంతం
బృందం బృందావనభువిగవాం చారయంతం చరంతమ్,
ఛందోభాగే శతముఖమఖధ్వంసినాం దానవానాం
హర్తారంతం కథయరసనే! గోపకన్యాభుజంగమ్.

శ్రీకృష్ణకర్ణామృతము. ౨. ఆ. ౬-శ్లో.

ఇట్లు భగవంతుcడు బృందావనప్రాంతమున నివసించు దానవుల గోపబాలకులంగూడి సంహరించుచు నవ్వనము సాధు

జనాక్రాంతము గావించుచుఁ దనపాదకమలచిహ్నములఁ బరమపావనముగ నొనర్చుచునుండి యాదిన మఘాసురుంజంపిన పిదప నాభీతినుండి గోపకుమారుల మరలించి యిచ్ఛావినోదంబులఁ బ్రొద్దుపుచ్చుచు నచ్చోటనుండి గోవుల మరలింప నాజ్ఞయిడి వార లట్లొనరింప వేఱొకతావునకుం బోయెను. అప్పటికిఁ జాలప్రొద్దెక్కెను. ఎండవేడిమి దుర్భరముగా నుండెను. బాలకు లాఁకటిం దూలుచున్న ట్లగపడసాగిరి. దప్పి నిలువనీయని యట్లు దోఁచెను. కొంతదూరము వారిం గూడి పోయెను. అందొకదివ్యసరస్సు దృష్టిపథమునంబడియెను. అందలిజలమతిశీతలము. మారుతములు శీతలస్పర్శములు. సుగంధభరితములు. దానియం దున్న రాజీవములు మనోహరములు. ఎండవేడిమిని గనఁబడకుండఁజేయునట్లు చూడఁదగియుండెను. అందు రాయంచలు వేడుకమైఁ గూరుచుండి తమచేడియలతోఁగూడి యాడుచుండినవి. అందలిమకరందము సాస్వాదించుకుతూహలంబున నందువ్రాలు మత్తద్విరేఫంబులు కన్నులపండువుగా నుండినవి. వానిఝంకారము వీనులకు విందుగొలుపుచుండినది. అం దుద్భవిల్లినతరంగమాలిక లుయ్యేలలుగా రాయంచ లూఁగుచుండఁ జూడఁజూడ మానుషానంద మింతకన్న మిన్నగ నున్నదియా యని తోఁపఁజేయుచుండెను. అంతియగాక యొడ్డుననుండువారి కందలియలలు తటమునుసోఁకినపు డుట్టిపడుశీకరములు శరీరసుఖ మిట్టిదియుఁగలదా యని తోఁచునట్లు చేయుచుండెను. ఆతీరమున మనోహరశీతలమహీజాతవ్రాతములు

దట్టముగనుండెను. వానిపైఁ గలరవముల శ్రోతలకు హాయి పుట్టించువిహంగములు భగవత్సృష్టి విశేషమును దెలుపుచుం డెను.

## శ్రీకృష్ణుఁడు గోపకులతోఁగూడి చల్దు లారగించుట.

*అట్టితఱి శ్రీరాధానాథుఁడు తోఁకనాడుకొనుచు నా యెండవేడిమికిఁ గందికుందినగోపకులంజూచి బాలకులారా! చాలబడలితిరి. కాన నాతోఁగూడి చల్దు లారగింపుఁడని సాదర ముగాఁబలుక వార లూఱడిల్లి యట్లే యనిరి. ఆవల గోపకు లోపికమై గోవులను వత్సంబులను అసరోవరంబునఁ గలతీయని నీరు ద్రాగునట్లుచేసి పచ్చికల మేయఁదోలి యాచెంతనే యవి విచ్చలవిడిశీతలతరుచ్ఛాయలనుండి పచ్చికలమేయఁ దమరిండ్ల నుండి తెచ్చినచల్దిచిక్కంబులు విచ్చి యందుంచి యంటయొక్క మొగిం గూరుచుండిరి. శ్రీకృష్ణుఁడు మధ్యభాగంబునఁగూరుచుం డెను. బాలకులు చుట్టును గూర్చుండిరి. మహానందంబునఁ జల్దు లారగింప శ్రీకృష్ణు ననుమతింబడసిరి. చక్కనియాఁకులు కంచం బులుగా భుజింపసాగిరి. ఇప్పట్టున శ్రీపోతనగారు,

సీ. మాటిమాటికివ్రేలు మడిచి యూరించుచు
నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ

---

* ఈకథ శ్రీభాగవతము ౧౧ స్కం. ౧౩ అధ్యాయమునుండియు, శ్రీ కృష్ణజన్మఖండము ౨౦ వ అధ్యాయమునుండియు సమయోచితముగాఁ గలిపి వ్రాయఁబడినదని తెలియఁదగు.

డొకనికంచములోని దొడిసి చయ్యన మ్రింగి
చూడు లేదని నోరు చూపు నొక్కఁ
డేగు రార్ధురచల్లు లెలమిఁ బన్నిదమాడి
కూరొ్కని కూరొ్కని కుడుచు నొక్కఁ
డిన్నియుండఁగఁ బంచి యిడుట నెచ్చెలితన
మనుచు బంతెనగుండులాడు నొకఁడు
ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరుమ్రోల
మేలి భక్ష్యరాశి మెసఁగు నొకఁడు
నవ్వు నొకఁడు సఖుల నవ్వించు నొక్కఁడు
ముచ్చటాడు నొకఁడు. మురియు నొకఁడు.

ఆసమయంబునందు,

సీ. కడుపునదిండుగాఁ గట్టినవలువలో
లాలితవంశనాళంబుఁ జొనిపి
విమలశృంగంబును వేత్రదండంబును
జాఱిరానీక డాచంక నిఱికి
మీఁగడపెరుఁగుతో మేళవించినచల్ది
ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తెచ్చినయూరుఁగాయలు
వ్రేళ్లసందులయందు వెలయనిఱికి
ఆ. సంగడీల నడుమఁ జక్కఁగఁ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి

యాగభోక్తకృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి చల్ది గుడిచె.

అని వక్కాణించిరి. ఈపద్యములకు మూలము సమగ్రముగ లేకున్నను సహజమైన యాచార మలవడ వచించి తన సర్వతోముఖపాండిత్యమును వెలయఁజేసిరి.

ఇట్లు గొల్లపిల్లలతో నాబలరామకృష్ణులు ఇష్టమువచ్చినట్లు చల్దు లారగించుచుండిరి. నానావిధోపదంశముల రుచి చూచుచుండిరి. బాలచేష్టలు ప్రౌఢచాలదే యనిపించుచుండెను. యామ మొకక్షణముగా గడచిపోవుచుండెను. వీరిట్లు చల్దులారగించుచుఁ గ్రీడలఁ బ్రొద్దుపుచ్చుచుండఁగా శీతలతరుచ్ఛాయలక్రిందనుండి పచ్చికమేయుచున్న ఆవులు సహజచాపల్యమున నటునిటు తిరుగుచుఁ దిరుగుచు బాలకు లున్న తావున కించుక యెడగలుగ నడచెను. అప్పు డవి మేయుచున్న తావుల కంటె దూరముగానున్న పచ్చికబయళ్లు భ్రాంతినిగూర్ప నందే మో పచ్చిక హెచ్చుగా నున్నయట్లుభావించి యంబారవంబులు చేయుచు నచటికిం బోవుచుండెను. అవ్వలి తావు లట్లే కనఁబడ నచ్చటికింబోవుచు నిట్లు స్థలాంతరములకు నందుండి వేఱొకతావులకుం బోవంబోవ గోగోపాలకులకు నంతరము దూరమును గనఁబఱుపసాగెను.

భూలోకమున గోలోకవాసి శ్రీకృష్ణమూర్తి యవతరించి తనయసమానమహిమమున భ్రాంతులఁజేయుచుంట మది

నెంచి విరించి తనకాభగవల్లీల లచ్చెరువుంగూర్పఁ బరీక్షించు నెపమున శ్రీకృష్ణమహిమమును దెలిసికొనఁజాలనివారికిఁ దెలు పందలంచెను. అదియ పరీక్షకు మంచితరుణమని భావించెను. లీలామానుషత్వమును వెల్లడించినఁగాని కొందఱయినఁ దరిం పరని నిశ్చయించెను. తాఁ బరీక్షించునట్లు, తన్మహిమమును దానెఱుంగనట్లు, నటించుటకే యోజించెను. పాఠకులారా! బ్రహ్మ తొలుత గోలోకమునకుంబోయి భగవంతునిఁ బ్రార్థిం చెను. అవతరించెదనని శ్రీకృష్ణుఁడు పలుక సంతోషించెను. అట్టిబ్రహ్మ యీబాలునియం దెంతమహిమముగలదో యని పరీక్షింపఁబూననేల? శ్రీగోలోకనాథునిమహిమము బ్రహ్మకుఁ జక్కఁగాఁదెలియును. కాని తెలిసినదానిని వర్ణించిన నెల్లరు నమ్మరు. ప్రత్యక్షప్రమాణాదులు లోకమునఁ బెక్కుమంది గలరు. అట్టివారికిని సంతృప్తిగలిగింపవలయునని బ్రహ్మయభి ప్రాయమైనట్లు కనుపట్టు. కారణాంతరమేమియుఁ గానరాదు. తనకుఁదెలిసిన విషయమునుగూడఁ దెలియనట్లు నటించుట సాధువుల యాచారము. అది మోసముకాదా యనరాదు. స్వగర్వనిర్వాపణమున కది పరమసాధనమగును. వంచకులకు సాధువులకు నీవిషయమునఁ బోల్కి కలదుగాని ఫలమున విప రీతముగనుండును.

**బ్రహ్మ గోపకులను గోవులను గనఁబడకుండ జేయుట.**

ఇట్లు గోవులు మేయుచుఁ జాలదూరముపోయెను. అంత టఁ బరమేష్ఠి యావులసవత్సకంబులఁ గనఁబడకుండఁజేసెను. భగ

వంతుఁ డీయభిప్రాయమెఱింగి మంచిది పంకజాసనుని యను మానమును బాపెదఁగాక యని తలంచుచు బాలకులంజూచి గోపకులారా! మన మిటఁ జల్లఁగాఁగూరుచుండి చల్దు లారగించితిమి. ఈనడుమ గోవులు దూరమునకేగెను. ఇది మహారణ్యము. క్రూరసత్వము లిందుండునని పెద్దలుచెప్పఁగా వింటిమి కదా! క్రూరదనుజులుండుట మనమెఱుంగుదుము. కాన నిట్టి కాఱడవి వానినివదలి యిటఁగూరుచుండిన నెట్లు? మీరిందే యుండుఁడు. నేనుబోయి వెదకి తోలుకొనివచ్చెదనని వారి నిలిపి తా నడవికింబోయెను. ఇత్తఱి భగవదాకారము తెనుఁగు భాగవతమునఁ జక్కఁగా వర్ణింపఁబడినది.

శా. కర్ణాలంబితకాకపక్షములతో గ్రైవేయహారాళితో
  స్వర్ణాభాసితవేత్రదండకముతో సత్పింఛదామంబుతోఁ
  బూర్ణోత్సాహముతోధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతో
  దూర్ణత్వంబున నేగె లేఁగలకునై దూరాటవీవీథికిన్.

ఇట్లు లప్పరమేశ్వరుం డేకాకియై వనజాసను తలంపెఱింగియు నీతనియజ్ఞతను దీర్చెదఁగాకయనుచుం బోవునట్లు గోవుల వెదకుచు నవిమేసినతావులు, అవి నీరానినచోటులు, అవి పరుండినతావులు పరికించుచుఁ బొదలయందుఁ జక్కఁగా వెదకుచుఁ బల్వెంబులం గాంచుచు సాధారణజనునివలె వెదుక సాగెను.

ఎందును గానరాకపోఁగా మరలి యొప్పటిసరస్సుచెం

తనువచ్చి యచ్చటనున్న గోపకులం గానక యోహో యిదియెల్లఁ బంకజసంభవుకృత్యం బని చింతించి శక్తింజూపి బ్రహ్మను వెఱపింపందలంచి ముకుందుఁడు తనమనంబున నిట్లు చింతించెను. సాయంకాల మింటికింబోయిన శ్రీహరీ! మాబాలు రేరని వల్లవులడుగుదురు. మాయావు లేవని వ్రజపురంధ్రులడుగుదురు. అగపడలేదందునా దుఃఖింతురు. ఎటకో పోయిరందునా నిన్ను నమ్మి పంపితిమికదా. వారినెందువిడిచితి వందురు. ఇది బ్రహ్మమాయ యందునా ఎవ్వరు నమ్మరు. కావున నిపు డొనరింపఁదగు పనియేది? అని తలపోసి ఈస్వల్పకార్యమున కింత యాలోచన యేటికని యూహించి తనరూపమును విస్తరింపఁజేయఁ బ్రకృతి కనుజ్ఞ నొసంగెను.

ఆజగన్మోహిని మాయ భగవదాజ్ఞంబూని క్షణకాలంబున నాత్మరూపమును గోవులుగను, గోవత్సంబులుగ, గోపబాలకులనుగా నొనరించి యథాపూర్వంబుగా నమందరయంబున మంద నమర్చెను. సాయంకాలమున యథారీతి గోవులు గోపబాలకులు స్వగృహములం బ్రవేశించిరి. ఆవులు తమమందలయందుఁ జేరెను. లేఁగలు యథాప్రకారము తల్లులంజేరి పాలుగుడిచెను. సకలకార్యములు సహజముగానే జరగెను. తల్లులు పిల్లలంజేరి జలకమాడించి యన్నముపెట్టిరి. ఆరేయి యథాప్రకారమే గడచెను. మఱుదిన ముదయమున నడవికింబోవుట సాయంసమయమున నింటికివచ్చుట యిట్లు జరగుచుండెను.

ఇట్లొక్కవత్సరము గడచెను. ఎవ్వరికింగాని యేవిషయ మందును సంశయ మంకురింపలేదు. ఒక్కకార్యమునందును మార్పు లేదు. బలరాముఁ డీవిధమంతయుఁ దిలకించి గోవులను గోపకులను శ్రీకృష్ణుని నొక్కఁడే యని చెప్పందగు పరమేశుం గాఁ జింతించి యిదియంతయు శ్రీకృష్ణునిమాయ అని తనదృష్టి నెఱింగియు నెఱుంగనియట్లు సోదరు నడిగిన నాగోపాల చూడామణి నవ్వుచు నన్నా! నీకుం దెలియనివిషయంబు లుం డునే అని తత్వంబెఱింగింప నతండు పరమానందంబు నొం దెను. ఇట్లు సాగఁగా నక్కాలంబు మనుష్యమానంబున నొక్కవత్సరంబయ్యె. బ్రహ్మమానంబున నది తృటిమాత్రం బయ్యె.

అంత శ్రీకృష్ణబలరాములు యథారీతి నఁవుల గోవుల మేపుచుండిరి. గోపకు లాకృష్ణునితో నాడుకొనుచుండిరి. పంక జాతపుత్రుం డందున్నవింతలంగాంచి మనమున నిట్లు తర్కిం చెను. నేఁడాఁచినగోవు లాగుహాయందున్నవి. గోపకు లందే యున్నవారు. ఇందుఁగాంచిన గోవులు గోపాలకులు కనఁబడు చున్నవారు. ఇదేమిమాయయో కలయో తెలియరాకున్నది. లోకమున సృష్టికర్త యనుమతిలేక యేజంతువు పుట్టుకం గాంచలేదందురు. ఆసృష్టికర్తను నేనే. రెండవబ్రహ్మ కనఁబడఁ డు. ఈబాలకులు గోతతి యేబ్రహ్మనుండి పుట్టువుంగాంచెనో

యెఱుంగఁజాలకున్నవాఁడ. అని తలంచి తలంచి *మోహము లేక సకలబ్రహ్మాండముల మోహించునట్లు చేయనేర్చిన భగవంతుఁడగు శ్రీహరిని మోహింపఁజేయఁబూని బ్రహ్మ తానే మోహితుఁడయ్యెను. భగవంతునియం దెవ్వనిమాయలు పనికిరావు. మాయయే యాభగవదిచ్ఛ. ఇఁక అట్టిభగవంతుని మోహింపఁజేయఁబూనుటకన్న వెఱ్ఱితనము వేఱుగనుండునా.

ఇట్లు లోచతుర్ముఖుఁడు ముగ్ధుఁడై యుండునంతలో నబ్బాలకులు నీలమేఘశ్యాములు పీతకౌశేయవస్త్రులు, చతుర్భుజులు, శంఖచక్రగదారాజీవపాణులు, కిరీటులు, కుండలమండితులు, రత్నహారావళివిభూషితవక్షులు, వనమాలాధరులు, శ్రీవత్సాంకులు, రత్నకంకణాంకితహస్తులు, సకలాలంకృత్యలంకృతసర్వాంగులునై కనఁబడిరి. ఆవింతలఁజూచి చతుర్ముఖుఁ డచ్చెరువంది యిట్లు తనమదిఁ జింతించెను. ఇందు బాలురంజూడఁగా శ్రీకృష్ణస్వరూపులుగనే కనఁబడుచున్నవారు. భేద మేమాత్రము కానరాదు. ఆలోచింపఁగా నాకు బుద్ధి చెప్పఁదలంచి యీ సర్వేశ్వరుఁడు తనరూపము ననేకథా వెలయించెనని తోఁచెడిని. సకలబ్రహ్మాండముల వెలయించిన యీపరాత్పరున కీబాలురఁగా దనరూపమును విస్తరింపఁజేయుట యొకవింతయా కాదు. తెలియక యేమో చేయఁబూనితిని, నాయజ్ఞానమును వెల్లడించు

* ఏవం విమోహయన్ విష్ణుం విమోహం విశ్వమోహనం, స్వయైవ మాయయాఽజోఽపి స్వయ మేవ విమోహితః. అనిమూలము.

కొంటిని. హౌరా! ఎంతమూఢుఁడను? ఎంత పొరపాటు చేసి తిని? అని తలపోసికొనుచు భక్తిపారవశ్యంబున మేనఁ బుల కాంకూరము లంకురింపఁ గేలుమోడ్చి శిరసువంచి మరల నిట్లూ హించెను. ఈబృందావనమంతయుఁ దిలకింప నాదృష్టికి శ్రీకృష్ణ మయంబుగాఁ గన్పట్టుచున్నయది. గోవులు, గోపాలకులు, ల తలు, గుల్మములు, పొదరిండ్లు బ్రహ్మమయముగనే కనుపట్టెడు. శ్యామసుందరవిగ్రహమే యంతటఁ గనుపట్టెడిని. హౌరా! కృష్ణే తరపదార్థ మిందొకటియుఁ గానరాదు. వృక్ష మెక్కడ? పర్వత మెందు? భూమి యేచోట? సాగర మేస్థలమున? దేవత లేభూ మిని? గంధర్వు లేపుడమిని? మునీంద్రు లేస్థలి? మానవు లె చ్చోట? ఆత్మ యేతావున? జగద్బీజ మెప్పట్టున? స్వర్గ మేయం బరమున? ఈసమస్తము శ్రీకృష్ణమాయాపరికల్పితముగాని వే ఱుపదార్థ మొక్కటియుఁ గానరాదు. సర్వజగన్నాథుఁడు శ్రీ కృష్ణుఁడే స్వమాయచే నివియెల్లఁ బుట్టఁజేసెను. కృష్ణమాయ మగు నీలోకవితతిం గాంచి నాకిఁక గర్వమేలా గునఁ గల్గును? ఇంక నీపరాత్పరు నేమని వినుతింతును? ఇంక నేఁజేయఁదగుకృత్య మేది?

అని యిట్లు విచారించి విచారించి జపము చేయ నూహిం చెను. సుఖకరమగుయోగాసనమును గల్పించుకొని సంపుటాం జలియై పులకాంచితసర్వాంగుఁడై సాశ్రునేత్రుఁడై యతిదీనుఁడై ఇడా, పింగళా, మధ్యాపింగళానళినీధు రానామకము లగునాడు

లనాఱింటిని బంధించి మూలాధారస్వాధిష్ఠాన మణిపూరకాది షట్చక్రములను జక్కఁగా బంధించి వరుసగా నొకదానినుండి వేఱొకచక్రమునకు లంఘునపద్ధతిని దాఁటుచు వాయువును బ్రహ్మరంధ్రమును బొందించి మధ్యను హృదయాంబుజమున నిలిపి ఆవాయువును మరలించి మధ్యతోఁ గూర్చెను. ఇట్లు నియమితవాయుండై యాసలువ చెలువుమీఱు సులలితయోగపద్ధతి నవలంబించి పూర్వము శ్రీహరి ప్రసాదించిన మంత్రరాజమును దశాక్షరమును జపించెను.

ఇట్లు ముహూర్తమాత్రము జపించి శ్రీకృష్ణపాదారవిందంబుల ధ్యానించి ధ్యానించి, హృదయారవిందదివ్యపీఠంబున భగవంతుని దర్శించెను. ఆ తేజస్సు సర్వతేజఃపుంజమై యుండెను. ఆ తేజస్సు నడుమ మిగుల మనోహరరూప మొండు గనఁబడియెను. ద్విభుజమై మురళీహస్తమై పీతవాసస్సుభూషితమై, శ్రుతిమూలస్థలన్యస్తజ్వలన్మకరకుండలమై, సుస్మితాస్యమై, భక్తానుగ్రహకాతరమై, బ్రహ్మరంధ్రమున, హృదయారవిందమున, వెలుపల నొక్కవిధముగాఁ గనఁబడఁగా నచ్చెరువంది పూర్వమేకార్ణవముగా నున్నతఱి విష్ణువు నేస్తుతిచేవేఁడెనో ఆస్తోత్రరాజమున నిట్లు స్తుతించెను.

* సర్వస్వరూపుఁడై సర్వేశ్వరుఁడై, సర్వకారణకార

---

*బ్రహ్మకృత శ్రీకృష్ణస్తుతిః.

శ్లో. సర్వస్వరూపం సర్వేశం సర్వకారణకారణం,
సర్వానిర్వచనీయం తం నమామి శివరూపిణం. ౧

ణుఁడై, సర్వానిర్వచనీయుఁడై శివరూపియగు కృష్ణునింగూర్చి నమస్కరించుచున్నవాఁడను. నవీనజలదాకారుఁడై, శ్యామసుందరవిగ్రహుఁడై, సర్వజంతువులయందుండి, నిర్లిప్తుఁడై, సాక్షిరూపియై, స్వాత్మారాముఁడై, పూర్ణకాముఁడై, జగద్వ్యాపియై, జగత్పరుఁడై, సర్వస్వరూపుఁడై, సర్వజగద్బీజరూపుఁడై, సనాతనుఁడై, సర్వాధారుఁడై, సర్వాతిశాయివిభవుఁడై, సర్వశక్తిసమన్వితుఁడై, సర్వారాధ్యుఁడై, సర్వగురువై, సర్వమంగళకారణుఁడై, సర్వమంత్రస్వరూపుఁడై, సర్వసంపత్కరుఁడై, శక్తియుక్తుఁడై, శక్తివిరహితుఁడై, స్వేచ్ఛామయుండై వెల

---

నవీన జలదాకారం శ్యామసుందరవిగ్రహం,
స్థితం జంతుషు సర్వేషు నిర్లిప్తం సాక్షిరూపిణం. ౨
స్వాత్మారామం పూర్ణకామం జగద్వ్యాపి జగత్పరం,
సర్వస్వరూపం సర్వేషాం బీజరూపం సనాతనం. 3
సర్వాధారం సర్వవరం సర్వశక్తిసమన్వితం,
సర్వారాధ్యం సర్వగురుం సర్వమంగళకారణమ్. ౪
సర్వమంత్రస్వరూపంచ సర్వసంపత్కరంవరం,
శక్తియుక్తమయుక్తంచ స్తౌమిస్వేచ్ఛామయం విభుమ్. ౫
శక్తీశంశక్తిబీజంచ శక్తిరూపధరంవరం,
సంసారసాగరే ఘోరే శక్తినౌకా సమన్వితమ్. ౬
కృపాళుం కర్ణధారంచ నమామి భక్తవత్సలమ్,
ఆత్మస్వరూప మేకాంతం లిప్తం నిర్లిప్తమేవచ, ౭
సగుణం నిర్గుణం బ్రహ్మ స్తౌమి స్వేచ్ఛా స్వరూపిణం,

యు భగవంతునకు నతులొనరించుచున్నవాఁడను. శక్తీశుఁడై, శక్తిబీజుఁడై, శక్తిరూపధరుఁడై, ఘోరతరసంసారసాగరంబున శక్తినౌకాసమన్వితుఁడై, పరమకృపాళువై, ముక్తినౌకాకర్ణధారుఁడై, భక్తవత్సలుండన నలరు భగవంతునకుఁ జేమోడ్పులు. ఆత్మస్వరూపమునఁ జెలఁగి, రహస్యరూపుఁడై, సర్వమునంటి దేనిని వ్యాప్తముగా నంటక సగుణమై, నిర్గుణమై

---

సర్వేంద్రియాది దేవంత మింద్రియాలయ మేవచ. ౮
సర్వేంద్రియ స్వరూపంచ విరాడ్రూపం నమామ్యహం,
వేదంచ వేదజనకం సర్వవేదాంగరూపిణమ్. ౯
సర్వమంత్ర స్వరూపంచ నమామి పరమేశ్వరం,
సారాత్సారతరం ద్రవ్య మపూర్వ మనిరూపిణమ్. ౧౦
స్వతంత్ర మస్వతంత్రంచ యశోదానందనం భజే,
సంతం సర్వశరీరేషు తమదృష్ట మనూహకం. ౧౧
ధ్యానాసాధ్యం విద్యమానం యోగీంద్రాణాం గురుం భజే,
రాసమండల మధ్యస్థం రాసోల్లాససముత్సుకం. ౧౨
గోపీభి స్సేవ్యమానం చ తం ధరేశం నమామ్యహం,
సతాం సదైవ సంతంత మసంత మసతామపి. ౧౩
యోగీశం యోగసాధ్యంచ నమామి శివసేవితం,
మంత్రబీజం మంత్రరాజం మంత్రదం ఫలదం ఫలం. ౧౪
మంత్రసిద్ధ స్వరూపంతం నమామి చ పరస్పరం,
సుఖందుఃఖం చ సుఖదం దుఃఖదం పుణ్యమేవచ. ౧౫
పుణ్యప్రదం చ సుభదం శుభబీజం నమామ్యహమ్,
బ్రహ్మణాచ కృతం స్తోత్రం నిత్యం భక్త్యాచ యః పఠేత్. ౧౬

వెలయు తత్వమని ప్రఖ్యాతిం గాంచిన బ్రహ్మస్వరూపునకు జోత లొనరింతును. సర్వేంద్రియముల కాదిదేవుఁడై, యింద్రియాలయుఁడై, సర్వేంద్రియస్వరూపుఁడై తనరారు విరాడ్రూపునకు మ్రొక్కు సమర్పించుచున్నవాఁడను. వేదము తానై, వేదజనకుఁడై, సర్వవేదాంగరూపుఁడై, సర్వమంత్రస్వరూపుఁడనఁబరఁగుచుఁ, బరమేశ్వరుఁ డగుదేవున కిదె వందనము లర్పించుచున్నవాఁడ. సారపదార్థములకు సారభూతుఁడై, యపూర్వుఁడై, ఇట్టివాఁడని నిర్ధారణముచేయ శక్యముగాక, స్వతంత్రుఁడై, అస్వతంత్రునివలె నటించుచు, యశోదానందనుఁ డన విఖ్యాతివహించిన భగవంతునకు భక్తినమ్రాత్మకంధరుఁడనై నమస్కరణంబు లొనరింతును. సర్వశరీరములయందుండి, ఉన్నట్టు లగపడక ఊహింప శక్యముగాక, ధ్యానాసాధ్యుఁడై, తానుండని తావులేక, యోగీశ్వరులకుంగూడ గురువుగనొప్పిన పరమజ్ఞానస్వరూపునకుఁ దలవంచి పాదంబులకడఁ జేర్చెద. రాసమండలమధ్యభాగముననుండి, రాసోల్లాసమున నుత్సుకుఁడై, గోపికలచే సేవింపఁబడుచు, ధరానాయకుఁడు నగుపరమేశుని ధ్యానించెద. సత్పురుషుల కెల్లతావుల నగపడుచు, నసత్పురుషుల కెందును గానరాక, యోగీశ్వరుఁడై,

---

ఇహాలోకే సుఖం భుక్త్వా యాత్యంతే శ్రీహరేః పదమ్,
లభతే దాస్యమతులం స్థానమీశ్వరసన్నిధౌ. ౧౭
లబ్ధ్వా చ కృష్ణసాన్నిధ్యం పార్షద ప్రవరో భవేత్,
శ్రీకృష్ణజన్మఖండము, ౨౦ అధ్యాయము.

యోగసాధ్యుఁడై, శివసేవితుఁడు నగు దేవుని భజించెదను. మంత్రబీజుఁడై, మంత్రరాజనం బరఁగి, మంత్రప్రదుఁడై, మంత్రఫలము నొసఁగుచు, ఆఫలము తానయై, మంత్రసిద్ధిస్వరూపుఁడై పరాత్పరుఁడు నగుదైవమునకు జేజేలు సమర్పించెదను. సుఖము దుఃఖము తానయై, సుఖము నొసఁగుచు, దుఃఖము నిచ్చుచుఁ, బుణ్యము తానయై పుణ్యప్రదుఁడై, శుభప్రదుఁడై శుభబీజభూతుఁడై వెలయు శ్రీమహావిష్ణువునకు మనసు నర్పింతును.

అని యీవిధంబున వినుతించి గోవులను బాలకుల నొసంగి దండాకృతిగా భూమిపయింబడి నమస్కరించి పలవించెను. లేచి నేత్రములఁ దెఱచి జగద్విధాతయగు చతుర్ముఖుఁడు భగవంతుని దర్శించెను. ఇది బ్రహ్మకృతమగు స్తోత్రరాజము. భక్తియుక్తుఁడై ప్రతిదిన మేనరుఁడు పఠించునో ఆనరుఁ డీలోకమున సకలసుఖము లనుభవించి అంతమున శ్రీహరిపద మగు ముక్తిం జెందును. అంతియగాక శ్రీపరమేశ్వరు దాస్యము నొందును. ఈశ్వరసన్నిధిని వసించును. శ్రీకృష్ణపరమాత్మ సాన్నిధ్యమునొంది పార్షదశ్రేష్ఠుఁడై యుండును.

అని నారాయణమూర్తి పలికి నారదుంజూచి మఱియు నిట్లనియె. మునివర్యా! ఇట్లు పలికి బ్రహ్మ తనలోకమునకు భగవంతు నసుజ్ఞపడసిపోయెను. ఆవల శ్రీకృష్ణుఁడు బాలకులం గూడి తనరూపముల నుపసంహరించుకొని యథాపూర్వముగ

బాలకులంగూడి సాయంకాలము తనయింటికింబోయెను. గోవులు గోవత్సములు, గోపబాలకులు తమగృహముల నొక్కసంవత్సరమునకుఁ జేరిరి. శ్రీహరికల్పితబాలకులు గోవులు నంతర్ధానమొందెను. అవి మాయాకల్పితములు. ఈసంవత్సరము బ్రహ్మకరుణచే గోగోపబాలకుల కొకత్రుటికాలముగాఁ దోఁచెను. నీరువట్టు, క్షుత్తు తెలియకపోయెను. కాఁబట్టి ఆసాయంకాలమునకే యింటికిం బోయినట్టులు తమయిండ్లను జేరిరి. నారదా! గోపకు లాసంవత్సరము తా మెందుంటిమని తర్కింపఁ జాలకపోయిరి. యోగులకుంగూడఁ దెలియశక్యముగాని భగవత్తత్వమును వా రెట్లు తెలిసికొనఁజాలుదురు? అత్యద్భుతమగు శ్రీకృష్ణచరిత్రమును జెప్పితి. ఇంకను వినఁగోరినఁ దెల్పెద. ఆచరిత్ర మింతమాత్రమని వచింప శక్యముగాని దనియెను.

ఇంతదనుక శ్రీకృష్ణజన్మఖండమునుండి స్తోత్రము నించుకకథయు వ్రాసితిని. ఈఘట్టమున శ్రీ భాగవతమునఁగల స్తోత్రమువ్రాసెద. తెనుఁగును వ్రాయను. ఏలయన నందలియర్థముగూడఁ బ్రాయశః పైభావమునే యనుసరించును. భక్తులకుఁ బారాయణార్హమని యాస్తుతినిమాత్ర మిాక్రింద వ్రాయుచున్నాఁడను.

---

శ్రీకృష్ణస్తుతిః.

శ్లో. నౌమీడ్యతేఽభ్రవపుషే తటిదంబరాయ గుంజావతంసపరిపింఛలసన్ముఖాయ, వన్యస్రజే కబలవేత్రవిషాణవేణు లక్ష్మశ్రియేమృదుపదే పశుపాంగజాయ. ౧. అస్యాపి దేవవపుషో మదనుగ్రహస్య స్వేచ్ఛామయస్య నతు భూ

అంత నయ్యాదిదేవుండు బ్రహ్మ తనమహిమమును జక్కఁగా నెఱింగెఁగదా యన్న సంతసము గనఁబఱుపక బాలునివలె నింటికింబోయి యథాపూర్వముగనే భుజించి హాయిగా నిద్రించెను. అఘాసురునివార్త లాలించి గోపకులెల్ల భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తి యని యెఱింగియు భగవన్మాయామోహితులై యేమియు నెఱుంగక నందనందనుంగాంచి ప్రమోదంబందుచుఁ గాలము సుఖముగాఁగడపుచుండిరి. బ్రహ్మ గోవత్సముల గోపకుల దాఁచినవృత్తాంతము, బాలరూపంబున గోగోవత్సలరూపంబున శ్రీకృష్ణుఁడు సంవత్సరము వర్తించినవిధంబును బలరాముఁడుతప్ప నెవ్వరెఱుంగకుండిరి. ఇట్లు గోలోకాధిపతి భగవంతుఁడు తనలీలామానుషత్వమును దెలుపుచు వినోదించుచుం దననుండి ముక్తులుకాఁదగినవారి కాయావిధంబుల ముక్తినొసంగుచు సంతసమున బృందావనంబున విహరించుచుండెను.

---

తమయస్య కోఽపి, నేశేమహిత్వమసితుం మనసాంతరేణ సాక్షాత్తవైవ కిముతాత్మసుఖానుభూతేః. ౨. జ్ఞానేప్రయాస ముదపాస్య నమంతఏవ జీవంతి సన్ముఖరితాం భవదీయవార్తాం, స్థానేస్థితాం శ్రుతిగతాం తనువాఙ్మనోభిర్యే ప్రాయశోఽజితజితోప్యసితైస్త్రిలోక్యాం. ౩. శ్రేయస్సృతిం భక్తిముదస్యతే విభో క్లిశ్యంతి యే కేవలబోధలబ్ధయే, తేషా మసౌ క్లేశలఏవశిష్యతే నాన్యద్యథా స్థూలతుషావఘాతినామ్. ౪. పురేఽహ భూమన్ బహవోఽపి యోగిన స్త్వదర్పితేహా నిజకర్మలబ్ధయా, విబుధ్య భక్త్యైవ కథోపనీతయా ప్రపేదిరేంజోఽచ్యుత తే గతిం పరామ్. ౫. తథాపి భూమన్ మహిమాగుణస్యతే విబోద్ధు మర్హ్యం త్యమలాంతరాత్మభిః, అవిక్రియా త్స్వానుభ

మురళీగానము గోలోకమునుండి భూలోకమునకువచ్చెను. అంతకుమునుం దాగానము లేదు. అది కేవలము గోలోకమున భక్తులచేఁ జేయంబడునది. రాసమండలవిహారము సేయుతఱి శ్రీకృష్ణుఁ డామురళీగానముచేయ భక్తులెల్ల వినుచు మహానందమున నోలలాడుచుందురు. గోవు లానాదమునవలరి తృష్ణలఁదెలియకసుఖముగా నుండును. ఆనాదమే శ్రీకృష్ణమూర్తికిఁ బరమప్రియమైనది. వెదురురంధ్రముల గాలిప్రవేశించి వెడలునపు డది యుద్భవిల్లి యటవీజంతులకుఁ బక్షులకు నానందమును గూర్చుచుండెననియు దానిని భగవంతుఁ డంగీకరించెననియు నాటంగోలె నది భగవత్ప్రీతికిం బాత్రమయ్యెననియుఁ గొంద

---

వాదరూపతో హ్యనన్యబోధ్యాత్మతయా న చాన్యథా. ౬. గుణాత్మన స్తేఽపి గుణాన్ విమాతుం హితావతీర్ణస్య కఈశిరేఽస్య, కాలేనయైర్వావిమితాః స్సుకల్పై ర్భూపాంసవః ఖే మిహికాద్యుభాసః. ౭. తత్తేఽనుకంపాం సుసమీక్షమాణో భుంజానఏవాత్మకృతం విపాకం,హృద్వాగ్వపుర్భి ర్విదధ న్నమస్తే జీవేతయో ముక్తిపదే సదాయభాక్. ౮. పశ్యేశమేవార్య మనంత ఆద్యే పరాత్మని త్వయ్యపి మాయిమాయిని, మాయాంవితత్యేక్షితు మాత్మవైభవం హ్యహం కియా నైచ్ఛమివార్చిరగ్నౌ. ౯. అతఃక్షమస్వాచ్యుత మే రజోభువో హ్యజానత స్త్వత్పృథగీశమానినః, అజావలేపాంధతమోంధచక్షుషః ఏషోఽనుకంప్యో మయి నాథవా నితి. ౧౦. క్వాహంతమో మహదహంఖచరాగ్నివా ర్భూ సంవేష్టితాండఘటస ప్తవిత స్తికాయః, క్వేదృగ్విధా విగణితాండపరాణుచర్యా వాతాధ్వరోమవివరస్యచ తే మహిత్వమ్. ౧౧. ఉత్క్షేపణం గర్భగతస్య పాదయోః కింకల్పతే మాతు రధోక్షజాగసే, కిమస్తినాస్తి వ్యపదేశభూషితం తవాస్తి కుక్షేః కియద ప్యనంతః. ౧౨. జగత్త్ర

అందురు. కాని యెంతవఱ కందు సత్యముగలదో తెలియ వీలు లేకున్నయది. ఏదియెట్లున్నను భక్తాగ్రగణ్యులందఱును మురళీగానప్రియునిగాఁ గృష్ణుని ధ్యానించినదిమాత్రము సత్యము. కాననే శ్రీకృష్ణభక్తులు మురళీహస్తునిఁ బూజింతురు. శ్రీకృష్ణకర్ణామృతశ్లోకము లిందులకుఁ బలుమాఱు సాక్ష్యమిచ్చుటకుఁ బిలువ లేదే యనికాచియుండును. అష్టపదులు నట్లే నడుముకట్టుకొనియుండును. ఇట్లు బృందావనమును నందాదివ్రజబృందము ప్రవేశించినదిమొదలు వారిమనస్సులకు నెవరివలనను బాధలువాటిల్లక సుఖముగా నుండినట్లు భావించుకొనుట కవకాశము కల్గినది. శ్రీకృష్ణుఁడు పరాత్పరుఁడని యొకానొకప్పుడు

---

యాంతోదధిసంప్లవోదే నారాయణస్యోదరనాభినాళాత్, వినిర్గతోఽజస్త్వితివాఙ్నవైమృషా కింత్వీశ్వరత్వం నవినిర్గతోఽస్మి. ౧౩. నారాయణస్త్వం నహి సర్వదేహినా మాత్మా స్యధీశోఽఖిలలోకసాక్షీ, నారాయణోఽంగం నరభూజలాయనా త్తచ్చాపి సత్యం నతవైవమాయయా. ౧౪. తచ్చేజ్జలస్థం తవసజ్జగద్వపుః కింమేనదృష్టం భగవం స్తదైవ, కింవా సుదృష్టం హృది మేతదైవ కింనో నపద్యేవ పున ర్వ్యదర్శి. ౧౫. అత్రైవ మాయాదమనావతారే హ్యస్యప్రపంచస్య బహిస్స్ఫుటస్య, కృత్స్నస్య చాంతర్జఠరే జనన్యా మాయాత్వమేవ ప్రకటీకృతం తే. ౧౬. యస్యకుక్షా విదంసర్వం సాత్మం భాతి యథాతథా, తత్త్వయ్యపీహ తత్సర్వం కిమిదం మాయయావినా. ౧౭. అద్యైవ త్వదృతేఽస్య కింమమ నతే మాయాత్వ మాదర్శితం ఏకోఽసి ప్రథమం తతో వ్రజసుహృ ద్వత్సా స్సమస్తా అపి, తావంతోఽసి చతుర్భుజా స్తదఖిలై స్సాకంమయోపాసితా స్తావంత్యేవ జగంత్యభూ స్తదమితం

నందుఁడుతప్ప నితరులు భావించుటకు భగవన్మాయ యవకాశ మీయకుండెను.

పాఠకవరులారా! ఈగాథ యతిభవ్యమైనది. దీనియం దెన్నియో యద్భుతములు కానఁబడును. భక్తులాపరమాత్ముని లోకాతీతకృత్యములం దలంచి పులకాంచితసర్వాంగు లగుచుం

---

బ్రహ్మాద్వయం శిష్యతే. ౧౮. అజానతాం త్వత్పదవీ మనాత్మ న్యాత్మాత్మనా భాసి వితత్య మాయాం, సృష్టావివాహం జగతో విధానఇవ త్వమేషోంతఇవ త్రినేత్రః. ౧౯. సురేష్వృషిష్వీశతథైవనృష్వపి తిర్యక్షుయాదస్స్వపి తేఽజనస్య, జన్మాసతాం దుర్మదనిగ్రహాయ ప్రభో విధాత స్సదనుగ్రహాయచ. ౨౦. కోవేత్తి భూమన్ భగవన్ పరాత్మన్ యోగీశ్వరోతీర్భవత స్త్రిలోక్యాం, క్వవా కథంవా కతివా కదేతి విస్తారయన్ క్రీడసి యోగమాయాం. ౨౧. తస్మాదిదం జగదశేష మసత్స్వరూపం స్వప్నాభమ స్తధిషణం పురుదుఃఖదుఃఖం, త్వయ్యేవ నిత్యసుఖబోధతనావనంతే మాయాతఉద్యదపి యత్సదివా విభాతి. ౨౨. ఏక స్త్వమాత్మా పురుషః పురాణ స్సత్య స్స్వయంజ్యోతి రనంతఆద్యః, నిత్యోఽక్షరోఽజస్రసుఖో నిరంజనః పూర్ణోఽద్వయో ముక్తఉపాధితోఽమృతః. ౨౩. ఏవంవిధంత్వాం సకలాత్మనామపి స్వాత్మాన మాత్మాత్మతయా విచక్షతే, గుర్వర్కలబ్ధోపనిషత్సు చక్షుషా యేతేతరంతీవ భవానృతాంబుధిం. ౨౪. ఆత్మానమే వాత్మతయా విజానతాం తేనైవజాతం నిఖిలం ప్రపంచితం, జ్ఞానేనభూయోఽపిచ తత్ప్రలీయతే రజ్జ్వామహే ర్భోగ ఇవాభవాయథా. ౨౫. అజ్ఞానసంజ్ఞౌ భవబంధమోక్షౌ ద్వౌనామనాన్యౌ స్తఋతజ్ఞభావాత్, అజస్రనిత్యాత్మని కేవలేపరే విచార్యమాణేతరణావివాహనీ. ౨౬. త్వా మాత్మానం పరం మత్వా పరమాత్మాన మేవచ, ఆత్మాపునర్బహిర్మృగ్య అహో అజ్ఞజనాజ్ఞతా. ౨౭. అంతర్భవేనంతభవంతమేవ

దురు. భక్తులు కాని వారి కేగాథలు చప్పగానుండుననుటకే శంకలుండవు. పాపము! వారిదోష మేమియు లేదు. పూర్వజన్మమున వారు శ్రీహరి నారాధించినవారు కారు. కానసే యవి

---

వ్యాతత్త్వజంతో మృగయంతి సంతః, అసంత మప్యంతిక మంతరేణ సంతం గుణంతం కిముయంతి సంతః. ౨౮. అథాపి తే దేవపదాంబుజద్వయప్రసాదలేశానుగృహీతఏవ, జానాతి తత్త్వం భగవన్ మహిమ్నో నచాన్యఏకోఽపి చిరం విచిన్వన్. ౨౯. తదస్తు మే దేవ సభూరిభాగో భవేత్ర వాన్యత్ర తువా తిరశ్చాం, యేనాహ మేకోఽపి భవజ్జనానాం భూత్వా నిషేవే తవ పాదపల్లవం. ౩౦. అహోతిధన్యా వ్రజగో రమణ్యః స్తన్యామృతం పీతమతీవ తే ముదా, యాసాం విభో వత్సతరాత్మజాత్మనా యత్తృప్తయేఽద్యాపి చ నాల మధ్వరాః. ౩౧. అహోభాగ్య మహోభాగ్యం నందగోపవ్రజౌకసాం, యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మసనాతనమ్. ౩౨. ఏషాంతు భాగ్యమహిమాచ్యుత తావదా స్తా మేకాదశైవహి వయం బత భూరిభాగాః, ఏతద్ధృషీకచషకై రసకృ త్పిబామ శర్వాదయోంఽఘ్ర్యుదజమధ్వమృతాసవంతే. ౩౩. తద్భూరిభాగ్య మిహజన్మ కిమప్యటవ్యాం యద్గోకులేఽపి కతమాంఘ్రిరజోఽభిషేకం, యజ్జీవితంతు నిఖిలం భగవాన్ ముకుంద స్త్వద్యాపి యత్పదరజః శ్రుతిభి ర్విమృగ్యమ్. ౩౪. ఏషాంఘోషనివాసినాముత భవాన్ కిం దేవరాతేతిన శ్చేతోవిశ్వఫలాత్ఫలం త్వదపరం కుత్రాప్యయంముహ్యతి, సద్వేషాదివపూతనాపి సకులా త్వామేవ దేవాపితా యద్ధామార్థసుహృత్ప్రియాత్మతనయప్రాణాశయా స్త్వత్కృతే. ౩౫. తావద్రాగాదయః స్తేనా స్తావత్కారాగృహం గృహం, తావన్మోహోంఘ్రినిగళో యావత్కృష్ణ నతేజనాః. ౩౬. ప్రపంచ నిష్ప్రపంచోఽపి విడంబయసి మాయయా, ప్రపన్నజనతానందసందోహం ప్రథితుం భవాన్. ౩౭. జానంత

రుచింపకుండును. ఉపవసించినవానికన్నఁ దిన్నవానికే యాఁకలి మెం డనునానుడి మీకుం గ్రొత్తదియా. కాదుకదా ! దానిం బట్టియే మనము తెలిసికొనవచ్చును. తొలిజన్మమునఁ జేసినకృషిఫలము గలిగినను దృష్టిమాత్రము భక్తులకుండదు. భక్తిలేని వారికి విసుగుకూడఁ గల్గును. ఈకథయందు విశేషమేమన్నదియే గట్టిప్రశ్నము. బ్రహ్మ శ్రీకృష్ణమహిమము నెఱుంగుననియు లోకులకుఁ దెలుపుటకే యిట్టిపన్నుగడఁ బన్నెననియు నింతకు ముందే వ్రాయఁబడినది. ఇఁక బ్రహ్మయొనరించినస్తుతినుండి నేర్చుకొనఁదగినవిశేషములు కొన్ని కలవు. వాని నిట వ్రాయఁబూనుట యధికప్రసంగముకాదు. మీరట్లు తలంపరన్న గట్టివిశ్వాసము నాకున్నయది.

భగవంతునిఁ బెక్కుమంది వినుతింతురు. అందులో నొకఁడు బ్రహ్మయు. ఎవ్వరెవ్వ రెట్లెట్లు నుతించినను భావభేదము కలదా యని విమర్శించినఁ గనఁబడదు. ఏదేవతాస్తుతిని సొంతముగాఁ బరికించినను భావ మించుమించుగా సమముగనే కనుపట్టు. కారణమేమి? అందఱిమనస్సుల భగవంతుఁ డొక్కఁడే

---

ఏన జానంతు కింబహూక్త్యా నమే ప్రభో, మనసో వపుషో వాచో వైభవం తవ గోచరమ్. ౩౮. అనుజానీహి మాం కృష్ణ సర్వం త్వం వేత్సి సర్వదృక్, త్వమేవ జగతాం నాథో జగచ్చైతత్తవార్పితమ్. ౩౯. శ్రీకృష్ణవృష్ణికులపుష్కరజోషదాయిన్ క్ష్మానిర్జరద్విజపశూదధివృద్ధికారిన్, ఉద్ధర్మశార్వరహరక్షితిరాక్షసధ్రుగాకల్పమార్కమర్హన్ భగవన్నమస్తే. ౪౦. శ్రీభాగవతము. ౧౦ స్కం. ౧౪ అధ్యా.

యున్నవాఁడు. భగవద్భక్తి యొక్కరీతిగనే యుండును. ఇట్టు లుండఁగా నర్థభేద మెట్లుగనఁబడును? ఏభక్తుఁ డేదేవత నిష్టదే వతగా భావించి స్తుతించినను సర్వేశ్వరా! నిరంజనా, సర్వవ్యా పకా! సర్వాధారా! యను నీమొదలగుమాటలే యందుప యుక్తములగు. కారణమేమని యూహింపుఁడు. ప్రతిభక్తుఁడే కత్వమును జూచుచుండు ననుట కిదియే సాక్ష్యము. సకలబ్ర హ్మాండనాయకా! యన్నమాట తుడుము మొదలు దేవతార్చన ముపఱికన్నట్లు విష్ణువుమొదలు గ్రామదేవతవఱకు వ్యాపిం చును. కాఁబట్టి ప్రతిభక్తుఁడు తనబుద్ధియం దేకత్వమును జూచు చున్నాఁడని తేలుచున్నయది. సర్వవ్యాపిత్వము సకలదేవతా సామాన్యశబ్దము. ఇట్టులుండఁగా నొకరికంటె నొక్కరు తక్కు వయన్నమాట కేమియాధారమో తెలియఁజాలకున్నాఁడను. విపరీతమైనవెఱ్ఱియే దీనికాధారము. స్వాభిమతదేవతయం దాధి క్యమారోపించుతఱిఁ దద్భిన్నములేదని యూహించుట మేలు. కాని తారతమ్యములు నిర్ణయింపరాదు. భగవంతుఁ డొక్కఁడే యని యంద ఱంగీకరింతురు. ఆమహాత్మునకు సర్వనామములు చెల్లునని యంగీకరింపక తప్పదు. అంగీకరింపకున్న నతని సర్వ వ్యాపకత్వ మూడిపోవును. సర్వకర్త, సర్వసాక్షి, సర్వనియంత, నిర్లిప్తుఁడు, నిరీహుఁడు, నిర్ద్వంద్వుఁడు అనుమొదలగుశ బ్దము లాపరాత్పరునకుఁ జెల్లునుగదా. ఎల్లమతముల నీయ ర్థముగల శబ్దములున్నవి. భక్తహృదయాబ్జ వాసుఁడు, అరూపుఁడు, సరూపుఁడు, నిర్గుణుఁడు సగుణుఁడునాఁబ

షుపదము లంద అంగీకరించినవియే. ఇట్టులుండ శివునికన్న విష్ణువు, విష్ణువుకంటె శివుఁడు ఎక్కువయని వాదించువారి పట్టుదల నేమనవచ్చును? భగవంతునియందు శంకఖచక్ర గదాపద్మచిహ్నము లొక్కఁ డారోపించును. శూలపినాక కపాలాదిచిహ్నములు వేఱొకఁ డారోపించును. ఈయిరుదెగ లవారికింగూడ భగవంతునిరూప మిట్టిదని తెలియదు. ఈచిహ్నములు కల్పితములు. ఈ రెండు భేదము లగుచిహ్నములును గల వని వారింజూచి వీరికేల యాగ్రహమో తెలియకున్నది. వేదములు పురాణములు రెండింటినిఁ జెప్పుచున్నవి. తమకుఁగల దురభిమానమునఁ దమకు విరుద్ధముగా నున్నశ్రుతులను బురాణముల దూషించి పాపములసంపాందించుకొనుట యొక్కటియే వీరికిం గల్గుపురుషార్థమని నాకుం దోఁచెడిని. మఱికొందఱు విరుద్ధముగా నర్థము చెప్పుటయుం గలదు. అది వారికి హితమయిన రెండవయర్థముహితమని కొందఱకుం దోఁచును. ఇం దొకరికిఁ దోఁచినయర్థమే సత్యము. రెండవ దసత్యమని చెప్పఁ గలవా రెవ్వరు? ఒక్కభగవంతుఁడు కలఁడు. అతఁడు నామరూపక్రియాశూన్యుఁడు. ఇంక నీవాదము తెగుటెట్లు ? లేనిచో నెవరియర్థమును వారు నమ్మి తృప్తిపడుట యుచితముకాని వేఱొకయర్థము లేదని బొడ్డున జన్నిదముఁదోఁపి కలహమునకుఁ గాలుద్రవ్వ నేటిసరసము? వాదము లేకున్న సిద్ధాంతము తేలదనవచ్చునుగాని ఆవాదము తత్త్వప్రతిపాదనసమర్థము కావలయుఁగాని స్వపక్షస్థాపనార్థము చేయరాదు.

ఎంతచర్చించినను బ్రతివారును ఇదితప్ప నింకొక్కటిలే దని చెప్పఁజాలరు. వేదములు ప్రతిపక్షమున కనురూపముగా నర్థమిచ్చుచున్నవన నింకేదిసిద్ధాంతము చేయఁజాలును? కావునఁ దాను నమ్మినవిషయమున విశ్వాసముంచి యితరమతముల దూషింపక భగవంతు నారాధించుచుఁ గృతకృత్యునిం జేయుమా సర్వేశ్వరా! యని చేతులు ముకుళించుటతప్ప వేఱు మార్గము తోఁచకున్నది. ఈకథారసమును గ్రోలినమీఁదఁ జేయఁదగుకృత్యము,

శ్లో. బృందావనద్రుమతలేషు గవాంగణేషు
వేదావసాన సమయేషుచ దృశ్యతేయత్
తద్వేణు నాదనపరం శిఖపింఛచూడం
బ్రహ్మాస్మరామి కమలేక్షణ మభ్రనీలమ్.

అను భగవద్రూపమును ధ్యానించుటయే. ఇఁక నీవిషయమునఁ గాలమును బుచ్చక మఱొకభగవల్లీలం బఠింపఁబూనుట శ్రేయస్కరము.

## కాళీయఫణిదర్పభంజనము.

శ్లో. కరాశరదుదంచితాంబుజవిలాసశిక్షాగురూ
పదావిబుధపాదపప్రథమపల్లవోల్లంఘినౌ,
దృశౌదళితదుర్మదత్రిభువనోపమానశ్రియా
విలోకయ విలోచనామృత మహోమహాచ్ఛైశవమ్.

నారదమునీ! విచిత్రమగు భగవత్కృత్యమును వచించెద. ఆలకింపుము. బ్రహ్మకీరీతిజ్ఞాన ముపదేశించి తనసమంచితకృత్య మెవరికే గోచరము కాకుండ మెలంగుచుఁ దా సకల బ్రహ్మాండనాయకుండై యుండియు నొకబీదకుటుంబము నివసించుచోట మహోత్సాహమున నివసించుచు, సకలయోగిజన సేవ్యుండయ్యు నేమియు నెఱుంగనిగోపకులచే సేవింపఁబడుచు, దేవతాధీశరక్షకుండయ్యు గోరక్షకుండే యనంబరఁగుచు నడవి యందుఁ దిరుగుచు, గోవులంగాచుచుఁ దనమహితమాహాత్మ్యమున నించుకభాగమేని బ్రహ్మాదులకుఁ దెలియనీయక వర్తించుచుండె. దినదినాభివృద్ధినొందుచుండు బాలకునింగాంచి తల్లియుఁ దండ్రియు మహానందమొందుచు ముదుసలితనమున జన్మించిన సంతానమగుట మఱింతగోముసఁ బెంచుచు నితఁడు పరాత్పరుఁడనికాని, త్రిమూర్తులలో నొక్కఁడనిగాని, తుదకు దేవతలలో నొక్కఁడుగా నైననుండుననిగాని తలంపక సామాన్య శిశుమాత్రునిగాఁ దలంచి, అచింత్యమహిమాన్వితుని శ్రీకృష్ణపరమాత్మను అబ్బాయీ. నాయనా! రారా యని పిలుచుచుఁ గన్నులార నమానుషమహిమములఁ జూచుచుండియు వానిని మఱచుచు మరల వానిం దలంపనుగూడ నశక్తులై నందాదు లానందించుచుండిరి. కాని భగవంతుఁడు తనమహిమముల నపుడపుడు కనఁబఱచుచు వానిని స్మరింపకుండ మాయచే వారి నాచ్ఛాదించుచుఁ, దనశిశుత్వమునుమాత్రమే వారు

సదాస్మరించునట్లు చేయుచు వినోదించుచు మానుషానందము తుచ్ఛతమమైనను మహానందముగా ననుభవించుచు నుండెను.

కొలఁదిదినము లిట్లుసాగెను. ఒకదినము భగవంతున కొకయూహ జనించెను. గర్వమున విఱ్ఱవీఁగుజంతువును బాగు చేయవలయు ననునదియే దానిఫలము. తనమనస్సునకుఁ దోఁచినదాని నితరులతో నాలోచింపవలసినయవసర మామహాత్మునకు లేదుకదా. ఎవ్వరితో నాలోచింపవలయును? తనతోఁ దా యోజింపవలయును. ఊహజనించుటయు నదిఫలించుటయు నను నివి యాచారములు. అంతియకాని కొన్నిసాగుటయుఁ గొన్ని జరగక నిలిచిపోవుటయు నామహాత్మునిప్రవృత్తియందుఁ గానరాదు. కాఁబట్టియే "కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థః" అన్న పేరు భగవంతునకే చెల్లెను. అనిర్వచనీయమహిమము, అప్రతిహతశక్తి, యను నీరెండు శ్రీకృష్ణపరబ్రహ్మమునందె గానఁబడుచుండినవికాని యితరులకుఁ దెలియకుండ మాయాశక్తి వారి నాచ్ఛాదించుచుండెను.

* ఒకానొకదినంబున శ్రీబాలకృష్ణమూర్తి గోపకులం గూడి బలరామునివదలి యమునాతీరమున విహరింపఁబోయెను. బలరామునిం గూడిపోయిన నాతనికిం దెలుపక తా నేకార్యము

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము పందొమ్మిదవయధ్యాయమునుండి వ్రాయఁబడునుగాని భాగవతహరివంశవిష్ణుబ్రహ్మపురాణములనుండి విశేషాంశము లిందుగలుపఁబడుననియుఁ దెలియఁగఁదగు.

చేయుట యాచారములేదు. బలరాముఁడు వలదని చెప్పిన విషయమునఁ దాఁ బ్రవర్తించుపద్ధతియులేదు. కావుననే ముందు తాఁజేయఁబోవుకార్యమునకు నభ్యంతరము గలుగునని యాలోచించియే బలరామునివదలి కొందఱుగోపకులం గూడి పోయెను. ఆప్రయాణము విచిత్రముగా సాగెను. బలరాముఁ డేలరాఁడనియు నెవ్వరును బ్రశ్నింపఁజాలకుండిరి. ఊహింప వీలున్నఁగదా ప్రశ్నించుట? *బలరాముని వదలిపోవుటకుం దగుకారణము ముందు తెలియఁదగియుండును. యమునాతీర మందే బృందావనమున్నయది. ఆనదియందే యొకానొకహ్రద మున నొకమహాసర్పమున్నయది. దానిసత్వమపారము. తద్విషా నలమున నందలిజలమెల్లఁ గలుషితమగుటచేతనే కాఁబోలు నం దెవ్వరును జలపానముచేయు నాచారమే లేదు. పశుపక్ష్యాదులు కూడ నద్దానిం జేరఁజాలకయుండినవి. క్రొత్తజంతువందుఁ దిగి నచో మరల నదియొడ్డున కారూపమున వచ్చినదియే లేదు. దేవ లోకమునకుఁ బోవుటయే యాచారము. కావున నేజంతువు కూడ నందుఁ జొర జంకుచుండెను.

ఆతీరమున బృందావనభూములుగలవు. అందు మహా వృక్షములు దట్టముగానుండును. పుష్పములో ఫలములో వృక్షములకుండుఁగాని వంధ్యవృక్షములు గానరాకుండెను. ఆ నదీజలము మహావృక్షములనీడచే నల్లగఁ గనఁబడునని కొంద

---

* రాముని వదలిపోవుటసర్వపురాణప్రతిపాదితముఁగ నున్నదని తెలియవలయును.

అందురుగాని బృందావనము వ్యాపింపనితావులంగూడ నల్లగా నీరుండినందున నట్లుండుట నదీస్వభావముననేకాని వృక్షచ్ఛాయచేఁ గాదని బుద్ధిమంతు లూహించుచుండిరి. భూవర్ణమున జలము నల్లగాఁ గనఁబడునని యందఱంగీకరించిరి. ఆనదియాద్యంతభాగము లట్లుండనేల యన్న సమాధాన మాకాశనిరీక్షణమేగాని యింకొకటి నేటికిని గానరాదనుటమాత్రము సిద్ధాంతము. మనుష్యబుద్ధి యత్యల్పము. భగవచ్ఛక్తి యపారము. దాని నిది యెట్లు గ్రహింపఁగలదు. జలమునకు వర్ణము రుచియు లేదని యొకశాస్త్రసిద్ధాంతము. ఇందేదివాస్తవమో చెప్పఁజాలననుట నాసిద్ధాంతము.

శ్రీకృష్ణమూర్తిబాలకులంగూడి యాబృందావనభూముల యమునాతీరమందు విహరించుచు ఫలముల భక్షించుచు శీతలచ్ఛాయల విశ్రమించుచు, శీతలవాతపోతములస్పర్శమున కానందించుచు వేణువులూదుచు గోవులంగాచుచు చల్లనినీడల విశ్రమింపఁ దాముదమొందుచుఁ గ్రీడించుచుండెను. స్వేచ్ఛామయుండగు నామహావిష్ణువు ఆఁకలిగొన్న యట్లు నటించెను. దప్పిగొన్న చందము నగపఱచెను. నీరుత్రాగుట ఫలములనుభక్షించుట సామాన్యప్రజలయభ్యాసమునే తెలుపుచుండెను. కాఁబట్టియే యామహాపురుషుని సామాన్యనరునిగా భావింప నవకాశముగల్గెను. లేకున్న నమానుషచర్యలఁగని పరాత్పరుఁడని భావింపకుందురా. అందఱట్లు భావించుచో నెల్లర ముక్తులను

జేయుపని యాదివ్యమూర్తికిం గలుగకతప్పునా. ఆరీతిగల్గుచోఁ గర్గసిద్ధాంతము తాఱుమాఱుకాకుండునా. కాఁబట్టి యతనిం గాంచి తమలో నొకనిగా వారెల్లఁ దలంచుచుండిరి. బలరామమూర్తితప్ప నితరు లామహాత్మునితత్వము నెఱింగినవారు సామాన్యులలో లేరని వ్రాయుటకు జంకుకల్గలేదు.

ఇట్లు విహరించుచు మెల్లమెల్లన గోగణమును యమునాతీరమునకుఁ దోలెను. సహజముగా స్థలాంతరమునకు మేయఁ దోలినట్లే యందఱకుం దోఁచెనుకాని ముందుఁ దాఁజేయఁ బూనుమహాకార్యమున కిది యంకురారోపణకర్మమని తెలియ వీలుగల్గింపకుండెను. శిశువు లాకృష్ణునింగూడి వేణుగానము చేయుచుఁ బోవుచుండిరి. యమునాతటమువఱకుఁ గ్రమముగా వానిని దోలుచుఁ బోయిపోయి యందు విడియించెను. ఎండ మెండుగనుండుటఁజేఁ జల్లనితావున నాలమందను నిలుపుట గోపాలసహజకృత్యము. కాఁబట్టి యట్లొనరించెను. శ్రీహరి క్రీడానిమగ్నచిత్తుఁడు కాఁగా శిశువులందఱు పరమానందమునఁ గ్రీడానిమగ్నచిత్తులే యగుచుండిరి.

భగవంతునిచిత్తము హఠాత్తుగా మార్పునొందెను. గోవు లంబారవములుచేయుచు నిలువక దప్పిని భరింపలేనిచందమునఁ గదలి వడివడిఁ బరుగిడి యమునానదిలో దుమికెను. బాలకు లెంత మరలించినను మరలక పరుగిడెను. అందఱచ్చెరువందుచుండిరి. అందుఁ బెద్ద లెవ్వరును లేరు. యమునాహ్రద

మున నీరుత్రాగరాదని వారలకుం జక్కఁగాఁ దెలియదు. ఆ నాఁడే యాంతావునకుంబోయిరి. కాన నాచోట నిట్టియపాయము గలుగునన్నజ్ఞానము వారికిలేదు. ఒకరిద్దఱు తెలుకపడకుండునాయన్న నట్లెఱుకపడినను వారికి విష్ణుమాయ తోఁపకుండఁజేసెను. మొత్తముమీఁద నాకాలమున నెఱింగినవారిలో శ్రీకృష్ణుఁడొక్కఁడే యుండెననకతప్పదు. గోవులు వడిగాఁ బరుగెత్తి యాయమునాప్రవాహమునఁబడి పొరలి కడుపులు నిండ జలపానముచేసెను. కడుపులు జలములనిండెను. ఇఁకఁ బ్రాణములుండఁ దావులేదు. కాఁబట్టి యీవిషజలసంసర్గము మాకువల దింకెందైనఁబోవుట మేలని యాలోచించినట్లు ప్రాణవాయువులు ఎచ్చటికో నుండుపోయి స్థలముచూచుకొనకయే వలసపోయెను. ప్రాణవాయువు లొక్కక్షణమునఁ బోఁజాలక యోజించుచుండినను ఆక్రూరసర్పవిషాగ్నిజ్వాలలు వానిని నిలువకుండఁజేయఁగా నిఁకనుండిన లాభములేదని యెంచి కాఁబోలు పరుగిడినవని వచింప నవకాశముకల్గెను. ఒక్కమాఱు గోగణమంతయు నీటియొడ్డునంబడి మృతినొందెను? వానిపాటుంగాంచి బాలకులు విలపింప నారంభించిరి. భీతిచే గొందఱు విలపింపనుజాలక మోములవ్రేలవైచుకొని యధోభాగమును జూచుచుండిరి. యమదూతలందుఁదిరుగుచుఁ బ్రాణములఁ గొనిపోవుచుండిరి. ఎవ్వనిచే నేమికీడువాటిల్లెననియుఁ జెప్ప నవకాశములేక యవి యప్పుడే మృతినొందినవి. యమునాతరంగిణియంతయు మృతగోతను పరికీర్ణమై ఘోరముగాఁ

జూడఁదగియుండెను. కటకటా! ఆసమయమునవానింజూచినచో నెట్టికట్టడిమానసమైన నయ్యో యనక యూరకుండఁగలదా. ఆనదిని జూచినంతన మానసము భస్మమైపోవున ట్లుండెను.

అంత గోపడింభకు లాయావుల యవస్థంజూచి మధుసూదనా! నీవేదిక్కు. వేఱుదిక్కుగానమని మొఱ్ఱయిడిరి. అప్పుడు వారిచిత్తముల నీయాపద శ్రీకృష్ణునివలనఁ దీఱఁగలదని మాత్రము తోఁచెనుగాని యాపన్నాశకుఁడు భగవంతుఁడు కదా. ఆభగవంతుఁడే యీకృష్ణుఁడనిమాత్రము తోఁచలేదు. కారణము భగవన్మాయయే. * ఇట్లు గోపబాలకు లాకులమతులై మొఱ్ఱయిడ నవ్వారింగూడి యటకుంబోయి పడియున్న గోసముదయముంజూచి కరుణించి క్షణమాత్రంబున బ్రదికించెను. ఆవులంబారవములలేచి నిలువంబడెను. పాపడింభకు లానందంబున శ్రీకృష్ణునిఁ బరివేష్టించి నిలువంబడిరి.

## యమునాహ్రదవర్ణనము.

†అంతట శ్రీకృష్ణమూర్తి గోపబాలకులంగూడి హ్రదముచెంత కరిగెను. ఆయమునానదీభూభాగము మనోహరము

---

* జ్ఞాత్వా సర్వం జగన్నాథో జీవయామాస గోకులమ్—అని మూలము ఈవిషయము విష్ణుబ్రహ్మభాగవతహరివంశములయందుఁ గనఁబడదు.

† ఇది బ్రహ్మపురాణము ౭౭-వ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది, ఇందు హరివంశము ౧౧-వ యధ్యాయమునఁ గలవిషయము గలుపఁబడుననియుఁ దెలియందగు.

భయంకరముగ నుండెను. ఈవర్ణన మిట ననవసరముకదా యని తోఁచునుగాని యిట్టిచోటనున్న క్రూరభుజంగము మదమణం చెనని బోధించుట భగవన్మహిమమును వెల్లడించుటకే హేతువని వ్రాయుచున్నాఁడను. ఆయమునానదియం దొక్కభాగము మహాభయంకరము. విషాగ్నికణదూషితము. అందుఁ గాలీయమహాఫణి నివసించును. కాననే యంత భయంకరముగా నుండెను. అందలి విషాగ్నిజ్వాలలు వ్యాపించుటచేఁ దీరమందలి మహాద్రుమములు కాలిపోవుచుండెను. కొన్నింటికొమ్మలు నదియందు వ్యాపించుటచే నవి కాలియేపోయియుండెను. తీరముననున్న కొమ్మలుమాత్రము శీతమారుతస్పర్శమునఁ గాలకున్నను ఆతాపమునకుమాత్రము వాడిపోయినవి. అందలి తరంగములు వాతసంఘాతమునఁ బైకెగిరి యందలి తుంపురులు సోఁకుట విహంగములు మరణించి నదియందుఁబడుట వాడుక. కావుననే చూడ దారుణముగనుండెను. తటాలునఁ జూచువారలకు మృత్యుదేవతావక్త్రబిలముగాంచిన ట్లుండు ననుట స్వభావోక్తియే గాని యతిశయోక్తికాదు.

అత్తఱి నయ్యమునానది శ్రీకృష్ణునింగాంచి తనసాధ్వీత్వమును వెల్లడించెను. తరంగాపాంగకుటిలధ్యై వారిసంస్పర్శసుఖమారుతధ్యై పద్మోత్పలనయనములొప్పారఁగా నొకయన్నులమిన్నవలెఁ గానఁబడియెను. మఱియు నానది సుతీర్థమొప్పు, స్వాదుసలిలములు చూచినంతనే దప్పినార్పు, వేగగమనంబు

తనమహిమము నెఱుకపఱుపఁ, దోయవాతోద్ధతవేగములచేఁ దీరమహీరుహములను లోఁగునట్లు చేయుచు, హంసకారండవాదిజలపత్త్రులు కలనాదములొనరింప, జలచరదంపతులు తనవిభూతిని దెలుప, నెన్నియో ప్రాణితతులు తన్నాశ్రయించి జీవింప, వివిధవిమలప్రసూనములు తన్నలంకరింప, నాచుతీఁగలు జలమును హరితవర్ణముగ నొనరింపఁ బ్రవాహము చూచువారికి వెఱపుపుట్టింపఁ, బులినతలములు శ్రోణీసుభగత్వమును బొంపొందింప, ఆవర్తములు నాభిగాంభీర్యమును బ్రసాదింపఁ, బద్మములు లోమసామ్యము నాపాదింపఁ, దరితరంగములు వళీత్రయమును గానుపింప, ఫేనప్రహృష్టవదనయై, ప్రసన్నయై, హంసహాసినియై, రుచిరోత్పలరక్తోష్ఠయై, నతభ్రూలతికయై, జలజేక్షణయై, ప్రదదీర్ఘలలాటాంతరయై శైవలమూర్ధజయై యపూర్వనారీరత్నముభంగి కనంబడియె. కాని యందొక్కభాగము మహాభయంకరముగాఁ గనంబడుట వింతపుట్టింపకమానదు.

ఆనది యెంతపవిత్రమైనదియో అమడు గంతభయంకరముగా నుండెను. అది చాలదూరము వ్యాపించియుండెను. అందు వివిధభుజంగములు తప్ప వేఱొండుజలచరములు కానరాకుండెను. దానిం గన్నులారఁ జూచినజంతువులు మరలి యిరవునకరిగినవి తఱచుగా లేవనియే యందఱభావము. అట్టి యుత్తమతరంగిణియందపవిత్రమై మహాదారుణమైన మడుఁగుండ హేతువేమో యెవ్వరెఱుంగరు. బాలకులందఱు కృష్ణు

నితో నరుగ బాలగోపాలుఁడా చోటి కరిగెను. దానితటమునం దొక్కమఱ్ఱిచెట్టుగలదు. దానింగాంచినపుడు శ్రీహరి పరమానందమొందెను. ఆవృక్షము వృక్షరాజమని పేరుగాంచినది. దూరమునుండి చూచువారల కది నీలమేఘము భూమి నావరించియున్నదా యను భ్రాంతి కల్గును. నీరంధ్రముగ దాని యాకుజొంపములు కనఁబడుచుండు. దానియెత్తు వియన్మార్గమున సగ మాక్రమింపఁబడినంతయని యూహింపఁబడినది. దానిపై భాగమునంతయుం బైనుండిచూడఁగా నొకకొండవలె నుండును. నీలవిచిత్రహరితప్రముఖవర్ణంబుల విరాజిల్లుపక్షు లా భూరుహము నాశ్రయించియుండును. ఫలములు ప్రవాళములా యను భ్రాంతిని గల్గించుచుండును. నల్లనియాకృతి ఎఱ్ఱని పండ్లుండుటచూడఁగా నింద్రచాపములతో నలరు నీలమేఘము దాని కుద్దిసేయఁదగు. ఆవృక్ష మొకపెద్దరాజమందిరమువలెఁ గనఁబడును. దానిం బెక్కులతలుచుట్టుకొనియుండును. దానిమూలము మహత్తరము. అద్దేశమునఁగలవృక్షములకెల్ల నధిపతియైయున్న ట్లగపడుట సహజము. దాని నాశ్రయించువార లపారసుఖములనొందుట సహజము. దానిక్రిందనుండువారికి వర్షాతపబాధలుండ వీలుండదు. దానిపేరు భాండీరము. అయ్యది యమునాతటమునఁ గాళీయహ్రదముచెంత నుండెను. దానిం జూడఁగనే శ్రీహరికి నందు నించుకసేపు విశ్రమింతమను బుద్ధిపుట్టెను.

ఆవృక్షముకడ శ్రీహరి చేరఁగనే నదినుండి గోవు లంబారవము లొనరించుచువచ్చి పరివేష్టించెను. పునర్జన్మమునొందిన గోవులంగాంచి గోపకులు కరము హర్షించి వేణువులూఁదుచుఁ జెలరేఁగి గంతులువైచిరి. శ్రీహరియు నాపాదపముంగాంచి శ్రాంతునివలెఁ గొంతసేపు దానిక్రింద నివసించెను. శిశువులందఱు చుట్టునుంబట్టునుం గూరుచుండి వినోదించుచుండిరి. పరమేశుఁడు దాని నెగదిగఁజూచునపుడు వారును జూచుచుండిరిగాని యేయూహఁబన్ని చూచుచున్నాఁడో యెఱుఁగఁజాలరు. బాలురతో మాటలాడుచుండియుఁ దనపూనిన కార్యము నిర్వహింపఁ బ్రయత్నించెను.

ఇట్లావటవిటపిమూలతలంబున నించుక విశ్రమించి యార్తింబాసి చల్లఁగా విశ్రమింప ననువగు నాచెట్టునీడఁబరుండిన గోగణంబులం దిలకించి వీనిమూలంబున నీకార్యంబు నేనొనరించిన ననవసరకార్యంబని తలంపఁబడదని యూహించి వేణునాదక్రీడఁ జాలించి మెల్లగా లేచెను. గోపకులును లేచిరి. అందఱు నాచెంతనున్న యమునాతీరమును జేరిరి. ఆమడుఁగు చెంతనే తీరమున మహాశాఖావిభూషితమగు కదంబవృక్ష మొక్కండు కలదు. దానిశాఖలు కొన్ని యమునానదిలోనికిఁ బ్రాఁకియుండెను. కాన నాశాఖలు విషవాయువునఁ గ్రాఁగి కాలినట్లుండెను. తటమునకు వెనుకప్రక్కనున్న శాఖలు చక్కఁగానుండెను. దానినెక్కిదుమికినచో నామడుగుమధ్యభాగమునఁ బడవచ్చును.

ఆవృక్షము చెంత కందఱుంబోయిరి. శ్రీహరి నిచిర కాలము నుండి విషాగ్నిచే సకలజంతువుల భయపెట్టుచు నించుకేని భీతి లేకవర్తిల్లు కాళీయఫణి చేష్టలం జింతించెను. వేగంబ యాతనిదుర్వారగర్వమును హరించి యిమ్మడువు సర్వజంతుసుగమ్యమ్మగునట్లొనరించెదఁగాక యని యూహించెను. ఇదియదాని కదను. దానికింక గర్వించు కాలము లేదు. కావున వేగంబ యిమ్మహాహ్రదముంజొచ్చెద. విచ్చలవిడిఁదిరిగెద. దాని ప్రతాప మించుక సాగనట్లారకుండెద. వెంటనే దానిమద మడఁగించి నిశ్చింతగా నెల్లరు నిందు జలపానము చేయునట్లు చేసెద. ఇదియ ప్రస్తుతకృత్యమని నిశ్చయించెను.

అంతట శ్రీహరి కదంబవృక్షమునెక్కఁ బ్రయత్నించెను. ఈఘట్టమున శ్రీభాగవతమునందు దశమస్కంధముఁ బదాఱవ యధ్యాయమునందు,

శ్లో. తం చండవేగ విషవీర్యమవేక్ష్య తేన
దుష్టాం నదీంచ ఖలసంయమనావతారః,
కృష్ణః కదంబ మధిరుహ్య తతోఽతితుంగ
మాస్ఫాట్య గాఢరశనోఽభ్యపతద్విషోదే. ౬. శ్లో.

అని కనుపట్టెడు. దీనియర్థమును మహాకవి పోతన గ్రహించి కాంచబోలు,

మః కటిచేలంబు బిగించి పింఛమును జక్కం గొప్పు బంధించి
దోస్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబు గీలించి

త, త్కుటశాఖాగ్రముమీఁదనుండి యుటికెఁ గోపాలసిం
హంబు ది, క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుబగుబ
ధ్వానం బనూనంబుగన్.

అని వ్రాసిరి. భగవంతునిప్రయత్నము లెట్టివైనను లోక
సామాన్యమగువాఁడుకలను బరికించిన నీపద్యము స్వభావోక్త్య
లంకారమునకు లక్ష్యమై కనుపట్టుచున్నది. కానిమూలమునందలి
యొక్కమాటకైనను నవకాశ మిచ్చుపదము గానరాదు. లేకు
న్నను మహాకవి మూలమున లేకపోవునా యని సంశయమును
గల్గించునట్లు పద్యమును వ్రాసెను. ఔరా! ఎంతసాహసము!
ఎంతచమత్కారము! భగవంతునియందు, భాషాంతరీకరణమందు
నెంతటిస్వతంత్రత! మహాత్మా యని పొగడవచ్చు. సరసకవివరా
యని మెచ్చవచ్చు. జ్ఞాననిధీ! యని ప్రశంసింపవచ్చు. భక్తచూడా
మణీయని నమస్కరింపవచ్చు. మాబోంట్ల కిట్టిజ్ఞానమున లేశమైన
నిమ్మాయని ప్రార్థింపవచ్చు! సెబాసు! సెబాసు! రామభక్తాగ్రేస
రా! ఇవె వందనములు. ఇఁకఁ గథాభాగమును విన విన నవ
ధానులరుగండు.

అంత శ్రీహరి గోపబాలకుల కీకార్యమునకుఁ బ్రయ
త్నించుచున్నవాఁడనని తెలుపక యాకదంబభూరుహమునెక్కి-
దానిశాఖ నాశ్రయించి యించుకప్రాఁకి చివరభాగమును జే
రెను. అది యమునాహ్రదమధ్యభాగమునకు సూటిగ మీఁద
నున్నది. అకొమ్మమీఁదికిఁ జక్కఁగాఁబోయి సర్పరాజదర్పదళ

నోద్యమ మేపార శ్రీబాలగోపాలుఁడు ఏమియుఁ దెలియనట్టు చెట్టుపైనెక్కి తనపూన్కి నెఱవేఱక తప్పదుగాన నిర్భయముగా మడుఁగునడుమఁబడ దుమికెను. మహాప్రభువు పైనుండి తనలోదుముకగనే యామడుగు స్వాగతమొసఁగ నేదుర్కొనెనో యనునట్లు శతహస్తప్రమాణము నీరు పైకెగిరెను. బాలకు లాకృత్యమునకు హర్షించిరి. విషాదమునుబొందిరి. మడుఁగు తత్పూర్ణంబున నావిలమయ్యెను. తరంగహస్తములం జాపిచాపి తటము నాశ్రయించి తనదురవస్థను జెప్పుకొనఁబోవు నట్లు జల ముప్పొంగెను. జలరాశి భరింపఁజాలని భగవంతుని నేభరింపఁగలనా యని భీతిల్లినట్లు హ్రదమయ్యది బుద్బుదము లతో తనవెత బయలుపఱచెను. ఇఁక నాగతియేమనిభీతిల్లి నట్లు ఘుమఘుమ ధ్వనించెను. అంతలో మహానందంబునొంది శ్రీరాధారమణుఁడు నన్నుఁ బవిత్రమును జేయ నరుదెంచె నన్న సంతోషమును దెలుప నవ్వెనోయన్నట్లు ఫేనము కనఁబడెను.

ఇప్పట్టున శ్రీభాగవతమునందు,

శ్లో. తం ప్రేక్షణీయసుకుమారఘనావదాతం
శ్రీవత్సపీతవసనం స్మితసుందరాస్యమ్,
క్రీడంత మప్రతిబలం కమలోదరాంఘ్రిం
సందశ్యమర్మసురుషా భుజయాచచ్ఛాద.

అని కనుపట్టెడు. దీనికి మహాకవిపోతన,

శా. బాలుం డొక్కఁడు వీఁడు నామడుఁగు విభ్రాంతోచ్చల
త్కీర్ణక, ల్లోలంబై కలఁగం జరించె నిట నేలోనుంటఁ
జూడండు మ, త్కీలాభీలవిశాలదుస్సహవిషాగ్నిజ్వాలలన్
భస్మమై, కూలంజేసెద నేఁడు లోకులకు నాకోపంబు దీపిం
పఁగన్.

వ. అని తలంచి విజృంభించి.

ఉ. ఘోరవిషానలప్రభలు, గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్యవి,
స్ఫారుఁడు కాళియోరగుఁడు పాఱి వడిం గఱచెం బయో
ధరా, కారుఁ బయోవిహారు భయ కంపవిదూరు మహాగ
భీరు నా, భీరకుమారు వీరు నవపీతశుభాంబరధారు ధీరు
నిన్.

అనువానిని వ్రాసిరి. మూలమునఁగలయర్థమిందు సంపూర్ణ
ముగా లేదుగాని క్రొత్తయర్థము కల్పింపఁబడినను బదబ్య
ములు మహార్థవంతములై సమయోచితముగ స్వారస్యమును
వెళ్లఁగ్రక్కుచు వీనులవిందుగా నమరి కవిశక్త్యుత్కృష్టతను
వెల్లడించుచున్నవి. ఒక్కొక్కవిశేషణము భగవంతునందుఁగల
యపూర్వశక్తిని వెల్లడించుచున్నది. భక్తిరసమును వెదలఁ
గ్రక్కుచున్నది. సహజపాండిత్యమండితుఁడు కదా మహాకవి.

ఇట్లు కృష్ణస్పర్శంబున నాహ్రాదంబు కలవిలపాటొంది కల
గుండువడి చెల్లచెదరై యుప్పొంగి తటములఁదాఁకి యుబ్బి
పైకిఁబోవ వీలులేకుండఁగా నందుండినకాళీయఫణిపతి యావి

ధం బెఱింగి చిరకాలమున కెవ్వఁడో దుష్టాత్ముఁడు నాశక్తి యె
ఱుంగక యిందుఁ బ్రవేశించెనన్న కావరంబునఁ జెలరేఁగి తనసై
న్యంబుల కెల్ల నాయితంబయియుండ హెచ్చరించి యవియన్ని
యుఁ దనకంటె ముందునడువ తనకదలికకు జలంబు లుప్పొంగ
మేను పెంచి హుంకరించి మీఁదికేతెంచెను. *అత్తఱి శ్రీహరి
తనమదిలో నీదుష్టాత్ముఁడు సముద్రమునందుండి నాచే బాధింపఁ
బడి యోడి సముద్రమునువదలి యిమ్మడుఁగుచొచ్చియు దుష్టా
త్ముఁడు గాన నిందును బరులబాధించుచున్నవాఁడు. ఇందు
నరులుగాని కిన్నరులుగాని మఱెవ్వరుగాని, గోవులుగాని డప్పి
గొన్నను జలంబులఁద్రావక యూరకపోవుట యాచారము.
ఇట్లు కండకావరంబునఁ దన్ను నొంచువారు లేరని తలంచి
యున్న వీనియనూనగర్వము నడంచి యిమ్మడువుచొర శక్యము
గానుండునట్లొనరించెద. అంత నందవ్రజమునఁగలవారందఱు
భీతివాసి సుఖముగా గోవులతో నిందు విహరింపఁగలరు. నంద
వ్రజజనానందసంపాదనము నాకృత్యములలో నొక్కటికదా.
†ఇట్టికార్యముల సాధించుటకొఱకే మర్త్యలోకమున నవతరిం
చితిని న్యాయమార్గమునుమీఱి యిష్టానుసారము ప్రవర్తిం

---

* అస్మిన్వసతి దుష్టాత్మా కాళీయోఽసౌవిషాయుధః, యో మయా నిర్జిత స్త్యక్త్వా దుష్టో నష్టః పయోనిధౌ=అని బ్రహ్మపురాణము ౭౭ అ. ౬ శ్లో.

† ఏతదర్థే నృలోకేఽస్మి న్నవతారో మయాకృతః, య దేషా ముత్పథస్థానాం కార్యాశాస్తి ర్దురాత్మనామ్. బ్రహ్మ. ౭౭ అ. ౮ శ్లో.

చువారలకు శిక్షవిధించుటకదా నాపని. ఆకృత్య మిపు డొన ర్చెద. దీన నెందఱకో సుఖముకలుగు. అజ్ఞానమున విఱ్ఱవీఁగు నీసర్పరాజునకు బుద్ధివికసించి సన్మార్గమునఁ బ్రవర్తింపఁజేసెద. శిష్టరక్షణమన నిదియే. శిష్టరక్షణ మనఁగా శిష్టులరక్షించుట యనియే కొంద ఱర్థముచెప్పుదురు. అదిచాలదు. శిష్టులనుఁగా నొనర్చి రక్షించుటయనియు నర్థము చెప్పవలయు. అట్లు చెప్పినఁ గాని నాయవతారఫలము సంపూర్ణముగాఁ గలుగదు. పాపము నశించుకాలము రాఁగా దుష్టాత్ములను శిష్టులనుగాఁజేసి కాపా డుటయు నాపనియే. కాన నీభుజంగరాజునకు గర్వమువాసి శాంతాత్ముఁడు కాఁదగినసమయ మాసన్నమైనది. కావున నిప్పు డూరకుండుట న్యాయముకాదు. క్షణమైన నిఁక నాలస్యము చేయరాదు. చేసినచో నాయాజ్ఞను నేనే మీఱినట్లగును. లోకులకు గుణపాఠము చెప్పినట్లగును. కాన నింకఁ ద్వరలో వీనిగర్వముఁ దూలించెద. ఆలసించిన సత్కార్యము కనిపెట్టి యుండి విసుగునొందును.

అని యూహించి లీలామానుషవిగ్రహుండగు శ్రీకృష్ణ మూర్తి తనమేనుపెంచి * బాహువులుచాపి జలముల నీఁదు లాడుచుండెను. ఇట్లు విలాసమున విహరించు నామధుసూదను కృత్య మెఱింగినంతనే కాళీయునకుఁ బట్టరానియాగ్రహము కల్గెను. ఆక్రోధము లోనిముడక వెలికుబ్బెను. అది యగ్నిరూ పమయినది. ఆయగ్ని విషసముత్థితము. అది సాధూన్యాగ్ని

* ఆస్ఫోటయామాస తదా కృష్ణో నాగప్రాదం భుజైః-అని మూ.

కంఱు భయంకరము. దాని గాలిపాఱినంతనే యకాలమృత్యు దేవత జంతువులఁ గబళించును. మాఱులేక యాయగ్ని యా స్ఫోట మొనర్చును. దాని నాపువా రొక్కరును లేరు. సర్వే శ్వరుఁ డొక్కఁడేకలఁడు. ఇట్లాగ్రహించి యాపెనుఁబాము హుంకరించి మేనుపెంచి బలంబులకెల్ల ననుజ్ఞఁ బ్రసాదించి యవక్రవిక్రమంబున నవంధ్యగతిఁ బఱతెంచి గోపాలబాలునిం జూచి వీఁడా నామడువులోదుమికి గలంచువాఁడు. ఔరా! వీనికండకావరము! సెబాసు! మెచ్చవచ్చు. పాప మీపాఁపఁడు కాళీయఫణిపతివిషాగ్నిజ్వాలామాలికల చవియెఱుంగఁడు. కుల శైలములు నావిషాగ్నివాయుస్పర్శంబున భస్మంబులగు. వీనికా యువు నశింపఁగాఁబోలు. ఇంకను నిర్భయముగా నీఁదుచు న్నాఁడే. ఏమి వీనిధైర్యము! ఏమి వీనియూహ! ఏమి వీనిపట్టు దల! చూడఁజూడ వీఁడు జడమతిగాఁ గనఁబడియెడు. నాయీ మడువువార్త యెఱుంగునో, ఎఱుంగఁడో. ఎఱింగియున్ననిట్లు విహరించునే. ఎఱుంగకున్నను జలస్పర్శమాత్రంబున మ్రందుఁ గదా. ఏలొకో వీఁడిట్లు క్రీడించుచున్నాఁడు. అని చాలదూర మూహించి తుదకు వీఁడు మూర్ఖుఁడో ఉన్మత్తుఁడో కావల యు. పాపమని పోనీయరాదని సిద్ధాంతముచేసికొని వడివడిం బాఱి యతనిం జుట్టుకొనియె. శ్రీహరిని నరమాత్రునిగాఁ దలంచి పట్టరానియాగ్రహంబున మనుజుఁడు తప్తలోహపిండ మును బట్టుకొన్నచందమునఁ బట్టుకొనియెను. ఔరా! క్రోధ

మాహాత్మ్యము! తనచావుగూడఁ దెలియకుండఁ జేయఁజాలును గదా. కావుననే పెద్దలు,

కం. "క్రోధము తపముం జెఱచును
క్రోధమె యణిమాదు లైనగుణములఁ బాపున్
క్రోధమె ధర్మక్రియలకు
బాధయగున్."

అని వ్రాసిరి. శాంతము సర్వార్థమూలంబయి యెట్లు విరాజిల్లునో క్రోధం బట్లు సర్వానర్థమూలంబయి వర్ధిల్లును. అట్టి క్రోధమునకుఁ గాళీయఫణిపతి లొంగెను.

ఇప్పట్టున శ్రీభాగవతమునందు,
"తన్నాగభోగపరివీత మదృష్టచేష్టమ్"

అని మాత్రమే యున్నది కాని, తెనుఁగునందు,

క. కఱచి పిఱుతివక మఱియును
వెఱవక నిజవదనజనిత విషదహనశిఖల్
మెఱయఁ దన నిడుదయొడలిని
నెఱి హరిఁ బెనఁగొనియె భుజగనివహపతి వడిన్.

అని కనుపట్టెడు. క్రోధముననున్నవాఁడు, తనచేతఁజిక్కిన పగవాని నెట్లు బాధించునో తెలుపుటకై యిట్లు వ్రాసియుండునని తోఁచెడిని.

అంత ఫణినాథుఁడగు కాళీయుఁడు భగవంతునిజుట్టుకొని తనబలముగనంబడ దంతములఁ గఱచియుఁ దోఁకచేఁ గొట్టి

యు, ఫణముచేఁ బొడిచియుఁ దనదేహముచే భగవత్తనువును బీడించియు మర్మముల మఱెంతనొక్కియుఁ దనకు వీలుండినంత దనుక నేర్చినరీతినెల్లఁ గనఁబడ శ్రీహరిని బాధించెను. ఆబాధల కోర్వఁజాలనిరీతి కనఁబడఁజేయలేదుగాని శ్రీహరి నిశ్చేష్టనిపలెనుండెను. బాలకు లాతురపడవలయునని యూహించెను. వ్రజమున కరిగి యందఱ కెఱిఁగింపనీ యని తలంచెను. అందఱునువచ్చి చూచి తనసర్వేశ్వరత్వము నెఱుంగ మాయాశక్తి యది మఱచిపోవఁజేయఁజాలునా. చాలదా పరీక్షింతమని యాలోచించెను. విషము సోఁకుటచే మేనుమఱచియున్న జాడలఁ గనఁబఱచెను. ఇట్టట్టు కదలకుండెను. మోమున విన్నదనంబు దోఁపఁజేసెను. ఏమో బాధపడుచున్నట్టిజాడ నగపఱచెను. పాఠకులారా! నిక్కముగా నత్తఱి శ్రీకృష్ణున కొకపరితాపము గలదు? ఈతుచ్ఛుని నెంతవేగముగా స్వచ్ఛమతినిగా నొనరింతునా యని; ఈపరితాపము నెవ్వరెఱుంగుదురు? ఆమహామహునికే తెలియును. తదభిన్నప్రకృతి యెఱుంగును. ఇతరు లెవ్వరెఱుంగరనుట నిక్కము.

ఇట్లు సర్వేశ్వరుఁడు నిశ్చేష్టుఁడై యుండుకొలఁది నాకాళీయసర్పము కోపాటోపంబున మురహరుఁ గఱవఁదొడఁగెను. బ్రహ్మతేజస్సుసోఁకుటచే నది యుద్విగ్నమయ్యెను. వెఱ్ఱియెత్తినట్లయ్యెను. ప్రాణములు తనువునుండి వెడలిపోవనున్నట్లు తోఁపఁగా నోటినుండి దేహసార మనఁదగురక్తము వెడలఁగ్ర

క్కెను. మఱియుఁ గఱవఁబూనుటచే దాని పెనుదంతము లూడి పోయెను. ముఖము రక్తమయమయ్యెను. శ్రీకృష్ణవజ్రాంగచర్వణ మేమి సామాన్యమా. ఎన్ని ప్రయత్నము లాసర్పరాజు చేసి తన్ను బాధించుచున్నను శ్రీహరి పలుకకుండెను. *అంతనాతనిపరిజనములగు సర్పములు పైఁబడి హరిని గఱవసాగెను. ఎన్ని తన్నుఁగఱచుచున్నను భగవంతుఁ డూరకుండెను. ఆపన్నునిమాడ్కి నుండెను. కఱచినసర్పములన్నియుఁ జేష్టలుదక్కెను. రక్తమును వెడలఁగ్రక్కుచుఁ జావ సిద్ధముగానుండెను. కాళీయునిదురవస్థ వర్ణింప శక్యముకాదు. శక్తినశించెను. దంతము లూడిపడెను. రక్తము నోటినుండి వెడలసాగెను. మర్మములు విలవిల బాధనొందఁజొచ్చెను. ఇంచుకంతయు బ్రదుకుదు నన్న యాశ లేదు. ఇంకనాగతియేమి యను నూహయే యాయురగరాజునకుఁ దోఁచెను. ఈతఁ డెవ్వఁడో తెలియరాకున్నవాఁడు. సామాన్యుఁడు కాఁడు. నావిషవహ్నికి భస్మముగాక పోయిగాఁ బరుండియున్నవాఁడు. ముఖకాంతి మాయకున్నది. నేత్రమరీచులు తగ్గవు. తెలివితప్పినజాడ గానరాదు. కపటమూని యూరకున్నచందము కనఁబడుచున్నది. అని యతని మదిఁదోఁచెను. అంతకంతకు నట్టి యూహలుకూడఁ దగ్గసాగెను. దేహము వడవడవడంకసాగెను. బుద్ధిపాటవ మంతము నొందెను. మృత్యువాసన్నమైనచిహ్నములే కానఁబడఁజొచ్చెను. పాప మాఫణి

* తతః ప్రవేష్టిత స్సర్పై స్సకృష్ణో భోగబంధనైః, దదంశుశ్చాపి తేకృష్ణం విషజ్వాలావిలైర్ముఖైః-అనిమూ. బ్రహ్మ. ౭౭ అ. ౧౭. శ్లో.

రాజేమిచేయఁగలఁడు. అయఃపిండము నమల శక్యమగునా. నెత్తినఁ బెట్టుకొన వీలగునా. మెఱపుఁదీవియల నలిపి మ్రింగ నగునా. అకార్యము శక్యమైనఁ గావచ్చునేమోగాని పరాత్పరునిఁగఱచి చంప శక్యముకాదుకదా.

ఇచ్చటిస్థితి యిట్లులుండఁగా నొడ్డుననున్న గోపబాలకు లస్థితి నించుక విచారింపక మాన నయితిగాదు. మ్రాదములో దుమికినవెంటనే గోపకు లాతీరమున నిల్చిరి. శ్రీకృష్ణుఁ డీదుచుండఁ దమరుకూడ దుముకుదమా యని యూహించునంతలోఁ గాళీయఫణివచ్చుటం గాంచిరి. ఎవ్వరికిఁగాని యొడలిమీఁదఁ బ్రజ్ఞయే లేకుండెను. వారిమేనులు వడఁకసాగెను. నోటతడియైన లేదు. మాట నోటినుండి వెడలదు. ఇంతలో బాలగోపాలుఁడు సర్పవేష్టితుఁడయ్యెను. ఆవిధముఁ గాంచిరి. సర్పములన్నియుఁ గఱచుట, శ్రీహరి మైమఱచుట వీక్షించిరి. ఇఁకఁ గార్యముతప్పినదని నిశ్చయించిరి. ఈయదియే కాఁబోలు కాళీయఫణియుండు మడుఁగని తలంచిరి. పూర్వము విన్న వార్త నిజముగా వారికిఁ గనఁబడెను. ఇఁక నేమిచేయవలయునో వారికిఁ దోఁచకుండెను. పలవించిరి. కృష్ణా! ఏమిమాటాడవు స్వామీ యని గొంతెత్తిపిలిచిరి. మమ్ముద్ధరించు నీకిట్టిపాటు రాఁజెల్లునా! యని కుందిరి. ఇంటికింబోయి యశోదాదేవి మాబిడ్డఁ డేడీయని యడిగిన నేమిచెప్పుదుము శ్రీకృష్ణా యని యేడ్చిరి. ఏల యిప్పనిఁజేసితివి మిత్రుఁడా యని వెచ్చనూర్చిరి. మమ్మి

పాముకఱువక మాకృష్ణు నేల కఱచె నని చింతించిరి. ఇంతలో నిట్లగునని తలంపఁజాలకపోతిమికదా యని చేతులు పిసికికొ నిరి. విధివశమునకు మాఱుచేయ నెవ్వరిశక్యమని యూరకుం డిరి. నీరుత్రాగి యావులన్నియుఁ బడిపోఁగా క్షణమాత్రమున బ్రదికించిన నీశక్తి యిపుడేలచూపవో తోఁచకున్నదన్నాయని విపన్నులైరి.

అందుఁ గొందఱు గోపబాలకు లాతురులై పడిఁబాఱి నందమందిరముఁజొచ్చి యందున్నవారితో మనకృష్ణుఁ డజ్ఞాన మునఁ గాలీయహ్రదమున దుమికెను. వెంటనే మహాక్రూరస ర్పము వెడలివచ్చి కృష్ణుని భక్షించుచున్నది. రండురండు. ఆల సింపకుఁడు. క్షణమూరకున్నఁ గృష్ణుఁ డేమగునో యనిపలికి నిలు వలేక మరలనచ్చటికే పరుగిడిరి. పాప మాబాలకులు శ్రీ కృష్ణాసక్తమానసులు. అజ్ఞులు. కాననే కృష్ణున కాపదగలి గెనని చెప్పిరికాని యాపన్నిర్వారణున కాపద యెచ్చటనుండివ చ్చును? అనిమాత్ర మూహింపఁజాలకుండిరి. ఇంతకంటె నజ్ఞాన మేమియుండును?

నందవ్రజమున నామాట వజ్రపాతమువలె వినఁబడియె. గోపికలు యశోదాప్రముఖనందాంగనలు గోపకులు దేహస్మృతి యైనలేక యటకుం బరువిడిరి. యశోదాచిత్తవిక్షోభము నిట్టి దని యెవ్వరుచెప్పఁజాలుదురు? యశోదాదేవి శ్రీకృష్ణుం జూడఁ గలనా యని పరుగిడెను. యశోదతో నందుఁడు విహ్వాలాంతః

శరణుండ్రై పరుగిడెను. అద్భుతవిక్రముఁడగు బలరామదేవుఁడు వారింగూడి పరుగిడెను. కృష్ణు నెప్పుడెప్పుడు చూతుమని హ్రద ముచెంత కందఱరిగిరి. అందఱు నిమేషమాత్రముననే హ్రద మును సమీపించిరి. ఆతీరమున గోవులు లేఁగలు నిశ్చేష్టములై నిలువఁబడియుండెను. గోవులు సగము కొఱికినకసవు నట్లే నోట నుంచుకొని యుండెను. నందాదులంగాంచి యంబారవము లొన రించుటగాని, చెంతకు వారు రాఁగా సంతోషసూచకముగా నాకుటగాని లేకయూరకుండెను.

నందాదు లంతకు నించుకముందు తమరుకన్న దుర్నిమిత్తములకు ఫలమిదియే యని నిశ్చయించిరి. బాలగోపాలునిఁ గాంచిరి. దేహమాద్యంతము ఫణివేష్టితము. మోముమాత్ర మగపడుచుండెను. కదలక సర్పవశంగతుఁడై యున్న ట్లుండిన బాలుం దిలకించిరి. మాటలాడ వశము కానందున నూరక నిలువంబడిరి. *బలరామమూర్తిమాత్రము భగవంతుఁడు కాన విచారము లేనివాఁడయ్యెను. కుంతియ కాక సోదరు నద్భుతప్రభావ మాయన యెఱుంగును. తనలోఁదాను నవ్వుకొనుచు నింతటి యజ్ఞులా యని యూహించుచు లోకాచారమును బాటించి వారివెంట దానునుబోయెను.

---

* తాం స్తథా కాతరాన్ వీక్ష్య భగవాన్ రోహిణీసుతః, ప్రహస్య కించిన్నోవాచ ప్రభావజ్ఞోఽనుజస్యసః – శ్రీభాగవతము. ౧౦ స్కం. ౧౬ అ. ౧౬ శ్లో.

అంతట యశోదాదు లాకృష్ణునింగాంచుచుండునంతలో గోపిక లాయశోదాదేవిం బట్టుకొని కృష్ణుని బాలక్రీడలను జెప్పుచు మఱింతపలవించిరి. ఇప్పట్టున శ్రీభాగవతమునందు,

శ్లో. తాః కృష్ణమాతర మపత్య మనుప్రతప్తాం
తుల్యవ్యథా స్సమధిగమ్య శుచ స్స్రవంత్యః,
త్రస్తావ్రజప్రియకథాః కథయంత్య ఆసన్
కృష్ణాననేఽర్పితదృశో మృతకప్రతీకాః. ౨౧ శ్లో.

అనిమాత్రమే కనఁబడుచున్నది. మహాకవి పోతనగారు మాత్రము "వ్రజప్రియకథాః"అనువాక్యము నాధారముగాఁ జేసికొని,

సీ. ఎదురువచ్చినఁ జాల నెదురుగాఁ జనుదెంతు
వెదురువచ్చిన నేఁడదేల రావు
చూచినఁ గృపతోడఁ జూచుచుందువు నీవు
చూచినఁ గనువిచ్చి చూడవేల
డాసిన నఱలేక డాయంగవత్తువు
డాసిన నేటికిఁ డాయ విచటఁ
జీరిన నో యని చెలరేఁగిపలుకుదు
విదియేమి చీరిన నెలుఁగకుంట

ఆ. తలఁపుచేయునంతఁ దలపోయుచుందువు
తలఁపు సేయ నేఁడు తలఁప వకట
యనుచు భక్తివివశ లాడెడ్డికైవడి
ప్రేతలెల్ల నాడి వివశలైరి.

అను నీమొదలగుపద్యముల నేడింటి వ్రాసిరి. ఇది భాషాంతరీకరణమా యని ప్రశ్నింపకుఁడు. భావకవిత్వమున నిదియే కదా. ప్రియకథాః అన్నమూలము నాధారముచేసికొని శ్రీకృష్ణునిచర్యలను దెల్పినట్లు తెనిఁగించిరి. అట్టిదియే భావమును దెలుపుభాషాంతరీకరణము. ఈమార్గమునే శ్రీనాథాదు లంగీకరించిరి. ఇట్టి భావకవిత్వము చెప్పఁజాలనివారే మూలమున నెన్నిపదములో అన్నిపదములే తెనుఁగున నుండవలయు నను చుందురు. వారిజోలి యిటనేల ?

ఇట్లు గోపికలు దుఃఖించుచుండ నందాదు లాతురులై దుఃఖించుచు నేమో మాటలాడుచుఁ గొడుకు నుద్ధరించువెఱ వెఱుంగకయుండిరి. హాహాకారంబులు చెలంగుటయేగాని యందొక్కఁడైన దుమికి శ్రీకృష్ణుఁ దరిఁజేర్చినవాఁడుగాని, దుముకఁ బ్రయత్నించినవాఁడుగాని కనఁబడఁడు. పుత్రునుద్దేశించి వగచుటయు, నంతతో నూరకుండక బాలచేష్టల నుగ్గడించుటయు, మఱింతయేడ్చుటయు, నెవ్వరైన నుద్ధరించువారు రాఁగూడదాయనుటయు, విధినిదూఱుటయు నింతియేగాని వేగమ మడుఁగులోనికిఁబోయి యాపామును ద్రుంచి బాలునకు సోఁకినవిషము హరింప మంత్రించి బాలుని రక్షింపఁబూనువా రొక్కరుగూడ లేరనుట స్పష్టము. ఆపద్బంధువు లన నిట్టివారే కాఁబోలు. ఆపత్తునుండి మే ముద్ధరింతుము మే ముద్ధరింతుమని మాటయిచ్చువారు నందాదులకన్న నధికులగుదురా. ఎవ్వ

రను దూరముననుండి చూచువారేకాని యొక్కరి ప్రాణము లకై తన ప్రాణముల నర్పించువారు లేరని నందాదుల ప్రవృత్తియే మనకుఁ దెల్పుచున్నది. స్వార్థపరులై వాగ్దానములఁ జేయుటయుఁ గార్యముపట్టునఁ దమచేతగాని దైవముపైనఁ ద్రోయుటయు నాచారములుగా నున్నవి. అంతియకాని "క్రియా కేవల ముత్తర" మ్మనుమాట సార్థకముగాదు. స్వార్థపరుల మాటల నమ్మువా రంతకంటె నవివేకులే యనఁబరఁగుదురు.

నందాదు లిట్టు లాకులపాటొందుచుండ యశోదాదులు కన్నీరుమున్నీరుగాఁ బ్రవహింప నేడ్చుచుండ బాలకులు మిత్ర కష్టముం గన్నులారఁగాంచి కంఠములు బ్రద్దలగునట్టు లాక్రోశింపుచుండ గోవులు కసవుమెసవక యూరక చూచుచుఁ దమ సంతాపమును దెల్పుచుండ నాచోటు తత్కాలమున దుఃఖ సాగరంబన నొప్పుచుండెను.

అప్పుడు బలరాముఁ డచ్చటివారగలదైన్య మాలోకించి భగవంతుఁడై తమయిరువురమహిమను నెఱుంగనివారి ప్రాస్వ దృష్టిని బరిశీలించి శ్రీకృష్ణునిసంబోధించి కాళీయఫణిమర్దనము గావించి వీరిసంతాపము నడంపుమాయని వచింపఁదలంచి తన సముచితజ్ఞానంబు నెఱుంగనివారెల్ల వినుచుండ శ్రీకృష్ణునితో నిట్లనియె. దేవాదిదేవా! జగత్ప్రభూ! ఏల యీమానుషభావ మభినయించెదవు? స్వమహిమమును మఱుఁగుపఱిచెదవు? నీ మహిమను నీవెఱుంగవా. ఏల దాఁచి మానుషత్వము నాశ్ర

యించెదవు! ఇంతటఁ జాలింపుము. నిజచరిత్రము నించుకతలంపుము. * ఈజగములకెల్ల నీవకదా నాభిభూతుఁడవు. దేవతలకు నీవకదా యాశ్రయభూతుఁడవు. సకలలోకముల సృజింపఁ బెంప నుపసంహరింప నీవకదా కర్తవు. లోకములు నీస్వరూపములుకదా. త్రయీమయుఁడవు నీవేకదా! మహాప్రభూ! ఈ లోకమున నవతరించిన మనకిర్వురకు గోపకులేకదా బంధువులు. గోలోకమునుండి మనకొఱ కవతరించినవారలే దేహబంధువులనఁబడుదురు. గోపికలు మనల నమ్మి యవతరించిరి. వారిపుడు దుఃఖించుచున్నవారు. ఇట్టి యనన్యగతికబంధువుల నుపేక్షింపనేల?

మానుషభావము నభినయించితివి? బాలచాపలము చూపించితివి. ఇంకఁజాలును. ఇంకను గాలహరణ మొనరించిన వీ రపారదుఃఖములపా లగుదురు. కాన వీరిని వగలపాలుకాకుండ నీకనైనఁ గాపాడవలయు. ఆలసింపకుము. యశోదాది జనసుల దుఃఖముచూడ శక్యముకాకున్నది. వా రాయాసపడు

---

త్వమస్య జగతోనాభి స్సురాణా మేవచాశ్రయః
కర్తాఽపహర్తా పాతాచ త్రైలోక్యం త్వం త్రయీమయః
అత్రావతీర్ణయోః కృష్ణ గోపా ఏవహి బాంధవాః
గోప్యశ్చ సీదతః కస్మా త్త్వం బంధూం త్సముపేక్షసే
దర్శితో మానుషోభావో దర్శితం బాలచాపలం
తదయం దమ్యతాం కృష్ణ దురాత్మా దశనాయుధః.

విష్ణు. బ్రహ్మ. 22 అ. 33 శ్లో.

చుండ నేఁజూడఁజాలకున్నాఁడను. శ్రీకృష్ణా! సర్వలోకాధిపతీ! ఇంక వేగమ యీదురాత్ముని దంతాయుధుని గాళీయభుజంగరాజును గర్వవిహీనుంగా నొనరింపుము.అని బలరాముఁడు హితము స్మరింపఁజేసెను. శ్రీహరియు నందాదులయాకులపాటెఱింగెను. జనులశోకమును గుఱుతించెను. బాలకుల యాక్రోశమును వినెను. గోవులయార్తి నెఱింగెను. చూడవచ్చిన గోపాలకుల దీనభావమును గుఱుతించెను.బలరాముని హితోపదేశమును బాటించెను. కాళీయఫణిరాజు నామమాత్రజీవితుఁడై యుండుట యెఱింగెను. తద్గర్వనిర్మూలనప్రయత్నముచేయవల నిదియని యెదఁదలంచెను. మానుషత్వమును బరిత్యజించెను. స్వీయమహిమమును స్మరించెను. స్మితభిన్నోష్ఠసంపుటుఁడయ్యెను.

అట్టితఱి నాభుజంగరాజుగతి యెట్లున్నదని యింక విచారింతము. గోపాలబాలుని మనుష్యమాత్రునిగాఁ దలంచి యాగ్రహించివచ్చి నైజగర్వమున విఱ్ఱవీఁగి చుట్టుకొని బాధించెను. తనపౌరుషమంతయుం గనంబఱచి కఱచెను. దాన నేమాయె? అతనిబలము తఱిగెను. దంతము లూడెను. నోటి రక్తధారలు వెలువడెను. దేహము పరవశమయ్యెను. కఱవనుంకించినను దాలువులు సాయపడఁజాలవయ్యెను. తెఱచిననోరు తెఱచినట్లే. ఊడినదంతము లూడినట్లే. రాలినపండ్లు రాలినట్లే. ఏయవయవముగాని పాప మాసమయమునఁ గాళీయఫణికి సాయ

పడవయ్యెను. మనసు భయాక్రాంతమయ్యెను. ఇంక నాగతియే మనువిచారము పుట్టెను. బుద్ధి తక్కువయగుట మనుష్యమాత్రునిగాఁ దలంచితిని. ఈతఁడే భగవంతుఁడని తోఁచెడు నను నూహ కలుగఁజొచ్చెను. అన్నియాశలు తీఱెనట్లుండెను. ఇంక నప్పైనుఁబా మేమిచేయఁగలదు? బుసకొట్టుచుఁ గృష్ణునిఁ జుట్టుకొనినట్లు నటించుచు మరణావస్థ నాశ్రయించియుండెను.

అంతట శ్రీకృష్ణపరమాత్మ బలరామప్రేరితుఁడై మానుషత్వము ద్యజించి తనయమానుషత్వమును స్మరించి తనమేను పెంచెను. భోగిబంధనము పటాపంచలయ్యెను. రెండుచేతుల దానిఫణములఁబట్టి వంచెను. గట్టిగా హస్తయుగమున దాని కంఠమును బిగించెను. దాన నాఫణిఫణాగ్రదుస్సహావిషాగ్ని రక్తరూపమున బయటపడెను. మేను వీరవశమయ్యెను. ఆవిధ మెఱింగి శ్రీహరి యొకచేతఁ దన్మధ్యమఫణంబుఁ బట్టుకొని వేఱొకచేత దానితోఁకనుబట్టుకొని వంచి ఫణమువిూఁదఁ బాదములుంచి నృత్యముచేయ నారంభించెను. ఆనర్తన మత్యద్భుతమై కనుపట్టెను. అడుగెత్తి మరల దానిపై నునుచునపుడెల్లఁ గడవలతోఁ గుమ్మరించినట్లు దానియంతస్సారము రక్తరూపమున వెడలఁజొచ్చెను. జగన్మోహనాకారుని యామహానాట్య మద్భుతముగ నుండుననుట విచిత్రమా.

ఇప్పట్టున శ్రీభాగవతమునందు,

శ్లో. ఏవం పరిభ్రమహతౌజసమున్నతాంస
మానమ్య తత్పృథుశిరస్స్వధిరూఢ ఆద్యః,

తన్మూర్ధరత్న నికరస్పృగ్న్ఘాతి తామ్ర
పాదాంబుజోఽఖిలకళాదిగురు ర్ననర్త.

౧౦ స్కం.౧౬అ.౨౬ శ్లో.

అని కనుపట్టెడు. దీని కాంధ్రభాగవతమునందు,

సీ. ఘనయమునానదీకల్లోలఘోషంబు
సరసమృదంగఘోషంబుగాఁగ
సాధుబృందావనచరచంచరీకగా
నంబు గాయకసుగానంబుగాఁగఁ
గలహంససారసకమనీయమంజుశ
బ్దంబులు తాళశబ్దములుగాఁగ
దివినుండి వీక్షించు దివిజగంధర్వాది
జనులు సభాసీనజనులుగాఁగఁ

తే. బద్ధరాగాదిరత్నప్రభాసమాన
మహితకాళియఫణిఫణామండపమున
నళినలోచనవిఖ్యాత నర్తకుండు
నిత్యనైపుణ్యమునఁ జేర్చి నృత్యమాడె.

శా. కుక్షిన్ లోకము లున్న గౌరవముతో *గోపాకృతిం బొల్చి
నా, రక్షోహంత వడిన్ మహాఫణిఫణారంగప్రదేశంబుపై,
నక్షీణోద్ధతి నాడుఁ బాడుఁ జెలఁగున్ హాసంబుతోడం బదః
ప్రక్షేపంబులు చేయుఁ గేళిగతులం బ్రాణైకశేషంబుగన్.

* గోపాకృతి న్నన్నరయా-అనుపాఠము సాధువుకాదు. తాఁటియాకుల ప్రతియందుఁ బైయట్లే యున్నదని పాఠకు లూహింతురుగాక.

అని పోతనమహాకవి భాషాంతరీకరణము కన్పట్టెడు. "తన్మూర్ధరత్ననికరస్ఫుర్మాతితామ్రపాదాంబుజః" అన్నవిశేష ణము "పద్మరాగాదిరత్నప్రభాసమాన, మహితకాళియఫణిఫణామండపమున" అని మార్పఁబడినది. ఈ రెండుపద్యములు మూలము నించుక యాధారముగా ముద్దులు మూట గట్టునట్లు స్వేచ్ఛగా వ్రాయఁబడినది. భగవన్మహిమమును దెల్పుపట్ల శ్రీపోతనమహాకవి కొడలు తెలియకుండునన్న నానుడి సత్యమేయని తోఁచును. కపటవేషమును దాల్చువారి మాటలు చప్పిడిగానుండును. అట్లుగాక భక్తిభరమున నొడలెఱుంగక మహాకవి భాషాంతరీకరణ మొనరించెను. కాన వీనులవిందై యమృతపునోనలపొందై యన్నట్లు రసప్రవాహమో యనఁ బద్యరత్నము లలరారెడు. మూలముతోఁ బోల్చక పద్యములు చదివినచో వ్యాసతాత్పర్యమునకు మెఱుఁగుపెట్టినట్లుండు ననుట నిస్సందేహము. ఇంకఁ బ్రకృతకథాభాగమునకు రండు.

ఆమహానర్తనము దేవతల కామోదసంధాయకమైయుండెను. కాననే వారు దివినుండి పూలవర్షమును గురియించిరి. దుందుభులమ్రోతల నాకసము నిండఁజేసిరి. ఆడిరి. పాడిరి. భగవంతా! నీమహిమము తెలియఁదరమా యని ధ్యానించిరి. నీయానందము నీవే యెఱుంగుదువని కేలుమోడ్చి నమస్కరించిరి. పాపాత్ములనుగూడఁ దరింపఁజేయునేర్పు నీకుఁ దప్ప నెవ్వరికిఁ గలదనుట పొరపాటుగదా యని తలలు వంచిరి. సర్వేశ్వరా! ఈదీనుని ఫణిపతిని గాపాడుమా యని ప్రార్థించిరి.

ఇట్లు దేవతలు వినుతించుచుండఁ గృష్ణుఁడు తనన_ర్తనము సాగించుచుండ నాకాళీయఫణిపతిఫణములపై వ్రణములు చెలఁగెను *అడుగుపెట్టునపుడెల్ల దానిగర్వమువదలుచుండెను. చేష్టలుతగ్గుచుండెను. ప్రాణవాయువు లేక్షణమున వదలిపోవుదమా యని మాటలుగట్టుకొని యున్నట్లుండెను. ఇఁక భరింపఁజాలనను మంచియూహ జనించెను. అట్టితఱి శ్రీహరి మఱింతగట్టిగా న_ర్తనవ్యాజమున నడుగులిడ నారంభించెను. దాన దానికి మూర్ఛవచ్చెను. భ్రాంతి యంకురించెను. చేయఁదగినపనియేది? అనునాలోచనము తోఁపకుండెను. గట్టిగా నడుగులు పెట్టునపుడెల్ల ర_క్తధారలు నురుగులతోడ వెలువడసాగెను. క్రమక్రమముగా దేహము వంగిపోవ మొదలుపెట్టెను. అప్పటి కాళీయఫణిపతికి గర్వము మొదలంట నశించెను. దానిస్థానమున శాంతి నెలకొనియెను.

స్మృత్వా చరాచరగురుం పురుషం పురాణం
నారాయణం తమరణం మనసాజగామ. శ్రీభాగ. ౩౦. శ్లో.

శాంతము నెలకొనినవెంటనే యుక్తాయు_క్తపరిజ్ఞానమున కవకాశముకలైను. అదికలుగఁగానే చరాచరములకు గురువై పురాణపురుషుఁడై వెలయు నారాయణుని ధ్యానించుబుద్ధి వికసించెను. అప్పుడు మనమున నీవేదిక్కు సర్వేశ్వరా! అని

* వ్రణాః ఫణే భవం త్యస్య కృష్ణస్యాంఘ్రివికుట్టనైః=అని మూ. బ్రహ్మ. ౭౭ అ. ౩౬ శ్లో.

ప్రార్థింపఁదగునని తోఁచెను. ప్రపంచతత్త్వము తెలియఁజొచ్చెను. తానొనరించినకృత్యము కేవలక్రూరులు చేయఁదగినది. దానికిఁ బ్రతిఫల మిపుడేకలిగెనన్న విశ్వాసముపుట్టెను. కాని నమస్కరించి ప్రార్థింతమన్న నోట మాట రాదు. ఎట్టకేలకు మాటలాడుదమన్న భగవంతునిపాదఘాతములశక్తి తగ్గుచుండెను తగ్గుకొలఁది పాదకుట్టనములు మఱింత దుర్భరములుగా నుండెను. కాన మాటలాడలేకపోయెను. మనస్సున నీవేశరణము. ఆపదుద్ధారకా! శ్రీకృష్ణపరమాత్మా యని ప్రార్థింపసాగెను. అట్టియిక్కట్టున నాతనినుద్ధరించువాఁడు తత్కాలమున నతనికి శత్రువుగానున్న భగవంతుఁడేతప్ప నింకెవ్వరుగలరు? ఆతనిమనసున నప్పుడుగలపరితాపము వర్ణింపఁదరమా. మనసున నిట్లు ప్రార్థించునంతలో నాతనికి మృతి యాసన్నమైన చిహ్నములు కనఁబడుచున్నవని తద్బంధువు లెఱింగిరి. విలయకాల మాసన్నమైనదని వారు తలంచిరి.

అత్తఱి నాకాళీయఫణిపతిపత్నులు భగవంతునినాట్యమును, భర్తదురవస్థయుఁ గాంచిరి. ఇఁకఁ గాళీయుఁడు జీవించుట భగవత్కరుణచేఁదప్ప వేఱుకారణముచేతఁ గాదని నమ్మిరి. భర్తప్రతాపము క్షీణించుటయుఁ బ్రాణము లుత్క్రమింప సిద్ధముగానుండుటయు నిఁక శరణుచొచ్చి కృష్ణపరమాత్మకరుణ సంపాదింపకున్న బ్రదుకుతెఱవు లేదనియు నెఱింగిరి. ఆలసించినఁ గార్యముతప్పునని నిశ్చయించి కచభరంబుపీడ దేహాలత

కంపింప, గతివిశేషము చలింప దీనవక్త్రులై భగవంతునిజేరఁ బరుగిడిరి. పుటాంజలుల నిలిచి భక్తిభారంబున దేవదేవుంజూచిరి. అంత సాష్టాంగముగాఁ బ్రణమిల్లిరి. రెండుపాదములఁబట్టుకొని పలవించుచు జగద్రక్షకా! కరుణాసింధూ! కాపాడుమా యని వేఁడుచు నిట్లు వినుతించిరి. అందు జ్యేష్ఠపత్ని సురసయను నాగకాంత యిట్లని ప్రార్థించెను. *జగత్సంతోషకరచరిత్రుఁడవు. నాకాంతునిగటాక్షింపుము. మానదా! శ్రీకృష్ణా! నాకు మర్యాద నొసంగుము. వనితలకుఁ బ్రాణాధికుఁడు పతియేసుమీ. పతిని

---

* కాళీయపత్నీకృత శ్రీకృష్ణస్తుతిః.

శ్లో. హేజగత్కాంతకాంతం మే దేహి మానంచ మానద, శ్రీపతిః ప్రాణాధికః స్త్రీణాం నాస్తి బంధుశ్చ తత్పరః. ౧. సకలభువననాథ ప్రాణనాథం మదీయం న కురు వధ మనంత ప్రేమసింధో సుబంధో, అఖిలభువనబంధో రాధికాప్రేమసింధో పతి మిహ కురు దానం మే విధాతు ర్విధాతః. ౨. త్రినయనవిధిశేషాః షణ్ముఖ శ్చాస్య సంఖ్యైః స్తవనవిషయజాడ్యా స్తోతు మీశానవాణీ, నఖలు నిఖిలవేదా స్తోతు మన్యేపి దేవాః స్తవనవిషయశక్తాః సంతి సంత స్తవైవ. ౩. కుమతి రహ మధిజ్ఞా యోషితాం శ్చాథ మావాక్వభువనగతి రీశ శ్చక్షుషో గోచరాపి, విధిహరిహరశేషైః స్తూయమానశ్చ యస్త్వ మతను మనుజ మీశం స్తోతు మిచ్ఛామి తం త్వామ్. ౪. స్తవనవిషయభీతా పార్వతీయస్యపద్మా శ్రుతిగణజనయిత్రీ స్తోతు మీశానయం త్వాం, కలికలుషనిమగ్నా వేదవేదాంగశాస్త్రశ్రవణవిషయమూఢా స్తోతు మిచ్ఛామి కింత్వామ్. ౫. శయానో రత్నపర్యంకే రత్నభూషణభూషితః, రత్నభూషణభూషాంగీ రాధావక్షసి సంస్థితః. ౬. చందనోక్షితసర్వాంగ స్సేరాననసరోరుహః, ప్రోద్యత్ప్రేమరసాంభోధౌ నిమగ్న స్సతతం సుఖాత్.

మించినబంధు వీప్రపంచమున లేఁడు. సకలలోకాధిపతీ! నాప్రాణనాథుని దయచేయుము. వధింపకుము. ప్రేమసింధువవు. సద్బంధువవు. కావున నాపతిని వధింపఁదగదు. అఖిలభువనబంధువవు. రాధికాప్రేమనీరరాశివి. భర్తను నాకు దానమిమ్ము. నీవు సృష్టికర్తను సృజించువాఁడవుకదా. ఈశ్వరుఁడు, బ్రహ్మయు, ఆదిశేషువు షణ్ముఖుఁడగు కుమారస్వామియుఁ దమతమపంచచతుష్షణ్ముఖములచేత స్తుతింపఁ జాలకుండువారు. వాణీదేవియు స్తుతింప నశక్తురాలు. సకలవేదములు స్తుతింపఁ జాలవు. ఇఁకఁ దక్కినదేవతలు స్తుతింపఁజాలుదురా! నేను గుబు

౭. మల్లికామాలతీమాలాజాలైః శోభితశేఖరః, పారిజాతప్రసూనానాం గంధామోదితమానసః. ౮. పుంస్కోకిలకలధ్వానై ర్భ్రమరధ్వనిసంయుతైః, కుసుమేషు వికారేణ పులకాంకితవిగ్రహః. ౯. ప్రియాప్రదత్తతాంబూలం భుక్తవాన్యఃసదాముదా, వేదాఅశక్తా యం స్తోతుం జడీభూతా విచక్షణాః. ౧౦. తమనిర్వచనీయంచ కింస్తౌమి నాగవల్లభా, వందేహం త్వత్పదాంభోజం బ్రహ్మేశశేషసేవితమ్. ౧౧. లక్ష్మీ సరస్వతీ దుర్గా జాహ్నవీ వేదమాతృభిః, సేవితం సిద్ధసంఘైశ్చ మునీంద్రై ర్మనుభి స్తథా. ౧౨. నిష్కారణాయాఖిలకారణాయ సర్వేశ్వరాయాపి పరాత్పరాయ, స్వయంప్రకాశాయ పరావరాయ పరావరాణా మధిపాయ తే నమః. ౧౩. హేకృష్ణ హేకృష్ణ సురాసురేశ బ్రహ్మేశ శేషేశ ప్రజాపతీశ, మునీశ మున్వీశ చరాచరేశ సిద్ధీశ సిద్ధేశ గణేశ పాహి. ౧౪. ధర్మేశ ధర్మీశ శుభాశుభేశ వేదేశ వేదే ష్వనిరూపితశ్చ, సర్వేశ సర్వాత్మక సర్వబంధో జీవీశ జీవేశ్వర పాహి మత్ప్రభుమ్. ౧౫. నాగపత్నీకృతం స్తోత్రం త్రిసంధ్యం యఃపఠే న్నరః, సర్వపాపాత్ప్రముక్తస్తు యాత్యంతే శ్రీహరేఃపదమ్. ఇహలోకే హరే ర్భక్తి

ద్ధిని. నీతత్వము నెఱుంగఁ గోర్కిమాత్రముకలదు. నారీమణులలో నధమురాలను. సకలజగన్నాథుని నిన్నుఁ జక్షుర్గోచరునిగనుఁగొనఁజాలను. త్రిమూర్తులచే నుతింపఁబడు నిన్ను వినుతింపఁబూనితినే. ఎంతటి యవివేకురాలను. పార్వతీదేవి వినుతింపఁబూని భీతినొందినది. సకలవేదమాతయగు పద్మయు వినుతింపఁజాలక నిల్చినది. ఇఁక నేనెట్లు నుతింపఁజాలుదును? నేనన్ననో సకలపాపస్పర్శమలినచిత్తను. వేదవేదాంగశాస్త్రజ్ఞానము లేనిదానను. అట్టులయ్యు నిన్ను వినుతింపఁబూనుట వెఱ్ఱితనముగాదా. రత్నపర్యంకమున శయనించి రత్నభూషణభూషితుఁడవై, చిరత్నరత్నభూషితయగు రాధావక్షమునవసించి, చందనోక్షితసర్వాం

మంతే దాస్యం లభే ద్ధ్రువం, లభతే పార్షదో భూత్వా సాలోక్యాదిచతుష్టయం. శ్రీకృష్ణజన్మఖండము. ౧౯ అధ్యాయము.

## బ్రహ్మపురాణాంతర్గతస్తుతిః.

శ్లో. జ్ఞాతోఽసి దేవదేవేశ సర్వేశ త్వ మనుత్తమః, పరం జ్యోతి రచింత్యం య త్తదంశః పరమేశ్వరః. ౧. నసమర్థా స్సురా స్స్తోతుం యమ నన్యభవం ప్రభుం, స్వరూపవర్ణనం తస్య కథం యోషి త్కరిష్యతి. ౨. యస్యాఖిలమహీవ్యోమజలాగ్నిపవనాత్మకం, బ్రహ్మాండ మల్పకాంశాంశ స్తోష్యా మ స్తం కథంవయమ్. ౩. తతఃకురు జగత్స్వామిన్ ప్రసాద మవసీదతః, ప్రాణాం స్త్యజతి నాగోఽయం భర్తృభిక్షా ప్రదీయతామ్. ౪.

## కాళీయకృతశ్రీకృష్ణస్తుతిః.

శ్లో. ఇత్యుక్తేశాతరాతశ్చ క్లాంతదేహోఽపి పన్నగః, ప్రసీద దేవదేవేతి ప్రాహ వాక్యం శనైశ్శనైః. తవాష్టగుణ మైశ్వర్యం నాథస్వాభావికం

గము లలర స్మేరాననపంకజమొప్పఁ, బ్రోద్యత్ప్రేమరసాంబునిధి యందు నిమగ్నుఁడవైయున్న నిన్నుఁ గొనియాడెద. దేవాది దేవా! మహాదేవా! మల్లికామాలతీమాలాజాలములచేఁ బ్రకాశించు జడముడి యొప్పార, పారిజాతకుసుమపరిమళామోదిమానస మలరార, పుంస్కోకిలకలరవములచేతను, మత్తభ్రమరఝంకారములచేతను, పంచాస్త్రవికారములచేతను బులకాంచిత విగ్రహుండవై, రాధాకామినీమణీకరకమలప్రదత్తమగు తాంబూలము నమలుచు మహానందమునఁ జెలువారు నిన్ను వేదములు వినుతింపఁజాలవు. ఇఁక నేర్పులులగువారు జడీభూతులగుట యొక్క-యక్క-జమా. అట్టి యనిర్వచనీయమహిమాఢ్యుఁడవగు నిన్ను నీ నాగాంగన వినుతింపఁగలదా. స్వామీ! నీపాదారవిందముల కిదె వందనము. ఈనీపాదాంబుజము బ్రహ్మేశశేషసేవితము. ఇంతియకాక లక్ష్మీసరస్వతీదుర్గాజాహ్నవీ

---

పరం, నిరస్తాతిశయం యస్య తస్య స్తోష్యామి కిన్వహం. ౧. త్వంపర స్త్వం పరస్యాద్యః పరంత్వం తత్పరాత్మకం, పరస్మా త్పరమో య స్త్వం తస్య స్తోష్యామి కిన్వహం. ౨. యథాఽహం భవతా సృష్టో జాత్యా రూపేణ చేశ్వర, స్వభావేనచ సంయుక్త స్తథేదం చేష్టితం మయా. 3. యద్యన్యథా ప్రవర్తేయం దేవదేవ తతో మయి, న్యాయ్యో దండనిపాత స్తే తథైవ వచనం యథా. ౪. తథాపి యం జగత్స్వామీ దండం పతితవా న్మయి, ససోఢోఽయం వరోదండ స్త్వత్తో నాన్యోస్తు మే వరః. ౫. హతవీర్యో హతవిషో దమితోఽహం త్వయాచ్యుత, జీవనం దీయతా మేక మాజ్ఞాపయ కరోమి కిమ్. ౬.

వేదమాతలచే నిత్యసంసేవితము. సిద్ధసంఘసంసేవితము. మునీంద్రవినుతము. జగదీశా! నీవు నిష్కారణుఁడవు. అఖిలకారణుఁడవు. సర్వేశ్వరుఁడవు. పరాత్పరుఁడవు. స్వయంప్రకాశుఁడవు. పరమశివునకుఁ బరమశివుఁడవు. సకల దేవేశ్వరేశ్వరుఁడవు. ఇట్టి నీకొఱకు నమస్కారము లర్పించుచున్నాను. శ్రీకృష్ణా! కృష్ణా! సకలామరాధినాథా! చతుర్ముఖప్రభూ! అనంతవిభూ! సకలప్రజావిభూత్తమా! మునీశా! మనువిభూ! చరాచరనాయకా! సిద్ధసంఘప్రభూ! సిద్ధిప్రదా! గణేశా! నన్ను రక్షిం

---

### శ్రీభాగవతాంతర్గత కాళీయఫణిపత్నీకృత శ్రీకృష్ణస్తుతిః.

శ్లో. న్యాయ్యోహి దండః కృతకిల్బిషేఽస్మిన్ తవావతారః ఖలనిగ్రహాయ, రిపోస్సుతానామపి తుల్యదృష్టే ర్ధత్సేధమ న్ధర్మమేవానుశంసన్. ౧. అనుగ్రహోఽయం భవతా కృతోహి నో దండోఽసతాం తే ఖలుకల్మషాపహః, యద్దందశూకత్వ మముష్య దేహినః క్రోధోఽపి తేఽనుగ్రహ ఏవ సమ్మతః. ౨. తపస్సుతప్తం కిమనేనపూర్వం నిరస్తమానేనచ మానదేన, ధర్మోఽథవా సర్వజనానుకంపయా యతోభవాం స్తుష్యతి సర్వజీవః. ౩. కస్యానుభావోఽస్య నదేవవిద్మహే తవాంఘ్రిరేణుస్పర్శాధికారః, యద్వాంఛయా శ్రీర్లలనాచరత్తపో విహాయ కామాన్ సుచిరం ధృతవ్రతా. ౪. ననాకపృష్ఠం నచ సార్వభౌమం నపారమేష్ఠ్యం నరసాధిపత్యం, నయోగసిద్ధీ ర్నపునర్భవంవా వాంఛంతి యత్పాదరజః ప్రపన్నాః. ౫. తదేషనాథాపదురాపమన్యై స్తమోజనిః క్రోధవశోఽప్యహీంద్రః, సంసారచక్రే భ్రమతశ్శరీరిణో యదిచ్ఛతస్స్యా ద్విభవ స్సమక్షం. ౬. నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే, భూతావాసాయ భూతాయ పరాయ పరమాత్మనే. ౭. జ్ఞానవిజ్ఞానవిధయే బ్రహ్మణేఽనంతశక్తయే, అగుణా యావికారాయ నమస్తే.

పుమా. ధర్మధర్మీశ్వరా! శుభాశుభనాయకా! వేదవిభూ! నీవు వేదములచే నిరూపింపఁబడని స్వరూపముగలవాఁడవు. సర్వేశ్వరుఁడవు. సర్వాత్మకుఁడవు. సర్వప్రాణిబంధువవు. జీవాధినాథుఁడవు జంతుస్వరూపుఁడవు. నాపతినిగావుమా. అని వినుతించి యూరక భగవంతుం జూచుచుండెను. ఇది నాగపత్నీకృతస్తోత్రము. దీని నెవ్వఁడేని మూఁడుకాలములయందుఁ బఠించిన సకల పాపములు తొలఁగి కడపట శ్రీహరిపదము నొందును. ఈ లోకమున నున్నంతకాలము శ్రీహరిభక్తి కుదురును. కడపట శ్రీహరిదాస్యము లభించుటయేగాక పార్షదుఁడై శ్రీకృష్ణసాన్నిధ్యమున నుండునట్లుచేయును. ముక్తి యాభక్తునకుఁ గరతలామలకము.

---

ప్రాకృతాయచ. ౮. కాలాయ కాలనాథాయ కాలావయవసాక్షిణే, విశ్వాయ తదుపద్రష్ట్రే తత్కర్త్రే విశ్వహేతవే. ౯. భూతమాత్రేంద్రియప్రాణమనోబుద్ధ్యాశయాత్మనే, త్రిగుణేనాభిమానేన గూఢస్వాత్మానుభూతయే. ౧౦. నమోఽనంతాయ సూక్ష్మాయ కూటస్థాయ విపశ్చితే, నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే. ౧౧. నమః ప్రమాణమూలాయ కవయే శాస్త్రయోనయే, ప్రవృత్తాయ నివృత్తాయ నిగమాయ నమోనమః. ౧౨. నమః కృష్ణాయ రామాయ వసుదేవసుతాయచ, ప్రద్యుమ్నాయానిరుద్ధాయ సాత్వతాంపతయే నమః. ౧౩. నమోగుణప్రదీపాయ గుణాత్మచ్ఛాదనాయచ, గుణవృత్త్యుపలక్ష్యాయ గుణద్రష్ట్రే స్వసంవిదే. ౧౪. అవ్యాకృతవిహారాయ సర్వవ్యాకృతసిద్ధయే, హృషీకేశనమస్తేఽస్తు మునయే మౌనశీలినే. ౧౫. పరావరగతిజ్ఞాయ సర్వాధ్యక్షాయ తే నమః, అవిశ్వాయచ విశ్వాయ తద్ద్రష్ట్రేఽస్య చ హేతవే. ౧౬. త్వం హ్యస్య జన్మస్థితిసంయమాన్ విభో గుణైరనీహో

## శ్రీకృష్ణుఁడు నాగపత్నికి వరమొసఁగుట.

అని యిట్లు నాగపత్నియుఁ గాళీయఫణిపతియు వినుతించిరని పలుక నారదుఁడు నారాయణమూర్తింగాంచి తర్వాతి వృత్తాంతం బెట్లుచెల్లెను. కరుణించి చెప్పవే యన నారాయణుం డిట్లనియె. నారదమునీ! ఈయద్భుతవృత్తాంతము వినఁదగినది. సావధానుఁడవుకమ్ము. అట్లు నాగపత్ని నుతింప విని మధుసూదనుఁడు సుప్రసన్నుఁడై తనముం దంజలిబంధంబొప్ప భయవిహ్వలత్వము గదుర వెలవెలపోవుచున్న యానాగకాంతం జూచి యిట్లుపలికెను. సురసా! నాగపత్నీ! లెమ్ము. లెమ్ము. వరమడుగుము. ఒసంగెద. భయపడవలదు. * తల్లీ! ఇదిగో నీభర్తను గ్రహింపుము. నావరప్రసాదమున నీభర్త జరాబాధితుఁడుగాక మృత్యుపీడితుఁడుకాక యుండగలఁడు. ఈహ్రదము నీభర్త నివ

---

కృతకాలశక్తిధృక్, తత్తత్స్వభావాన్ ప్రతిబోధయన్ సత స్స్వమాత్మయా మోహవిహారఈహసే. ౧౭. తస్యైవ తేఽమూ స్తవన స్త్రిలోక్యాం శాంతా అశాంతా ఉత మూఢయోనయః, శాంతాః ప్రియాస్తే హ్యధునావితుం సతాం స్థాతుశ్చతే ధర్మపరీప్సయేహతః. ౧౮. అపరాధ స్సకృద్భర్త్రా సోఢవ్య స్స్వప్రజాః కృతః, క్షంతు మర్హసి సర్వాత్మన్ మూఢస్య త్వా మజానతః. ౧౯. అనుగృహ్ణీష్వ భగవన్ ప్రాణాం స్త్యజతి పన్నగః, స్త్రీణాం న స్సాధుశోచ్యానాం పతిప్రాణః ప్రదీయతామ్. ౨౦. విధేహి తే కింకరీణా మనుష్ఠేయం తవాజ్ఞయా, యచ్ఛ్రద్ధయానుతిష్ఠన్ వై ముచ్యతే సర్వబంధనాత్. ౨౧. దశమస్కంధము. ౧౬ అధ్యాయము.

* గృహాణ కాంతం హేమాత ర్మద్వరా దజరామరమ్-అని మూ.

సించియున్నందునఁ గాళిందీహ్రదమనఁ బరఁగెఁగదా. ఇందు మాత్రము నివసింపరాదు. దీనిం ద్యజించి స్వస్థానమునకు వెళ్ల వలయును. అమ్మా! నీభర్తను బంధువులను సేవకులను బిలుచు కొని సుఖముగా స్వస్థలమునకుంబోయి సుఖముండుము. ఇది మొదలు నీవు నాకుఁ బుత్త్రికవుగమ్ము. నీప్రాణాధికుఁడగు నీ కాళీయుఁడు నాకల్లుఁడగును. సత్యము. నీభర్తఫణముపై నా పాదపద్మచిహ్నములుండును. వానింగాంచి గరుత్మంతుఁడు నుతించుచు నమస్కరింపఁగలఁడు. కావున గరుడునివలనిభీతిని ద్యజింపుము. వేగముగా రమణకస్థానము నొందుము. ఈహ్ర దమునుండి వెడలిపొమ్ము. ఇంకేమివరమువలసినఁ గోరుము.

అని శ్రీహరి పలుక విని సుప్రసన్నవదనేక్షణరై ఆనంద బాష్పములు స్రవింప భక్తిభరమున శిరమువంచి సురస యిట్లు ప్రార్థించెను.జగన్నాథా! వరమనుగ్రహింప సమ్మతించితిరి.వరదా! ఈశ్వరా! వేఁడుచున్నదానను. నీపాదపంకజములయందు నిశ్చ లమైనదృఢభక్తిని బ్రసాదింపుము. నామనస్సు నీపాదారవింద ములయందు భ్రమరముభంగి సదా పరిభ్రమించుచుండుఁగాక. నీస్మరణమందు విస్మృతినామనస్సున కెప్పుడునుగలుగకయుండుఁ గాక. మహానుభావా!నాసౌభాగ్యమంతయు నాభర్తయధీనము. నే నీనాగమునకుభార్యనుగదా. కావున నీజ్ఞానము మాకుంగల్గు నట్లు వర మనుగ్రహింపుము. ఇదియ నేఁగోరువరము. దీనిని బూర్ణముచేయవలయును.

అని యిట్లు ప్రార్థించి యానాగపత్ని శ్రీహరియెదుట నిలువఁబడియెను. శరత్కాలరాకాశీతకరసహస్రాధికసుందర మగు శ్రీకృష్ణపరమేశ్వరుమోమును వీక్షించుచుండెను. ఆపతివ్రతాశిరోమణి లోచనముల నాదివ్యరూపమును గ్రోలుచు నిర్భరానందవివశయై నిర్నిమేషయై యుండెను. ఆమె తనువాద్యంతము పులకాంకురాంచితమయ్యెను. ఆనందాశ్రులు, తనుల తను దడుపుచుండెను. అంతలో నాసురస సుందరాకారుఁడగు నాగోపాలబాలకుం గాంచెను. వెంటనే పుత్రవాత్సల్య మంకురించెను. కావున మరల భక్త్యుద్రేకమున నోడలుమఱచి యిట్లు పలికెను. మహానుభావా! రమణకస్థానమునకుం బోనొల్లను. అందు నాకుంగలుగు ప్రయోజనము లేదు. అందు నాపతి నివసించుఁగాక. నన్ను నీసేవకురాలినిగా నంగీకరింపుము. నాకు సాలోక్యాదిచతుష్టయముగల ముక్తియందు వాంఛ లేదు. శ్రీకృష్ణా! ఆముక్తి నీపాదాంభోజసేవయందు షోడశాంశము నకు సరిరాదు. ఎవఁడు నీపాదసేవనముతప్ప వేఱొకవరము కోరునో *వాఁడు భారతభూమిం బుట్టువును గాంచలేఁడు. ఒకప్పుడు భారతభూతలమునఁ బుట్టువుంగాంచినను వాఁడు వంచితుఁడగును. అని పలుకు నాగపత్నీవచనమును విని చిఱునగవుతో మోము వింతకాంతిని గనుపింపఁజేయఁగాఁ బ్రసన్నమానసుఁడై శ్రీనాథుఁ డశ్లోకానిమ్మని మఱియు నిట్లు పలికెను.

---

* భారతే దుర్లభం జన్మ లబ్ధ్వా సో వంచితస్స్వయమ్-అని మూ.

శ్రీకృష్ణమూర్తివాక్యము వచ్చునంతలో ఆకాశము నుండి దివ్యమై రత్నసారవినిర్మితమై తేజోరాశియగురథ మొండువచ్చి నిల్చెను. అందుఁ బార్షదులు వేనవేలుండిరి. వస్త్రములచేఁ బుష్పమాలికలచే నాయరదము వెలయుచుండెను. శతచక్రములు దానికింగలవు. వాయువేగము దానికి సహజము. మర్యాదలకుం దగినది. చూడ నందమైనది. అట్లువచ్చినరథము నుండి శ్యామవర్ణులు, శ్యామసుందరకింకరులు దిగి శ్రీకృష్ణునకు నమస్కరించి అనాగపత్ని నారథము నెక్కించి గోలోకమునకుఁ గొని చనిరి. ఆవిధ మెవ్వ రెఱుంగరు. శ్రీహరియు నానాగపత్నిచ్ఛాయనుగల్పించి కాళీయునికడ నుండ నాజ్ఞాపించెను. విష్ణుమాయామోహితుఁడు కాన నాఫణిరా జాలలన భార్యయా కాదా యని యెఱుఁగఁజాలకుండెను.

అవ్వల శ్రీహరి కాళీయఫణిఫణమునుండిదిగి యభయహస్తమును బ్రసాదించెను. వెంటనే యాతనికి యథాపూర్వముగాఁ బ్రాణమువచ్చెను. బుద్ధిపాటవముకలిగెను. కావున భగవంతు నెదుటనిల్చియున్న శ్రీకృష్ణునిం గాంచెను. పుటాంజలిధై సాశ్రునయై యున్న తనభార్యను సురసను జూచెను. శ్రీకృష్ణునకు నమస్కరించి ప్రేమవిహ్వలుఁడై యేడ్చెను. అట్లే యానందాశ్రువులు ప్రవహింపనున్న సురసనుగాంచి భగవంతుఁడు ఫణి కిట్లులనియెను. భగవంతునకు యోగ్యాయోగ్యులపైఁ గరుణాసమానముకదా! కాళీయసర్పరాజా! నీమనసునఁగల

వాంఛితమును దెల్పుము. వర మొసంగెద. నీవు నాప్రాణముల కన్న నెక్కుడు ప్రీతిపాత్రుఁడవు. భయమువదలుము. సుఖముగ నుండుము. ఎవఁడు నాయంశజనితుఁడో వానికిఁ బ్రసన్నుఁడ నయ్యెదను. వాఁడే నాభక్తుఁడు. కొంచె మాతని గష్టపెట్టి ప్రసాదదృష్టిం జూచెదను నీవంశమునఁ గలుగుసర్పముల నెవఁడు హింసించునో ఆమానవాధముఁడు బ్రహ్మహత్యాతుల్యపాపమును బొందఁగలఁడు. ఇది నిజము. నాపాదపద్మచిహ్నమునం దెవఁడు దండించునో బ్రహ్మహత్యాద్విగుణపాప మానవాధము నకుఁ గల్గును. లక్ష్మీదేవి వానియింట నొల్లక శపించి వెడలిపోవును. వంశాయుర్యశస్సులకు హానిగల్గును. నూఱువంశములు కాలసూత్రమునఁ బడియుండఁగలఁడు. అంతియగాక వానిని నీయంతటిపొడవుగల ఘోరసర్పములు గఱచుచుండును. పాపఫలానుభవానంతరమందు జన్మించి సర్పఘాతమునఁ జచ్చును. తద్వంశజనితులకు సర్పభయము కలుగుచుండును.

ఏజనులు నాదివ్యపాదాంకితమగు నీవంశజసంతతింగాంచి నమస్కరింతురో వారు పాతకవినిర్ముక్తులగుదురు కాళీయభుజగరాజా! నీవు రమణకస్థానమునకుం బొమ్ము. గరుడభయము నీకుం గలుగక యుండుఁగాక. గరుడుఁడు నాపాదాంకమును నీఫణమందుఁగాంచి నమస్కరించును. నీకుమాత్రమేగాక నీవంశజనితులకు గరుడభీతి యుండదు. నీకును నీ జ్ఞాతులకుంగూడ వర మీాయది యమరియుండును. ఇంక నేదే వరముగోరఁ గోర్క

యలరునేని కోరుము. భయంపడక నీమనోవాంఛను నాకుం దెల్పుము. వగలంబొందకుము.

అని శ్రీహరి పలుక కాళీయఫణిపతి భయకంపితాంగుండై యంజలింగీలించి పరమాత్మా! వరప్రదా! వేఱొకవరముం గోరు వాంఛ నాకులేదు. ప్రతిజన్మమునందును నీపాదాంబుజభక్తియు స్మృతియు నాకు వదలకయుండున ట్లనుగ్రహింపుము. నీభక్తునకు బ్రహ్మవంశమునందుఁగాని తిర్యగ్యోనులయందుఁగాని పుట్టుక కల్గినను రెండును సమానములే. నీచరణాబ్జస్మృతి యెవని కలదో వానిజన్మమే జన్మము. నీపదస్మృతిలేనిచో స్వర్గవాసముకూడ నిష్ఫలమగును. నీపాదసేవకుల కాయువు క్షీణింపదు. జన్మమరణరోగశోకార్తిభయములు వానికిం గల్గవు. భక్తులకు నీపాదసంసేవతప్ప నమరత్వమందుఁగాని, ఇంద్రత్వమందుఁగాని, అతిదుర్లభమగు బ్రహ్మత్వమందుఁగాని వాంఛయుండదు. నూత్నపదమేదియైనను మిగుల జీర్ణించినపటముతో సమానమగును. ఎట్టిముక్తిగాని నీపాదసేవతో సమానముకాదు. శ్రీకృష్ణా! నీపాదకృతమగువ్రణము నాకలంకారమేయైనది. అపక్వభక్తిగల నన్నుంగాంచి మహాభక్తుండగు గరుత్మంతుఁడు దేశదూరునిగాఁ జేసెను. భక్తి నీయందు దృఢముగాఁ గల నన్ను నింకఁజూచి పరిపక్వభక్తిగలవానినిగాఁ దలంచి వదలఁ గలఁడు. నామస్తకమున నీపాదాబ్జచిహ్నముగాంచి శ్రీమస్తకుఁడనౌట సదోషుఁడనైనను నన్ను గరుడుఁడు వదలఁగలఁడు. నన్ను సేవించునాగములు నేనును దద్బాధ్యులము కాము.

భయము మాకింక నెందును లేదు. గరుడభయమే మాకుం డెను. ఏభగవంతుని దేవేంద్రాదిదిక్పాలకులు మహర్షులు మనువులు లోనగువారు స్వప్నమందైనఁ జూడఁజాలరో యాపరాత్పరుని నిన్నుం గనఁగల్గితిని. విభూ *భక్తానుకంపమున సాకారుఁడవైతివిగాని నీకు దేహ మెక్కడిది? [1]సగుణుఁడవయినపుడు సాకారుఁడవగుదువు. నిర్గుణుఁడవగుతఱి నిరాకారుఁడవు, స్వేచ్ఛామయుఁడవు, సర్వధాముఁడవు, సర్వబీజమయుఁడవు, సనాతనుఁడవు, సర్వేశ్వరుఁడవు, సర్వసాక్షివి, సర్వాత్మవు, సర్వరూపధారివి. బ్రహ్మేశశేషధర్మేంద్ర వేదవేదాంగపారగులందఱును ఏ నిన్ను వినుతింప మందమతులగుదురో అట్టి నిన్నీసర్ప మెట్లు స్తుతింపఁజాలును? ఓనాథా! కరుణాసింధూ! దీనబంధూ! ఈనీచుని నన్ను క్షమింతువు గాక. ఖలస్వభావమువలనను, అజ్ఞానమువలనను, శ్రీకృష్ణా! నిన్నుం గఱచితిని. ఆకాశమేలాగు అస్త్రలక్ష్యముకాదో, అట్లే నీవుచూడఁబడవు. వ్యాప్తిగమ్యుఁడవుకావు. దాఁట శక్యముకావు. స్పృశింపఁదగవు. కఱవఁదగవు. నీరూపము తేజోమయము.

అనిపలికి యాకాళీయఫణి శ్రీకృష్ణపాదాంబుజములపయింబడెను. శ్రీహరియు నీవడిగినట్టివరముల ననుగ్రహించితినని-

---

* భక్తానుకంపా త్సాకారః కుతస్తే విగ్రహోవిభో-అని మూ. భగవంతుఁ డీలోకమందే యుండునన్న మొండివాదము దీన నూడిపోవునని తెలియవలయు. 1 సగుణస్త్వంచ సాకారో నిరాకారశ్చ నిర్గుణః-అని మూ.

సంతుష్టుండై పలికెను. నాగరాజకృతస్తోత్రము నే నరుఁ డుద యమునఁ బఠించునో, ఆతనికిఁ దద్వంశజనితులకు సర్పభయము గలుగదు. మఱియు నామనుష్యుఁడు నాగశయ్యపైఁ బరుండ శక్తుఁడగును. ఆతనికి విషపీయూషభక్షణమందు భేదముగలుగదు. నాగగ్రస్తుఁడుగాని, నాగదష్టుఁడుగాని, విషభోజనమునఁ బ్రాణాంతస్థితి గలుగునతఁడుగాని, యీస్తుతిని స్మరించినంతనే యాబాధలు పోవును. భూర్జపత్రమునందువ్రాసి కంఠమందుఁగాని, దక్షిణహస్తమందుఁగాని యెవఁడు ధరించునో వానికి నాగభయముగలుగదు. ఏగృహమున నీస్తోత్రపుస్తకముండునో యాయింట నాగము నివసింపదు. విషాగ్నివజ్రభీతియు నాయింట నుండువారికిం గలుగదు. ఇజ్జగమున హరిభక్తియు స్మృతియు వారికినుండును. అంత్యమందు స్వకులమును దరింపఁజేసి భగవద్దాస్యము నొందుదురు.

అనిపలికి నారాయణమూర్తి నారదునకు మఱియు నిట్లనియె. మునీంద్రా! అట్లు కాళీయునకు వరమొసంగి మధురవాక్కులతో మఱియు నాతని కిట్లనియెను. ఆవాక్యము పరిణామసుఖావహము. కాళియఫణిరాజా! ఇంద్రనగరప్రతిమానమగు రమణకపదమునకుం బొమ్ము. నీబంధువులను సేవకులను బిలుచుకొని యమునాజలమార్గముననే పొమ్ము. అను భగవదాజ్ఞను విని నాగేంద్రుఁడు పలవించెను. నాథా! ఎప్పుడు మరల నీపాదారవిందములఁ జూడఁగల్గుదునని ప్రార్థించెను. నమస్కరించి సపరి

జనుఁడై కాంతలంగూడి ఫణిపతివిరహాతురుఁడై యమునాజల మార్గమునఁ బయనముసాగించెను. ఆయమునాహ్రదసలిలం బంత పావనంబై యమృతతుల్యంబయ్యెను. సకలజంతువులు ప్రసన్నములయ్యెను. ఆఫణిపతి పోయిపోయి యింద్రనగరము వంటి భవనముంగాంచెను. శ్రీకృష్ణపరమేశ్వరాజ్ఞచే విశ్వకర్మ క్షణకాలమునందే దానిని నిర్మించెను. ఆదివ్యభవనమున నాగేంద్రుఁడు భార్యాపుత్రపరిజనులంగూడి నివసించెను. నిశ్శంకుఁడై హర్షయుక్తుఁడై హరిభావనతత్పరుఁడై యందు హాయిగానుండెను. అనిపలికి నారదమునితో నారాయణుం డార్యా! శ్రీహరి చరితంబు వచించితిని. ఇది యపారసుఖదము మోక్షదము. ఇంక నేమి వినఁగోరెదవో తెలుపుమన నారదుఁ డిట్లు పలికెను.

మహాత్మా! కాళీయుఁడు పూర్వగృహమునువదలి యేల యమునాతీరమునకుం బోయెను? ఆవార్తను వినఁగోరెదనని ప్రశ్నింప నారాయణుం డిట్లనియె. మునివర్యా! పురాతనేతిహాస మును వివరించెద. ఈయితిహాసము ధర్మవక్త్రమునుండి వినఁబడినది. మలయపర్వతమున సూర్యగ్రహణపుణ్యకాలమున శ్రీకృష్ణాఖ్యానప్రసంగంబున వింటిని. సుప్రభానదీతీరమునందుఁ బులహముని మునిసభామధ్యస్థితుఁడగుధర్మునిఁ బ్రశ్నించెను. ఈయాశ్చర్యాఖ్యానము నాకృపానిధి ధర్ముఁడు వివరించెను. ఆ మలయపర్వతసమీపమున నాపుణ్యకాలమున నానదీతటమున నామునిసభయందుండిన నే నాకథను విననోచితిని. దానిని వచియించెద. అవహితుఁడవై యాలకింపుము.

ఆదిశేషునియానతిచే నాగములన్నియు భయంపడి ప్రతి వత్సరమందును గార్తికపూర్ణిమయందు గరుడపూజను చేయు చుందురు. పుష్పములచేతను, ధూపదీపములచేతను, నైవేద్య ములచేతను, బలులచేతను, గరుడుని దృప్తిసేయుదురు. పుష్క రమహాతీర్థమున స్నానమొనరించి భక్తియుక్తులై పూజింతురు. ఆపూజను గాళీయుఁడాచరింప గర్వించెను. నాగపూజోపకర ణముల బలవంతముగా భక్షింపఁ బ్రయత్నించెను. నాగులెల్ల నాతనిం జేరి గర్వించినవాఁడని తెలిసి నీతి నుపదేశించిరి. కాని వారివాక్యములు కాళీయుని చెవిఁ జొరవయ్యెను. ఆవిధ మెఱింగి తద్గర్వనిర్వాపణ మొనరింపఁ దానే గరుడుఁ డచట సాక్షాత్కరించెను. వానింగాంచి కాళీయుని రక్షించుపొంటె నాగులెల్లరుఁ బ్రాణముల నొడ్డి దొడ్డ సంగరమొనరించిరి. సూర్యోదయమగువఱకు గరుడునితోఁ బోరాడిరి. పక్షీంద్రుని తేజోమహత్వమున నిర్బలులై పలాయనము నంగీకరించిరి. సర్వాభయప్రదుండగు నన్నంతునిమఱుఁగు చొచ్చి రక్షింపుమా యని వేఁడిరి. పలాయనపరాయణులైన నాగులంగాంచి కరుణా జలధియగు కాళీయుఁడు నిలువంబడి శంకారహితుఁడై హరి పదాంభోజముల సంస్మరించి యుద్ధముచేయసాగెను. వారి యుద్ధము ముహూర్తకాల మతిభయంకరముగఁ జెల్లెను. అంత గరుడతేజస్సుచేఁ గాళీయుఁడు పరాజితుఁడయ్యెను. ఇఁక వధిం చునన్న భయమున వడివడి యమునాహ్రదముచేరఁ బరువెత్తెను. ఆమడుఁగు సౌభరియను మునిశాపంబున ఖగేంద్రునకుఁ జొర

శక్యంబు గాకుండెను: ఆ హ్రదముఁజొచ్చి పైకివచ్చిన గరుడుఁడు చంపునన్న భయమున నందే వసించెను. వెనుక నాతనిబంధువులులోనగు నాగములెల్ల నచ్చటఁజేరెను. అన నారదుఁ డిట్లు ప్రశ్నించెను.

## సౌభరిముని గరుత్మంతుని శపించుట.

నారాయణా! దేవదేవా! సౌభరిముని యేల గరుడుని శపించెను? భగవద్వాహనమగు ఖగేంద్రుఁడు చొరనశక్తుఁ డేలయయ్యెను? విన వేడుకయ్యెడు వచింపుమా యని ప్రశ్నింప నారాయణుఁ డిట్లనియె. దివ్యవర్ష సహస్రములు యమునాతటంబున నివసించి మున్ను సౌభరి తప మొనరించెను. ఆతపస్సు ఫలింప మహాసిద్ధులం బడసి శ్రీకృష్ణపాదపద్మముల మది నిలిపెను. ఒకనాఁ డుదయమునానదీతటముననే కూరుచుండి భగవంతుని ధ్యానముచేయుచుండఁగా శంకారహితుఁడై ఖగేంద్రుఁడు తనబలములతోఁ దిరుగుచు సౌభరింగాంచి దిగి వలగొని మ్రొక్కి పోవుచుండుట వాడుక. ఒక్కనాఁ డట్లు మౌనిం గాంచి నమస్కరించిపోవుచు నమ్మహాహ్రదంబుననున్న మీనంబులంగాంచి చంచుపుటమున మీనంబులం బొడిచి పట్టుకొని మునిసమీపంబునుండియే పోవుచుండెను.

సౌభరియు మీనమును జంచువుల నుంకించికొనిపోవు గరుడునిఁ గోపారుణితనేత్రుఁడై చూచెను. ఆక్రోధదృష్టికిం బెదరి గరుడుఁడు వణఁకి మీనమును విడువ నది మడువునఁబడియె.

మరలఁ జపలతచే దానింబట్టుకొనపోఁగా నామీనము గరుడ భీతిని వడఁకుచు మునిచెంతకు నీటినుండియే పరుగుపాటె వడఁ కుచుండెను. దానింగాంచి సౌభరి యిట్లు పలికెను. ఖగరాజా! దూరముగాఁబొమ్ము. దూరముగాఁబొమ్ము. నాచెంత నొక్క ప్రాణిహింసచేయు యోగ్యత నీకుఁగలదా. నీవు శ్రీకృష్ణవాహ నమునుగదా నేనని గర్వించెదవు. నీవంటివాహకులను శ్రీకృ ష్ణుఁడు కోటిమందిని సృజింపఁగలఁడు. కనుబొమముడిచేతనే నిన్ను భస్మముచేయఁజాలుదును. నీవు భగవంతుని వాహన మవు. మేము నీకుఁ గింకరులముగాము. ఖగేంద్రా! ఇది మొదలు నీమడువునకు వత్తువేని నాశాపవశమున భస్మమ వగుదువు.

ఇట్లు పలుకు మునీంద్రునివాక్యమును విని ఖగపతి వడఁ కెను. శ్రీకృష్ణపాదముల స్మరించిస్మరించి మునిపతికి నమస్క రించి తనదారినఁబోయెను.. అదిమొదలు యమునాహ్రదమన్న మాట వినఁబడినచో ఖగేంద్రునిశరీరము కంపించుచుండును. నారదా! ధర్ముఁడు వచించినయీయుపాఖ్యానమును విన్నయట్లే తెల్పితిని. సారభూతమని తలంపుము. వినిన దీనిని మదిని జక్కఁగా నిలుపుము.

అవ్వలికథను వినుము. కాలీయుఁడు వెడలిపోయి తర్వాత శ్రీహరి ఆజలమునుండి వెడలిరాక యందే యుండెను బాలురందఱు మిగుల వగలఁబొగిలిరి. యమునాతటమున నిలు

వెచ్చనూర్చిరి. కొందఱుబాలకులు దుఃఖాకులులై యేమియు మాటాడలేకుండిరి. మఱికొందఱు భూమింబడి పొరలిపొరలి విలపించి విలపించి మూర్ఛమునింగిరి. బాలకులలోఁ గొంతమంది యమునాహ్రదమున దుముకఁ బ్రయత్నించిరి. కొంద ఱందుఁ దొరపడి మడువున దుముకువారిని వలదని యడ్డగించిరి. ఇంకనుం గొందఱు జీవించుటకన్న మరణించుటయే మేలని యూహించి యప్పనికి సమకట్టిరి. కొందఱు బుద్ధిమంతులు భగవంతునికి రక్షయొనఁగూర్పఁ బ్రయత్నించిరి. కృష్ణ కృష్ణా యని కొందఱును, అయ్యో! అయ్యో! అని మఱికొందఱును బల్కుచుండిరి. కొందఱు నందునిచెంతకుం బోయి మొఱలిడఁ బ్రయత్నపడుచుండిరి. గుంపుగాఁగూడినబాలకు లిఁకఁ జేయఁదగు కార్యమేది ? మనగతి యిఁకనేమి ? అని యూహింపసాగిరి. కొందఱు నందనందనా! ప్రాణాధికప్రియసఖా! మాప్రాణము లిఁక నిలువవు. త్వరగా దర్శనమిచ్చి కావుమా యని చేతులు మోడ్చి యభ్యర్థించిరి. ఏడ్చుచు నోడలు తెలియక నందునిసన్నిధికే కొందఱు మొఱపెట్టుకొనఁజనిరి. గోపికాగోపకులు రోదనములొనర్చుచుఁ గన్ను లెఱ్ఱవాఱఁగా యశోదానందులతోఁ గర్తవ్య మాలోచింపఁబోయిరి. మడువుచెంతకుంబోయి యంద ఱొక్కపెట్టున రోదనముచేయ నారంభించిరి.

యశోద యాహ్రదమున దుముకఁ బ్రయత్నింపఁగా గోపికలు కొందఱు వలదమ్మా యని పట్టుకొని నిల్పిరి. రాధయు

నత్తఱి నచ్చటికివచ్చి తనప్రాణవిభుని పాటు గాంచి తానును మడువులోఁబడఁ బ్రయత్నింప నొకగోపికవలదని వారించెను. రాధయు నాసరిత్తటమున నట్లే పడిపోయి మృతినొందినదాని వలె నుండెను. నందుఁడు దుఃఖించి దుఃఖించి మూర్ఛ తన్ను ముంప నట్లే భూమిపై నొరగెను. ఆమూర్ఛ పలుసారులు కల్గు చుండెను. స్మృతియుఁ బెక్కుమాఱులు వచ్చుచుండెను. అత్తఱి నాయమునాతటము దుఃఖమయమై దుర్భరమైయుం డెను.

అత్తఱి జ్ఞానివర్యుఁ డగుబలరాముఁడు వారినందఱ నాశ్వాసింపఁ దలంచి గోపికలారా! గోపాలకులారా! గోపబా లకులారా! మీ రెల్ల నామాట లాలింపుఁడు. నందా! మహా త్మా! గర్గవాక్యమును స్మరింపుము. జగంబులమోయు నాదిశేషు వునకు, జగత్సంహారము చేయు శంకరునకుఁ దండ్రియై సర్వకర్త యగుమహానుభావునకుఁబరాజయ మెవ్వనివలనఁ గలుగును?పర మాణువు,వ్యూహము స్థూలతమము పరాత్పరము నగుతత్త్వమే దో దానికి బాధ యెవ్వనినుండికలుగును? ఉండియు లేనిదై యో గులకు సంయోగమును గల్పించుచు నుండు తత్త్వమునకు క్షతి యెట్లు?దిక్కులకు సంయోగమెట్లులేదో ఆకాశ మెట్లు స్పృశింప నలవికాదో అట్లేసర్వేశ్వరుఁడుబాధింపఁబడుటయు నని యెఱుం గవలయును అని శ్రుతులు నెత్తిన నోరుపెట్టుకొని ఘోషించు చున్నయవి. ఆత్మ దృశ్యముకాదు. అస్త్రములకు గుఱికాదు

బాధింపఁదగనిది. కనఁబడనిది. అగ్ని దానిం గాల్పలేదు. హింసింప శక్యముగాదు. అని యాధ్యాత్మికులు చెప్పుదురు?

* శ్రీకృష్ణనిరూపము భక్తులు ధ్యానము చేయుటకుఁగాఁ గల్పింపఁబడినదియే. భగవంతుఁడు జ్యోతిస్స్వరూపుఁడు. అట్టి పరమేశ్వరునకు ఆదిమధ్యాంతములుగలవా? బ్రహ్మాండము జలాప్లుతముకాఁగా జనార్దనుఁడు జలశాయియగును. ఏమహాపురుషుని నాభికమలమున బ్రహ్మ యుదయించెనో ఆమహాత్మున కీప్రాదమున విపత్తుకల్గునా? తండ్రీ! దోమ సకలబ్రహ్మాండమును గుటుక్కున మ్రింగఁగల్గినేని యట్లు జరగుఁగాక. పరమేశుని నాగము మ్రింగఁజాలదని నమ్ముఁడు. ఇది యాధ్యాత్మికతత్త్వము. అతిరహస్యము. దురూహము. యోగులుగూడ దీనిని బయలు పలుపరు. సకలసంశయచ్ఛేదకారణ మిదియే.

అని బలదేవుఁడు వచింప మునిపతియగు గర్గుఁడు మున్ను చెప్పియున్న రహస్యమును స్మరించి నందుఁడు శోకముడిగెను. గోకులవాసులు, గోపికలు ప్రసన్నులైరి. ఎల్లరు తెలివిదెచ్చుకొనిరి కాని యశోదయు రాధికయు దుఃఖము మానరైరి. బంధువిచ్ఛేదసమయమున నెంతటియుపదేశమైనను మనసున కెక్కదు.

---

*విగ్రహోఽస్యైవకృష్ణస్యభక్తధ్యానార్థమేవచ,జ్యోతిస్స్వరూపస్య విభో ర్నాద్యంతమధ్య మాత్మనః-అని మూ.

ఇట్లితఁడి శ్రీహరి జలములనుండి లేచెను. ఆశ్రీకృష్ణుని గోపగోపికలు కనుఁగొనిరి. చిఱునగవుతో మోము పూర్ణిమా నిశాకరునిబోలి వెలింగెను. వస్త్రము తడువలేదు. పూవులహార ములు వాడలేదు. శ్రీచందనము కరఁగలేదు. సర్వాభరణము లుల్లసిల్ల బ్రహ్మతేజస్సులరార,మయూరపింఛము చెలువార మురళీ సంయుతవక్త్రమును గాంచి యంద ఱానందాంభోధి నిమగ్ను లైరి. నిమేషములు లేనిచూపులచే శ్రీహరిం దిలకించిరి. బాలి కలు ప్రేమభరంబునఁ గన్నులు గానరాకపోఁగా శ్రీహరి నాలిం గనముచేసికొనిరి. ఎల్లరయుల్లముల వెల్లివిరియుచున్న తల్లడము చల్లారె. దివినుండి పూలవాన కురిసెను నందాదులు కుమారు నెత్తుకొని ముద్దాడిరి. యశోదాదుల యానందమునకు మేరయే లేదు. సర్వ మానందమయముగ నుండెను. ఆదిన మచ్చటనే యెల్లరు పుచ్ఛఁదలంచి వంటలుచేసిరి. చక్కఁగా భుజించి హాయిగా వృక్షచ్ఛాయల శయనించిరి.

మహామతులారా! భక్తజనులారా! ఈకథనుండి గ్రహిం పఁదగునంశము లనేకములుగలవు. ముఖ్యవిషయములని నాకుం దోఁచువాని నిట వ్రాసెదను. గోవులు యమునాహ్రదమునఁ బ్రవేశించి జలముత్రాగి చచ్చుట శ్రీకృష్ణజన్మఖండమున మా త్రమే కనఁబడు.వానిని మరల బ్రదికించుటయు నందే గనఁబడు. దీనిచే శ్రీకృష్ణుఁడు కాళీయఫణిచేఁ జుట్టఁబడి నిశ్చేష్టుఁడుగా నున్న ట్లభినయించినతఁడి గోపకులు పరుగిడి నందాదులకుం దెల్పి

నపుడు గోవులు జలములుత్రాగి చచ్చినవి. శ్రీకృష్ణుఁడు వాని బ్రదికించెనని యేలచెప్పలే దనున దొకప్రశ్నము. దీనికి సమాధానము వ్రాయు టనవసరముకాదు. బాలకు లంతకుముందే శ్రీకృష్ణాద్భుతచర్యల నెన్నింటినో కన్నులారఁ జూచిరి. కాని శ్రీవిష్ణుమాయామోహితులగుట నుత్తరక్షణమున వానిని మఱచిరి. ఇది వారికి సహజమయ్యెనుగదా. ఇంతియగాక గోవులు జలములఁద్రావి చేష్టలుదక్కి పడిపోయెను. గోపకులు శ్రీహరితో మొఱ్ఱపెట్టుకొనిరి. వెంటనే శ్రీహరి వారిందోడుకొని యామడుపుదరికింబోయి మంత్రించినట్లు బ్రదికించెను. ఇది వారి కాశ్చర్యమును గల్గింపలేదు. ఏలయనఁగా గోచికిత్సలు గోపకులకుం బెక్కులు తెలియును. విషహరమంత్రము లున్నవి. మూలికలున్నవి. వేనినుపయోగించినను అవి బ్రదుకును. కావున వా రాశ్చర్యపడవలసినంతవిషయ మదికాదు. కాఁబట్టియే నందాదులతోఁ దమరు శ్రీకృష్ణవార్తలను దెలునపుడుకాని నందాదులు బాలకుంగాంచి దుఃఖించుతఱినిగాని యీవార్తను దెలుపకపోయిరి. వారి కాకార్య మొక యమానుషచర్యగాఁ గనఁబడలేదనుట స్పష్టము.

బలరాముని శ్రీహరి యానాఁడు పిలుచుకొనిపోకుండుటయే లనునది రెండవప్రశ్నము. సాధారణముగా బలరామకృష్ణు లొక్కటిగా నాడుకొనుట వాడుక. ఆనాఁడుమాత్రము బలరాము నింటవిడిచి తానుమాత్రమే యచ్చటికింబోయెను.

కారణమేమని ప్రశ్నించుటనవసరము మాత్రముకాదు. సమాధాన మేమనఁగా, బలరాముఁడు శ్రీహరితత్త్వ మెఱుంగును. తాఁజేయఁబూనుకృత్యములు కొన్నిగల వనియు నెఱుంగును. కాని శ్రీకృష్ణుఁడు చేయఁదగుకృత్యము లనేకములు గలవని చక్కఁగా నెఱుంగును. కావుననే తా నాశ్చర్యపరవశుఁడు గాక యుండువాఁడు. ఈయిరువురకు భేదమే లేదు. అనంతుఁడన్న భగవంతుఁడేకాని వేఱొకఁడు కాఁడు. రామావతారమునఁ దనకు సహాయముచేసిన మర్కటపంక్తిలో నొకరిద్దఱు ద్వాపరమున గర్వించి పరుల బాధించుటఁదెలిసి రాముఁడే వారిని సంహరించెను. కావున శ్రీకృష్ణునకు బలరామునకు భేదమే లేదు. ఏయేకార్యమున కెంతశక్తి యుపయోగింపఁదగునో అట్టిశక్తినే భగవంతుఁడు వినియోగించును. బలరామునకుఁ దెలుపకయుండ నానాఁడు యమునాహ్రదమునకుం బోనేలయన్నచో ఆనాఁ డింట బలరాముఁడే లేకున్న శ్రీకృష్ణుని దుస్థితి నాలించిన యశోదాదులు వెంటనే మరణించియే యుందురు. బలరాముఁ డావార్త నాలించినపుడు వికారచిత్తుఁడు కాలేదు. బలరామునింజూచియే నందాదు లించుక ధీరులై యుండిరి. యశోదాదు లీబలరామకల్పితమాయచేతనే మూర్ఛనొందకుండిరి. "ప్రహస్యకించినోచే వాచ ప్రభావజ్ఞోఽనుజస్యసః" అన్న ప్రమాణమును బరిశీలించినచో నీవిషయము తేటపడును. "అత్రావతీర్ణయోః కృష్ణగోపా ఏవహి బాంధవాః"

అన్న బలరామోక్తియే శ్రీకృష్ణునకుఁ దనకు నభేదమని తెల్పు చున్నయది. కావుననే బలరాముఁ డావార్తయాలించి ఖేదము నొందక యందఱ నోదార్చుచుంబోయెను. యమళార్జునభంజన కాలమున గోపకులుచచ్చిరా యిపుడేల చత్తురన్న దానికిని దీని కిని భేదమెంతయో కలదు. కాళీయఫణిశక్తి యంద ఱెఱుంగు దురు. ఆమడువుమీఁదుగాఁ బోవుపక్షులుకూడ నావిషవాయు వుసోఁకుటఁ జచ్చి యందులోఁబడుట వా రెఱుంగుదురు. ఆజల పానము మృత్యుప్రదమని వారికి నమ్మకముకలదు. ఎందఱో మృతినొందుట వారిశ్రుతు లెఱుంగును. అట్టిచోటఁ బ్రత్యక్ష ముగాఁ గాళీయఫణియే చుట్టుకొనియున్నవాఁ డన్నమాట విన్నతోడనే వార లన్నాయని కన్నుల నీరునించి చచ్చియే యుందురనుట యసంగతప్రసంగము కానేకాదు. కాఁబట్టియే బలరాము నింట నునిచి శ్రీహరి నాఁటిపయనము సాగించెను. నందాదులు దుఃఖపరవశులైనను దా నూరకుండి శ్రీబల రాముఁడు,

దర్శితో మానుషోభావో దర్శితం బాలచాపలమ్,
తదయం దమ్యతాం కృష్ణ దురాత్మా దశనాయుధః.

అని యుపదేశింపఁగాఁ దా నపుడులేచి కాళీయఫణిమద మణఁగించెను. బలరామునకుఁ దనకు భేదములేదని లోకులకుఁ దెలియఁజేయుటయే యీకార్యఫలము. కాఁబట్టి దూర మా లోచించియే శ్రీహరి జ్యేష్ఠసోదరు నింట నునిచిపోయెను. బల

ధాముఁడును యశోదాదుల నూఱడించుచుంబోయి యా పన్నులమొఱ లాలింపుమా యని హెచ్చరించెను. శ్రీకృష్ణుఁ డంతట నొక్కక్షణమునఁ గాళీయఫణిపతిగర్వభంగ మొనరించెను. కావున సర్వజ్ఞునికార్యములలో నొక్కటియైనఁ దప్పులు పట్ట నవకాశము గలుగదు.

కాళీయఫణి భగవంతుని బాధించి బాధించి యాబాధ తనకే కలుగఁగా దంతము లూడఁగా భయముగదురఁగా జేయునదినేరక యూరకుండి నిట్టూర్పులు పుచ్చుచుండఁగాఁ దత్పత్నిసురస పతివ్రత గావునఁ బతిదురవస్థ నెఱింగి వినుతించెను. అంతకుముందే భగవంతుఁడు మడుపునఁ దుముకఁగానే యేల ప్రార్థింపకపోయెను? తర్వాత జ్ఞానముగలిగినదియా? పతివ్రతగాన నీమడుపున దుముకువా రెవ్వరైయుందురా. యని యూహింపఁజాలకపోవనేల? యనునది మూఁడవప్రశ్నము. దీనికి సమాధానమేమనఁగా, ఎట్టివారికిఁగాని కర్మము బలవత్తరముగాన దానిఫల మనుభవింపకముందే జ్ఞానముకలుగదు. దుష్కర్మమునకు ఫలమనుభవించిన పిదపఁ దదాచ్ఛాదితమగు చిత్తము వికసించును. ఫలమనుభవింపక బుద్ధి వికసింపదు. కర్మమాచ్ఛాదింపఁగా దానిఁ దొలఁగించువారు లేరు. దానికన్న బలవత్తరులు లోకమునలేరు. భగవంతుఁడుకూడ నట్టిపనికిఁ బూనఁడు.

శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే యస్తే ఉల్లంఘ్య వర్తతే,
ఆజ్ఞాచ్ఛేది మమ ద్వేషీ నమే వధ్యత మామతః.

అన్న స్వప్రతిజ్ఞను దానే యతిక్రమింపఁబూనఁడు. చేసిన పాపమునకుఁ బ్రతిఫల మనుభవింపక తప్పదు. తదనుభవానంతర మాపాపము నశించును. దానిపదమునఁ బుణ్యము పొడు కొనును. అపుడు తదుచితబుద్ధి వికసించును. ప్రపంచతత్వ మెఱుకపడును. వివేక ముదయించును. దానభగవత్తత్వము మనోవీథి విస్పష్టముగాఁగనఁబడు. తద్బలమున నంతర్దృష్టి ప్రతి ఫలించు. అతిసూక్ష్మపదార్థములు దర్పణబలమున స్పష్టముగాఁ గనఁబడునట్లు దృగతీతపదార్థములు ఎదుటనున్నట్లగు. దానఁ దనయజ్ఞానముతొలఁగు. దానిచేఁ దనకుఁ గర్తవ్య మేదనునూహ జనించు. అట్టితఱి సత్కార్మము బలవత్తరమైనచో భగవదను గ్రహపాత్రమగు విజ్ఞాన ముదయించు. తద్ద్వారా ముక్తి యొదవు. ఇదియే కర్మసిద్ధాంతము. దీనికిఁ బ్రతిహతములేదు. ఎవ్వ రెన్నిరీతులవాదించినను దుద కీసిద్ధాంతము నెఱింగినఁ గాని సన్మార్గమును బరికింపఁజాలరు.

ప్రకృతమునఁ గాళీయఫణిపతిపత్ని సురస తద్భార్యలలో వివేకమున మేటి. కావుననే భర్త యలయుట కనిపెట్టెను. ఇఁక నీతఁడు జీవింపఁడని యెఱింగెను. నర్తనము చేయు మహా పురుషుఁడు భగవంతుఁడగు నారాయణమూర్తియనియు నెఱిం గెను. ఫణావళిపై రంగన్నర్తన మీలాగునఁ జేయువాఁడు వేఱొకఁడుకలఁడా యని విమర్శించెను. వితర్కమునఁగాని యేదియు సిద్ధాంతముకాదు. ఒక్కచేతితోఁ జేసినశబ్దమువంటి

దగును. ఇఁకఁ దడవుసేసిన భర్త మరణించుననియుఁ దెలిసి కొనియె. వెంటనే యాపద్బాంధవుని వినుతించెను. భగవంతుఁడు కనఁబడఁగా ముక్తినిగోరక భర్తప్రాణములఁ గోరనేల యని ప్రశ్నింపరాదు. అదియే యడుగఁదగినవరము. అట్లడుగనిచో నది సాధ్విగాదు. భగవదనుగ్రహము సాధ్వికిఁ దప్ప నితరస్త్రీలకుఁ గలుగదు. ప్రవర్తనము విధివిహితము. దానికి లెక్కింపకుండుట లోకవినాశనహేతువు. ఏదేశమున సత్ప్రవృత్తి ప్రధానముగఁ బరిగణింపఁబడదో యాదేశమున సుఖముకలుగదు. త్వరగా నాదేశముసర్వనాశనమగును. తలవంచుకొని కుందికుంది తుదకు నశించును. కాఁబట్టియే "హేజగత్కాంతకాంతం మే దేహి మానంచ మానద, పతిః ప్రాణాధికస్త్రీణాం నాస్తి బంధుశ్చ తత్పరః" అని ప్రార్థించెను. ఇందలివిశేషమును గమనింపుఁడు. తొలుదొలుత నోజగత్కాంతా యని భగవంతుని సంబోధించెను. జగత్పతివికదా నీవు. నీవు లేకున్న జగము లెట్లుండునో యోజింపుము. నాకును ఈ ఘణియేపతి. ఈతఁడు లేకున్న నాస్థితి నశించు కాన నాకు భర్తృదానము చేయుమా యని వేఁడెను. రెండవతడవ మానదా యని సంబోధించెను. మర్యాద నొసంగు భగవంతుఁడవు నీవు. నాకును మర్యాద ననుగ్రహింపుమా యని ప్రార్థించెను. పతివిహీననుగా నన్నుఁజేయుట నీకుమాత్రము మర్యాదయా యని యామెభావము. ఇట్లడుగుటయే సాధ్వికిఁ గృత్యము. కాఁబట్టియే భగవంతుఁడు సంతోషించెను. ఎవ్వ రేపనిచేయఁ

బగునో వార లాపని నప్రమత్తులై చేసిన భగవంతుఁడు పరితుష్టుఁడగునుగాని లేకున్న కాఁడు. ఎవరు భర్తను దిరస్కరింతురో వారిహాపరముల సుఖమును గాంచరు. కొలఁదిజనులు క్షుద్రులై తన్నుఁ బొగడినను సజ్జనాదృతి వారికిం గల్గదు. క్షుద్రజనస్తుతి కన్న సజ్జనదూషణమే మేలు. కావున స్త్రీలకు సత్ప్రవర్తనమే ప్రధానము. అది లేనిచోఁ గులట యనఁబడుఁగదా. బాహ్యాచారముల వాస్తవస్థితినివృత్తి బయలుపఱచును. కావున లోకమును మోసపుచ్చఁదలంపక సద్వృత్తిగలవారుగ నుండవలయు. సురస తాఁజేయవలసినపనినొనరించి భగవంతునిదృప్తిపఱచెను. ఆస్తుతికిఁ గాదుగాని యామె సద్భక్తికిఁ బరమేశుఁడు సంతృప్తినొందెను. కోరినవర మిత్తుము కోరుమనియె. భర్తను బ్రసాదించుట యదివఱకే సిద్ధమయ్యెనుగాన నామె శ్రీకృష్ణపాదారవిందదాస్యముగోరెను. వేఱుకోరిక లేదనియె. అది విన్నంతనే పరమాత్మకు గల్గినసంతోషమునకుఁ బారములేకపోయెను. ఆమెకు గోలోకవాస మప్పుడే ప్రసాదింప మనమునఁ దలఁచెను. ఆక్షణముననే విమానమువచ్చెను. ఆమెను గోలోకమునకుం బోవ ననుమతియిచ్చి తొలివరమును సార్థకముచేయ నెంచి ఆమెఛాయను నిర్మించి కాళీయునిచెంతనుండ నియమించెను. ఇప్పని శక్యమా యని యెంచుటకన్న వెఱ్ఱితనము వేఱుగనుండదు. భగవంతున కలవిగానిపనులు గలవనుటకంటె ఘోరకృత్యము మఱియొకటి యుండదుకదా!

సురస యొనరించిన స్తుతులలోనిసారము గ్రహింపవలసి నది. భగవంతుని వినుతింప నశక్యమనునదియే తత్సారము. మనో వాగతీతుఁడగు పరమేశ్వరుని వినుతించుట కెట్లు శక్యమగును? శక్యముగాదని యూరకుండఁదగునా అనఁగా యథాభ్యాస ముగా నారాయణు వినుతించుట కర్తవ్యమని తేలినది. ఈ విషయమునే శ్రీశంకరాచార్యులు,

శ్లో. త్వద్యాత్రయా సర్వగతాహతా తే
ధ్యానే నచేతః పరతాహతా తే,
స్తుత్యానయా వాక్పరతాహతా తే
క్షమస్వశంభో త్రివిధాపరాధమ్.

అని తెల్పిరి. స్వాములు కాశీనగరమునకుం బోయిరి. అం దున్న శివునకుఁ బేరు విశ్వేశ్వరుఁడని తదర్థమును జింతించిరి. భగవంతునిరూప మెట్టిదని యోజించిరి. అది నిరాకారము. ఆకారకల్పన యెట్లులనితలంచిరి. తర్వాత నాకారవిరహితుని ధ్యానించు టెట్లని విచారించిరి. ఆపిదప నుతింపనెంచిరి. రూప రహితుని వినుతింప నెట్లు శక్యమని తర్కించుకొనిరి. చక్కఁగా నాలోచింపఁగా నివి మహాపరాధములని తోఁచెను. ఇఁక మనుజులు తలంచు టెట్లని మరల నూహించిరి. సగుణత్వ మారోపింపక తప్పదని నిశ్చయించిరి. సగుణత్వ మారోపింప కున్న విధిలేదనియుఁ దరణోపాయమే లేదనియు నెఱింగి యిట్లు ప్రార్థించిరి.

ఓశంకరా! నీయాత్ర యని కాశీనగరమునకు వచ్చితి. దీనిచే నీసర్వగతత్వము నశింపఁజేయ నెంచినట్లయ్యెను. అనఁగా సర్వవ్యాపియగు నిన్నుఁ గాశీనగరమున నొకదేవాలయమున నొకమూల నున్నవాడని నిశ్చయించికదా వచ్చితిని. దీన నే మాయె? సర్వవ్యాపి కాఁడన్న భావమేకదా. ఇంతకంటె నపరాధముగలదా? ఇది యొకయపరాధము. నిన్ను ధ్యానించితి. అనఁగా నిట్టిరూపము. ఇవి యాయుధములు అను మొదలగు రూపకల్పనచే ధ్యానించితిని. దీనిచేతఁ గలిగినఫలమేది? భగవంతుఁడు మనోగమ్యుఁడనునదియే. ఔరా! చేతఃపరుఁడు భగవంతుఁడన్నమాట దీనిచే మూడిపోయెను. తుచ్ఛమగుమనసున నిన్నెఱుంగశక్యమా. ఇదియొకయపరాధము. స్వామీ! నిన్ను వినుతించితిని. దీనిచే వాక్కులకు గమ్యుఁడని తెలిసినది. వాగతీతుఁడగునిన్ను వాగ్విశునిగ నొనరించితిని. శంకరా! ఎంతటితప్పు చేసితిని. ఇదియొక యపరాధము. ఈయపరాధముల మూఁడింటిని జేసినందులకు నన్ను క్షమింపుము. ఈయపరాధత్రయము చేయక భక్తుఁడెవ్వఁడునుద్ధరింపఁజాలఁడు. అనఁగా యాత్రలుచేసి ధ్యానించి వినుతించవలయును. కాని యివి కేవలవిజ్ఞానులకుఁ దప్పులుగాఁ దోఁచును. ఐనను నిన్ను సగుణునిగాఁ గల్పించుకొనకున్న గతి వేఱొండులేదు. అని ఆచార్యులుగారు స్పష్టపఱచిరి. ఈవిషయమును ముఖ్యముగా భక్తుఁ డెఱుంగవలయును. విగ్రహారాధనము ముఖ్యముకాదన్న వాదమునకు మూల మిది.

యేకదా! ఏవేదమును, ఏశాస్త్రమును, ఏపురాణమును పరిశీలించినను నిరాకారుఁడు నిరంజనుఁడు సర్వవ్యాపకుఁడు. అను నీమొదలగుశబ్దములే కనఁబడును. అట్టి మహనీయమూర్తికి రూపకల్పన యేల ? ఎట్లు ? అన్నచోఁ దృష్టార్థమే కాని వేఱు గాదు. ఇట్టులుండ బొమ్మలఁబూజించుట యెంతఫలమో యోచింపుఁడు. వ్యర్థమేనా యన్నఁ గాదు. తొలుదొలుత విగ్రహము నేర్పఱచుకొని ఆరూపమును జూచుచు నది మనోవీధి దృఢపడినపిదప విగ్రహపూజనుమాని మనఃపీఠమునఁ బరమేశ్వరుఁ బూజింప నలవఱచుకొనవలయు. ఇదియేటికన మనస్సు నిశ్చలమగుటకుఁ బన్నినపన్నాగము లివియని గ్రహింపఁదగు. ఇది గ్రహించినవాఁడే కృతార్థుఁడగు. లేనిచో వానిగతి సర్వ యేకరీతిగనే యుండును. భక్తిజ్ఞానవైరాగ్యములు ప్రధానములుగా ముక్తి కేర్పఱుపఁబడిన వనుటకు హేతు విదియే యని గ్రహించుటయే యీకృషికి ఫలము.

ఇట్లు భగవంతుఁడు సురసకు వరములొసంగి, గర్వముడాలి చేవమాలి జాలినొందఁజేయు స్థితిలోనున్న కాళీయుఁ గాంచి కరుణించి నాగరాజా! నీకిఁక భయములేదు. నాపాదాంకితమగు నీఫణముం గాంచినంతనే గరుత్మంతుఁడు నిన్ను బాధింపక తొలఁగిపోవును. నీవంశజనితులకందఱకు నాచిహ్నము మస్తకమున నలరారు. మిమ్మెవరు హింసింతురో వారు నరకమునఁ బడుదురు. వారికి ముక్తిలేదు. నాపాద

ఫణముగల మీజాతింగాంచి యేనరుఁడు నమస్కరించునో వాఁడు పాతకనిర్ముక్తుఁడగు. అని వరమొసంగెను. నీవు నాప్రాణములకన్న మిన్నఁగా భావింపఁబడుదువనియె. చూచితిరా! భగవంతునియాగ్రహ మేలాగు అనుగ్రహముగా మాఱినదో. అనఁగా భగవంతునిదృష్టి కందఱు సమానులే. గర్వ మడఁగు నంతకువిరోధులనుగా భగవంతుఁడుచూచు. దానిని దొలఁగింపఁ బ్రయత్నించు. అది తొలఁగినంతనే పరమభక్తునిగాఁ దలఁచును. శత్రుమిత్రత్వము లాపరాత్పరున కెవనివిషయమున మనకుండినట్లుండవు. సర్వజనతరణాన్వేషమే యాయనపని. కర్మము పరిపక్వముకాఁగా భగవత్కరుణ వానిపైఁ బ్రసరించును. దాన వాఁడు భగవద్భక్తుఁడగు. తత్పాదసేవచేయుభాగ్యము వానికి లభించు. దానిచే వాఁడు ముక్తుఁడగు.

ఈవిషయమునుండి మనము గ్రహింపఁదగువిషయ మేమనఁగా, క్రూరజంతువని సర్పమును హింసించుట మానవలయు ననునదియే. క్రూరజాతినిహింసించువాఁడును గ్రూరుఁడే. అట్టిజాతియందుఁ గనికరము చూపుటయే మంచిగుణము. అది క్రూరమనుట దానిచే దానిని జంపవలయుననుట మూర్ఖపద్ధతి. మనము దానిపైఁ గరుణయునుంచుచో నది మనలహింసింపనేరదు. భూతదయ యన నిదియే. భూతదయకుమించినపుణ్యము లేదు. సర్వభూతదయాపరుఁడే జ్ఞాని యనంబడు. భూతదయ లేనిచో శాంతమాతనిహృదయమునఁ దనకుఁ జోటులేదని వెడలిపోవును.

సర్వభూతసమబుద్ధియేకదా పండితలక్షణమని శ్రీకృష్ణపరమాత్మయే భగవద్గీతలయం దుపదేశించెను.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని,
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః. గీతావాక్యము.

దీనిని దెనిఁగించుచుఁ గవిబ్రహ్మయగు తిక్కనసోమయాజి తనసర్వతోముఖపాండిత్యమును జూపి మూలమునకు మెఱుఁగుపెట్టెను.

చ. వినయము విద్యయుం గలుగు విప్రునియందును గోవునందు నో, ప్పునఁ దగుహస్తియందు నొకపాకకుఁ బోవని కుక్కయందు దా, ని నడఁచి తెచ్చి తిను నీచపు మాలయందుఁ దుల్యద, ర్శనులు తదంతరాత్ముని నిరంజనునిం గనునట్టి పండితుల్.

నాల్గవపాదముం బరికింపుఁడు. సమబుద్ధిచేఁ జూచుటకు హేతు వేదిగా నిర్ణయింపఁబడినదో. సర్వభూతములయం దంతరాత్మ యొక్కఁడే కనుపట్టును. కాన భేదబుద్ధికూడదని. ఇట్లు భగవద్గీత లుపదేశించుచుండఁగా శివకేశవులం దుచ్చత్వనీచత్వములఁ గల్పించువా రెట్టిపండితులో చెప్పశక్యమా. ఒక్కతత్వమే బ్రహ్మాండరూపమున వెలసియున్నది. దానిని సమబుద్ధిచేఁ బండితుఁడును, విషమబుద్ధిచేఁ బామరుఁడును జూచును. భేదమంతమాత్రమే. ఒకటి తరణోపాయము. వేఱొకటి యధఃపతనోపాయము. అని మనము గ్రహింపవలయు.

ఇఁక సౌభరిశాపముంగూర్చి యించుక వ్రాయవలసియు న్నది. సౌభరిముని శ్రీకృష్ణభక్తుఁడు. పరమశాంతధనుఁడు. నియమవంతుఁడు. అక్రోధనుఁడు. ఇట్టు లయ్యు గరుత్మంతుఁడు విష్ణువాహనమని యెఱుంగఁడా. ఎఱింగియు శపించెనా యన్న ప్రశ్నము రాకతప్పదు. సావధానముగా సమాధానమును వినుఁడు. గరుత్మంతుఁడు భగవద్వాహనము. విష్ణుభక్తులలో మేటి. వైష్ణవులు (విష్ణుభక్తులు) ఆమహామహుని భగవంతునింబోలె సేవింతురు. సౌభరియు గరుడునిమహిమము నెఱుంగును. కాని యొకనాఁడు తాఁజూచుచుండ మీనమును ముక్కునం గఱచుకొని గరుడుఁడు పఱచెను. ముని కన్నులారఁ గాంచెను. మనమున జాలికలిగెను. పరుల కపకారముచేయక నీటిలో నుండు జంతువులఁ జంపనేల యన్నయూహ యామునిమనమునఁ దట్టెను. తన్నుఁజూచియైనఁ జంపమానఁడయ్యెఁగదా యనునభిప్రాయము తోడనే కలిగెను. దానిచేఁ గోప ముదయించెను. ఆకోపమున దృష్టి మార్పునొందెను. అది పరభయంకరముగఁ దోఁచెను. ఆదృష్టి గరుత్మంతునిపైఁ బ్రసరింపఁగనే భీతిల్లి వడఁకెను. దాన ముక్కున నిఱికికొనిన మీనము జలములఁ బడియెను. మృత్యువక్త్రమునుండి తప్పించుకొనినదిగాన వడంకుచు మరలఁ బట్టుకొనునేమో యనుభావముఁ గనఁబఱచుచు మునిచెంతకు వచ్చెను. దానింగాంచఁగనే మునిమానసము వెన్నవలెఁ గఱఁగెను. సాధువులు హింసాకర్మమును జూడనైనఁజాలరుకదా.

తద్దర్శనమున నాతఁడు మిగులఁ గోపావిష్టుఁడై యిట్లు తలంచెను. ఈగరుడుఁడు బలవంతుఁడు. పరాపకార మొనర్పకయుండు నల్పజంతువుల హింసింపఁదలఁచుచున్న వాఁడు. తన్నడ్డువారు లేరని విజ్జృంభించుచున్న వాఁడు. ఈమడువున స్నానము చేసి చిరకాలమునుండి జపము చేయుచున్నవాఁడు. ఈఝషములు నన్నెన్నఁడుగాని బాధింపవు. కాన వీని కీతనిబాధ లేకుండఁ జేసినచో గృతజ్ఞుఁడ నగుదును. ఊరకున్న మదాశ్రయమును మఱచినవాఁడనగుదును. అది నాకుఁ దగనిపని. అని తలంచి విష్ణువాహనఖగరాజమా! నీ కించుకగర్వముగలదు. నేను లేకున్న శ్రీమహావిష్ణువు పనిసాగునా యన్నదురూహ నీమనసునఁ గలదని యెఱింగితి. నీవంటివాహనములఁ గోటిసంఖ్యల భగవంతుఁడు సృజింపఁగలఁడు. దాని మాయించెదను. ఎన్నఁడే నీకఖీఁద నీ వీమడుఁగుఁజొత్తువేని చత్తువు. ఇందు నిన్ను దహింపనాశాపాగ్ని సదా వేచియుండును. జాగ్రత్త. అని శపించెను. గరుడుఁ డేమియుఁ బలుకకపోయెను. ఆశాపము విన్నంతనే గరుడునిమదిఁ గలయహంకారము నశించెను. దానిస్థానమున శాంతము పాదుకొనియె. కాఁబట్టియే తనతప్పునొప్పుకొని యిది నాగర్వనిర్వాపణకుమయినది. కాన నా కీశాప ముపకారమొనరించినది. ఈముని నాకు మహోపకార మొనరించెనని తలంచిపోయెను. ఈకథగూడ జంతుహింసపాపకృత్యములలో ప్రధానమని బోధించుచున్నయది. కాఁబట్టి జంతుహింస యెంతే

వారికేని ముప్పు గల్గింపకపోదు. మనము నేర్చుకొనఁదగిన దిదియే. ఈశాపమున మునితపస్సు నశింపదు. వృద్ధినొందును. ఏలయనఁగా గరుడునకు దీన నపాయములేదు. మీనములకుఁ బరమలాభముకల్గెను. కాఁబట్టిపరోపకారపుణ్యముకల్గినది. ఇదియే తపస్సునకు ఫలము. భక్తులారా! ఇఁక నీవిషయమునఁ జెప్పఁ దగినవి నామదికిఁ బోడకట్టవు కాన వదలి భగవల్లీలల మఱి కొన్నింటిని వ్రాయ లేఖిని మరలించెదను.

## కార్చిచ్చును పానముచేసి శ్రీకృష్ణుఁడు గోపకులఁ గాపాడుట.

ఆకాళిందీతటంబున గోపికాగోపకులందఱు నాఁటిరేయి హాయిగా పరుండ నిశ్చయించిరి. పగలంతయు నాహ్రదంబునఁ దమకములు తీఱ స్నానముచేసిరి. మునిఁగిరి. తేలిరి. నిర్భయముగా నందు గోపికలుగూడ జలకములాడిరి. కాళీయఫణిపతిబాధ నేఁటికిఁ దప్పెఁగదా యనిరి. ఇఁక మనగోవు లిందుఁ దృప్తిగా జలముత్రాగవచ్చునని సంతోషించిరి. ఆవిషవాయుస్పర్శమున నంబరమునుండి పడిచచ్చిన పక్షుల కంకాళము లగపడ నక్కటా! యెన్నిపక్షు లిందుఁబడి మరణించినవి? పాపమని వగచిరి. ఇన్ని జంతువులబాధించుకాళీయునకుఁ దగినప్రాయశ్చిత్తము మనకృష్ణునిచేఁ జేయఁబడియెఁగదా యని వినుతించిరి. వానిని జంపి యుండిన బాగుండునని కొందఱన మఱికొంద ఱిదియే తగిన పని యని వారిని మందలించిరి. ఇట్లు పలువిధముల వినోదించుచుఁ బ్రొద్దుపుచ్చిరి. బాలకు లందు శ్రీకృష్ణుఁ డేచెట్టునెక్కి దుమికెనో

యాచెట్టునుండి దుముకిరి. కాళీయఫణి అదిగో వచ్చె నిదిగో వచ్చెనని కొందఱు బెదరింప నులికిపడఁగా వారినిగాంచి కొందఱు నవ్విరి. కొందఱు చప్పటులఁగొట్టిరి. కొందఱు బాలకులా కాళీయభుజంగముమాట వినఁబడఁగానే మూర్ఛిల్లిరి. కొందఱు వారిని మంత్రించి లేవఁదీసి కూరుచుండినపిదపఁ గాళీయుఁడు కృష్ణమూర్తిచేఁ దఱువఁబడఁగా మీరుచూడలేదా యని భీతి వాపిరి. కొందఱు తమలో నొకఁడు కాళీయుఁడని వేఱొకఁడు శ్రీకృష్ణుఁడని పేరులుపెట్టుకొని యాకృత్యమంతయు నొక యాటగా నాడసాగిరి. ఇట్లు వారాడుచుండఁగా గోపకన్యకలు కొందఱు శ్రీకృష్ణునిఁ గాళీయపత్నులు నుతించినట్లు తమరు వినుతించిరి. పలువిధములగు శృంగారవిహారములచే నాదినశేషము క్షణకాల మట్లు వారిచే గడపఁబడియె. ఆరాత్రి యంద ఱొకచోటఁజేరి హాస్యముల నాటలఁ బాటలఁ గ్రీడించి భుజించి హాయిగా సుఖనిద్రచేయ నుంకించిరి. చెట్లక్రింద సుఖశయనములు కల్పింపఁబడినవి. గుంపులుగుంపులుగాఁ గొంద ఱందుఁ బరుండిరి. మఱికొంతమంది యొంటరిగా శయనించిరి. ఆరాత్రి వారికిఁగలిగినమహానందము బ్రహ్మానందమును మించియుండెనని చెప్పవచ్చును.

నందాదులును బాలకృష్ణు నెందును దిరుగనీక కాపాడుచు నాఁటిదినమున జరగినపని దైవయత్నమునఁ దప్పినదిగాని లేకున్న నెంతటిప్రమాదముగల్గియుండు ననుకొనుచుఁ గుమా

రుని మద్దాడుచుండిరే కాని యెప్పుడైనను. భగవన్మాయామో హితులుగాన భగవంతుఁడే కృష్ణుఁడన్నమాటను మఱచిరి. ఔరా! ప్రత్యక్షమునఁగూడ భగవన్మాయామహిమ మెఱుకపడు నదికాదని దీనివలనఁ దేటపడియెఁగదా!. బలరాముఁడొక్కఁడు తప్పఁ దన్మహిమము నెఱింగినవాఁ డొక్కఁడే నాసభలో లేకుం డెను. అపుడపుడు నందుఁడుమాత్రము గర్గవాక్యమును స్మరిం చుచుండువాఁడు కావున సామాన్యమాత్రునిగా శ్రీకృష్ణుని దలంపరాదనియు, మహాపురుషుఁ డీరూపమునఁ దనయింట నవ తరించెననియుఁ దలంచుచుండెనుగాని తటాలున భగవన్మాయ తన్నావరించుట ఆవిషయమును మఱచుచుండెను. యశోదాదు లాగండము జలగండమనియు నది యెట్లో తప్పెననియు నింక బాలున కేభయము గలుగదనియు, నీగండము నిలువేల్పులు తప్ప మఱెవ్వరు కాపాడియుండరనియుఁ దలంచి కులదైవము లకు మఱింతభక్తితో మ్రొక్కిరి. కాని యంతకుముందే శ్రీ కృష్ణుఁడు కాళీయఫణిఫణామండలి చెంగుచెంగున నృత్యమా డుట గాఁఱచిరి. సెబాసు! విష్ణుమాయను దెలిసికొన నెవ్వనికే నశక్యము. దానిని మెచ్చవచ్చు! ఇట్లు కుమారునిముద్దాడుచు జలగండము తీఱినదిగాన నింకముం దట్టియిక్కట్టులు కలుగ కుండ రక్షఁగట్టించిరి. బలరామకృష్ణుల మృదుశయ్యలం బరుం డఁబెట్టి నిద్రపుచ్చి తమరు నిద్రించిరి.

భగవంతున కారేయి రానున్నకష్టము హృదయగోచర మయ్యెను. కాన యశోద నిద్రపుచ్చుచున్నపుడు నిద్రించినట్లే

నటించెను బలరాముఁడట్లే నటించెను. కాని యావిధ మెఱుంగని యశోదాదులు నిద్రపుచ్చితిమన్న సంతోషమునఁ దమరు సుఖనిద్రఁజెందిరి. ఆసమయమున నాభాగము జనాకీర్ణమయ్యును నిశ్శబ్దముగనుండెను. చీమనడుచుచున్నను ఆధ్వని వినఁబడు నట్లాయెను. నిస్తరంగసముద్రమునుబోలి యాగోష్ఠ మలరారెను. అత్తఱి విధివశమున నాయడవి నగ్నిచోరఁబడియెను. మనుజులకు సంఘాతమరణ మలవడునట్లే జంతువులకుంగూడ సంఘాతమరణముగలదు. ఒక్కతఱిఁ బెక్కుజీవులు మరణించుటయే సంఘాతమరణ మనంబడును. అదియెప్పుడో ఒక్కప్పుడు కలుగుచుండును. ఆతరుణమున నెన్నియో ప్రాణులు మృతికై యొకచోటఁజేరును. ఆయాయికర్మములు ఆయాయిజంతువుల ముక్కుకు త్రాడుగట్టి యీడ్చినట్లు లాగి యొక్కచోఁ జేర్చును. పని కల్పించుకొనియైన బ్రాణు లాచోటికిం జేరును. ఎందుల కిట్లు చేయుచున్నామో యని యాప్రాణు లాలోచింప నవకాశముండదు. ఏలయన, కర్మము బలవత్తరము. దానిపోకడ లెవ్వారికిఁ దెలియ శక్యముగానివి. అవియెఱింగినవాఁ డొక్కభగవంతుఁడే. ఇతరుల కెవ్వరికిని దెలియ వనుట నిక్కము.

ఆనాఁడు కర్మము త్రాడుగట్టి జంతుజాలముల నన్నింటిని మృతినొందఁదగినవానిని బాధల ననుభవింపఁదగినవాని నొక్కచోఁజేర్చెను. అన్నియు నొక్కతావునఁ జేరి సంతోషమున సుఖనిద్ర చేయుచుండినవి. ఇట్లుండఁగా దటాలున నొక శబ్దము వినవచ్చెను. అది జంతుజాలములు పరుగిడుచుండఁగా

గలిగినదియే. తాఱుమాఱుగా జంతువులు పరుగె త్తసాగెను. పక్షులుదృష్టిలేమి నాక్రోశింపసాగెను. కీటకములమాట యిప్పుడు విచారించువారెవ్వరు? అవన మాతరుణమున వచింపనలవిగాని దురవస్థలపాలయ్యెను. వృక్షములు చిటపటశబ్దములు చేయ సాగెను. అత్తఱి దావాగ్ని తనజ్వాలామాలికల హ స్తముల వలెఁజాపి కొలఁదికిమీఱువృక్షములఁ గాల్చుచు, లతావితాన ముల నామమాత్రావశిష్టములను గావించుచుఁ, బొదరిండ్ల భస్మముచేయుచుఁ జిఱువృక్షముల నాఘూర్ణించుచు నాకస మును స్పృశించునట్లు భూమిని కౌఁగిలించుకొనునట్లు దిక్కుల కుఁ జేతులుసాపినట్లు నలుప్రక్కల నావరించి యెందుఁజూచినఁ దానయై వెలసినట్లు చెలరేఁగి వనముఁ గాల్చుచుండెను. దా వాగ్నిదాకకుం దాళలేక జంతువు లార్వసాగెను. కొన్ని పరుగిడ వీలులేక దిక్కుతోఁపక మంటలోఁబడి మ్రంగుచుండెను. ఎవరికి వారే యన్నట్లు తల్లికిఁబిల్ల, పిల్లకుఁదల్లి యనుసంబంధము లేక పరుగిడుచుఁ గార్చిచ్చు తమ్ము వెంబడింప వేగముగా పరుగిడు చు, అలసి నిలుచుచు, నిలిచి మంట లావరింప నార్చి చచ్చుచు నుండెను. ఎటుచూచినను గార్చిచ్చు కానవచ్చుచుండెను.

అర్ధరాత్రకాలమున నాదావానల మడవి నావరించెను. దానిజ్వాలలవేఁడిమి గోపకులకు సోఁకెను. భరింపరాని యాదా వాగ్నిబాధకు గోపకు లార్తినొంది తమకు దిక్కు శ్రీకృష్ణుఁడే యని తలంచిరి. అనన్యగతికుల మనుమాట మఱువక దీనులై

గొంతెత్తి * శ్రీకృష్ణా! మహాప్రభూ! బలరామా! దీనబంధూ! పరాక్రమధనా! దావాగ్ని యిదె మమ్మును జుట్టుముట్టి కాల్పఁ జూచెడిని. ఇది భరింపరానిది. దీనిబాధను భరింప మేమెంతవారము. దుర్బలులము. మిమ్మే నమ్మియుండువారము. అనన్యగతికులము. మహానుభావా! వేవేగ మమ్ముద్ధరింపుము. క్షణ మాలసించిన బ్రదుకఁజాలము. ఇదిగో సమీపించుచున్నది. జ్వాలామాలికలు మమ్ము స్పృశించుచున్నవి. మహాత్మా! లోకనాథా! దీనబంధూ! మీవారము. మిమ్మే నమ్మియుండువారము. ఆపన్నార్తిహరా! శ్రీకృష్ణా! బలరామా! వేవేగ కాపాడుఁడీ యని మొఱ్ఱపెట్టిరి.

క. నీపాదంబులనమ్మిన
నాపద లెక్కడివి జనుల కత్యుగ్రమహా
దీపితదావజ్వాలనము
పైపడకుండెడివిధంబు భావింపఁగదే. పోతనమహాకవి.

ఈపద్యము "నశేక్ష్మ మస్త్వచ్ఛరణం సంత్యక్తు మకుతో భయమ్" అన్న శ్లోకార్థమునకుఁ దెనుఁగు. ఎట్లు దీనియర్థమును

---

* కృష్ణ కృష్ణ మహాభాగ హేరామా మితవిక్రమ
ఏష ఘోరతమోవహ్ని స్తావకాన్ గ్రసతే హినః
సుదుస్తరాన్ న స్స్వాన్పాహి కాలాగ్నే స్సుహృదః ప్రభో
న శక్నుమ స్త్వచ్ఛరణం సంత్యక్తు మకుతోభయమ్.

అని మూలము. భాగ. ౧౦ స్కం. ౨౮ శ్లో.

మార్చి శ్రీపోతనగారు పద్యమును వ్రాసిరో పరికింపుఁడు. మూలార్థమును దెలుపక స్వభాషాస్వభావమును వీడఁ బుచ్చక తెనిఁగింపవలయునన్నమాట యామహాత్మునకుఁ జక్కఁగాఁ దెలియును. కావుననే సరసజనహృదయంగమముగా నున్నది.

ఇట్లు గోపకులు ఘోషించుట శ్రీకృష్ణపరమాత్మ యాలించెను. వారిప్రార్థనలఁ జక్కఁగా నంగీకరించెను. ఆర్తులను గాపాడుట తనపనియన్నసూక్తిని స్మరించెను. ఇఁకఁ దడవుచేసిన నొక్కుత్తుగ వీరిని దావాగ్నిదహించునని యెంచెను. * వెంటనే తల్లి యెఱుంగకుండ లేచి సకలబ్రహ్మాండనాయకుఁడగు శ్రీకృష్ణమూర్తి యడవినెల్లెడలం జుట్టుముట్టి యవార్యశక్తి వెలయు నాదావపావకుఁ దనయనంతశక్తి కనంబడ నొక్కసారి గుటుక్కునఁ ద్రావెను. ఆదావాగ్ని యట్టె యడంగెను. ఉత్తర క్షణమున దానిచిహ్నమైనను లేకుండెను. సకలజంతువులు హతశిష్టములు దావాగ్ని యనుమాట యెఱుంగక హాయిగా సుఖనిద్రం జెందెను. గోపకులు మనకృష్ణుఁ డుండ నేమిబాధలు మనకుఁ గల్గునన్నవిశ్వాసమున భగవంతుని వినుతించుచు సుఖనిద్ర చేసిరి.

మహాశయులారా! శ్రీహరిదావాగ్నిని గబళించుట వింటిరికదా! ఆసమయమున దావాగ్నిదరికొననేల? దానిని గృష్ణుఁడు

---

* ఇత్థం స్వజనవైక్లబ్యం నిరీక్ష్య జగదీశ్వరః
తమగ్ని మపిబ త్తీవ్ర మనంతోఽనంతశక్తిధృక్.

అని మూలము. ౨౫ శ్లో.

ద్రావనేల? అని ప్రశ్నింతురు కాఁబోలును. గోపకులకుం గల్గిన మహత్తరవిపత్తుల నడంచుపని శ్రీహరిదికదా! దావాగ్ని రగుల్కొనుట అపమృత్యువునకు సంబంధించినది. ఆయపమృత్యువు సకలజంతువులకు సంఘాతమరణమును గల్పించునది. ఆనాఁడు హాయిగా గోపికాగోపకులు పరుండియుండ నాదావాగ్ని రగిలెను. ఆపన్నాశకరా! శ్రీకృష్ణా! నీవుదక్క వేఱుశరణము లేదని వారెల్లఁ బ్రార్థించిరి. శ్రీహరి

అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్,

అను స్వప్రతిజ్ఞను మఱచునా, గోపకుల కహంకారముగలదా, లేక సర్వమునకుఁ దన్నే నమ్మి యున్నవారా యని పరీక్షించెను. ఇట్టియిక్కట్టులనుండి యుద్ధరింప శ్రీహరితప్ప వేఱొండుశరణము లేదని గోపకులెల్ల వేడిరి. ఆదావాగ్ని నొక్కక్షణమాత్రమున మ్రింగెను. భగవంతున కీకార్య మంత గొప్పది కాదు. అత్యల్పకార్యము. దీనిచే నాపదుద్ధారకుఁడన్న తనప్రియనామమును సార్థముగా నొనరించెను. ఇంక నవ్వలిభగవత్కథను వినిపింపఁ బ్రయత్నించెదను. సావధానులరు గండు.

## శ్రీ కృష్ణ వృత్త వు.

శ్రీహరి కాళీయఫణిపతిదర్ప మడంచినపిదప గోపకులు యథాపూర్వముగా బృందావనమున విశ్వకర్మవినిర్మితసుందరమందిరముల నివసించిరి. ఏకొఱంతయు లేక విహరిం

మాడ్కి నుండిరి. భగవత్సాన్నిధ్యమున నుండువారికిఁ గొఱం
తలుండునా? అక్కాలము సూర్యప్రతాపవృద్ధిదాయకము. భగ
వంతుఁడగు లోకబాంధవుఁడు తన యసమానప్రతాపమును
జూపుచుండెను. సహస్రకరముల నెల్లెడల వ్యాపింపఁజేసి యస
మానప్రతాపుఁ డన్నపేరు సార్థకముచేయుచుండెను. సకలవృ
క్షములు చిగురుటాకులు పుష్పములు ఫలములు చెలువారఁగాఁ
జూడఁజూడ రెండుకన్నులు చాలకుండెను. ఆకాలమే సకల
ప్రాణికోటికి క్షేమంకర మగునది. ఎండవేఁడిమి యెక్కువగా
నున్నను, దానితాపమున నెల్లజంతువులు తహతహపడుచు
న్నను ఆరోగ్యము వృద్ధియగుచుండును. బాహ్యతాపమేగాని
అంతశ్శీతము బలమును వృద్ధిచేయుచుండును. అది మన కెఱు
కపడదుగాని దైవికముగా జరగుకార్యములు ప్రాణివృద్ధికర
ములే యని తలంపవలయును. పగటిపూట మిగుల వృద్ధియ
గును. రాత్రి పరిమాణము తగ్గును. కాని నిద్ర తక్కువయైనను
అట్లుండినఁగాని రోగములు నశింపవు. సకలరోగము లాకా
లమున నౌషధసేవ లేకున్నను వృద్ధినొందవు. వర్షాకాలమురాఁ
గానే వృద్ధినొందును. కారణమేమి? ఆకాలము ఆరోగ్యసూచ
కము. కాఁబట్టియే యాకాలమందలిఫలములన్నియు నుష్ణమును
వృద్ధిచేయునవియే. కాలము సంతాపకరము. ఫలము లుష్ణమును
వృద్ధిచేయునవి. ఇట్టికాలమున నారోగ్యము పెరుగును. శీతకా
లమున నున్నజడత్వముపోయి నాడులు పరిశుద్ధములై యుం
డును. రక్తనాళములు కల్మషరహితములగును. అపుడుగాక
యారోగ్యము మఱియెప్పు డుండును?

అట్టి గ్రీష్మకాలము సంతాపకరముగానున్నను బృందావనమున నున్నవారు శీతలతరుచ్ఛాయల నుండుట రవికరప్రసారము నెఱుంగఁజాలకుండిరి. కాని గ్రీష్మవాయువు లపుడపుడు వారిమేనులతో సయ్యాటము లాడుచుండెను. ఆకాలవాయువులు సోఁకినఁగాని దేహములు వాడవు. చర్మము వాడినఁగాని రక్తము పరిశుద్ధముకాదు. అది నెఱవేఱినఁగాని ఆరోగ్యము కలుగదు. కావున బృందావన మెంతచల్లఁగానుండినను ఎండవేఁడిమి ఇసుమంతయైనఁ దగులక విడువలేదు. ఆంధ్రభాగవతమున నీఘట్టమునందు,

సీ. దినము లంతంతకు దీర్ఘంబులై యుండె
        దినానాథుఁ డుత్తరదిశఁ జరించె
    నాఁటినాఁటికి నెండ నవ్యమై ఖరమయ్యె
        వెచ్చనిగాడ్పులు విసరఁజొచ్చె
    మేదినీరేణువుల్ మింట సంకులమయ్యె
        నేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ
    బానీయశాలలఁ బథికసంఘము నిల్చెఁ
        జప్పరంబుల భోగిచయము డాఁగెఁ
ఆ. దరులఁ గుసుమచయము దళములతో వాడె
    మిథునకోటికి రతి మెండు దోఁచె
    నఖిలజంతుభీష్మమైన గ్రీష్మము రాకఁ
    గిలి యడవులందుఁ గేళిసలిపె.

ఆ. వాడిరుచులు గలుగు వానివేఁడిమి గ్రీష్మ
కాలమందు జగము గలయఁబడియె
స్రష్ట జనులకొఱకు బ్రహ్మాండఘటమున
నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ.

ఈపద్యము లెంతమనోహరముగ నున్నవో చూడుఁడు. ఇందు స్వభావముకాని వర్ణన మొక్కటియుఁ గానరాదు.

అట్టికాలమైనను బృందావనము శ్రీరామకృష్ణనివాసము కావున మనోహరంబై యొప్పారుచుండెను. లతలునవనవోన్మేషంబునఁ జూపఁ దగియుండెను. తరువరములు లతావితతులు తమ్మల్లిబిల్లిగ నల్లుకొనఁ దత్సంబంధమున సంసారభారమును వహించి విహరించున ట్లుండెను. అత్తరుణము నే లతలు పుష్పవతుల య్యెను. పుష్పవతులగులతలు తమ్మెడఁబాయక చుట్టుకొన, పాదపములు నవ్యప్రకాశమున నొప్పుచుండెను. ఆకాలమున బృందావనము పెండ్లికై శృంగారించినగృహముపోల్కి నలరారెను. పక్షులు కలరవముల నందున్నవారికి నెంతోసంతోషమును గల్గించుచుండెను. యమునాతరంగిణీతుంగరంగత్తరంగసంగతి నొలయు వనానిలము నిదాఘతాపమార్ప నడుముకొనిన ట్లుండెను. కమలములపుప్పొడులఁ బొరలి జలశీకరములఁ దొప్పదోఁగి తరుపల్లవముల సంగతి నించుకగలిగి వాతపోతములు మందమందసుందరగమనంబున వ్యాపింపఁ బ్రాణికోటి యెంతో హాయిచెందుచు నిదాఘతాపమును మఱచియుండెను.

అత్తఱి బలరామకృష్ణులు గోపబాలకులంగూడి వేడ్కకమై నాడుచు గోవులమేపుచు వానివృద్ధినే కోరుచు విహరించుచుండిరి. గోరక్షణమే భగవంతునకుంగూడ హితమని తీసనెఱుంగవచ్చును. పశుజాతులయందు గోజాతివంటిది లేదనియంద అంగీకరింతురు. దానివలననే లోకము నిలిచియున్నదనియెఱుంగవలయు. సురుగాఅని దానిక్షీరధారలు రోగనాశనమొనరించుటయేకాక ఆరోగ్యమునిచ్చి తద్వారా యుస్సునువృద్ధిచేయుచుండును. దానిక్షీరములే దేవతాయోగ్యములు. దానిని రక్షించుటయే పరమపవిత్రకార్యము. గోమయమూత్రక్షీరదధ్యాజ్యములు సకలపాపాపనోదనక్షమములు. పంచగవ్యమని వానిసముదాయమునకుఁ బేరు. కొన్ని పాపములకుఁ బంచగవ్యము ప్రాయశ్చిత్తముగా స్మృతులు ప్రతిపాదించుచున్నవి. ఆరోగ్యమును ప్రసాదించుటయేకాక పాపమునుగూడదూలగొట్టునదిగదా పంచగవ్యము. అట్టిగోవును బూజించుటయిహపరసాధనమనుట సర్వస్మృతిసమ్మతము. పశుజాతి మనుష్యజాతిగా మాఱవలయునన్న గోజాతిలోఁ బుట్టినపిదపనే మానొందవలయునని పెద్దలందురు. అట్టిగోవును హింసించువాపములకు మేరలేదు. గోదానము సకలపాపక్షయము. గోదానమును గ్రహించువాఁడు దానిఁ జక్కఁగాఁ గాపాడకమహాపాతకమని స్మృతులు ఘోషించుచున్నవి. కావున సమజంతువులలో గోజాతి యత్యుత్తమమైనది. భారతభూమిమపవిత్రమగుట గోపూజచేయుట, గోవును హింసింపరా

నియమముగల్గుట యనుకారణములచేతనే యని యత్యుత్తమ ప్రవర్తనము గలమహాత్ములు పల్కుట మనము వినలేదా. గోవులఁ బూజించుట పాపములు దొలఁగఁదోలుట యనునుపకారమే కాక ఆరోగ్యభాగ్యాభివృద్ధికిఁ బ్రధానకారణమని సిద్ధాంతము చేయఁబడినది. గోహింసను మించినపాపము వేఱొకటిలేదని యార్యమహాజనులెల్ల నంగీకరించినదియే. ఇందభిప్రాయభేదములు లేవనుట సిద్ధాంతము.

## శ్రీకృష్ణుఁడు దావాగ్నిని మ్రింగి గోగోపకులఁ గాచుట.

* ఇట్లు రామకృష్ణులు గోవులమేపుచు బాలకులతో వినోదించుచు వారి నానందింపఁజేయుచు బృందావనమును బృందారకసందోహసంస్తవనీయముగా నొనరించుచుండిరి. వారి విహార మనన్యసామాన్యముగానుండెను. గోపకులయుత్సాహము మేరమీఱియుండెను. చింతాసంకులితముగాని యావిహారమునకు సాటిచేయఁదగునదేది? ఇట్లు వారొకనాఁడు గోవుల మేపుచు యమునాప్రాంతారణ్యమున సంచరించుచుండిరి. ఇంతలో నాకస్మికముగ వనమున నెల్లెడలఁ బావకుఁడు తనప్రకాశము గనఁబఱచునట్లు వెలయసాఁగెను. అంతకుముం దొక్కమా

* ఈకథ శ్రీభాగవతము ౧౦ స్కం. ౧౯ అధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగనగు. శ్రీకృష్ణజన్మఖండము ౧౯ వ అధ్యాయమునుండి విషయము సంగృహీతము. ఈవనదాహము శ్రీభాగవతమున రెండుసారులు జరిగినట్లున్నది.

జేదావాగ్ని బాధ యిందులోఁ గొందఱు బాలకులు చవిచూచి యున్నారు గాన నదిగో వనవహ్నిరగులుకొనియె. ఇఁకఁ జేయు నదేమని చేతులు పిసికికొనిరి. ఇప్పట్టున శ్రీభాగవతమునందు,

శ్లో. త మాపతంతం పరితో దవాగ్నిం
గోపా స్సగావః ప్రసమీక్ష్య భీతాః,
ఊచుశ్చ కృష్ణం సబలం ప్రపన్నా
యథా హరిం మృత్యుభయార్దితాజనాః. ౯ శ్లో.
కృష్ణకృష్ణ మహావీర్య హేరామామితవిక్రమ,
దవాగ్నినా దహ్యమానాన్ ప్రపన్నాన్ త్రాతు మర్హథః.

ఈ మూలములకుఁ దెనుఁగున మొదటిశ్లోకమునకు వచనము వ్రాయఁబడినది. రెండవశ్లోకమునకు మాత్రము,

క. అభ్రంకషధూమాయిత
విభ్రాంతమహాస్ఫులింగ విసరోగ్రశిఖా
విభ్రష్టదగ్ధలోకా
దభ్రంబై వచ్చెఁ జూడు దవశిఖికృష్ణా.

అని వ్రాయఁబడినది. మూలమున నిం దున్నయర్థ మిసు మంతయు లేదుగాని దావాగ్నివర్ణనమునకుఁ దగినపదములసం గతిఁ బద్య మెంతో హృద్యముగ నున్నది. ఇట్లేల పెంచిరని ప్రశ్నింపరాదు. వర్ణనము లిట్లుండవలయుననియే ప్రాచీనమ హాకవుల యాశయములు. అవి యిక్కాలమున నసమర్థులచేఁ

ద్యజింపఁబడుటయేగాక యీసడింపఁబడియెడిని. ఘోరా! కాల మహిమము!!

'లోకానామంతకృత్కాలః'అన్న సూర్యసిద్ధాంతశ్లోకమును 'భాషానామంతకృత్కాలః'అని మార్పవలసిన ట్లగపడియెను.

ఇట్లు గోపకులెల్లఁ బెల్లుగఁ దల్లడిల్లుచు నేమియుఁ జేయఁ దోఁపమి శ్రీకృష్ణబలరాములంజేరి కుయ్యో మొఱ్ఱో యని తమదైన్యమును దెలుపుకొనసాగిరి. *అంత భక్తియు భయముగదుర బాలురందఱు శ్రీకృష్ణా! జగత్పతీ! ఈవఱ కెన్నియో యాపత్తులనుండి మ మ్ముద్ధరించితివి. అట్లే యిపుడు నుద్ధరింపుము. ఇపుడు దావాగ్నివలన గొప్పయాపదగల్గినది. మధు

*శ్లో. యథా సంరక్షితం బ్రహ్మన్ సర్వాపత్స్వేవనః కులమ్,
తథా రక్షాం కురు పున ర్దావాగ్నే ర్మధుసూదన.
త్వ మిష్టదేవతా స్మాకం త్వమేవ కులదేవతా,
స్రష్టాపాతాచ సంహర్తా జగతాంచ జగత్పతే.
వహ్నిర్వా వరుణోవాపి చంద్రోవా సూర్య ఏవచ,
యమః కుబేరః పవన ఈశానాద్యా శ్చ దేవతాః.
బ్రహ్మేశశేషధర్మేంద్రా మునీంద్రా మనవ స్సృతాః,
మానవాశ్చ తథా దైత్యా యక్షరాక్షసకిన్నరాః.
యేయే చరాచరాశ్చైవ సర్వే తవ విభూతయః,
ఆవిర్భావ స్తిరోభావ స్సర్వేషాం చ తవేచ్ఛయా,
అభయం దేహి గోవింద వహ్ని సంహారణం కురు. ౧౭౮ శ్లో.
వయం త్వాం శరణం యామో రక్షన శ్శరణాగతాన్.
శ్రీకృష్ణజన్మఖండము. ౧౯ అ.

సూదనా! దీనినుండి మమ్ము బ్రదికింపుమా. మాకు నీవేకదా ఇష్టదేవతవు. కులదేవతవుకూడ నీవేకదా. సృష్టికర్తవు, పాలకుఁడవు, సంహర్తవు నీవేకదా! జగన్నాథా! వహ్నియు, వరుణ చంద్రభాస్కరులు, యమకుబేరపవనులు, నీశానాదులగు దేవతలు, బ్రహ్మేశశేషధర్మేంద్రులు, మనువులు మునీంద్రులు మానవులు దానవులు యక్షరాక్షసకిన్నరులు, వీరుగాక యీ చరాచరము నాఁబడు ప్రపంచమున నుండువారెల్ల నీవిభూతులు కదా! పుట్టుట గిట్టుట యనునివి యెల్లరకు నీయిష్టానుసారముకదా సాగుచుండును. గోవిందా! అభయదానమొసంగి వహ్నితాపము నివారింపుము. నిన్నే శరణుచొచ్చితిమి. శరణాగతుల రక్షింపుము. అదియగదా నీబిరుదము. ఈ ఘట్టమున శ్రీభాగవతమునందు,

నూనం త్వద్బాంధవాః కృష్ణ నార్హంత్యే వావసాదితుం,
వయంహిసర్వధర్మజ్ఞ!త్వన్నాథాస్త్వత్పరాయణాః.౧౧ శ్లో.

అని కనుపట్టెడు. దీనికిఁ దెనుఁగువ్రాయుచు శ్రీపోతనమహాకవి,

శా. నీచుట్టాలకు నాపదల్ కలుగునే నే మెల్ల నీవారమ
న్యాచ్చారంబు లెఱుంగ మీశుఁడవుమా కాఖీలదావాగ్ని నేఁ
డేచందంబున నింక దాఁటుదుము మ మ్మీక్షించి రక్షింపవ
న్నా! చంద్రాభ!విపన్నులఁ శిఖివితానచ్ఛన్నులఁ ఖిన్నులఁ.

అని పద్యరత్నము నలంకరించిరి. ఇందుఁ గొందఱు పండితమ్మన్యమ్మానులు అన్నా! యనుపదము పాదపూరణమనియు,

ఇట్టి విపత్కాలమున బాలకు లిట్లు శ్రీకృష్ణుని సంబోధించియుం డరనియుఁ బల్కుదురు. కాని వారికి మహాకవిభావ మెఱుకపడ లేదని తెలుపుట తప్పుగాదు. ఎట్టి యాపత్సమయమునందుఁ గాని స్వభావము మార్పునొందదు. చిన్ననాటనుండియు సోద రులవలె నాడుకొనుచున్న వారుగానఁ దటాలున నన్నా యని శ్రీహరింజీరుట స్వభావమేగాని విరుద్ధ మిందేదియు లేదు. ఇంతి యకాక దీనిప్రక్కన చంద్రాభ యనుపదమును బ్రయోగింపఁ బడినది. శ్రీహరీ! నీవు చల్లనివాఁడవు అని. జ్వాల లివె క్రమ్ము చున్నయవి. కాన మమ్మంగాపాడుమా అని చంద్రాభపదస్వా రస్యము. పరికరాంకురాలంకారమునకు నుదాహరణముగా మహాకవి పదములఁ బ్రయోగించియుండ నందుఁ దప్పులఁ బట్టు నెట్టులగును? దేవానాంప్రియుల యాలాపము లిట్లే యుం డునుగాన వానిని మనము గణింపకుండుటయే సరసము.

గోపబాలకు లిట్లాపన్నులై భగవంతుని బ్రార్థించిరి..

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ,
తస్మా త్కారుణ్య భావేన రక్షరక్ష జనార్దన.

అని మ్రొక్కియిడిరి. మీపాదములనే నమ్మినవారము స్వామీ! మీరూరకున్న మఱెవ్వరు కాపాడుదురు? అని వేఁడిరి. పరితాప మాప శక్యముగాని దనుభావము నాలాపము లచే వెల్లడించిరి. చంపినను గాపాడినను నీవే యని నిశ్చితాభి ప్రాయమును వెలిపుచ్చిరి. ఈవలఁ గాపాడినమహాకార్యము

లలో నిది యేపాటిదని స్పష్టపఱచిరి. మాపనిరైనవి. ఇంక నీ పనియే కొఱంత యని దీనాననములద్వారా శ్రీహరిమది కెక్కఁజేసిరి.

శ్రీహరియు వారి ప్రార్థనల నాలకించెను. బంధుజనసంరక్షణము కృత్యమే యని నిశ్చయించెను. ఈబాధకై ఇంత శ్రమంపడవలయునా యని చప్పరించెను. నిర్భయముగా నుండుఁడిదె యీదావాగ్నిని గుటుక్కున మ్రింగెదఁ జూడుఁడని తెలుపు నట్లు ప్రయత్నపరుఁడయ్యెను. దావాగ్ని కెదురునడచెను. దానిజ్వాలామాలికలఁ జక్కఁగాఁ దిలకించెను. ప్రళయాగ్నిగర్భమునఁగల పరాత్పరున కొకతుచ్ఛాగ్నిం గాంచిన భీతియా. *శ్రీకృష్ణుఁడంతబాలకులారా! ఇంచుక కన్నులు మూసియుంచుఁడు. ఈబాధ యేమగునో తర్వాతఁ జూతురుగాక యని పలికెను. వారట్లు లొనరించిరి. వెంటనే శ్రీహరి తనశీతలదృష్టిని దావపావకము గాంచెను. ఆసుధామయదృష్టుల నాయగ్ని చల్లపడియెను. భగవద్వీక్షణములఁ గాలినతావులు యథాపూర్వములుగ నొప్పెను. వారు కన్నులఁ దెఱచులోపల భాండీరవటవిటపిమూలమున భగవదనుజ్ఞ వారెల్ల నుండిరి. భగవంతు నుత్తరువుంగొని కన్నులు తెఱచిరి. దావాగ్ని కానరాదు. విట

* నిమీలయత మా భైష్ట లోచనానీత్యభాషత. తథేతి మీలితాక్షేషు భగవా నగ్ని ముల్బణం, పీత్వా ముఖేన తాన్ కృచ్ఛ్రా ద్యోగాధీశో వ్యమోచయత్. అని మూ. శ్రీభాగవతము ౧౯ అ. ౧౩ శ్లో.

వృక్షమూలమున నెల్లరు హాయిగా నుండిరి. వనమును బాఁఱఁ జూడఁగా యథాపూర్వముగా నుండెను. కాలినజాడ కాన రాకుండెను. లతలు, పొదరిండ్లు, తరువులు, మహాతరువులు, తుదకు పచ్చికగూడ కందకుండెను. ఔరా! భగవంతునిశక్తి!! చెప్పశక్యమగునా. ఊహింపనైనఁ దరమగునా. అట్టి శరణాగత జనభరణుని రూపమ్మును మహాభక్తాగ్రేసరుఁడు లీలాశుకుఁ డిట్లు వర్ణించియున్నవాఁడు. దానింబఠించి పరమగతి నొందఁ దగును.

శ్లో. అమునాఖిలగోపగోపనార్థం
యమునారోధసి నందనందనేన,
దమునా వనసంభవః పపేనః
కిము నాసౌ శరణార్థినాం శరణ్యః.

శ్రీకృష్ణకర్ణామృతము ౨ ఆ. ౧౬ శ్లో.

వర్షర్తువు.

ఇట్టు లాబలరామశ్రీకృష్ణులు బృందావనమునఁ జల్లనితరు వులనీడల నుల్లసిల్లుచు, గోపకుమారులం బరిహృష్టమానసులం జేయుచు, గోవుల గోవత్సంబులఁ జక్కఁగా మేపుచుఁ దమయ మానమహిమమును విస్తరింపఁజేయుచుఁ, బ్రజల మాయా చ్ఛాదనమునఁ దముంజూచి సామాన్యబాలకులుగా భావించు నట్టి ప్రవర్తనముగలవారలఁ జేయుచు, దేవాధిపతులుగూడఁ దమదర్శనమునఁ బవిత్రులమైతిమని భావించుకొనునట్లు రూప

మహాత్త్వంబున నెసంగుచు బృందావనము నలంకరించుచుండిరుగు చుండిరి. కొలఁదిదినములీరీతిజరుగఁగా గ్రీష్మకాలముగడచెను. వర్షర్తువారంభమయ్యెను.

మహాశయులారా! వర్షర్తువు ప్రస్తావ మిట నేలయని భావింపవలదు. గోపికాసమాసక్తహృదయుఁ డన్ననామము దుర్వారపరిభవమును శ్రీకృష్ణమూర్తికిఁ భ్రామరులచే నారోపింపఁబడినదికదా. అది తెలివితక్కువచేననియు, వాస్తవ మాలోచింపఁదేలునట్టి యర్థ మిదియనియుఁ దెల్పుటయే యీగ్రంథారంభఫలము. కాన దానికొఱకేయీవర్షర్తువువిషయమై వ్రాయవలసివచ్చినది. ఇంచుక యోపికనూని యాలకింపుఁడు. హఠాత్తుగా మనసునకుఁ దోఁచు నర్థమే వాస్తవమనఁ గాదు. దానిని దర్కించి సన్మతి నాలోచించి తర్వాత దృఢపడనిచో బుద్ధిమంతుల నడిగి వారు తెల్పినదానిని మరల స్వబుద్ధిచే నూహించి లోకానుభవమునఁగాక పరమార్థమున ననుభవముగలపెద్దలు పల్కిన యీయర్థ మెట్లు సరిపడునా యని తర్కించి తర్కించి నిర్ధారణము చేసికొనవలయును. ఆయర్థము శాస్త్రములకు సరిపడునా లేదా యని గ్రంథములఁ ద్రిప్పిచూడవలయును. సరిపడునేని అదియే వాస్తవార్థమని గ్రహించి తదనుసారము మెలఁగవలయును. ఈయర్థము నించుకభేదముగా నొకమహాకవి యొకశతకమునఁ దెల్పియున్నాఁడు.

క. వినఁ దగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపఁదగుం

గని కల్ల నిజము దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ.

ఈమహాకవి యెంతటి లోకానుభవముగలవాఁడో ఆలోచింపుఁడు. ఈరీతిఁ బ్రవర్తింపుఁడు. పైయర్థమును మనమునఁ జక్కనిడుకొని తడవుపరికించి వితర్కించి యవ్వల నద్దాని నూఁతగొని ప్రవర్తింపుఁడు. ఈమాటను మఱువకుఁడు. ఇఁక నవ్వలివిషయమును వినుఁడు. త్వరపడకుఁడు.

గ్రీష్మదినములు మిగుల భీష్మములుగఁ దోఁచెను. బృందావనవాసులకు మనోహరములుగఁ దోఁచినను జనసామాన్యమున కించుకగాక మఱింతసంతాపకరములుగనే యుండెను. కాని చక్కఁగాఁ బరికింప నవి ఆరోగ్యకరములు. బహిస్సంతాపము అంతశ్శాంత మాదినములయం దుండుననుట నిర్వివాదాంశము. ఆయుఱువదిదినములు ఎట్లు గడచునా యనిపించినవి. కాలము మహత్తమము. దాని కాద్యంతములు లేవు. ఆద్యంతములు కనుఁగొనఁ బ్రయత్నించుట యవివేక మనవలయును. కాలరూపిగదా భగవంతుఁడు. భగవంతునియాద్యంతములు కనుఁగొన శక్యముకాదని శ్రుతులు మొఱ్ఱ యిడుచున్నవి కాన మనము దానినెట్లు కనుఁగొందుము? కాఁబట్టియే కాల మఖండదండాయమానమని పెద్దలు చెప్పి తమ యసమర్థతను గప్పిపుచ్చక వెలిపుచ్చిరి. అదికదా సరసము. తెలియని దానిని దెలిసినట్లు నటించి లోకమును మోసముచేయుటకంటెఁ

బాపకార్య మెద్దియు నుండదు. ఈపలు కసత్యముకాదని మీ రంగీకరింతురన్న నమ్మకము నాకున్నది. కావున వర్షర్తుసమయ మును దానిలక్షణము నించుక వ్రాసి కథ నారంభించెదను.

సంతాపకరదినముల కంతము సమీపించెను. మేఘము లంబరమున నావరింపసాగెను. సూర్యుఁడు కిరణప్రసారణమున నంతగా శ్రద్ధవహింపకున్న ట్లగపడియెను. పవనుఁడు శీతలత వహించెను. దానిస్పర్శము జనుల కించుకసుఖమును గల్పింపసాగెను. ఇప్పట్టున శ్రీభాగవతమునందు దశమస్కంధమున నిరు వదవయధ్యాయమున,

శ్లో. తతః ప్రావర్తత ప్రావృట్సర్వసత్త్వసముద్భవా,
విద్యోతమాన పరిధి ర్విస్ఫూర్జిత నభస్థలా. 3
సాంద్ర నీలాంబుదై ర్వ్యోమ సవిద్యుత్స్తనయిత్నుభిః,
అస్పష్ట జ్యోతిరాచ్ఛన్నం బ్రహ్మేవ సగుణం బభౌ. ౪

అని కనఁబడియెడు. "సర్వేషాం ప్రాణినాం సముద్భవః. ఉత్పత్తితః జీవనశ్చ. సగుణం గుణై రాచ్ఛన్నం జీవనాఖ్యం. విద్యుద్గర్జితాంబుదానాం సత్త్వరజస్తమోభిరుపమా" అని వ్యాఖ్య. వర్షర్తువు వెంబడి శరదృతువు వర్ణింప నేలయని ప్రశ్నించుకొని శ్రీధరాచార్యులుగారు "ప్రావృట్ఛరదృతుశ్రీ యోర్వర్ణనం త్వద్భుతై శ్వర్యకృష్ణలీలావివక్షయా" అని వ్రాసిరి. భగవల్లీలా మానుషత్వప్రకటనార్థ మీవర్ణనమని మహానుభావులు ప్రకటించిరి. చూచితిరా వారి భక్తిపరత్వము! ఈపై శ్లోకముల

భావమును శ్రీపోతనగా రెట్లు పరిగ్రహించి తెనుఁగున వ్రా
సిరో చూడుఁడు.

సీ. తూర్పు వాయువులు ప్రభూతంబులై వీచెఁ
బటమట నింద్రచాపంబు దోఁచెఁ
బరివేషయుక్తమై భానుమండల మొప్పె
మెఱపు లుత్తరదిశ మెఱవఁ దొడఁగె
దక్షిణగాములై తనరె మేఘంబులు
జలచరానీకంబు సంతసించెఁ
జాతకంబులపిపాసలు కడపలఁ జేరెఁ
గాంతారవహ్నుల గర్వ మడఁగె
ఆ. నిజకరాళివలన నీరజబంధుండు
దొల్లిపుచ్చుకొన్న తోయమెల్ల
మరల నిచ్చుచుండె మహీకర్షకానంద
కంద మైనవాన కందువ నొగి.

పై శ్లోకములభావమును మాత్రము గ్రహించి పోతన
యెట్లు తెనిఁగించెనో చూడుఁడు. మూలార్థ మిట లేదే యన
కుఁడు. దానిని బెంచి యలంకరించి వ్రాసెను. స్వభావోక్తి
కుదాహరణభూతమై యున్నదికదా యీపద్యరత్నము. ఇట్టితా
వుల్ఁ గవికి సర్వాధికారము కలదు.

ఆకాలము సంతాపహారకమై యుండెను. మేఘములు నల్ల
వాఱి యనంతము నావరించి తమయనంతత్వమును వెలయిం

చుచు ననంతునిరూప మిట్టిదే చూడుఁడీ యని లోకులకుం దెల్పున ట్టుండెను. అపుడు జలజలచినుకులు రాలుచుండెను. ఇంద్రచాప ములు మితిమీఱి కనఁబడుచుండెను. గర్జితములు కొండ లద రిపడ మ్రోఁగుచుండెను. మార్గములు పంకసంకులములై యుం డెను. పల్వలములు జలభరమునఁ దమపూర్ణతను దెలుపుచుం డెను. కొన్నిసమయములందు జలధారలు మింటికి మంటికి సూత్రముగట్టినట్లు పడుచుండెను. కొన్నిసమయములందు నాకుజొంపములనుండి మెల్లఁగా జాఱు నీటిబిందువులు ముత్తియములా యను ననుమానమును గల్పించుచుండెను. ఆ కాలమునఁ దరువరములు పత్త్రభరమున శాఖలు వంగ మోయఁ జాలక మోయున ట్లుండెను. పక్షులు వృక్షములకొమ్మలసందుల గృహము లమరుచుకొని తమ చేడియలంగూడి యుండెను.పక్షుల కలకలధ్వనులు తగ్గిపోవుచుండెను. సర్వప్రాణులకుఁ దృప్తియు హాయియు మాత్రము కలిగియుండెనని యూహింపవచ్చును. ఈయర్థమునఁ దెనుఁగు భాగవతమునందు,

క. వాడక వ్రాలక తెవుళులఁ
గూడక తగనల్ల గెలలుగొని నవకములై
చూడఁగ భద్రము లగుచును
వీడెఁ సస్యంబు లిడుమ వీడెం బ్రజకున్.

అని వ్రాయఁబడినది. ఇది స్వభావాలంకారము.

అట్టి తరుణమున బలరామ మధుసూదనులు గోవుల

వనాంతంబుల మేయునట్లు త్రిప్పుచు గోపబాలకులం గూడి నేర్పు మైఁ గందమూలఫలములఁ దినుచు నతిమనోహరగ్రావాగ్రము లపై మహానందమునఁ జల్దు లారగించుచుండిరి.

శ్లో. నిర్విశ్య భగవాన్ రేమే కందమూలఫలాశనః. ౫౦
దధ్యోదన ముపానీతం శిలాయాం సలిలాంతికే,
సంభోజనీయై ర్బుభుజే గోపైస్సంకర్షణాన్వితః. ౫౧ అనిమూ.

శా. ఆవర్షాగమమందు గోవుల నరణ్యాంతంబులన్ మేపుచున్
గోవిందుండు ప్రలంబవైరియుతుఁడై గోపాలవర్గంబుతోఁ
బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్ భక్షించుచున్ మంజుల
గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్ది గుడిచెం గాసారతీరంబులన్.

అని తెనుఁగునను గన్పట్టెడు.

మూలమున దధ్యోదన మనఁగా దధిగల్పిన యన్నమని యర్థము. చల్దియన్నము చతుర్విధసాధకసహితముగ భుజించు టేకాలమున నాచారము లేదు. ఈపదము నూఁతగాఁ గొని. కాఁబోలు శ్రీవైష్ణవులు దేవాలయములందు దధ్యోదనము భగవత్ప్రీతికరమని యారగింపు చేయుచుండుట. అట్లే యయ్యె నేని విపరీతార్థమగు నేమో. గోపకులనుగూడఁ జేర్చి యారగింపుచేయవలసియుండునుగదా. ఈపదము తెనుఁగున వదలిపెట్టఁబడినది. దానియర్థమే కాఁబోలు చల్ది యనుపదము తెలిపెడు. పోతనగారికాలమున దధ్యోదనము లేదు కాఁబోలు! దానిని విక్రయించుట సదాచారమను ప్రఖ్యాతియు లేదు కాఁబోలు!!

ఈరీతి బాలురంగూడి యన్నయుం దానును ఏకాంతానందావహస్థలముల విహరించుచు హాయిగా నందఱుం దన తోఁ గూడియుండఁ గాలముపుచ్చుచుండెను. గోవు లాకాలమున హృష్టపుష్టాంగముల నొప్పుచు గంతులువైచుచు అంకెలఁ జూచువారికి భీతి నాపాదించుచుండెను. వృషభము లున్నతభూభాగముల నుత్ఖాతకేళుల సంతోషించుచు వాలోద్ఘాటనమునఁ దమయానందాతిశయములను దెలుపుచు నుండెను. గోపబాలకులు శ్రీహరింగూడి చల్దు లారగించుచు హాయిగా గోవులం గాచుచు నుండిరి ఇట్టికాల మింకఁ బ్రపంచమున రాఁజాలదని యూహించుచుండిరి. నిశ్చయమేకద! అట్టి యానందజనకకాలము మఱెప్పుడువచ్చును ?

ఆతరుణమున భగవంతునకు మురళీగానము ప్రీతిపాత్రమైనట్లు తోఁచెను. గోలోకమున మురళీగానము ప్రశస్తతమము. గోపికలు గోపకులు సదా రాసమండలవిహారముతటె శ్రీరాధామాధవులఁ దద్గానమున నామోదపరవశులనుగాఁ జేయుచుందురు. గోలోకవాసులకు మురళీగానము మిగుల నామోదకరము. కావుననే వారు దానియందు సదా నిమగ్నచిత్తులై యుందురు. ఆగోలోకవాసులేకదా నందవ్రజమున నవతరించిరి. వారికెల్ల మురళీవాదనమున మిక్కిలి మక్కువ. ఆమక్కువను శ్రీహరి తీర్ప నెంచెను. గోరక్షణమును జేయుతటె నా శ్రీహరియు బలరాముఁడును దివ్యభవ్యవంశములఁ దాల్చి వామభాగమున

మోమువంచి ఆవేణురంధ్రముల ముఖమారుతమును నింప నందుద్భవించిన యొకానొక యపూర్వనాదము పరబ్రహ్మోను సంధాయకులనెల్లఁ బరవశులనుగాఁ జేయునన నిఁక వారివెంట నున్న గోపకుమారుల నానందవారిరాశి తరంగమాలికాడో లికాధిరోహులనుగాఁ జేయుట యొకయబ్బురమా. ఆవేణు నాదమహిమమును దెనుఁగుభాగవతమున శ్రీపోతనగారు,

సీ. విశ్వమోహనమైన వేణునినాదంబు
సరసగంభీరగర్జనము గాఁగ
మహనీయనిర్మల మందహాసద్యుతి
లలితసౌదామనీలతికగాఁగఁ
దలచుట్టు బాగుగఁ దనరు పింఛపుదండ
శైలభేదనశరాసనముగాఁగఁ
గరుణాకటాక్షవీక్షణసుధావర్షంబు
సలిలధారాప్రవర్షంబుగాఁగ
తే. జాడ నేతెంచు గోపాలజనమునీంద్ర
చాతకంబుల దురవసఁ జక్కఁజేసి
కృష్ణమేఘంబు బహుతరకీర్తి నొప్పె
విమలబృందావనాకాశవీథియందు.

అని వ్రాసిరి ఇప్పట్టున నీపద్యమునకు శ్రీభాగవతమునమూలము కానరాదు. ఇంతకుముం దిరువదితొమ్మిదవశ్లోకమును వ్రాసితి కదా. దానికిఁ బద్యమును వ్రాసితిని. దానిపిదప నున్నశ్లోక మును జూడుఁడు.

శాద్వలోపరిసంవిశ్య చర్వతో మీలితేక్షణాన్
దృష్ట్వా వృషా న్వత్సతరాన్ గాశ్చ స్వోధోభరశ్రమాః.
ప్రావృట్ఛ్రియంచ తాం వీక్ష్య సర్వభూతసుఖావహాం,
భగవాన్ పూజయాం చక్రే ఆత్మశక్త్యుపబృంహితామ్.

అనిమాత్రమే కనుపట్టెడు. ఈశ్లోకములకే పైసీసము తరువాత,

క. గోవుల వృషవత్సంబుల
వావిరిఁ బూజించి పిదప వర్షాకాల
శ్రీవనితను బూజించెను
శ్రీవల్లభుఁ డయ్యె గోపశేఖరుఁ డధిపా.

అని వ్రాసిరి. కాఁబట్టి పైసీసమునకు మూలము లేకున్నను సమయోచితముగా భవ్యకల్పనాసంయుతముగా రచించి సరసకవిశేఖరుఁడన్న పేరు సార్థకముచేసికొనిరి. భగవద్వర్ణనమున నింతటిలోభి యెం డెవ్వఁడు కానరాకున్నవాఁడు. ఆ మురళీనాదము గోపికలకు గోపకులకు మహాప్రీతిజనకమని యెన్నిమాఱులు తెల్పినను తృప్తి నాకును గలుగకున్నయది.

ఇప్పట్టున శ్రీకృష్ణపాదారవిందభజనానందమతి కవితిలకుఁడు నగు శ్రీలీలాశుకుఁడు,

శ్లో. వ్యత్యస్తపాద మవతంసితబర్హిబర్హం
సాచీకృతానన నివేశితవేణు రంధ్రమ్,
తేజః పరం పరమకారుణికం పురస్తాత్
ప్రాణప్రయాణ సమయే మమ సన్నిధత్తామ్.

అని కొనియాడిరి. ప్రాణప్రయాణసమయే అనఁగా ఇట్టి మహత్తరతేజోరూపుఁడగు భగవంతుఁడు మరణకాలమున నెదుట నిల్చుఁగాక. అనఁగా నితరకాలముల వలదని భావము కాదు. ఇతరకాలములందు సన్నిధిం బ్రసాదించుమహాత్ముఁడు మరణకాలమందునుగూడఁ దోఁచుఁగాక అని భావము. ఈ యర్థ ముపలక్షణవిధిచే గ్రహింపసాధ్యమే.

శ్లో. అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి సమద్భావం యాతినాస్త్యత్ర సంశయః.
యంయం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరం,
తంతమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౽

అని భగవద్గీతలయం దక్షరపరబ్రహ్మయోగము.

అను నీప్రమాణమునుబట్టి ప్రాణప్రయాణ సమయమున శ్రీహరీ నీయీరూపము సాక్షాత్కరింపఁజేయుమను ప్రార్థనము మిక్కిలి కోరఁదగినది. దీనిచే నితరకాలములందు వలదనునర్థము చెప్పుట వెఱ్ఱితనముకాదా.

ఇవ్విధమున శ్రీహరి బలరాముంగూడి వర్షాకాలదినములఁ బుచ్చుచుండెను. బృందావన మాకాలమున భూలోకమున నున్నను స్వర్గమునుమించి గోలోకబృందావనమా యను విభ్రాంతిని దేవతలకుంగూడఁ గల్గించుచుండెను. ఆగానమును వినుచుఁ బక్షు లాఁకలిగొన్నను గదలకుండెను. ఇఁక సర్పములు నెత్తినఁ గాలూని నడుచువారిని జూచియైన నాగ్రహింపక

తదేకధ్యానముగా నాలకించుచుండెను. కాఁబట్టియే పెద్దలు,

'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసంఫణిః'

అని తెల్పిరి. సెబాసు! ఏమి వారిలోకానుభవము! ఇట్లు వర్షాకాలదినములు గడపుచు బాలకులనెల్ల నాడించుచు వేణువులూఁదునట్లు చేయుచు గోవులఁ దద్వత్సములఁ జక్కఁగా మేపుచు బృందావనమునను, దత్పరిసరాటవులను విహారించుచుండెను. బలరాముఁడు సోదరునకుఁ దోడునీడవలెనుండి తనమహిమము నితరులకుం దెలుపక తమ్మునిచర్యల కానందించుచునుండెను.

## ధేనుకాసుర నిషూదనము.

* ఒకానొకప్పుడు శ్రీహరి బలరాముఁడు గోపకులతోడఁగాఁగా నావుల మేపు నెపమున బయలువెడలి బాలకులం జూచి మిత్రులారా! చాలదినములనుండి తాళవనము మిగులఁ బ్రశస్తమని వినుచున్నవాఁడను. దానింజూడఁ బోవుదము. అందుఁ దాళవృక్షచ్ఛాయలు దట్టముగా నమరియుండునఁట. అద్దానియందుఁ బచ్చిక హెచ్చుగఁ బెరిగి మృదుతమముగఁ జూపట్టుచుండునఁట. దానిం గోవులుభక్షించిన మిగుల బలము

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ఇరువదిరెండవ యధ్యాయము నుండియు, బ్రహ్మపురాణము డెబ్బదియొనిమిదవ యధ్యాయమునుండి వ్రాయఁబడును. భాగవతమునందలి విషయముగూడఁ గలుపఁబడుననియు తెలియం దగును.

కలిగి చూడంజూడ నందముగనుండి పా లింతకు మునుపిచ్చు వానికంటెం ద్రిగుణముగా నిచ్చును అని పలికెను. వా రావన మున శ్రీహరితో వినోదింప ననుమోదించిరి. ఎప్పుడెప్పుడుచూ తమా యని యువ్విళ్లూరుచుండిరి. శ్రీహరియు వారియూహాల నెఱింగి యన్నకు విన్నవించి యాతఁ డంగీకరింపఁ దాఁ బ్రయా ణము నిశ్చయించెను.

ఆతాళవనము పరిపక్వఫలావళీసమన్వితము. అందలి త్రాటిమ్రాకులు దట్టముగానుంటచే వానియాకులన్నియుఁ బందిరివేసినట్లు చూడఁజూడ వేడుకగానుండును. కావుననే చల్లగానుండెను. దానినీడనుండినఁగూడ హాయిగా నుండునని ప్రవాదముండెను. అది సార్థకమే యగునని నందాదు లూహిం చియుండిరి. దానిచెంతఁ జుట్టునుంబట్టును దివ్యసరోవరములు గలవు. కావునఁ జల్లనిగాలి వీచుచుండును. కావున ననుగమ్య మాన మనుట కేశంక లుండవు కాని ఆవనమునఁ దాళవృక్ష ముల రక్షించువాఁ డొకదానవుఁ డుండెను. వానిపేరు ధేను కుఁడు. వాఁడు ఖరరూపమున నుండువాఁడు. పూర్వకర్మవాస నాబలమున వానికి ఖరరూప మిష్టముగా నుండెను. కర్మములు బహువిధములుగదా అందు వానికర్మ మతినీచమైనది. కాఁబట్టి వానికి ఖరతనువునం దెక్కుడుప్రీతి. అట్టు లౌట వాఁడు ఖర రూపమును సదా ధరించియుండువాఁడు. కోటిసింహాముల కెంత బలముండునో అంతకుమించిన బలముగలవాఁడు. దేవ

తాదర్పము నెన్నివూలులో నశింపఁజేసినవాఁడు. వానిశరీర మును జూచినపు డిది పర్వతమా యని తోఁచును. దూరము నుండి చూచినచో నిది సత్యముగాఁ బర్వతమేకాని వేఱొక టికాదని తోఁచును. నూతులవంటి నేత్రములు. నాగలినిబట్టు కొనుటకుఁ గట్టినదండము (మేడితోఁక) వలె పొడవులై వంకర గానుండు దంతములు వానికింగలిగి వెఱపుపుట్టింపఁ జాలియుం డును. నోరు కొండగుహావలె నుండును. నాలుచేతులపొడవు గలిగి యల్లలనాడుచు నాతనినాలుక భయంకరముగా నుం డును. ఆతనినాభి పెద్దసరస్సువలె నుండును. వానికంఠధ్వని యుఱుమును మించి భీతిని గొలుపుచుండును. ఇట్టి వికారదే హముగల ధేనుకాసురుఁ డాతాళవనమునకుఁ దానే యధి పతి ననుకొనుచు నందుఁ బ్రవేశించినవారిని హింసించుచు నుండును.

ఆతాళవనమును బాలకు లందఱు కృష్ణానుమతిం బ్రవేశించిరి. బలరామకృష్ణులకుందప్ప నితరుల కాదైత్యునివిధ మెఱుకపడకయుండెను. ఏలన, నందుఁ బ్రవేశించినవారు మరల వచ్చి యందలివార్తను దెల్పినవారు లేరు. కావున నావనచరి త్రము గోచరింపక యుండెను. కావున బాలురంద ఱావన మునఁ బ్రవేశింపఁగనే మోములు చిఱునవ్వులతో వికసిం పఁగా శ్రీకృష్ణుని బలరామునిం గాంచి యిట్లు ప్రార్థించిరి. కరుణాసింధూ! శ్రీకృష్ణా! దీనబంధూ! జగన్నాథా! బలానుజా!

అర్థఋణము శ్రద్ధవహించి మావాంఛితములఁ దీర్పుము. సుంత నిలువుము. భక్తవత్సలా! శిశువులము. భక్తులము. ఆఁకలిచే బాధింపఁబడువారము. నిన్నే నమ్మి "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణమ్మమ." అను విశ్వాసము మాకెల్ల రకుం గలదు. కాఁబట్టి యొక్కకోరిక గలదు. దానిని విని సఫలముచేయుమా. ఈతాళవృక్షముల నెగఁజూడుము. ఫలము లెన్నిగలవో పరికింపుము. స్వాదువులుగ నున్నవి. సుందరములుగ నున్నవి. వానిని భక్షింప నిచ్ఛగలదు. వానిని బడఁగొట్టఁజాలము. ఆపని నీవలననే కావలయు. వృక్షములఁ గదలించిన ఫలములు రాలును. పుష్పములుకూడఁ బెక్కురంగులఁజూడ వేడుకగొలుపుచున్నవి. దుర్లభములని మాకుఁ దోఁచుచున్నవి. వానిని ధరింపఁ గోరుదుము. నీయాజ్ఞయే యైనచో మే మీపనులు చేయఁగలము. నీయాజ్ఞ లేనిచో మే మశక్తులము. ఇప్పుడే యొకమాట వినఁబడినది. ఇందొకదానవుఁడు ఖరరూపమును దాల్చియున్నవాఁడఁట. వానిపేరు ధేనుకుఁడఁట. దేవతలుగూడ వానిని జయింపఁజాలరఁట. బలపరాక్రమములముజ్జగములనాతనికి సాటి చెప్పఁగలవారు లేరఁట. ఎవ్వరుగాని వానిమార్గముని నిలుపఁ గలవారు లేరఁట. కంసునకు నెచ్చెలియఁట. సర్వజంతువుల హింసించునఁట. ఈ ప్రాంతముల నున్న వనముల కెల్లనధిపతియఁట. కావున నీవిషయముల నన్నింటి నూహించి యేమియాజ్ఞయిచ్చిన నట్లు మెలంగువారము. సకలాపత్తులు తొలఁగించువాఁడవు నీవే. సకలసంపత్ప్రదాతవు నీవే. కావున యాజ్ఞను వేఁడుచున్న

వారము. చేయఁదగినది, చేయఁదగనిది యనఁబరఁగు కార్య జాలముఁ బరీక్షించి యానతిమ్ము. అని యన్నదమ్ములను వేఁడు వేఁడఁ బ్రార్థించిరి.

శ్రీకృష్ణుఁడు బాలకులపలుకు లాలించి చెవులపండువగు నట్లు సుఖము మదికిఁ గల్గించునట్లు చక్కఁగా నిట్లుపలికెను. బాలకులారా! మీకు దానవునుండి భయముగలుగు నన్న శంక జనించినదియా. మీరెల్ల నాకు సహచరులుకదా! కాన నే నానతియిచ్చుచున్నాఁడను. తాళవృక్షములఁ గదలింపుఁడు. ఫలములఁ బడఁజేయుఁడు. నిర్భయముగా భక్షింపుఁడు. అని పలికెను. తమ్ముని మాటల నన్నింటిని శిరఃకంపనమున బలరాముఁ డంగీకరించి నేత్రసంజ్ఞచే బలరాముఁ డాబాలకుల కనుమతి యిచ్చెను. ఇట్లు శ్రీకృష్ణుఁడు బలరాముఁడు ఖరరూపుఁడగు దానవువార్తల నెఱింగియు బాలురవలన వినియు నాలోచించి యిట్లు వచింపఁగా * బాలురందఱు మహోత్సాహములఁ జెల రేఁగిరి. బలములఁ జెలువారిరి. పౌరుషముల మించిరి. ఊహల నసమానులైరి. వెంటనే యాబాలురందఱు వృక్షాగ్రముల

* తాళఫలములను బాలురే పడఁజేసిరని బ్రహ్మవైవర్తమునఁ గనుబ ట్టెడు. బ్రహ్మపురాణమునందు, ఇతి గోపకుమారాణాం శ్రుత్వా సంకర్షణో వచః, కృష్ణశ్చ పాతయామాస భువితాలఫలానిచ-అని బలరామకృష్ణులు పడఁజేసిరని కనుబట్టెడు. శ్రీభాగవతమునందు, శ్లో. ప్రహస్య జగ్మతు ర్గోపై ర్వృతౌ తాళవనం ప్రభూ, బలః ప్రవిశ్య బాహుభ్యాం తాలాన్ సంపరిక౦

కెగఁ బ్రాఁకిరి. క్షుద్బాధితులు గావున ఫలముల నెప్పుడెప్పుడు భక్షింతుమా యనునాసల వానిని బడఁజేసిరి. సుందరములు స్వాదువులు నగుఫలములఁ బడునట్లు తాళవృక్షాగ్రముల నూఁచిరి. పటపటధ్వనులతోడఁ బండ్లు వేలకువేలుగాఁ బడినవి. నారదమునీ! ఆవిధ మేమనిచెప్పుదును? బాలకులు కొందఱు వృక్షాగ్రముల విఱిచిరి. కొందఱు వృక్షముల నాడించిరి. కొందఱు వృక్షాగ్రములఁ బట్టుకొని కోలాహలమొనరించిరి. కొంద ఱందేయుండి నృత్యము చేయుచుఁ బాటలుపాడిరి. మఱి

పయన్, ఫలానిపాతయామాస మతంగజ ఇవౌజసా-అని యున్నది. బలరాముఁడే తాళఫలపతనహేతువని చెప్పఁబడినది. విష్ణుపురాణమునందు, శ్లో. ఇతి గోపకుమారాణాం శ్రుత్వా సంకర్షణోవచః, ఏతత్కర్తవ్య మిత్యుక్త్వా పాతయామాస తానివై, కృష్ణశ్చ పాతయామాస భువితాలఫలాన్యథ-అని కనుపట్టెడు. హరివంశమున, విష్ణుపర్వమునఁ బదుమూఁడవయధ్యాయమునందు, శ్లో. తత్ర దామోదరోవాక్య మువాచ వదతాం వరః, అహోతాలఫలైః పక్వై ర్వాసితేయం వనస్థలీ, స్వాదూన్యార్యసుగంధీని శ్యామాని రసవంతిచ, పక్వతాలాని సహితౌ పాతయావో లఘుక్రమా,......దామోదరవచ శ్శ్రుత్వా రౌహిణేయో హసన్నివ, పాతయన్ పక్వతాలాని చాలయామాస తాం స్తరూన్-అని కనుపట్టెడు. బలరామకృష్ణులనియు, బలరాముఁడేయనియు, బాలకులనియు నీతాలఫలపతనహేతువులని నానావిధములుగాఁ గనఁబడుచున్నవి. ఇట్టితావుల నాక్షేపింపరాదు. ఆజ్ఞప్రకారము బాలకులు పడఁజేసిరన్నను వారే పడఁగొట్టిరన్నను భేదము కానరాదు. భగవంతుఁడే కర్త కాన నాభావమున నీశంకలను సరిచేయవచ్చును.

కొందఱు చెట్లనుండి మెల్లఁగాదిగి బలమలరఁ బండ్లనెత్తుకొని పరుగులిడుచు దానవపుంగవుం గాంచిరి.

ఆదానవుఁడు మహా త్తరబలశాలియై మహాకాయ మలర భయంకరుఁడై గర్దభమువలెఁ గానఁబడియెను. వాఁడాశబ్దము శ్రుతిపుటముల భేదింపఁ ద్వరపడి వచ్చుచుండెను. భయము గొలుపున ట్లార్చుచుండెను. అట్టిదానవుం జూడఁగనే ఫలములఁ గ్రిందఁబడవైచి విలపించిరి. బాలకు లొక్కపెట్టున శ్రీకృష్ణా! గోపాలా! మధుసూదనా! యని బహుభంగులఁ బిల్చిరి. కరుణానిధీ! మమ్ముఁ గాపాడుమా. త్వరగా రమ్ము. మమ్ము వీఁడు చంపును. కాన నాలసింపక రమ్ము. ఓబలరామా! సంకర్షణా! మమ్ముద్ధరింపుము. మా ప్రాణములు పోవుచున్నవి. దానవుఁ డిదె మాపైకి వచ్చుచున్నవాఁడు. వధింపక విడుచువాఁడు కాఁడని తోఁచెడు. కాన మాప్రాణముల నిలుపుమా. ఓమురారీ! శ్రీహరీ! శ్రీకృష్ణా! దామోదరా! దీనబంధూ! గోపీశ! గోపేశ్వరా! మమ్మీసంసారసాగరమునుండి యుద్ధరింపుము. అనంతా! నారాయణా! రక్షింపుము. రక్షింపుము. గుణసింధూ! సర్వోత్కర్షముగా వర్ధిల్లుము. భయాభయములందు శుభాశుభములందును, సుఖదుఃఖములందును నీవుదక్క మా కెవ్వరు దిక్కు? ఓభక్తైకబంధూ! బహువిధభయయుక్తులము. బాలకులము. కాన మమ్ముఁ గాపాడుమా. దానవకులాధిపతివై, మా కంత మునుగూర్ప నెంచి సురదర్పభంజనుఁడై వృద్ధినొందు వీనిం జంపుము. త్వరపడి రమ్మని విలపించుచు వేఁడిరి.

ఇట్లు గోపబాలురు మొఱపెట్టుకొనఁగా శ్రీపతి వారి విక్లబమును గాంచి బలరామునిం గూడి బాలురచెంత కరుదెంచెను. భక్తవత్సలుఁడగు భయహర్త శ్రీహరి భయంపడవలదు, భయంపడవలదని పల్కుచుఁ బరుగెత్తి చిఱునవ్వు మోమున వ్యాపించగా బాలుర కభయమొసంగెను. బాలకులా శ్రీకృష్ణ బలరాములం గాంచినంతనే భీతిఁబాసి నాట్యముచేయసాగిరి. శ్రీహరిస్మృతి అభయమొసంగునదియు సర్వమంగళదాయకము నగునుగదా.

అంత నా శ్రీహరి బాలుర మ్రింగ నుంకించుదానవుని ముందుగఁ గాంచి బలరాముం గాంచి అన్నా యని సంబోధించి యిట్లు పలికెను. బలదేవా! ఈదానవుఁడు బలిపుత్రుఁడు. సాహసికుఁడని పిలువఁబడువాఁడు. మహాపాపాత్ముఁడు. బలపరాక్రమముల సాటిలేక యుండువాఁడు. కాన నాకీతఁడు వధ్యుఁడు. అన్నా! బలరామా! నేను వీనింజంపెద. బాలకుల నీవు కాపాడుము. ఈగోపబాలకులు మిగుల భీతిల్లిరి. కాన నీసంగరముఁ గాంచిన నేమగుదురో వీరిం బిలుచుకొని దూరమున నుండుము. అనిపలుక బలదేవుఁ డప్పుడ వారలం దోడ్కొని శ్రీకృష్ణానుమతి దూరమున కేగెను. శ్రీకృష్ణునింజూచి దానవేంద్రుడు పరాక్రమ మలరుచుండువాఁడు కావునఁ గోపంబున మండు నగ్నింబోలి వెలింగి మార్కొనియెను. వారిరువురకు ఘోరసంగరంబు చెల్లెను. హరిం జంపఁగోరి బగ్గున మండిపడి

యెను. మహాతేజస్వియగు శ్రీహరి మ్రింగఁదలంచెను. అంతలో భీతిఁజెంది మ్రింగఁగలనా యని సందియమందెను. పట్టుకొని యిటునటు ద్రిప్పి దానవుఁడు హరిని వదలెను. అంతలో బ్రహ్మతేజోవిరాజమానుఁడగు సుందరాకారుఁడు శ్రీహరి దానవునెదుట నిలిచెను. శ్రీకృష్ణబ్రహ్మదర్శనమాత్రమున నా దానవునకుఁ బూర్వస్మృతి కల్గెను. జగత్కారణుఁడు శ్రీహరి యన్నయూహ యాతనికి మదికిఁ దట్టెను. తనవృత్తాంతము మనసున కపుడు తోఁచెను. మహత్తరతేజశ్శాలియగు పరాత్పరు నిం జూచి దానవుఁడు పరమానందభరితుఁ డయ్యెను. ఏలపుట్టు కం గాంచెనో ఎట్లు గుణాతీతుఁడో యని యా పరాత్పరునితత్త్వ మించుక వాని కపుడు బోధపడిరెను. వెంటనే దానవుఁడు శ్రీహరిం గూర్చి యిట్లు పలికెను. *మహాత్మా! నీవే యంశమున వామనుఁడ వైతివి. నాతండ్రియగుబలి జన్నము చేయుచుం.. యాచించితివి. రాజ్యలక్ష్మిని హరించితివి. సుతలమును బ్రసాదించితివి. బలిభక్తికి వశుఁడవైతివి. సర్వేశుఁడవు. భక్తవత్సలుఁడవు. కృష్ణా! త్వరగా నన్ను వధింపుము. పాపాత్ముఁడను శా

---

*ధేనుకకృత శ్రీహరిస్తుతిః.

శ్లో. వామనోఽసి త్వమంశేన మత్పితు ర్యజ్ఞభిక్షుకః,
రాజ్యహర్తాచ శ్రీహర్తా సుతలస్థలదాయకః.
బలిభక్తి వశోఽపిరః సర్వేశో భక్తవత్సలః,
శీఘ్రం త్వం హింధి మాం పాపం శాపా ద్గర్దభరూపిణం.
మునే ర్దుర్వాససః శాపా దీదృశం జన్మకుత్సితం,

వశమున గర్దభరూప మలవడినది. దీనిం బాపుము. దుర్వాసుఁడు శపించెను. దాన నిట్టికుత్సితరూపముగల్గినది. నీవలనఁ జావు లభించునని మునియే వచించెను. అతితీక్ష్ణమై, మహత్తరతేజస్స్ఫురితమైనచక్రమునఁ దునుముము. మోక్షదాయకా! సద్భక్తిని బ్రసాదింపుము. నీవే యొకయంశమున వరాహరూపమును దాల్చి భూమి నెత్తఁబూని హిరణ్యాక్షునిం జంపి వేదముల రక్షించితివి. నీవే నృసింహరూపమును దాల్చి హిరణ్యకశిపుం జంపి ప్రహ్లాదు ననుగ్రహించి దేవతల రక్షించితివి. నీవే వేదోద్ధరణార్థము మీనాంగమున నవతరించి నృపునకు జ్ఞానము నిచ్చి సురవిప్రులను గాపాడితివి. ఆదిశేషువున కాధారమగు కూర్మమవైతివి. విశ్వాధారుఁడవు. విశ్వము నీవే. దశరథతనయుఁడవగు రాముఁడవు నీవే. జానకి నుద్ధరించితివి. దశకంఠు హరించితివి.

---

మృత్యురుక్తశ్చ మునినా త్వత్తో మమ జగత్పతే. ౩
షోడశారేణ చక్రేణ సుతీక్ష్ణేనాతితేజసా,
జహి మాం జగతాం నాథ సద్భక్తిం కురు మోక్షద. ౪
త్వమంశేన వరాహశ్చ సముద్ధర్తుం వసుంధరాం,
వేదానాం రక్షితా నాథ హిరణ్యాక్ష నిషూదనః. ౫
త్వం నృసింహః స్వయం పూర్ణో హిరణ్యకశిపోర్వధే,
ప్రహ్లాదానుగ్రహార్థాయ దేవానాం రక్షణాయచ. ౬
త్వంచ వేదోద్ధారకర్తా మీనాంశే చ దయానిధే,
నృపస్య జ్ఞానదానాయ రక్షాయై సురవిప్రయోః. ౭
శేషాధారశ్చ కూర్మస్త్వ మంశేన సృష్టిహేతవే,
విశ్వాధారశ్చ విశ్వస్త్వ మంశే నాపి సహస్రధృక్. ౮

సింధువున సేతువునిర్మించితివి. అంశమునఁ బరశురాముఁడవైతివి. జమదగ్ని నీకుఁ దండ్రి. ఇరువదొకపర్యాయములు దుష్టరాజుల వధించితివి. అంశమునఁ గపిలుఁడవన నవతరించితివి. సిద్ధులకును గురువులకును గురువవైతివి. తల్లికి జ్ఞానము నొసంగితివి. యోగశాస్త్రమును రచించితివి. నరనారాయణు లనుమునులు నీరూపములే. ధర్మసుతుఁడవై ధర్మమును విస్తరింపఁజేసితివి. ఇపుడు పరిపూర్ణావతార మనఁబడు శ్రీకృష్ణుఁడవై జన్మించితివి. సర్వావతారబీజరూపుఁడవు. సనాతనుఁడవు. యశోదా ప్రాణము నీవే. నందునకు నానందవృద్ధి నొనరించువాఁడవు నీవే. గోపికలకు ప్రాణములకన్నఁ బ్రియుఁడవు. రాధానాథుఁడవు. వసుదేవతనయుఁడవు. దేవకీదుఃఖభంజకుఁడవు. శాంతుఁడవు. అయోనిసం

---

రామో దాశరథిస్త్వంచ జానక్యుద్ధారహేతవే,
దశకంధరహంతాచ సింధౌ సేతు విధాయకః. ౯
కలయా పరశురామశ్చ జమదగ్నిసుతో మహాన్,
త్రిస్సప్తకృత్వో భూపానాం నిహంతా జగతీపతే. ౧౦
అంశేన కపిలస్త్వంచ సిద్ధానాంచ గురోర్గురుః,
మాతృజ్ఞానప్రదాతాచ యోగశాస్త్ర విధాయకః. ౧౧
అంశేన జ్ఞానినాం శ్రేష్ఠో నరనారాయణావృషీ,
త్వంచ ధర్మసుతో భూత్వా లోకవిస్తారకారకః. ౧౨
అధునా కృష్ణరూపస్త్వం పరిపూర్ణతమస్స్వయం,
సర్వేషా మవతారాణాం బీజరూపస్సనాతనః. ౧౩
యశోదా జీవనో నిత్యో నందైకానందవర్ధనః,
ప్రాణాధిదేవో గోపీనాం రాధా ప్రాణాధికప్రియః. ౧౪

భూతుఁడవు. భూభారహరుఁడవు. పూతనకు మాతృగతి బ్రసాదించితివి. బకకేశిప్రభృతులకును నాకును ముక్తి నొసంగితివి. స్వేచ్ఛామయుఁడవు. గుణాతీతుఁడవు. భక్తభయభంజన మొనరించువాఁడవు. రాధానాథా! కరుణింపుము. దయానిధీ! ముక్తి నొసంగుము. నాథా! గర్దభయోనింబుట్టిన నాకీసంసారమునుండి కడతేర్పుము. నీభక్తుఁడగు బలిపుత్త్రుఁడను. మూర్ఖుఁడను. కాన నన్నుద్ధరించుట నీపని. వేదములు బ్రహ్మాదిదేవతాధీశులు మహామునులు నెవని నుతింపఁజాలకయుందురో అట్టి గుణాతీతుని భగవంతుని దైత్యకులమునఁబుట్టియిపుడుగర్దభాకారుఁడనైన నే

వసుదేవసుత శ్శాంతో దేవకీ దుఃఖభంజనః,
అయోనిసంభవ శ్శ్రీమాన్ పృథివీభారహారకః. ౧౫
పూతనాయై మాతృగతిం ప్రదాతాచ కృపానిధిః,
బక కేశి ప్రలంబానాం మమాపి మోక్షకారకః. ౧౬
స్వేచ్ఛామయగుణాతీత భక్తానాం భయభఞ్జన,
ప్రసీద రాధికానాథ ప్రసీద కురు మోక్షణం. ౧౭
హేనాథ గార్దభీ యోనేః సముద్ధరభవార్ణవాత్,
మూర్ఖస్త్వద్భక్తపుత్రో౽హం మాముద్ధర్తుం త్వమర్హసి. ౧౮
వేదాబ్రహ్మాదయోయంచ మునీంద్రా స్తోతుమక్షమాః,
కిం స్తౌమి తం గుణాతీతం పురాదైత్యో౽ధునాఖరః. ౧౯
ఏవం కురు కృపాసింధో యేన మే న భవేజ్జనుః,
దృష్ట్వా పాదారవిందంతే కః పునర్భవనం వ్రజేత్. ౨౦
బ్రహ్మస్తోతా ఖరస్తోతా నోపహాసితు మర్హసి,
సదీశ్వరస్య విజ్ఞస్య యోగ్యాయోగ్యే సమాకృపా. ౨౧

నెట్లు వినుతింపఁగలను? శ్రీపరాత్పరా! కరుణాసింధూ! పునర్జన్మముగలుగకుండ ననుగ్రహింపుము. నీపాదారవిందముల దర్శించిన యెవరికి మరల జన్మముకలదు? బ్రహ్మ వినుతించువాఁడు. ఖరాసురుఁడు నుతించువాఁడు. ఇది పరిహాసముకాదా! సాధు ప్రభువవయి జ్ఞానస్వరూపుఁడవగు నీకు యోగ్యాయోగ్యుల యందు సమానకరుణయుండును.

అని యిట్లుపలికి యాదానవుఁడు భగవంతునిమ్రోల నిలువంబడి ప్రసన్నవదనుఁడై జ్ఞానోదయముకాఁగా నూరకుండెను. ఇది దైత్యకృతస్తోత్రము. త్రిసంధ్యలయందు నియతుఁడై యెవ్వఁడు పఠించునో భగవదనుగ్రహపాత్రుఁడై దాస్యము నొంది తుదకు ముక్తినొందును. ఇట్లు దానవుఁడు నుతించి యూరకుండ భగవంతుఁడు పూర్వజన్మస్మృతిని హరించెను. ఏలయనఁగా జ్ఞానవంతుని వధించుట భగవంతునకుంగూడఁ బాతకము కదా. ఆదానవుఁ డంత విష్ణుమాయచేఁ దన్నెఱుంగఁజాలక

---

ఇత్యేవ ముక్త్వా దైత్యేంద్రః తస్థౌచ పురతో హరేః,
ప్రసన్నవదన శ్శ్రీమా నితిహృష్టో బభూవహ. ౧౨
ఇదం దైత్యకృతం స్తోత్రం నిత్యం భక్త్యాచ యః పఠేత్,
సాలోక్యసార్ష్టిసామీప్యం లీలయా లభతే హరేః. ౧౩
ఇహలోకే హరే ర్భక్తియుంతే దాస్యం సుదుర్లభమ్,
విద్యాం శ్రియం సుకవితాం పుత్రపౌత్రా యశోలభేత్. ౧౪

శ్రీకృష్ణజన్మఖండము. ౧౧ అధ్యాయము-

పోయెను. మరల వానికంఠమునుండి దురక్తులు బయలువెడల సాగెను. అంతఁ గోపంబున నధర మదరుచుండఁ గృష్ణుని మిగుల నెంచి యిట్లుపలికెను. దుర్బుద్ధీ! కృష్ణా! నిజముగా నీకుఁ జావు సమీపించినది. కావున నిన్నిపుడే యమసదనమునకుం బంపెద. నీవు బ్రదుకఁగోరియున్న నాయీతాలవనమునకు వత్తువా. బాలకా! నీ వికఁ నింటికిఁబోఁజాలవు. బంధువులఁ జూడఁజాలవు. కంసుఁడుగాని జరాసంధనరకాసురులుగాని నాకు సాటి గారు. దేవత లనుదినము నాపేరును స్మరించి వడఁకుచుందురు. తక్కినమాట యిఁక లెక్కయా. ప్రళయకర్తయగు శివుఁడు గూడ నన్ను వధింప సమర్థుఁడుకాఁడు. బ్రహ్మావిష్ణుయములు నన్నడంపఁజాలరు. నాతాళవనమును బ్రవేశించి తాళఫలముల విదళించి బ్రదుకఁజాలువాఁడు లేఁడు. ఓబాలకా! సుందరా కారుఁడవగు నీవెవఁడవు? నిజము చెప్పుము. నీకుఁ బ్రాణముల నిచ్చువాఁడు దుర్లభుఁడు. నాకొఱకు దేవుఁడు నిన్నర్పించెను.

అనిపలికి శ్రీహరిని శిరమునఁ బైకెత్తి యిటునటు త్రిప్పి దూరమునకు విసరివైచెను. దానవుఁ డిపుడు మరణోన్ముఖుఁడు గదా. ఇట్లు విసరివైచి విచిత్రరీతిగాఁ దనకులభించియున్న శృంగముల శ్రీహరిని గ్రుమ్మెను. శ్రీకృష్ణాంగస్పర్శమాత్రమున వానిశృంగములు భంగములయ్యెను. భగ్నవిషాణుఁడగు నాదా నవుఁడు కృష్ణునిపై నాగ్రహించి దంతపటుత్వము లేనికతన చిగుళ్లతో నొక్క నారంభించెను. భగవత్తేజమున నాముఖము

దహింపఁబడఁగా నాగ్రహించి ముష్టితో భూమిని గీరెను. తోఁకను నిక్కపెట్టి ఘోరారావము గావించి కృష్ణునివదలి బాలుకులకడకుం బరుగిడ వారు భీతిచేఁ బరుగువారిరి. అందున్న బలరామునిశిరమున నిటునటు కదలించి పొడువఁగా నాతఁడు పిడికిట దానింబొడువ నాయసురుఁడు మూర్ఛమునింగెను. వెంటనే స్మృతిగలుగ శ్రీహరిచెంతకుం బరుగిడెను. కాని మరల నాముష్టిప్రహారబాధ పీడింప మూర్ఛిల్లెను. మరల స్మృతిరాఁగా బాధితుఁడగుచు లేచెను. వెంటనే మూత్రపురీషముల వదలెను. భీతిఁజెందెను. ఒక్కక్షణమునకే ఆబాధతగ్గగా వాఁడు శిరసున శ్రీహరిని బైకినెత్తి బలపరాక్రమము లుప్పతిల్ల భూమిపైఁ బడవైచెను.

అంత శ్రీహరి చివాలున పైకెగరి తాళవృక్షముం బెకలించి దాన దానింగొట్టెను. ఆదెబ్బ ఖడ్గప్రహారమునఁ గలుగు బాధను గల్గింపఁగా వాఁడు పీడితుఁడగుచుండుటఁజేసే పాషాణము దానిపైవైచి మూర్ఛిల్లఁజేసెను. అంత నాతనిదేహము పటుతఁదప్పెను. రక్తము స్రవించెను. కాని క్షణకాలముననే తెప్పిఱిల్లి కోపమున వాఁడులేచి చిన్నపర్వతమునెత్తి గిరగిరఁద్రిప్పి కృష్ణునిపై వైచెను. శ్రీహరి దానిరాకఁ గాంచి చెఱకుగడను గ్రహించునట్లు వలపలచేతిని గ్రహించి తూర్పుభాగమున దానినునిచి తడవేటికని దానిచెవింబట్టుకొని గిరగిరఁద్రిప్పి విసరివైవ వాఁడాగ్రహించి భూమిని ఖరఖురపుటము

నఁ ద్రవ్వి శ్రీహరిం బట్టుకొని దూరమున విసరివైచెను. ఇట్లు హరిసమరము విచిత్రరీతిగాఁ జెల్లెను. మరల దానవుఁడు హరిం బడవైచెను. హరియు వానిం బొరలించెను. సంతసించి యంత శ్రీపతి వానిమెచ్చెను. మద్భక్తుఁడగు బలిచక్రవర్తిపుత్త్రుఁడవు. ధన్యునిగా నిన్నుఁజేసెద త్వరగా ముక్తినొందుము. నాదర్శనము స్వస్తిబీజము. ముక్తికిం గారణమగును గదా! మనోజ్ఞమై సర్వాతిశయానందమయమై తనరుస్థానము నొందుమా.

అని యిట్లుపలికి శ్రీహరి సుదర్శనమును స్మరించెను. అది సూర్యప్రభాభాసమానమై సన్నిహితముకాఁగా దానిం ద్రిప్పి వానిపైవైచెను. *బ్రహ్మవిష్ణుమహేశ్వరులచే వధింపఁబడని దానవుని సుదర్శనము మృతినొందఁజేసెను. ఆతనిశిరస్సు భూమిపైఁబడియె. ఆతనువునుండి సూర్యకోటిసమానప్రభగల తేజోరాశి బయలువెడలి గోలోకమును జేరెను. ఆవింతఁ గాంచి దివినున్న దేవతలు కరము హర్షించిరి. శ్రీహరిపైఁ బూలవానఁ గురియించిరి. వినుతించిరి. ఆటపాటల సాగించిరి. తమతమగృహములకుంబోయిరి. బాలకులాదానవుని చావుఁజూచి అచ్చటికి భీతిఁబాసివచ్చిరి. బలరాముఁడు శ్రీహరిచేఁతకు మెచ్చుకొనియెను. బాలకులాకృత్యమునకు శ్రీహరిం బొగడిరి. శ్రీకృష్ణ బలరాములకుఁ బరిపక్వతాళఫలముల నర్పించిరి. ఆఫలముల నందఱుం గలిసి భుజించిరి. శ్రీహరి వారలం

* చిచ్ఛేదలీలయాఽవధ్యం బ్రహ్మ విష్ణు మహేశ్వరైః-అని మూ.

గూడి శీతలోదకములం ద్రావి పండ్లదిని దానవుం జంపి వారలతో నింటికింబోయెను.

మహాశయులారా! దానవునిచరిత్రమును వింటిరి. శ్రీహరి వానింజంపుటం బఠించితిరి. ఈ ధేనుకాసురుని బలరాముఁడు వధించెనని శ్రీభాగవతమున నున్నవి.

శ్లో. చరణా వపరౌ రాజన్ బలాయ ప్రాక్షిపద్రుషా,
సతం గృహీత్వా పదయో ర్భ్రామయిత్వైకపాణినా,
చిక్షేప తృణరాజాగ్రే భ్రామేణ త్యక్తజీవితమ్.

తృణరాజస్తాళః-అని వ్యాఖ్య.

బ్రహ్మపురాణమునందు,

గృహీత్వా భ్రామణే నైవ చాంబరే గతజీవితమ్,
తస్మి న్నేవ ప్రచిక్షేప వేగేన తృణరాజని.

అని దీనింబట్టియు, బలరాముఁడే ధేనుకునిం జంపినట్లు వానిజ్ఞాతులను గృష్ణుఁడు చంపినట్లున్నది. విష్ణుపురాణము బ్రహ్మపురాణపుత్రికగాన నందుఁ బైశ్లోకములే యున్నవి. హరివంశమునందును,

శ్లో. జఘానోరసి దైత్యేంద్రో రౌహిణేయం నిరాయుధం. ౧౮
తాభ్యా మేవ సజగ్రాహ పద్భ్యాంతం దైత్యగర్దభమ్,
ఆవర్జితముఖస్కంధం ప్రేరయం స్తాలమూర్ధని. ౧౯
సంభగ్నోరుకటిగ్రీవో భగ్నపృష్ఠో దురాకృతిః,
ఖరస్తాలఫలైస్సార్ధం పపాత ధరణీతలే. ౨౦

తం గతాసుం గతశ్రీకం పతితం వీక్ష్య గర్దభమ్,
జ్ఞాతీం స్తథా పరాం స్తస్య తృణరాజనిపోఽక్షిపత్. ౨౧
విష్ణుపర్వము ౧౩ అధ్యా.

దీనింబట్టికూడ బలరాముఁడే చంపినట్లు స్పష్టము. శ్రీకృష్ణజన్మఖండమున మాత్రము శ్రీకృష్ణుఁడే ధేనుకాసురుం జంపినట్లున్నది. ఇందేది ప్రమాణ మనుశంక కలుగవచ్చును. కాని శ్రీకృష్ణబలరాముల కథేదముగాన నెవరు చంపిన నేమని సమాధానము చెప్పినను జాలదు. శ్రీకృష్ణజన్మఖండము ననుసరించి ద్వితీయప్రకరణమున బలిపుత్త్రుఁడగుసాహసికునకు దుర్వాసుఁడు శాపమిచ్చుటయుఁ దద్విముక్తిని బ్రసాదించుటయు వ్రాయఁబడినది. దానిం దిలకించిన నేది పరిగ్రాహ్యమో తెలియఁదగు. తదనుసారమే యీగ్రంథము తఱచు వ్రాయఁబడుచుండును గాన వానిం బరిగ్రహింపవలయునని వేఁడెదను. శ్రీకృష్ణునిచే మృతివాటిల్లునని శాపము క్తిసమయమునఁ దెలుపఁబడినది. కాని నిదియే యుక్తియుక్తమని తక్కినవానికి బలరామకృష్ణుల కథేదముగాన శంకవలదని సమాధానము చెప్పుటయే న్యాయము.

ఇట్టులీప్రకరణమున శ్రీభగవల్లీలలు, వానివలన గ్రహింపఁదగువిషయములు, విముక్తినొందినవారిచరిత్రములు లోనగు విషయములు తెలుపఁబడినవి. కథాభేదములఁ బాటింపక దాన భగవత్పాదభక్తికిఁ జేటువాటిల్లనట్లుచేయక ధర్మముఁనువీడక సత్యమునం దసూయఁబూనక సదా భగవన్నామమును స్మరించు

చుండుటయే ముక్తికి మార్గముగఁ బరిగ్రహింపవలయును. ఇఁక రాఁబోవు ప్రకరణమున రాధాదేవీవృత్తాంతము, భగవల్లీలలు విశేషముగ మీరుఁ జదువ ననువుపడును. ఆకాలము త్వరగా భగవంతుఁ డనుగ్రహించుఁగాక. భక్తులకెల్ల శ్రీకృష్ణపరమాత్మ ఆయురారోగ్యైశ్వర్యాఖండభక్తులఁ బ్రసాదించుఁగాక.

శ్లో. అయిపరిచిను చేతః ప్రాతరంభోజనేత్రం
కబరచలిత చంచత్పింఛదామాభిరామం,
వలభిదుపలనీలం వల్లవీభాగధేయం
నిఖిలనిగమవల్లీ మూలకందం ముకుందమ్. ౨ ఆ. ౧౦ శ్లో.

మమ చేతసి స్ఫురతు వల్లవీవిభో
ర్మణినూపురప్రణయి మంజుశింజితమ్,
కమలాశనేచర కళిందకన్యకా
కలహంస కంఠకలకూజితావృతమ్. ౧ ఆ. ౧౭ శ్లో.

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినోభవంతు.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ.

తృతీయప్రకరణము సమాప్తము.

---

చెన్నపురి: వావిళ్ల ప్రెస్సున ముద్రితము—1926.

# శ్రీ తులసీదాసరామాయణము, ఆంధ్రవచనము.

ఈ గ్రంథము ఉత్తరహిందూస్థానములో మహావిఖ్యాతిగాంచిన శ్రీతులసీదాసుఁడను మహాత్మునిచే హిందీభాషలో భక్తిరసభరితముగ రచింపఁబడినది. ఇది సమస్తకావ్యగుణముల కాకరమై విషయమునుబట్టి సర్వోపనిషత్సారమనఁదగియున్నది. ఈ గ్రంథము నొక్కసారి వినినను ఎట్టిఅక్షరశూన్యునకైనను ఎట్టి శుష్కహృదయునకైనను భక్తిరసముపుట్టి పొంగిపొరలి ప్రవహించునని చెప్పుట అతిశయోక్తి కాదు. ఇట్టిగ్రంథము మన తెనుఁగుభాషలో లేకుండుట యవమానకరమని తలఁచి ప్రకృతము తెనుఁగుభాషలో మృదుమధురశైలిని మూలగ్రంథములోని భావము లేమియు విడనాడక వ్రాయఁబడినది. అచ్చటచ్చట పాఠకమహాశయులహృదయమునకై తులసీదాసువారిమూలగ్రంథములోని చౌపాయ్, సోరఠా, ఛాంద్ అనుమనోహరగీతములుగూడఁ బొందుపఱుపఁబడియున్నవి. ఈ గ్రంథము ప్రతిపదభక్తిరసాలంకృతమును, సర్వజనశ్లాఘాపాత్రమును అయియుండు ననుటకు సందియములేదు

బాలకాండము విక్రయమునకు సిద్ధమైది. ప్రతి 1-కి రు. 2-8

తక్కిన కాండలు అచ్చగుచున్నవి.

# శ్రీ మహాభక్తవిజయము.

ఇదివఱకు మన ఆంధ్రభాషలో సర్వాంగసుందరమైన భక్తవిజయము ప్రకటింపఁబడియుండలేదు. శ్రీ పాద. సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే వ్రాయించి ఈమహాభక్తవిజయమును ప్రకటించినారము. శ్రీ శాస్త్రిగారి ముద్దులు మూటగట్టుపదరచన, మనోహరమగు వర్ణనాక్రమము ఆంధ్రదేశీయులకు తెలియనివిగావు. రెండవకూర్పున అనేకుల భక్తులచరిత్రలు చిత్రపటములు క్రొత్తగ చేర్చినారము. ప్రతి 1-కి రు. 4-0-0.

# వసుచరిత్రము, సటీక.

ఇదివరకు ముద్రితమైన వ్యాఖ్యానమును సంస్కరించి అనేక నూతనాంశముల ఈ క్రొత్త కూర్పున చేర్చినారము. ప్రతి 1-కి రు. [illegible]-0-0.

## భర్తృహరి సుభాషితము.

సవ్యాఖ్యానాంధ్ర పద్య టీకా తాత్పర్య సహితము, ఏనుగు లక్ష్మణ కవి, ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన ఈముగ్గురి ఆంధ్రపద్యముల చేర్చి చక్కగ ముద్రించినారము. ప్రతి 1-కి 2-12-0

## వేమనపద్యములు, తాత్పర్యసహితము.

ఆబాలగోపాలము తెలియునట్లు తేట తెల్లపు భాషలో తాత్పర్యములతో మంచి కాగితములమీద మరల ముద్రించి ప్రకటించినారము. చక్కని క్రొత్తకూర్పు ప్రతి 1-కి రూ. 3-8-0

వేమనపద్యములు, మూలము 1-12-0

| | | |
|---|---|---|
| శ్రీమదధ్యాత్మరామాయణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | 8 | 0 |
| శ్రీమద్రామాయణము, ఆంధ్రతాత్పర్యసహితము | 17 | 0 |
| ,, బాలకాండము | 2 | 0 |
| ,, అయోధ్యాకాండము | 3 | 0 |
| ,, అరణ్యకాండము | 2 | 0 |
| ,, కిష్కింధాకాండము | 2 | 8 |
| ,, సుందరకాండము | 2 | 0 |
| ,, యుద్ధకాండము | 4 | 0 |
| ,, ఉత్తరకాండము | 2 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | 1 | 4 |
| దశావతారచరిత్రము, పద్యకావ్యము | 2 | 0 |
| కేతనదశకుమారచరిత్ర, పద్యకావ్యము | 1 | 8 |
| ఆదిపర్వము, పెద్దచ్చు మేలుకాగితములు, చిన్నసైజు | 1 | 8 |

## భక్తిరసశతకసంపుటము.

### మొదటివాల్యుము.

భక్తిరసశతక మొదటిసంపుటములో భక్తిరసోద్బోధకములగు ఈక్రిందిశతకములను చేర్చి ముద్రింపించితిమి. శతకములన్నియు నిర్దుష్టముగ మనోహరముగ ముద్రింపఁబడి విపులములగు పీఠికలతో నలరారుచున్నవి. 1 వృషాధిపశతకము, 2 చెన్నమల్లుసీసములు, 3 సర్వేశ్వరశతకము, 4 ఒంటిమిట్టరఘువీరశతకము, 5 దేవకీనందనశతకము, 6 నారాయణశతకము, 7 దాశరథిశతకము, 8 సింహాద్రినారసింహశతకము, 9 కృష్ణశతకము, 10 మాతృశతకము, 11 ఉన్నవరాజగోపాలశతకము, 12 మానసబోధశతకము, 13 చిత్తబోధశతకము, 14 ఆంధ్రనాయకశతకము, 15 ప్రసన్నరాఘవశతకము, 16 రామతారకశతకము, 17 రామరాఘవశతకము, 18 రామప్రభుశతకము, 19 భద్రాద్రిరామశతకము, 20 మారుతిశతకము. ప్రతి 1-కి రు. 2 0

## భక్తిరసశతకసంపుటము.

### రెండవవాల్యుము.

ఇందు 1 సూర్యనారాయణశతకము, 2 రాజలింగశతకము, 3 రఘుకులతిలకశతకము, 4 మహిషాసురమర్దనిశతకము, 5 ఉద్దండరాయశతకము, 6 గొట్టిముక్కల రాజగోపాలశతకము, 7 రుక్మిణీపతిశతకము, 8 జ్ఞానప్రసూనాంబికాశతకము, 9 ముకుందశతకము, 10 శివశతకము, 11 రమానాయకశతకము, 12 భక్తచింతామణిశతకము, 13 సీతాపతిశతకము, 14 మహిజమనోహరశతకము, 15 పార్థసారథిశతకము, 16 రాజశేఖరశతకము, 17 రంగేశశతకము, 18 మాధవశతకము, 19 కామేశ్వరీశతకము, 20 విశ్వనాథశతకము.

ప్రతి 1-కి రు. 2 0

ఇవిగాక శతకములు విడిగాకూడదొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

